# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సహాయమందింపబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునొకండవ భాగము



సంపాదకుడు

విద్యాభూషణ

ఉపన్యాసకేసరి - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు



ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపబడిన

## శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునొకండవ భాగము



సంపాదకుఁడు

విద్యాభూషణ

ఉపన్యాసకరత్న - గీతాప్రచారక

ధనకుధరం వరదాచార్యులు



ప్రకాశకులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

# శ్రీ రామానుజ కీర్తి కౌముది

తిరుమల తిరుపతి దేవస్థానముల వారిచే సంభావింపఁబడిన

## శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వము

సచిత్రము

పదునొకండవ భాగము



సంపాదకుఁడు :

విద్యా భూషణ

ఉపన్యాసక రత్న - కవితా విశారద

ధనకుధరం వరదాచార్యులు



ప్రకాశకులు :

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ గ్రంథమాల

శ్రీ లక్ష్మీనారాయణ పురము

గుంటూరు - 522 006

[ This book is publ'shed with final assistance of Ti umal: Tirupati Devasthanams under theis Scheme Aid to pubi'sh religious books ]

శ్రీరామానుజ కీర్తి కౌముది
పదునొకండవ భాగము

మొదటి ముద్రణము

వేయి ప్రతులు

ప్రమోదూత - మకర సంక్రాంతి

జనవరి - 1991

రామానుజ శకము ౯౭౩

మూల్యము :-
నలుబది రూపాయలు

ముద్రణము :-
పెన్‌కమ్ ప్రెస్ ప్రైవేటు లిమిటెడ్,
బ్రాడీపేట . : గుంటూరు.

# సమాలోచన సమితి

వ్యాకరణ విద్యాప్రవీణ - భాషాప్రవీణ
శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, M A
విశాఖపట్టణము

*

న్యాయవిద్యాప్రవీణ
డాక్టర్ : యస్ బి. రఘునాథాచార్యులు, M A, Ph D
సంస్కృతశాఖాధ్యక్షులు .. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము
తిరుపతి

*

శ్రీమాన్ చిలకపాటి విజయరాఘవాచార్యులు, M A, B. Ed
లెక్చరర్. ఆంధ్రప్రదేశ్ రెసిడెన్షియల్ కాలేజి
నాగార్జునసాగర్ - విజయపురి సౌత్

*

శ్రీమాన్ పెరుంబూదూరు శ్రీరంగాచార్యులు, M. A
ఉపన్యాసకులు :- వేంకటేశ్వర ప్రభుత్వ ప్రాచ్యకళాశాల
పాలెమ్

*

కవికోకిల - విద్వత్కవి - కావ్యకళానిధి
శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు
సాహిత్య వికాస మండలి అధ్యక్షులు
సిద్దిపేట

*

డాక్టర్ : చింతాపట్టణం శ్రీరంగాచార్యులు, M.A Ph D.
ఆంధ్రోపన్యాసకులు : ప్రభుత్వ ఆర్ట్సు & సైన్సు కళాశాల
ఆర్మూరు
(నిజామాబాదు జిల్లా)

మహోపాధ్యాయ-ఉభయ వేదాంత శిరోమణి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, M.A. B.O L.
సంస్కృతోపన్యాసకులు
శ్రీ వేంకటేశ్వర వివేకవర్ధినీ సంస్కృత కళాశాల
హైదరాబాదు

*

కవితార్కిక కేసరి - ఉభయవేదాంత విద్వాన్
శ్రీమాన్ నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు, B O L.
వరంగల్

*

విద్యాప్రవీణ - భాషాప్రవీణ - ఉభయవేదాంత శిరోమణి
శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు, M.A.
రిటైర్డు ప్రిన్సిపాల్ : వేద సంస్కృత కళాశాల
నెల్లూరు

*

సాహిత్యవిద్యాప్రవీణ
డాక్టర్ : తట్టా విజయరాఘవాచార్యులు, M A, Ph D.
ఉపన్యాసకులు : విశిష్టాద్వైత విభాగము
రాష్ట్రీయ సంస్కృత విద్యాపీఠము
తిరుపతి

*

'సాహిత్యవిద్యాప్రవీణ'
డాక్టర్ సముద్రాల వేంకట రంగరామానుజాచార్యులు, M.A, Ph.D.
సంస్కృతోపన్యాసకులు : ఆంధ్ర గీర్వాణ విద్యా పీఠము
కొవ్వూరు.

# ప్రముఖులు - ప్రశంసలు

**శ్రీభాష్యం అప్పలాచార్యులు, M. A.** **విశాఖపట్టణము**

మీరు పంపిన శ్రీ రామానుజ కీర్తికౌముది – పదియవభాగము అందినది. మంచి వ్యాసములు వచ్చినవి. శ్రీభాష్యము, భగవద్గీత మొదలగునవి అందరకు అందునట్లు చేయుచున్నారు మీరు. ధన్యమైన జీవితము మీది. విశిష్టాద్వైత ప్రచారమునకు మీరు చేయుచున్న సేవ చాలా విశిష్టము.

**వేముగంటి నరసింహాచార్యులు** **సిద్ధిపేట**

విశిష్టాద్వైత మహాభ్యుదయమునకు తాము చేయుచున్న కృషి అమోఘము, అనుపమానము.

**టి. భాస్కరరావు, M A.** **గుంటూరు**

మీరు ప్రకటించుచున్న శ్రీరామానుజ కీర్తికౌముది 10 సంపుటములను చూచి, రుచి చూచి కన్నుల కద్దుకొంటిని ; శిరమున పెట్టుకొంటిని. మీ కృషి సంసార తాప తాపితులకు కార్తిక కౌముదీస్నానము. శ్రీవైష్ణవ ధర్మ విశేషములను గుర్తించుకొనవలెనని కొంతకాలము అన్వేషించితిని. కాని, తగిన గ్రంథములు నాకు తగిన రీతిలో లభ్యము కాలేదు. మీరు ప్రకటించుచున్న శ్రీరామానుజ కీర్తికౌముది సోదాహరణరూపముగా అందించుచున్న విశేషములను పరిశీలించి, ఒక నిధి లభించినంత సంతోషించితిని. మరి, మానవుడు అపరిపూర్ణుడు కదా! ఆకలి ఆకాశమంత ; నోరు సూది బెజ్జమంత. పునః పునః పఠనము చేసినగాని తన్మయీ భావము కలుగుట మాదృశులకు అలవికానిది, అలవాటులో లేనిది.

**డాక్టర్ : యస్ వి: రంగరామానుజాచార్యులు, M A, Ph.D కొవ్వూరు**

శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వమైన శ్రీరామానుజ కీర్తికౌముదీ భాగములు - వైష్ణవ లోకమునకే గాక, దార్శనిక ప్రపంచమున వైష్ణవ తత్త్వ జిజ్ఞాసువులకు వైష్ణవ దర్శన మర్మము నెరిగింపజాలు మహార్ఘకోశరాశి.

తొమ్మిదవ సంపుటి సంపాదకీయము మొదటి ఖండకము (paragraph) మొదట కలవర పరచినది. శ్రవణమనన నిది ధ్యాసములకు 'ప్రస్థానత్రయము'

అని ప్రసిద్ధి యున్నదనుట విచిత్రమనిపించినది. సాంతము చూడగా సమన్వయము చక్కగా ఉన్నది. అల్లే, మీరు రచించిన శ్రీ వైష్ణవ మత వైశిష్ట్యము నన్ను ఆకట్టుకొన్నది.

డా॥ చించా పట్టణం శ్రీరంగాచార్యులు, M. A , Ph,D          అయ్మూర్

కౌముదిని విస్తరింపజేయడంలో, సర్వాంగ సుందరంగా వివిధ విశేషాలతో కౌతుక మొప్పునట్లు తీర్చి దిద్దడంలో మీ కృషి బహుధా ప్రశంసనీయము.

C V. Raghavacharyulu, M A , B.Ed ,          VIJAYAPURI

The pancharatra philosophy, the commentry on Sree Bhashya and Bhagavadgeetha in particular, and, every article in general in 'FOCUS TENTH' abound fragrance and perfume of the literary and philisophical depths of the Ramanuja thought

I hope, the Ramanuja Keerthi Koumudi should emerge as an encyclopadia of the Visistadwaitha philosophy, when it complets the 'Final Focus' (Shodasa Kala Prapoorna). Your endeavour is superb, aud, extremely landable

## పత్రికలు - ప్రశంసలు

**THE HINDU**

*10th July, 1990*

The book under review is a substance of Ramanuja's commentary on the Brahmasutras, called Sribhashya. Sribhashya is the magnumopus of the nine works of Ramanuja This is the Tenth volume in the philosophical series of the complete works of Ramanuja

Ramanuja's Sribhashya is the first powerful attack on the monistic idealism of Shankara's Brahmasutrabhashya is commented on by Sudarshan Giri in Sruthaprakasha Among the moderns, the two volume clear exposition in Sanskrit by Uttamuru Veera Raghavacharya is an indispensable classic Ramanuja's monistic theism upholds the inseparable unity of souls God and the universe (Chit, Iswara and Jagat). These three categories form a complex whole They are inseparable, but yet, distinguishable The souls and the universe are dependent on God. God is Lord Narayana, full of infinite auspicious attributes with no defects. He is not only glorious and great but is also approachable easily by all devotees (even of the animal kingdom)

He highlights not only the Mahatmya of the Lord but also his Soulabhya and Soushilya The Lord is unmindful of the status, sex, talent, age or caste of the devotee. He is the refuge of all who seek him with unreserved, absolute and joyous, loving surrender

The life of devotees are a witness to this e g Prahlada, Dhruva, Ambarisha, Draupadi, Uttara, Ajamila, Gajendra, Kuchela Udhar and Arjuna. The unique feature of Ramanuja's system is it does not, sunder the souls and Universe from God They are

regarded as the body of God. There are as many as 150 Vishaya Vakyas which are common between Shankara and Ramanuja in their commentaries, on the Sutras The term Vishishtadvaitha mean the three Categories are distinct yet inseparable (Visistadvaita, Visishtasya Visista rupena Advaitam). It is a Monism yet with distinctions. Ramanuja was the first to identify the Brahman of the Vedanta with Lord (Vishnu) The volume gives a very clear account of the doctrines in lucid, readable, Telugu. It is a valuable addition to Ramanuja literature in Telugu.





శ్రీనివాసాయ నమః                                   శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీభాష్య ప్రభావము

## ( సంపాదకీయము )

శ్రుతి స్మృతి ఇతిహాస పురాణ ప్రమాణముల ననుసరించియు, పూర్వాచార్యులైన బోధాయన, టంక, ద్రమిడ, గుహదేవ, కపర్ది, భారుచి, భర్తృమిత్ర, భర్తృప్రపంచ, నాథ, యామున మునులచే ప్రవర్తింపఁజేయఁబడిన సిద్ధాంతము ననుసరించియు - శ్రీమద్రామానుజులు ( క్రీ.శ. 1017 - 1137 ) బ్రహ్మసూత్రములకు శ్రీభాష్యము అను పేర ఒక వ్యాఖ్యానమును రచించి, చిర యశమును గాంచిన విషయము జగద్విదితము.

వారి యనంతరము సంప్రదాయజ్ఞులైన ప్రముఖులు కొందఱు - వారి యడుగుజాడలలో పయనించుచు, శ్రీభాష్య వ్యాఖ్యానములను కొన్నింటిని రచించియున్నారు. ఇట్టి వ్యాఖ్యానములు నాఁటి నుండి నేఁటి వరకు ఒక ప్రవాహ రూపమున నరుస వరుసగా వచ్చియున్నవి. ఇందులకు - శ్రీభాష్య ప్రభావమే హేతువు. కావున, ఆ విశేషములు మనకు అవశ్య గమనార్హములై యున్నవి.

(1) క్రీ: శ: 1220 కాలమున 'వకుళాభరణ భక్తి కింకరులు' అనఁబడు వరద నారాయణ భట్టారకులు - 'న్యాయ సుదర్శనమ్' అను నొక శ్రీభాష్య వ్యాఖ్యను వ్రాసిరి. న్యాయ పద్ధతి ననుసరించి - విశిష్టాద్వైత తత్త్వ మిందు నిరూపింపఁబడినది. ఈ వ్యాఖ్యానమును శ్రీ వేదాంతదేశికులు ప్రమాణముగ స్వీకరించియుండుటనుఁబట్టి, దీని ప్రాముఖ్యము స్పష్టము.

(2) క్రీ. శ: 12 - వ శతాబ్దమున 'మేఘనాదాది సూరి' యను వారిచే, 'నయ ద్యుమణి' యను పేర నొక శ్రీభాష్య వ్యాఖ్యానము రచింపబడినది ఇది 12 భాగములు కలది. శ్రీ రామానుజ తత్త్వ మిందు సంగ్రహముగా తెలుపబడినది. ఈతని మఱి యొక వ్యాఖ్య - 'నయ ప్రకాశికా' ఇంకొక వ్యాఖ్య - 'భావ ప్రబోధనము'. మొదటి రెండును ముద్రితములు. మూడవది అముద్రితముగా - మద్రాసులో అడయారు గ్రంథాలయమున గలదు.

(3) క్రీ: శ: 13,14 శతాబ్దములలో - 'సుదర్శనభట్టు', 'సుదర్శన సూరి', 'వేదవ్యాస భట్టార్య', 'వ్యాసార్య' అను వివిధ నామధేయ ములలో నొప్పు సుదర్శనార్యునిచే, శ్రీభాష్యమునకు - శ్రుత 'ప్రకా శిక' అను అత్యుత్తమ వ్యాఖ్య వ్రాయబడినది. వేదాంత జిజ్ఞాస గలవారు ఈ శ్రుత ప్రకాశికా సుధను ఆస్వాదించక, పరిపూర్ణత నందజాలరు. శ్రీభాష్య - శ్రుతప్రకాశికలు రెండును విశిష్టాద్వైత మునకు వజ్ర ప్రాకారములు. శ్రుత ప్రకాశికకు సంగ్రహముగా సుదర్శనాచార్యులు - శ్రుత ప్రదీపిక' యను నొక వ్యాఖ్యను కూడ వ్రాసిరి. ఇవి రెండును ముద్రితములై విఖ్యాతి గాంచి యున్నవి.

(4) క్రీ: శ: 1268-1369 మధ్య కాలమున, శ్రీ వేదాంత దేశికులు 'అధికరణ దర్పణము' అను పేర నొక వ్యాఖ్యను సంగ్రహముగా రచించిరి. అది నేడు అనుపలభ్యము. శ్రీభాష్యమునందలి విషయ ములను అధికరణ క్రమమున వివరించుచు - 'అధికరణ సారావళి' అను మఱి యొక వ్యాఖ్యను వ్రాసిరి. ఓక - 'అధికరణ చింతామణి' అను నొక వ్యాఖ్య కలదు. ము ద్రితము. అనంతరము శ్రీభాష్యము నందలి విషయములను చర్చించుచు - 'తత్త్వ టీక' అను పేర మఱి యొక వ్యాఖ్యను రచించిరి, ఇదియును ముద్రితమే

(5) క్రీ: శ 15 - 16 శతాబ్దముల మధ్యకాలమున, కౌశిక వరదాచార్యులవారి తనయుడైన 'చంపకేశాచార్యులు' అను వారు 'లఘు తత్త్వ ప్రకాశిక' అను పేర శ్రుత ప్రకాశిక వ్యాఖ్యను వ్రాసిరి. మద్రాసు విశ్వవిద్యాలయమువారు 1978 లో ప్రచురించిన గ్రంథ సూచికలో దీనిని చూడవచ్చును.

(6) క్రీ: శ: 15 - 16 శతాబ్దముల మధ్యకాలమున - 'వాధూల శ్రీనివాసాచార్యులు' అనువారు - 'తులిక' యను పేర శ్రుతప్రకాశిక వ్యాఖ్యను వ్రాసిరి ఇదియు - అడయారు గ్రంథాలయమున గలదు. శుద్ధ సత్త్వాచార్యులవారి తనయులైన లక్ష్మణాచార్యులు - 'గురు భావ ప్రకాశిక' అను గ్రంథమున దీనిని పేర్కొనియున్నారు.

(7) క్రీ: శ: 1509 - 1591 ప్రాంతమున - 'దొడ్డయాచార్యులు' అనబడు మహాచార్యులు - 'శ్రీభాష్యోపన్యాసాః' అను గ్రంథమును వ్రాసిరి. మఱియు - ముఖ్య విషయములను దెలుపుచు - అధికరణార్థ సంగ్రహః' అను గ్రంథమును కూడ రచించిరి.

(8) క్రీ: శ. 16-వ శతాబ్దమున, తాతదేశికులవారి శిష్యులైన రంగరామానుజులు - 'భావ ప్రకాశిక' అను శ్రుతప్రకాశిక వ్యాఖ్యను వ్రాసిరి. అదియునుగాక, 'మూల భావ ప్రకాశిక', శారీరక శాస్త్రార్థ దీపిక' అను గ్రంథములనుకూడ రచించిరి. మొదటిది ముద్రితము. తరువాతి రెండును - అడయారు గ్రంథాలయమున గలవు.

(9) క్రీ: శ: 18 - 19 శతాబ్దముల మధ్యకాలమున, కొళియాళం రంగరామానుజమునులు ఆనందమయాధికరణమును వివరించుచు - 'పరపక్ష నిరాకృతి' యను గ్రంథమును రచించిరి. ఇది ముద్రితము,

(10) క్రీ. శ. 18 వ శతాబ్దమున, సురపురం శ్రీనివాసతాతాచార్యులవారి పుత్రు లగు వేంకటాచార్యులు - 'బ్రహ్మసూత్ర భాష్యస్థ పూర్వపక్ష సంగ్రహ కారికా' యను గ్రంథముగ వ్రాసిరి. ఆ కాలమునందే - సురపురం శ్రీనివాసాచార్యులవారు-'శ్రీభాష్యస్య సమీక్షాత్మక మధ్యయనమ్' అను రీతిలో - 'తత్త్వ మార్తాండము' అను గ్రంథమును వ్రాసిరి. 'అథా తో బ్రహ్మ జిజ్ఞాసా' అను మొదటి బ్రహ్మసూత్ర మందలి 'జిజ్ఞాసా' అను పదమును శ్రీభాష్యానుసారము వివరించుచు - 'జిజ్ఞాసా దర్పణము' అను పేర నొక గ్రంథమును వ్రాసిరి. 'నారాయణ' పదము నందలి 'ణ'త్వమును వివరించుచు - 'ణత్వ దర్పణము' అను పేర నొక గ్రంథమును రచించిరి. 'బ్రహ్మణః జిజ్ఞాసా = బ్రహ్మజిజ్ఞాసా' అను చోట కర్మణి షష్ఠిని ప్రతిపాదించుచు - షష్ఠీ దర్పణము' అను పేర నొక గ్రంథమును వ్రాసిరి. ఇవి యన్నియు ముద్రితములే.

(11) 18 - వ శతాబ్దమున, భూతపురవాసియగు 'శ్రీశైలయోగి' యను పేర ప్రసిద్ధిగన్న 'శ్రీనివాసాచార్యులు' - 'బ్రహ్మ' అను పదమును వివరించుచు - 'బ్రహ్మపద శక్తివాదః' అను గ్రంథమును వ్రాసిరి. ఇయ్యది అడయారు గ్రంథాలయమున గలదు.

(12) 18 - వ శతాబ్దమున, రంగనాథ దేశికులవారి పుత్రులు, శిష్యులు అగు శ్రీభాష్యం శ్రీరంగాచార్యులవారు - 'శ్రీభాష్య సిద్ధాంత సారః అను గ్రంథమును వ్రాసిరి, ఇదియు అడయారు గ్రంథాలయములో నున్నది.

(13) శ్రీ రామానుజుల గురువులలో నొక రగు శ్రీశైలపూర్ణుల వంశీయులైన తాతదేశికులవారి కుమారులైన 'శ్రీశైల శ్రీనివాస సూరి' యను వారు - 18 వ శతాబ్దమున - 'శ్రుతప్రకాశికా

సంగ్రహః' అను గ్రంథమును వ్రాసిరి. ఇదియును అడయార్ గ్రంథాలయమున గలదు.

(14) 18 - వ శతాబ్దమున - కుంభకోణ వాసులగు 'రాఘవాచార్యులు' అనువారు - 'శారీరకార్థ సంక్షేపః' అను గ్రంథమును వ్రాసిరి.

(15) క్రీ: శ: 1734 - 1766 మధ్య కాలమున, మైసూరు వాసులైన రెండవ కృష్ణరాజ్ వారి దళవాయిగాఁ గలవారి తమ్ముఁడైన వీర రాజులవారి పుత్రులగు శుద్ధసత్త్వం రామానుజాచార్యులు అనువారు - 'గురు భావ ప్రకాశిక' యను వ్యాఖ్యను వ్రాసిరి. ఇదియు అడయారు గ్రంథాలయమున గలదు.

(16) 18- వ శతాబ్దమున, ప్రతివాది వేంకటేశం పండితులు - 'శారీరక దీపికా' అను గ్రంథమును వ్రాసిరి.

(17) క్రీ: శ: 1842 - 1928 మధ్యకాలమున - ముడుంబి నరసింహాచార్యులవారు - 'బ్రహ్మసూత్ర భాష్యము' అను నొక గ్రంథమును వ్రాసిరి.

(18) పండిత రామశాస్త్రిచే రచింపఁబడిన 'శ్రీభాష్య వ్యాఖ్య' - Pandit New Series ద్వారా ప్రచురింపఁబడినవి.

(19) 'శేషార్య' అనఁబడు అనంతాచార్యులవారు - 'ఈక్షత్యధికరణ విచారః' అను గ్రంథమును వ్రాసిరి. ఇది ముద్రితము.

(20) శ్రీశైల శ్రీనివాసాచార్యులవారు శ్రీభాష్యమునను సరించుచు 'వేదాంత న్యాయ మాలిక' అను గ్రంథమును వ్రాసిరి. ఇదియును - అడయారు గ్రంథాలయములో - గలదు.

(21) తిట్టై వాధూల శ్రీనివాస పండితులు-శ్రీభాష్యమును శ్రుత ప్రకాశికను తమిళములో ననువదించిరి.

(22) కందాడ శేషాచార్యులవారు-1922 లో - ఆంధ్ర శ్రీభాష్యమును రచించి, ప్రచురించిరి. ఇది నేడనుపలభ్యము.

(23) వి. కె. రామానుజాచార్యులవారు 20 - వ శతాబ్దమున శ్రీభాష్యమును ఆంగ్లములో ననువదించిరి.

(24) 20 - వ శతాబ్దమున 'సెలమేఘ శాస్త్రి' అనువారొకరు - విశిష్టాద్వైతము మతానుసారము 'సూత్రభాష్యము'ను వ్రాసిరి.

(25) 19 - వ శతాబ్దమున అనంతరామ పండితులచే - 'వేదాంతసార వ్యాఖ్య', 'వేదాంతసార కుద్యమాలా' అను గ్రంథములు వ్రాయబడినవి. మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయము సంచలి 1949 సంవత్సరమునకు చెందిన నూతన గ్రంథసూచికలో ఇది సూచింపబడినది.

(26) 'శ్రీనివాస రాఘవదాసు' అనబడు 'శఠకోప రామానుజ యతి' యను పండితునిచే - 'అధికరణ కల్పతరు' అనబడు వ్యాఖ్య వ్రాయబడినది. ఇది ముద్రితము.

(27) 1855 లో జన్మించిన కపిస్థలం దేశికాచార్యులవారు - 'శారీరాధికరణ రత్నమాలా' అను గ్రంథమును రచించిరి. దీనికి తమిళానువాదము కూడ కలదు.

(28) కౌండిన్య వేంకటాచార్యులవారి పుత్రులగు అణ్ణయాచార్యులు - విశిష్టాద్వైత మతానుసారము - 'బ్రహ్మసూత్రార్థసూత్ర సంగ్రహము' అను గ్రంథమును వ్రాసిరి.

(29) పంజాబీ సుదర్శనాచార్యులు శ్రీభాష్యానుసారము 'విశిష్టాద్వైతాధికరణ రత్నమాల' అను గ్రంథమును వ్రాసిరి.

(30) 1895 నాటి వేదాంతదేశిక మహాయతీంద్ర దేశికులు శ్రీభాష్యానుసారము - 'బ్రహ్మసూత్రార్థ పద్యమాలిక' అను నొక గ్రంథమును వ్రాసిరి.

(31) 1884 - 1966 మధ్య కాలమున, మైసూరు పరకాల మఠ 33 - వ జీయరు - అభినవ రంగనాథ పరకాల యతులచే - 'గూఢార్థ సంగ్రహః' అను విస్తృత వ్యాఖ్య వ్రాయబడినది. ఇది ముద్రితము.

(32) అట్లే, వాధూల శ్రీనివాసాచార్య విరచిత మగు 'శ్రీభాష్య ప్రకాశిక' అను వ్యాఖ్యయు ముద్రితమైయున్నది.

(33) అభినవ దేశిక బిరుదాలంకృతు లగు ఉత్తమూరు వీరరాఘవాచార్యులవారు 20 - వ శతాబ్దమున 'భాష్యార్థ దర్పణమ్' - అను నొక వ్యాఖ్యను రచించి, ప్రకటించిరి.

(34) కారుక్కుచ్చి వేంకట రాఘవాచార్యులవారిచే - 'శ్రీభాష్యార్థ సంగ్రహము' అను మణిప్రవాళ గ్రంథము వ్రాయబడినది.

(35) వరదరాజ సూరిచే - 'శ్రీభాష్య ప్రమేయ మాలా' అను గ్రంథము ప్రకటింపబడినది.

(36) రంగరాజ ముని విరచిత మగు శ్రీ శారీరక శాస్త్రార్థ దీపిక ఒకటి కలదు.

(37) వేదాంత యతిరాజ విరచిత మగు 'బహ్మసూత్ర వృత్తి' ఒకటి కలదు.

(38) శ్రీనివాస విరచిత మగు 'బ్రహ్మసూత్రార్థః' అను విపుల విచారాత్మక మగు గ్రంథ మొకటి కలదు.

(39) రామానుజ దాస విరచిత మగు 'శారీరక భాస్కరము' అను నొక గ్రంథము కలదు.

(40) సుందరరాజ విరచిత మగు 'శ్రీభాష్య వ్యాఖ్య' అను గ్రంథ మొకటి కలదు.

(41) శ్రీనివాస విరచిత మగు శ్రీభాష్య లఘు భావ ప్రకాశిక' (42) రామానుజసూరి విరచిత మగు శ్రీభాష్య 'సుబోధిని'(43) మేఘ నాధారిసూరి విరచిత మగు 'శ్రీ భాష్య భావ ప్రబోధనమ్', (44) వేంకటాచార్య విరచిత మగు 'బ్రహ్మసూత్ర భాష్య పూర్వపక్ష సంగ్రహ కారికా (45) శఠకోపముని విరచిత మగు 'బ్రహ్మ సూత్రార్థ సంగ్రహః (46) నారాయణ విరచిత మగు బ్రహ్మసూత్ర వ్యాఖ్యా' (47) తిరుమలై లక్ష్మీకుమార కోటికన్యా దనంతకృష్ణ తాతాచార్య మహాదేశిక విరచితము లగు బ్రహ్మశబ్దార్థ విచారః', శఠకోపాచార్య విరచితము లగు (48) బ్రహ్మశబ్దార్థ విచారః (49) బ్రహ్మశబ్దార్థ నిష్కర్షా (50) దేశికాచార్య విరచితముగు బ్రహ్మ సూత్ర భాష్య టిప్పణి (51) కరికుఱిచి వేంకట కృష్ణమాచార్య రచిత మగు 'భాష్యార్థ మణి ప్రవాళ దీపికా' (52) మహాచార్య (దొడ్డయాచార్య) విరచితమగు శ్రీ 'భాష్యోపన్యాసః(52) శిరిశినగళ్ కృష్ణమాచార్య విరచితమగు 'శ్రీభాష్యోపన్యాసః' (55) శ్రీరంగా చార్య విరచిత మగు 'శ్రీభాష్యసిద్ధాంత సారః' (57) వరదాచార్య కృతము లగు శ్రీభాష్యవార్తికమ్ శ్రీభాష్యప్రమేయమాలా (58)

చార్య విరచిత మగు 'శ్రీభాష్యార్థ సంగ్రహః' (59) వాధూల శ్రీని వాసాచార్య విరచిత మగు 'శ్రీభాష్య ప్రకాశికా' అను ప్రాచీన - అర్వాచీన గ్రంథములే గాక, మద్రాసు విశ్వవిద్యాలయ గ్రంథాలయ మందును, అడయారు గ్రంథాలయమందును - అజ్ఞాత పండితులచే రచింపబడిన మతి కొన్ని గ్రంథములును కలవు. అవి యివి:

(60) అధికరణ సంగ్రహ శ్లోక వ్యాఖ్య (61) జన్మాద్యధికరణ విచారము (62) బ్రహ్మసూత్ర దూషణోద్ధరః (63) బ్రహ్మసూత్ర భాష్య సంగ్రహ వివరణమ్ (64) బ్రహ్మసూత్ర భాష్యారంభ ప్రయోజన సమర్థనమ్ (65) బ్రహ్మసూత్రాధికరణ సూత్రకారికా (66) బ్రహ్మసూత్ర భాష్య సంగ్రహ టిప్పణి (67) బ్రహ్మసూత్ర వృత్తిః (68) శారీరక వ్యాఖ్యానమ్ (69) శారీరక సారార్థ సంగ్రహః (70) లఘు భావ ప్రకాశికా (71) సుబోధినీ (72) శ్రుత ప్రకాశికా వ్యాఖ్యా తాత్పర్య దీపికా (73) శ్రుత ప్రకాశికా సంగ్రహః (74) మ ప్వర్థ విచారః (75) బ్రహ్మసూత్రభాష్య వ్యాఖ్యా (76) బ్రహ్మసూత్రభాష్య సంగ్రహ టిప్పణీ (77) బ్రహ్మ సూత్రార్థ సంగ్రహమ్ (78) రామానుజ సిద్ధాంతము (79) రామానుజ సిద్ధాంత నిర్ణయ సంగ్రహము (80) శ్రీభాష్య వ్యాఖ్యా - లఘుభావ ప్రకాశికా (81) శ్రీభాష్య వ్యాఖ్యా సుబోధినీ మొదలగునవి.

ఈ రీతిగా అనేక వ్యాఖ్యానములు ఒక ప్రవాహ రూపమున వరున వరుసగా వెలువడి, శ్రీభాష్య ప్రభావమును వేనోళ్ళ చాటు చున్నవి కావున, అట్టి శ్రీభాష్యకారు లగు శ్రీ రామానుజ యతి సార్వభౌముల తాత్త్విక దృక్పథము నేటికిని అనవృశమై, అఖండమై

అన్యూతమై, అజరామరమై యలరారుచున్నట్లు స్పష్ట మగు చున్నది గదా !

ఈ కారణము వలననే - డాక్టర్ : సర్వేపల్లి రాధాకృష్ణన్ వంటి ప్రముఖ తత్త్వశాస్త్రవేత్త లనేకులు శ్రీ రామానుజ దర్శనమును బహు భంగులుగా ప్రశంసించియున్నారు. ఇందులకు - వారి వారి రచనలే ప్రబల సాక్ష్యాధారములు.

"శ్రీభాష్యకారో జయతు రామానుజ జగద్గురుః
ముముక్షూణాం చ సర్వేషాం శ్రీమ దష్టాక్షర ప్రదః."



# విషయానుక్రమణిక

# లక్ష్మీస్తుతి

## (శ్రీ రామానుజ విరచితము)

— మూలము:—

భగవన్నారాయణాభిమతానురూప స్వరూప రూప గుణ విభవైశ్వర్య శీలాద్య నవధికాతిశయా సఙ్ఖ్యేయ కల్యాణ గుణాం పద్మావనాలయాం భగవతీం శ్రియం దేవీం నిత్యానపాయినీం నిరవద్యాం దేవదేవ దివ్య మహిషీం అఖిల జగన్మాతర మస్మన్మాతర మ శరణ్య శరణ్యా మనన్య శరణ శ్శరణ మహం ప్రపద్యే॥.

— తాత్పర్యము —

అలంకారములు శీలము (సౌశీల్యము) మొదలైన హద్దులేని అతిశయములు కలవైనట్టియు, లెక్కపెట్టలేనట్టివియు అయిన కల్యాణ గుణములకు ఆకరమైనట్టియు, పద్మాసనమే ఆలయముగా కలిగినట్టియు, షాడ్గుణ్య యుక్తిమైనట్టియు, మనచేత ఆశ్రయింపబడుచు భగవంతుని ఆశ్రయించినట్టియు, దివ్యమైన కాంతితో ప్రకాశించుచున్నట్టియు, భగవంతుని ఎల్లప్పుడును విడువనిదై యున్నట్టియు, దోష లేశము కూడ లేనట్టిదియు, శ్రీమన్నారాయణుని పట్టపురాణి యైనట్టియు, సకల ప్రపంచమునకు తల్లియైనట్టియు, (విశేషించి నాకు తల్లియైనట్టియు) దిక్కులేని వారలను రక్షించునట్టిదియు అయిన "శ్రీ దేవిని" ఎక్కడను శరణు దొరకని నేను శరణు పొందుచున్నాను.



శ్రియః కాంతాయ కల్యాణ నిధయే నిధయేర్థినామ్
శ్రీ వేంకట నివాసాయ శ్రీనివాసాయ మంగళమ్.

# శ్రీ వేంకటేశ స్తుతి

'కవయిత్రీ తిలక'

## శ్రీమతి - ఏక్రాల శ్రీదేవమ్మ



శ్రీరమణీ మణీ విమల చిత్త వశీకరణుండు - మౌని మం
దారుఁ డుదాత్త శీలుఁ డతి దారుణ పాతక దారణుండు - తన్
గూరిచి భక్తితోఁ బిలువ, కూరిమి - 'ఓ'యని పల్కు-వాఁడు - శ్రీ
గారుడశైలనాయకుఁడు గాచుత మమ్ము కృపాలవాలుఁడై.

వరదుని, లోక నాయకుని, వారి రుహాసను గన్నవాని, నే
యరమర లేక నాశ్రితుల కాశ్రయుఁడై దనరారువాని, నీ
ధర నరజాతి బ్రోచుటకు తామర పద్మమునందు వెల్గు శ్రీ
తిరుపతి వేంకటేశ్వరుని, దివ్యుని గొల్చెద నిష్ట సిద్ధికై.

భవ హరుచే, శ్రితాళి నిల పాలన సల్పెడు సామిచే, సదా
శివ విబుధేంద్ర సన్నుతులచే క్ష్మ నేలు పదారవిందుచే
శివము లొసంగి, లోకముల క్ష్మ నేలు కృపా సముద్రుచే
భువి సుఖియింతు మంచు వెరపున్ విడనాడి తలంతు రెప్పుడున్.

హరికై యాశ్రిత పక్షపాతికయి, విశ్వారాధ్యుకై, దైత్య సం
హరుకై, క్షీర సముద్రరాజ తనయాత్మానంద సంధాయికై
వర రత్నాంచిత శంఖ చక్ర ధరుకై, వైకుంఠుకై, వేంకటే
శ్వరుకై నువ్విళులూరుచుండు మది నిచ్చల్ నాకు నుప్పొంగుచున్.

తామరసాక్షు కంటె, నల తామరసోద్భవు కంటె, శ్రీ
భూ మహిళేశు కంటె, పరిపూర్ణుఁడు నౌ దొర కంటె, వాన స
త్కామిత దాత కంటె, సురగాద్రి వెలింగెడి శౌరి కంటె నీ
భూమిని బ్రోవ నే రొకఁడు పుట్టఁడు పుట్టఁ డటంచు చాటెదన్,

తాపస పాల శీలికి, నధర్మ విదారణ శౌర్య శాలికిన్
దీపిత రత్న దీధితుల దిగ్గన ద్రోయు సుమాల మాలికిన్
పాపములన్ హరించి శ్రితపాళినిఁ బ్రోవగ వేంకటాద్రిపై
కాపుర మున్న శ్రీపతికి, కల్మష హర్త కివే నమస్కృతుల్.

ఆగమ వేద్యు నందు, నఖిలాత్మకు నందు, నిజాశ్రితావనో
ద్యోగుని యందు, కల్మష విదూరుని యందు నిరంతరమ్ము బల్
బాగుగ నా మనమ్ము - మధుపంబు సరోజముఁ జేరు కై వడిన్
సాగుచు పొంగి సక్త మగు సప్తగిరీశుని యందు భక్తిమై.

వేదోద్ధార! మహా మహీధ్ర ధర! పృథ్వీ మండలోద్ధార! ప్ర
హ్లాద త్రాణ! బలి ప్రతారణ! ఖల క్ష్మాపాల నిర్వాపణా!
హే దుర్దాంత దశాస్య సంహార! హతాహీన ప్రలంబాసురా!
శ్రీరామాది వరార్పణ ప్రియ వహా! మ్లేచ్ఛాది పాపాపహా!

నీ వీశుండవు, నిన్న దిక్కుగ సురానీకంబు ప్రార్థించు, నీ
చే విశ్వమ్ము జనించు, నీ కొఱకునై చేతున్ ప్రణామాంజలుల్,
నీ వల్లన్ సిరి యబ్బు, నీకు సరి లేనే లేరు, నీ యందె నా
భావం బెప్పుడు లగ్నమై వరలు నో పద్మావతీ వల్లభా!

* * *

శ్రీరాజ ద్వరదార్య చంద్ర విమల శ్రీ బింబ సంభూత మీ
శ్రీ రామానుజ కీర్తి కౌముదిని పూజించెన్ మహా సక్తిమై
శ్రీరమ్యం బగు వేంకటేశు నుతియే శ్రీమత్ప్రసూనంబుగా
శ్రీ రంజిల్లగ భక్త సేవిక కవి శ్రీదేవి భవ్యమ్ముగన్.



# శ్రీమద్రామాయణము - వైష్ణవ తత్త్వము

'రామాయణ రత్నాకర - ఉభయ వేదాంత శిరోమణి'

శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు, ఎం. ఏ.

—★—

"శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజాను బాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి".

## శ్రీ రామాయణ పరిచయము

"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే
వేదః ప్రాచేతసా దాసీత్ సాక్షా ద్రామాయణాత్మనా."

వేద వేద్యు డగు పరమ పురుషుడు దశరథ పుత్రుడై శ్రీరాముడుగా అవతరింప, వేదము ప్రాచేతసు డగు వాల్మీకి వలన రామాయణ రూపమున ఆవిర్భవించినది."

"వేదై శ్చ సర్వై రహ మేవ వేద్యః."

భగవానుడే వేదము లన్నిటి చేతను ప్రతిపాదింపబడువా డని తెలియు చున్నది."

వేదములు సర్వాధికారములు కాకపోవుటచే, వేద ప్రతిపాద్యు డగు పరమ పురుషుడు అందుబాటులో లే డని, పరమ దయాళు వగు పరమ పురుషుడు సర్వ సులభుడై, సుశీలుడై, ఈ కన్నులతోనే చూచి తెలిసికొని చేరుటకు వీలుగా దశరథ కుమారుడై, జన్మ లేనివాడు జన్మించినాడు. అపుడు ఆ వేదవేద్యుని ప్రతిపాదించు వేదము వాల్మీకి నుండి శ్రీరామాయణముగా బయ ల్వెడలినది.

వేదము రెండు భాగములు. (1) పూర్వభాగము - ధర్మమును ప్రతిపాదించును. (2) ఉత్తర భాగము - సర్వ జగత్కారణము, సర్వ జగద్రక్షణము, సర్వాంతర్యామియు నగు పరమాత్మను - శ్రీమన్నారాయణుని ప్రతిపాదించునది.

ఈ లోకములో, పై లోకములో, పరమ పదమున శాశ్వతముగ పరమాత్మతో చేరియుండి, సుఖమును పొందుటకు సాధనము ధర్మము. వేద ప్రతిపాదిత మగు అభ్యుదయ నిశ్శ్రేయస సాధనము ధర్మము. ఈ లోకములో - పై స్వర్గాది లోకములలో సుఖించుట అభ్యుదయము. పరమాత్మతో చేరి, మఱి జన్మను పొందకుండ - ఆనంద స్వరూపు డగు పరమాత్మతో ఆనందము ననుభవించుచు, శాశ్వతముగ నుండుట నిశ్శ్రేయసము. ఈ రెంటికి సాధనము ధర్మము. మానవుడు - 'దుఃఖమును పొందకూడదు - సుఖమును పొందవలెను' అని ఎల్లపుడు కాంక్షించుచుండును. ఆ సుఖమునకు సాధన మేదియో - తాను తన బుద్ధితో నిర్ణయింపజాల డని వేదము* మనకు సుఖ సాధనము తెలియునట్లు చేయుచున్నది. మనము మన బుద్ధితో - 'నాకు సుఖమున కిది సాధనము' అని నిశ్చయించుకొనలేము. తాత్కాలికముగ అది సుఖమును కల్గించునట్లు కన్పించినను, చివరకు దుఃఖమును కల్గించిన దగును.

అట్టి సుఖము (1) ఐహలౌకికము (2) పారలౌకికము (3) శాశ్వతము అని మూడు విధములు. అందువలన, ఈ లోకములో జీవించియున్నంత కాలము, పై లోకములను పొంది, ఆ లోకములలో ఉన్నంత కాలము అనుభవించు సుఖమునకై ధర్మమును ఆచరింప

* ప్రత్యక్షముచే కాని, అనుమానముచే కాని ఎరుంగుటకు శక్యము కాని విషయమును తెలియజేయునది కావున; "వేదయతి ఇతి వేదః" అను వ్యుత్పత్త్యర్థమున వేదమునకు 'వేదము' అని పేరు గల్గెను.

వలెను. శాశ్వతము శరీరమును విడచి, పరమాత్మతో చేరియుండు సుఖమును పొందుటకై బ్రహ్మజ్ఞానము నార్జింపవలెను. వేదములలో పూర్వ భాగము ధర్మమును, ఉత్తర భాగ మయిన ఉపనిషత్తులు బ్రహ్మమును ప్రతిపాదించును. 'ధర్మము' నాచరింపవలెను. 'బ్రహ్మము' నెరింగి ఉపాసింపవలెను. ఈ రెండును వేదముచే ప్రతిపాదింపబడు నని, ఆ రెండును శ్రీరాముడై జనించినవి. శ్రీరాముడు నరుడుగా అవతరించి, పూర్వ భాగములో ప్రతిపాదింపబడిన ధర్మముల నాచరించి, "రామో విగ్రహవాన్ ధర్మః" అని ప్రసిద్ధి నందినాడు. తాను సాక్షాత్తు పరబ్రహ్మమై, ఇతరులచే ఉపాసింపబడినాడు. ఇట్లు ధర్మ బ్రహ్మములు రెండును ఒకే వేదమున ప్రతిపాదింపబడగ, తాను బాహ్యముగ ధర్మ స్వరూపుడై, ఆంతరముగ బ్రహ్మ స్వరూపుడై శ్రీరాముడు అవతరించినాడు. బాహ్యముగ నడువడి, ఆంతరముగ జ్ఞానము నరున కావశ్యకములు. సర్వ జగ త్కారణమైన తత్త్వము నెరింగి, ఆ జ్ఞానముతో ఆ పరముని ఆరాధించుచు, బాహ్యమైన ధర్మముల నాచరించిననాడు మానవుడు సిద్ధి నొందును. వేదములలో పూర్వ భాగము భగవానుని ఆరాధించుచు, బాహ్యమైన ధర్మముల నాచరించిననాడు మానవుడు సిద్ధి నొందును. వేదములలో పూర్వ భాగము భగవానుని ఆరాధించు విధానమును తెల్పును. ఉత్తర భాగము ఆరంభింపబడువాని స్వరూపమును నిరూపించును. శ్రీరామాయణము వేదమే యగుటచే, బాహ్యార్థమున భగవ దారాధన రూప మగు ధర్మమును ఎట్లు ఆచరింపవలెనో నిరూపించును. ఆంతరముగ ఉపనిషత్ప్రతిపాదిత మగు ఆరాధ్యుని స్వరూపమును, బ్రహ్మజ్ఞానమును ప్రతిపాదించును. ఈ విధముగ వేదము ప్రతిపాదించు ధర్మ బ్రహ్మ స్వరూపములనే శ్రీ రామాయణము ప్రతిపాదించుట చేతనే వాల్మీకి - తన శిష్యు లగు కుశ లవులకు "వేదోపబృంహణార్థాయ తావ గ్రాహయత ప్రభుః" వేదము చెప్పి, దానిలోని అర్థములు

శ్పష్టముగ అవగాహన మగుటకు ఉపబృంహణముగ శ్రీరామాయణ మును నేర్పెను.

మానవ జీవితము దుర్లభము. బహు జన్మ సంచిత సుకృత పరి పాకముచే మానవ జన్మ లభించును. దానిని వ్యర్థము చేసికొనకుండ సిద్ధిని పొంది, పొందవలసిన పరమ ధామమును పొందవలెను. దానికి బాహ్య జీవితమున ధర్మాచరణమును, ఆంతర జీవితమున సత్య మగు బ్రహ్మజ్ఞానమును కలిగియుండవలెను. ఈ రెండును ఉన్నరోజున, అతడు మానవుడు.

జ్ఞానము కన్ను వంటిది. ధర్మము కాలు వంటిది. ఇవి లేకున్న, గ్రుడ్డి, కుంటి యగును. సత్యము, ధర్మము అనునవి నాణెమునకు రెండు ప్రక్కలు వంటివి. నాణెమునకు ఒక వంక విలువను తెలుపు 'ఒకరూపాయి' అను అక్షరము లుండును. మఱి యొక వంక బొమ్మ యుండును. బొమ్మ మారుచుండును. విలువ మాత్రము మారదు. అట్లే, సత్యము మారనిది. ధర్మము వారి ఆశ్రమమును బట్టి, వయస్సును బట్టి, అవస్థను బట్టి మారుచుండును. (1) చైతన్యము గల జీవులు (2) అచేతన మగు ప్రకృతి (3) పరమాత్మ అనునవి మూడు తత్త్వములు. చేతనాచేతనములతో కూడిన పరమాత్మ అంతటను మార్పు లేకుండ ఉండును. దీనినే సత్య మందురు. దీని నెఱింగి, బాహ్యముగ ధర్మము నాచరింపవలెను. ధర్మము నాచరింపనిదే మనస్సున అంటియున్న రాగ ద్వేషము లనెడి మాలిన్యములు వదలవు. అవి వదలిననాడుకాని, జ్ఞాన మావిర్భవింపదు. జ్ఞానము కలిగిననాడు ఆ జ్ఞానముతో ఆచరించిన ధర్మము సిద్ధిని ప్రసాదించును. అందుచే, మానవ జీవితములో బాహ్యముగ ధర్మము, ఆంతరముగ జ్ఞానము ఆవశ్యకములు. వీనినే శ్రీమద్రామాయణము ప్రతిపాదించును.

బాహ్య జీవితములో ఆచరించిన ధర్మమే మానవునకు చేతికఱ్ఱ వలె శరీరమును విడచి ప్రయాణము చేయునపుడు సాయపడున దని చమత్కారముగా కాళిదాసు చెప్పినాడు.

ధర్మము = ధరింపబడునది, ధరించునది అని యర్థము "ధర్మో రక్షతి రక్షితః" మనచే ధరింపబడినచో, మనను ధరించునది ధర్మము. 'అభిజ్ఞాన శాకుంతల' మను నాటకములో - దీనినే చమత్కారముగా సూచించినాడు కాళిదాస మహాకవి. కంచుకి అంతఃపురములో సంచరించు ఉద్యోగి. అత డుద్యోగములో ప్రవేశించినపుడు - అవసర మున్నను, లేకున్నను - చేతిలో కఱ్ఱ పట్టుకొనవలెను. అట్లు వేత్ర దండమును ధరించి, అవసర మున్నవా డెంత శ్రద్ధగా పట్టుకొని తిరుగునో, అంత శ్రద్ధతో పట్టుకొని తిరిగి, బాగా వృద్ధుడైన పిమ్మట, తనలో ఇట్లు భావించుకొనుచున్నాడు :-

"ఆచార ఇత్యేవ హి తేన మయా ధృతా
యా వేత్ర యష్టి రవరోధ గృహేషు రాజ్ఞః."

'పెద్దల ఆచార మని నేను అంతఃపురములో తిరుగునపుడు - అవసరము లేకపోయినను, అవసర మున్నవాడు పట్టుకొనినట్లే, ఈ వేత్ర దండమును ఎంతో అవధానముతో పట్టుకొనినాను.'

"కాలే గతే బహు తిథే మమసైవ జాతా
ప్రస్థాన విక్లబ గతే రవలంబనార్థా."

చాల కాలము గడచిన పిమ్మట - ఇపుడు నడకతో తొట్రుపాటు కల్గుచున్న నాకు - ఆ దండమే ఊతగా నిలిచి కాపాడుచున్నది' అని.

ఆ వేత్రదండము వంటిదే ధర్మము. ధర్మమును ఆచరించు నపుడు - ఫలము నొసంగ లేదే యని వదలి వేయక, శ్రద్ధతో ఆచరించి

నచో, ఒకనాడు మన యీ శరీరమును వదలి, ప్రస్థాన మొనర్చినపుడు, మన గతిలో వైక్లబ్య మేర్పడిననాడు అదియే మనను రక్షించును. చేతి కఱ్ఱ వలె మనము దానిని ధరించిన, అది మనను ధరించును.

అందుచే, ధర్మము నెఱింగినంతమాత్రమున ప్రయోజనము లేదు. ఆచరింపవలెను. అట్టి ధర్మము నాచరించినగాని జ్ఞానము కలుగదు. జ్ఞానము కలిగి, ధర్మము నాచరించిన, ఆ ధర్మము మనలను ఆనంద ధామము నొందించి, శాశ్వత శాంతి నొసంగును.

ధర్మము రెండు విధములు. (1)సామాన్య ధర్మము(2) విశేష ధర్మము

(1) సామాన్య ధర్మము :- సమాజములో తన తోటివాడు ఆనందించునట్లు ప్రవర్తించుట లౌకిక ధర్మము. తండ్రి యెడ, తల్లి యెడ, సోదరుల యెడ, భార్య యెడ, శత్రువుల యెడ - ప్రవర్తింప వలసిన విధము లౌకిక ధర్మము. స్వర్గాది లోకములలో సుఖముగా నుండుటకై చేయవలసిన తపో యజ్ఞ దానాదులు వైదిక ధర్మములు. ఈ రెండును సామాన్య ధర్మములు.

(2) విశేష ధర్మము :- అజ్ఞానముచే ప్రకృతిలో పడి - సంసారియై, జన్మ మృత్యువులను పొందుచున్న జీవుడు — వానినుండి విడివడి, శాశ్వతమైన ఆనందమును పొందుటకు ఎఱుంగవలసిన జ్ఞానము విశేష ధర్మము. (1) తా నెవడు ? (2) తనచే పొందబడవలసిన దేది ? (3) వానిని పొందుటకు ఉపాయ మేది ? (4) అట్లు పొందుటకు ఆటంక మేమి ? (5) పొందిన ఫల మేమి ? అను ఐదు విషయముల నెఱింగి, త దనుగుణముగ ప్రవర్తించుట విశేష ధర్మము. బాహ్యముగ సామాన్య ధర్మములను, ఆంతరముగ విశేష ధర్మములను నిరూపించుటయే వేదము యొక్కయు, శ్రీమద్రామాయణము యొక్కయు ముఖ్యోద్దేశ్యము. శ్రీరామచంద్రుడు సామాన్య ధర్మములను తా నాచరించి, లక్ష్మణ - భరత — శత్రుఘ్న - సీతా - హనుమదాదుల

నడువడిచే విశేష ధర్మమును నిరూపింపజేసెను. వేదములలో పూర్వ భాగము సామాన్య ధర్మములను, ఉత్తర భాగము అనగా - ఉపనిషత్తులు విశేష ధర్మమును నిరూపించును. అట్లే, శ్రీమద్రామాయణమున వాచ్యార్థము సామాన్య ధర్మమును, వ్యంగ్యార్థము విశేష ధర్మమును నిరూపించును. శ్రీమద్రామాయణము వేదము వలె ధర్మ స్వరూపమును, జ్ఞానమును ప్రతిపాదించును. కాని, రామాయణము కావ్యమగుటచే, పైకి తెలియు అర్థము కాక, అంతరమువ ధ్వని రూపమున వే ఱొక అర్థముండును. వాల్మీకి మహర్షి నోటి నుండి ఆవిర్భవించిన వేదమే రామాయణ మగుటచే, వేదమునందు వలె ఇందును ధర్మ స్వరూపము, బ్రహ్మ స్వరూపము నిరూపింపబడినవి. అందుచేతనే దీనిని వేదమునకు ఉపబృంహణము అని వ్యవహరించిరి. వేదములలోని సూక్ష్మము లగు అర్థములను విశదముగ తెలియజేయునది ఉపబృంహణము.

(1) వేదము 'సత్యం వద, ధర్మం చర' అని రాజు వలె శాసించి చెప్పును.

(2) పురాణములు మిత్రుని వలె ఏదియో యొక కథను ప్రవచించి, వాని ద్వారా – 'ఇది చేయవలసినది – ఇది చేయ గూడనిది' అని తెలియజేయును. అట్టివి భారతాదులు.

(3) కావ్యము ప్రేమించిన ప్రియురాలి వలె మధురముగ మాటలాడుచు, తన్మయత కలిగించి, 'ఇది చేయవలెను – ఇది చేయకూడదు' అని ఉపదేశింపకయే పురుషుడు తనంత తాను ఆనందముతో మంచి మార్గమున ప్రవర్తించునటుల చేయును.

మొదటి శ్లోకములో వాల్మీకి - కోకిల. మామూలు కోకిల మధురముగ కూయును. కాని, వాల్మీకి కోకిల - మధురముగ, మధురాక్షరముగ కూడ కూసినది. ఇది కవిగ వాల్మీకియొక్క అతిశయమును నిరూపించును. కావ్యమునందు శబ్దములలో మాధుర్యము, అర్థములో మాధుర్యము, రసములో అక్షరత్వము ఉండవలెను. ఈ మూడును కవికోకిల స్వరములో కలవు. రామాయణము కావ్యమగుటచే, శబ్దములు గాన ప్రధానములై, చెవికి మధురములై యుండును. అర్థము హృదయమునకు ఇంపై, మధురముగ నుండును. దాని యందలి అంతరార్థము అక్షరమై, అనగా - నాశములేనిదై యుండును. క్షర మనగా - మార్పు నందునవి. అక్షర మనగా - మార్పు నందనిది. అది ఆత్మ తత్త్వము. ఇట్లు కావ్యముగ రామాయణము - మధురము, మధురము, అక్షరము.

రెండవ శ్లోకములో వాల్మీకి - ముని. ఆతడు సంచరించునది కవితా వనము. అందు ఆ సింహము రామ కథను గర్జించును. దానిని వినినవారు పర గతి నందుదురు. అనగా - పరమ పదము నొందుదురని యర్థము. అట్లు పరమ పదము నొందుటకు - రామకథలోని నాదమును, అనగా - ధ్వన్యర్థ మగు ఆత్మ తత్త్వము నెఱుంగవలెను.

ఇట్లు వాల్మీకి - కవిగా బాహ్యార్థమును, మునిగా అంతరార్థమును ప్రతిపాదించెను. కావ్య గానమున మాధుర్యము, ఆత్మతత్త్వము ప్రతిపాదించుటలో గాంభీర్యము రామాయణమున కలవు. వాల్మీకి - కోకిలయై, రామ కథను మధురముగ పలికెను. ముని సింహమై, ఉపనిష దర్థములను గర్జించెను. మొదటి స్వరము చెవికిని మనసునకును తరగని హాయిని ప్రసాదించును. రెండవది - శాశ్వతమగు స్థానమును చేర్చును. ఇట్లు ఈ శ్లోకములలో బాహ్యార్థమున రామ కథయు, అంతరార్థమున ఆత్మ కథయు కల వని తెలియనగును.

(1) శ్రీరామచంద్రుడు బాహ్యముగ మానవుడైయుండి, ఆంతరముగ భగవానుడు.

(2) శ్రీరామ నామము బాహ్యముగ దశరథ పుత్రుని ప్రేమ. ఆంతరముగ జగత్కారణ మగు పరమాత్మ పేరు.

(3) శ్రీరామాయణము బాహ్యముగ రామ కథ. ఆంతరముగ ఆత్మకథ. రామాయణము బాహ్యముగ కావ్యము. ఆంతరముగ ఉపనిషత్తు.

ఇట్లు సౌలభ్య పరత్వములు - శ్రీరామచంద్రుడై, శ్రీరామ నామమై, శ్రీరామాయణమై ఒకచో చేరియున్నవి.

రామాయణ మను నామము చాల విశిష్టమైనది.

(1) రాముని యొక్క చరితము రామాయణము. "రామస్య అయనమ్ - రామాయణమ్." రాముని పొందించునది రామాయణము. "రామః అయ్యతే అనేన ఇతి రామాయణమ్." ఇది రాముని చరిత్రమే యైనను, దీనిని చదివినవారిని, రాముని పొందించునట. రాముని వలె ధర్మశీలురై చివరకు బ్రహ్మసాయుజ్యము నందుదు రని భావము.

(2) ఇందు సీతాదేవి చరిత్రము ప్రధానముగా నుండుటచే, ఇది రామాయణము.

"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయా శ్చరితం మహత్."
రామాయణ మంతయు సీతాదేవి చరిత్రమే అని వాల్మీకి పేర్కొనెను. "రామాయాః అయనమ్ - రామాయణమ్" 'రామా' అనగా స్త్రీ. అనగా - సీత. ఆమె యొక్క చరిత్రము రామాయణము.

(3) రాముడు అయనముగా కలవారి చరిత్రము

(4) రామునికి అయన మయినవారి చరిత్రము – రామాయణము

రామాయణమున అన్ని పాత్రలును రామునే ఆశ్రయముగా చేసికొని సాగినవి. రాముడు మధ్యలో నున్నచో – చిన్న కాకి మొదలు, రావణుని వఱకు – శబరి మొదలు, అగస్త్యుని వఱకు రామునితో సాక్షాత్ సంబంధము ఇందు కన్పించును. రాముడు వారిపై ఆధారపడి, నిలచిన ట్లుండును. అందుచే, ఈ చరిత్రమున రాముడు ఇతరు లందఱిలో, ఇతరు లందఱును రామునిలో – పరస్పరము చేరిన ట్లుందురు. అందుచే, రాముడు అయనముగా – అనగా, ఆధారముగా కలవారి చరిత్రము రామాయణము. రామునకు అయనము – అనగా, ఆధారముగా అయినవారి చరిత్రము రామాయణము. ఇట్లు నారాయణ శబ్దము వలె రామాయణము రెండర్థములను ప్రతిపాదించును.

(5) ఆత్మ చరితము

(6) మనో విజయము (పౌలస్త్యవధము) రామాయణము

"....  ....  ...  సీతాయా శ్చరితం మహత్
పౌలస్త్య వధ మిత్యేవ చకార చరిత వ్రతః."

– (బాలకాండ 4–7.)

'సీతా చరిత్రము', 'పౌలస్త్య వధము' అని వాల్మీకి అనుటలో కూడ రహస్యార్థము ఇమిడి యున్నది. సీత ఆత్మ స్వరూపమును నిరూపించుటకై అవతరించిన జగన్మాత. ఆమె శ్రీరామునితో ఎన్నడును ఎడబాటు లేక కలిసియుండు దేవి. కాని, లోకులకు ఆత్మ స్వరూపమును, ఆ ఆత్మ పరమాత్మలకు గల సంబంధమును, పరమాత్మతో ఆత్మ ఎడబాటు నొంది, బంధము నొందుటకు గల కారణ

మును, మఱల పరమాత్మతో చేరుటకు ప్రవర్తింపవలసిన తీరును చరిత్రము - అనగా, ఆత్మ చరిత్రము రామాయణము అను నర్థము స్ఫురించును. సీతను బంధించినవాఁడు - కామ మోహితుఁడగు రావణుడు. ఆత్మను బంధించునది కామమోహిత మగు మనస్సు. ఆ మనస్సును జయించిననాడే ఆత్మ పరమాత్మతో చేరును. ఈ పౌలస్త్య వధయే మనో విజయము - రామాయణము.

ఇట్లు రామాయణము -

బాహ్యముగ - (1) రామకథ (2) సీతకథ, (3) రావణ వధ.

ఆంతరముగ - (1) బ్రహ్మకథ, (2) ఆత్మకథ, (3) మనోవధ.

ఇట్లు రెండర్థములతో సాగిన రామాయణమును అధ్యయనము చేయునపుడు -

బాహ్యముగ - (1) కావ్యగత సౌందర్యమును, (2) కథాగత సౌందర్యమును, (3) పాత్ర నిరూపణమును, (4) వర్ణనలలోని వైశిష్ట్యమును భావింపవలెను.

ఆంతరముగ - (1) ఆత్మ స్వరూపమును, (2) పరమాత్మ స్వరూపమును, (3) ఆ పరమాత్మను చేరుటకు ఉపాయమును, (4) చేరకుండ అడ్డెడి విరోధులను, (5) వారిని జయించి చేరుటచే కలిగెడి ఫలమును ఎఱుంగవలెను.

రామాయణము లౌకికముగ ఒక మహాకావ్యము. ఆధ్యాత్మికముగ ఉపనిషత్తు. అంతే కాక, ఇది ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము, మహామంత్రము. కవులకు కావ్య రచన కదియే ఆధారము. ఇందు మానవ జీవితమునకు ఆవశ్యకము లగునవి అన్నియు

కలవు. దీని అర్థమును తెలియక, కేవల శబ్దమునే చదివినవారికి కూడ, బుద్ధిని శుద్ధి నొనర్చి, కోరిన ఫలముల నిచ్చును. మంత్రములకు అర్థము తెలియనక్కరలేదు; శబ్ద మాత్రమును శ్రద్ధతో ఉచ్చరించినచో, ఫలము నిచ్చును. అందుచే, ఇది వేద మంత్రముతో సమానమైనది. మంత్రములలో నెల్ల శ్రేష్ఠమైనది గాయత్రీ మంత్రము. దానికి విశ్వామిత్రుడు ఋషి. సూర్యమండలాంతర్వర్తియైన నారాయణుడు దేవత. ఆ గాయత్రీ మంత్రము బుద్ధి వృత్తులను సమ్యక్ ప్రేరణ చేయుటకు, జగత్కారణుడైన భగవానుని గూర్చిన ధ్యాన రూపము. దీనిని జపించి, బుద్ధి వృత్తులను లెస్సగా ప్రవర్తింపజేసికొనుట ఆవశ్యకము. కాని, అందఱకును అది సాధ్యము కాదేమో యని, కరుణామయుడగు వాల్మీకి - ఈ రామాయణమున ఆ గాయత్రీ మంత్రమును నిక్షేపించెను. రామాయణమున కూడ, ప్రధాన ఋషి విశ్వామిత్రుడు. సూర్యవంశ సంజాతుడు. శ్రీరాముడు దేవత. గాయత్రీ మంత్రము నందలి ఇరువది నాలుగు అక్షరములను, రామాయణమున ఇరువది నాలుగు వేల శ్లోకములలో - ప్రతి వేయికి ఒక్కొక్క అక్షరము చొప్పున వాల్మీకి ఉంచెను. ఈ రామాయణమును చదువుటచే, గాయత్రీ మంత్రము జపించిన ఫలము లభించును.

శ్రీవైష్ణవ సంప్రదాయమున ద్వయ మను మంత్రము ప్రధానమైనది. ఆ ద్వయ మంత్రము యొక్క వివరణమే శ్రీమద్రామాయణము. కర్మము, జ్ఞానము, భక్తియు - ఉపాయములు కావనియు, భగవత్ ప్రాప్తికి భగవానుడే ఉపాయ మనియు విశ్వసించి యుండుట - ఉపనిషత్ సిద్ధాంతము. దానినే ద్వయ మంత్రము ప్రతిపాదించును. ఆ విషయమునే బాల కాండలో దేవతలు దశరథుని యజ్ఞ సదస్సులో శ్రీ మహా విష్ణువును శరణు పొందుట మొదలు, యుద్ధ కాండలో విభీషణుని శరణాగతి వఱకు శ్రీమద్రామాయణము నిరూపించుచున్నది.

మానవునకు ఆవశ్యకము లగు పుత్ర ధర్మము, మిత్ర ధర్మము, భ్రాతృ ధర్మము, భర్తృ ధర్మము, శిష్య ధర్మము, శత్రు ధర్మము మున్నగు ధర్మముల నన్నిటిని శ్రీరామచంద్రుడు ఇందు నిరూపించెను. స్త్రీలకు ఆవశ్యకము లగు ధర్మములను సీత నిరూపించెను. శ్రీరామ చంద్రుడు భరతునకు కుశల ప్రశ్న పూర్వకముగా రాజనీతి నంతను ఉపదేశించెను. ఇట్లు రామాయణ మంతయు ఒక ధర్మశాస్త్రమై సాగినది. అరణ్య, కిష్కింధ కాండలలో -- కవితా ప్రస్తావనకు ఆవశ్యకములైన పాత్ర పోషణమున, రస పోషణమున, శబ్ద విన్యాసమున, సంభాషణౌచిత్యమున శ్రీమద్రామాయణముతో పోల్చ దగు గ్రంథమే లేదు.

మానవుని జీవితమే రామాయణము. జీవితమును ఒడుదుడుకులు లేకుండ సాగించుటకు ఆవశ్యకములైన మూలసూత్రములు ఇందు ప్రతిపాదింపబడినవి. మానవుడు జీవించుటకు విషయానుభవము, ధనము ఆవశ్యకములే కాని, వాని భోగమునే ప్రధానముగా భావించి జీవించుచో, మానవునకు పశువు కంటెను భేద ముండదు. ఆహార నిద్రాదులు పశువునకును, మానవులకును సమానములే. బుద్ధి, వాక్కు అనునవి మనుజునకు ఒక్కనికే లభించిన వరములు. వానిచే తెలిసికొనదగుదానిని తెలిసికొని, నాచే అనుభవింపబడునది అంతయు పరమాత్మదే; వానికి చెందనిది, వానియందు ఆధారపడనిది ఏ ఒక్కటియును లేదు - అని గ్రహించి, 'నాది' అనుకొనుదానిని వానిదిగా తెలిసికొని వదలి, వాని ప్రీతికై చెందినవాడుగా మాత్రము అనుభవించుచుండుట త్యాగము. ఇట్టి త్యాగము లేక, తానే - తన కొఱకే అనుభవించుచున్నా నని తగులు వడి యుండుట పాశవికత,

అందుచే, కేవల భోగమును వదలి, త్యాగముతో అనుభవింపవలెనని - "తేన త్యక్తేన భుంజీథాః" అనుచు, ఈశావాస్యోపనిషత్తు చెప్పుచున్నది. ఈవిషయమునే రామ చరితము నిరూపించుచున్నది. రామ కథ త్యాగముతో ప్రారంభమై, త్యాగముతో అంతమైనది. అన్నిటి కంటెను విడచుటకు కష్టమైనవి - ఐశ్వర్యము, ప్రియురాలు. రాముడు మొదట రాజ్యమును వదలినాడు. చివరకు ప్రేమించిన భార్యనే వదలినాడు. మధ్యలో భోగములను అనుభవించినాడు. త్యాగముతో కలిసిన భోగమునే మానవుడు అనుభవింపవలెను. కేవల భోగము మానవునకు తగ దని రాముడు ఉపదేశించినాడు.

మానవుని జీవితములో - ధర్మము, అర్థము, కామము అనునవి మూడును సాధింపదగిన పురుషార్థములు. అందు ధర్మము ప్రధానము. కాని, దానికంటెను అర్థ కామములు ఇష్టములై యుండును. ధర్మముతో సంబంధము లేని అర్థ కామములు అనర్థ హేతువులు. అందుచే ధర్మ బద్ధముగ అర్థమును, కామమును ఉపయోగించుకొనవలె నని శ్రీరాముడు తన నడువడిచే నిరూపించెను. శ్రీరామునకు పట్టాభిషేకము చేసెద నని దశరథుడు సభలో ప్రకటించెను, రామునితో చెప్పెను. కాని, కైకేయి ఆ విషయు మెఱింగి, వెనుక తన కిచ్చెద ననిన రెండు వరములను ఇమ్మని కోరెను. దశరథుడు ధర్మమునకు కట్టుబడి, సత్యమును మీరలేక యూరకుండెను. రాముడు రాజ్యమును వదలి, అరణ్యమునకు ఏగెద నని అంగీకరించెను. కాని, లక్ష్మణుడు మాత్రము రామునియందు భక్తిచే తండ్రిని తీవ్రముగా విమర్శించెను. తండ్రిని బంధించి, రాజ్యమును స్వాధీనము చేసికొనుమని శ్రీరామునకు చెప్పెను. అప్పుడు శ్రీరాముడు - తండ్రి పలికిన సత్య వాక్యమును పాలించుట పుత్ర ధర్మ మనియు, రాజు, తండ్రి, గురువు, వృద్ధుడు అయిన దశరథుని మాట వినుటయే కర్తవ్యమనియు చెప్పెను. ఇప్పుడు అర్థ కామముల కంటెను ధర్మము గొప్పదని నిరూపించుచు ఇట్లు పలికెను

"ధర్మార్థ కామాః ఖలు తాత ! లోకే
సమీక్షితా ధర్మ ఫలోదయేషు."
- (అయోధ్యా కాండ : 21-57.)

"యస్మింస్తు సర్వేస్యు రసన్నివిష్టా
ధర్మో యత స్స్యాత్తదుపక్రమేత "
- (అయోధ్యాకాండ · 21.57.)

ధర్మార్థ కామములు మూడును ధర్మ బద్ధముగ ఆచరించిననాడు - ధర్మ ఫలమును ఒసంగని కేవల అర్థ, కామములను ఆర్జింపరాదు. ధర్మము ఎటు వైపు ఉన్న, దానినే ఆచరింపవలెను. ధర్మమునే ఆచరించుచున్ననాడు - ఆ ధర్మమే అర్థమును, కామమును కూడ సమకూర్చును. ఎట్లన,

"భార్యేవ వశ్యాఽభిమతా సుపుత్రా"
- (అయోధ్యా కాండ . 21-56.)

ధర్మ బద్ధముగ వివాహం మాడిన భార్య - ధర్మమును ఆచరించుటలో తోడుపడి, ధర్మమును సమకూర్చును. వానికి అనుకూలమై, ప్రియురాలై కామము తీర్చును. యోగ్యమగు పుత్రుని కని, అర్థమును ఆర్జింపజేయును. అట్లే, ధర్మమును ఒక్క-దానినే ఆచరించినను అర్థ కామములు సమంతట తామే నెరవేరును. అట్లు కాక, అర్థమునకే ఆశపడి ధర్మమును వీడినచో -

"ద్వేష్యోఽభవ త్యర్థపరో హి లోకే"
- (అయోధ్యాకాండ . 21 - 57.)

లోకము యొక్క ద్వేషమునకు గురి యగును. ధర్మమును వీడి, కామమును అనుభవించినచో -

"కామాత్మతా ఖల్వసి న ప్రశస్తా."
- (అయోధ్యాకాండ . 21-57)

లోక నిందను పొందును. అందుచే, ధర్మ బద్ధము కాని అర్థము - లోకుల ద్వేషమును, ధర్మబద్ధము కాని కామము లోకుల దూషణమును కొనితెచ్చును. అందుచే, మనము ధర్మమునే ఆశ్రయించి, రాజ్యమును వీడి, వనమునకు ఏగుదు మని లక్ష్మణుని శ్రీరాముడు అంగీకరింపచేసెను. చూడుడు :- ధర్మమునకు విరుద్ధముగ భరతునకు రాజ్యము కావలెనని కోరిన కైక - లోకములచే శత్రువుగ భావింపబడి, పగకు గురి ఆయెను. అట్లే, ధర్మ విరుద్ధ మగు కామమును అనుభవింపవలె నని ప్రయత్నించిన రావణుడు - లోకు లందఱి నిందను పొందెను. ధర్మ బద్ధుడై, రాజ్యము వీడిన రాముడు - మఱల రాజ్యమును పొంది, భార్యతో హాయిగా ఉండెను. కావున, అర్థ కామములను మాత్రమే సేవించరాదు. ధర్మ బద్ధము లగునపుడే వానిని ఆచరింపవలె నని శ్రీరాముడు తన నడువడిచే నిరూపించెను.

ఇక - పురుష ప్రయత్నమే ఫలము నిచ్చునా? లేక దైవ సహాయము ఉండవలెనా? అను విషయమును రామాయణము నిర్ణయించును. పురుష ప్రయత్నము ఎంత యున్నను, దైవము అనుకూలింపనినాడు - ఫలము సిద్ధింపదు. కాని, కేవల పౌరుషమే ప్రధాన మనియు, కొందఱు కేవలము దైవమే ఫల ప్రద మనియు భావించుచుందురు. కాని, శ్రీరామచంద్రుడు తన నడువడిలో ఈ రెంటికి సమన్వయము ఆవశ్యక మని ప్రదర్శించెను. అరణ్యమునకు వెళ్ళు మనిన తరువాత లక్ష్మణుడు - దశరథుని, కైకేయిని దూషించుచుండును. అపుడు శ్రీరాముడు - ఇది యంతయు దైవము చేసినది కాని, కైక చేసినది కాదు. నిన్నటి వఱకు తన పుత్రుని కంటెను న న్నెక్కువగా ప్రేమించినది. నే డిట్లు మారినది. ఇదియే దైవము."

"అసంకల్పిత మేవేహ యదకస్మాత్ ప్రవర్తతే
నివర్త్యారంభ మారబ్ధం నను దైవస్య కర్మ తత్."
(అయోధ్యా కాండ ; 22-24)

"అనుకొనిన పని ఆగిపోయి, అనుకొనని విధముగ హఠాత్తుగా జరుగుటయే దైవము యొక్క పని, ఇది కైకది కాదు" అని లక్ష్మణునకు బోధించెను. కాని, లక్ష్మణుడు -

"విక్లబో వీర్యహీనో యస్స దైవ మనువర్తతే
వీరా స్సంభావితాత్మానో న దైవం పర్యుపాసతే."
- (అయోధ్యాకాండ : 23-16)

"ప్రధావిత మహం దైవం పౌరుషేణ నివర్తయే."
- (అయోధ్యా కాండ - 23-20)

'చేతకానివాడు, పిరికివాడు దైవమును అనుసరించియుండును కాని వీరులమైన మనము కాదు. నేను ఆ దైవమును పరాక్రమముతో నివర్తింపజేయుదును' అని ఆవేశపడును. దాని ఫలితము మాత్రమే కనబడును. లాభము, నష్టము, జయము, అపజయము మున్నగు ఫలములచే, దాని వెనుక దైవము కారణముగా నున్న దని తెలియుచుండును. ఆట్లు పట్టు పడని, కనబడని దైవముతో నీ వేమి యుద్ధము చేయుదువు? విరమింపుము. దైవమును అనుసరించుటయే మేలు' అని చెప్పెను.

ఒక కార్యము సిద్ధించుటకు దైవ పౌరుషములు రెండును అనుకూలింపవలెనుకాని, కేవల పౌరుషము చాలదు. దశరథుడు శ్రీరాముని పట్టాభిషేకమునకు ప్రజల అనుమతి పొందెను. మంత్రుల అంగీకారమును సంపాదించెను. వసిష్ఠుని సమ్మతిని పొందెను. పురుష ప్రయత్నము లోపము లేదు. కాని, పట్టాభిషేకము కాలేదు. కారణము దైవమే! అట్లే, భరతునకు పట్టాభిషేకము చేయవలసిన దని కైక కోరెను. శ్రీరాముడు అంగీకరించి, రాజ్యమును విడచి, అడవుల కేగెను. దశరథుడు ఎటులనో సమ్మతించెను. కాని, పట్టాభిషేకము కాలేదు. కారణము దైవమే! దీనిచే, జీవితమున పౌరుషము మాత్రమే కార్యకారి కాదనియు, దైవ పౌరుష సమన్వయము ఆవశ్యక మనియు తెలియుచున్నది.

ఇట్లు శ్రీమద్రామాయణము మానవ జీవితమున, త్యాగ భోగ సమన్వయమును, ధర్మార్థ కామ సమన్వయమును, దైవ పౌరుష సమన్వయమును అవశ్యకము లని నిరూపించినది.

| రావణుడు | రాముడు |
| --- | --- |
| 1) ధర్మమును వదలి, అర్థమును ఆర్జించి, కామమును అనుభవించినవాడు. | 1) అర్థమును, కామమును తృణ ప్రాయముగ భావించి, ధర్మమునకే కట్టుబడినవాడు. |
| 2) విషయ భోగములను అనుభవించుచు, 'నేను', 'నాది' అను అహంకార,మమకారములతో – భోగ మయ జీవితమును గడిపినవాడు. | 2) అహంకార మమకారములను విడచి, త్యాగముతో భోగము లనుభవించినవాడు. |
| 3) పౌరుషమే ప్రధాన మని, దైవమును ఎదిరించినవాడు. | 3) దైవమును నమ్మి, పౌరుషము ఉపయోగించినవాడు. |

రావణుని ప్రవృత్తి - రాజసము, ఆసురము
రాముని ప్రవృత్తి - సాత్త్వికము, దైవము

ఆసురప్రవృత్తి నశించి, దైవ ప్రవృత్తి వృద్ధినొందుట మానవత్వము. అట్టి మానవత్వమును పెంపొందించుటయే శ్రీరామాయణము యొక్క ప్రధాన ప్రయోజనము.

ఈ విధముగ రామాయణము – మానవ జీవితము సుఖ శాంతులతో సాగునట్లు ఉపదేశము నిచ్చు మహా గ్రంథము.

"ఇదం పవిత్రం పాపఘ్నం పుణ్యం వేదైశ్చ సమ్మితమ్."

- (బాలకాండ : 1-98)

అని వాల్మీకి దీని మహాత్త్వమును వివరించెను.

ఈ శ్రీ రామాయణము -

(1) పవిత్రము :- అంతఃకరణమున అంటినదియును, జ్ఞానము కలుగకుండ అడ్డెడియు నగు దోషములను తొలగించును.

(2) పాపఘ్నము :- భగవత్ప్రాప్తికి ప్రతిబంధకములుగా నుండు పాపములను నశింపజేయును.

(3) పుణ్యము :- సుఖమునకు సాధనమై యుండును.

(4) అంనుచే - ఇది వేదముతో సమానమైనది.

మానవజాతి మనవలె ననిన. శ్రీమద్రామాయణమును అధ్యయనము చేయుట ఆవశ్యకము.

## శ్రీ రామాయణ అవతరణము

వాల్మీకి - ఋక్షు డను పేరుతో భృగువంశమున జన్మించినవాడయ్యు, ఆసుర మగు ప్రవృత్తితో - రాజస తామస మగు చిత్తముతో ఉండెడివాడు. అతడు పర హింసయే జీవనముగా కలిగి, కుటుంబ భరణమే పురుషార్థముగా బ్రతికెడివాడు. అట్టివానికి - సప్త మహర్షుల అనుగ్రహముచే రామ నామము లభించినది. దానిని చాల సంవత్సరములు జపించెను. చివరకు - శరీర స్ఫురణమే పోయెను. అతనిపై పుట్ట పెరిగినది. కొంత కాలము తరువాత, వరుణ దేవుని అనుగ్రహముచే వర్షము పడి, పుట్ట కరిగి, ఆతడు బయల్వెడలెను. అప్పుడు ఆతడు (వల్మీకము = పుట్టనుండి బయల్వెడలిన

నాడు) వాల్మీకి అని పిలువబడెను. ప్రచేతసుడు అనగా - వరుణుడు వరుణుని అనుగ్రహమువలన బయల్పడినాడు, ప్రాచేతసుడు. కనుక, తరువాత తపశ్శాలియై, ఆశ్రమమున శిష్యులతో నివసించుచుండెను. కుశలవులు కూడ ఆతని ఆశ్రమమున నుండిరి. ఒకనాటి మధ్యాహ్న సమయమున స్నానమునకై వాల్మీకి భరద్వాజు డను శిష్యునితో తమసా నది కేగేను. ఆ నదిని చూచి శిష్యునితో -

"అకర్దమ మిదం తీర్థం భరద్వాజ ! నిశామయ !
రమణీయం ప్రసన్నాంబు సన్మనుష్య మనో యథా."
- (బాలకాండ : 2. 15)

'భరద్వాజా ! ఈ జలమును చూడుము. బురద లేదు. మనోహరమై యున్నది. అడుగున ఉన్న వస్తువు కూడ కన్పడునట్లు, నీరు నిర్మలమై యున్నది. ఇది మంచివాని మనసు వలె నున్నది చూడుము' అనెను.

ఈ శ్లోకములో వాల్మీకి - తీర్థమును ప్రశంసించుటలో ఆతని మనస్థితి వ్యక్త మగుచున్నది. మంచివాని మనసును నదీ జలమునకు దృష్టాంతముగా చెప్పినాడు. మంచివాని మనసులో కూడ బురద లేకుండ ఉండును. బురద యనగా - రజోగుణము. అది తొలగి, స్వచ్ఛమై యుండుటయే కాదు. ప్రసన్నమై యుండును. అనగా - సత్త్వ గుణము వృద్ధి పొంది, ప్రకాశకమై యుండును. తరువాత - ఆనందమును అనుభవించుటకు, ఇతరులకు ఆనందమును కలిగించుటకు తగిన స్థితి కలిగి, రమణీయ మగును, ఇట్టి సన్మనుష్యుని మనస్సు - అకమర్దతా, రమణీయతా, ప్రసన్నతలు కల నీటితో పోల్చదగినది.

"అస్తి బ్రహ్మేతిచే ద్వేద. సంతమేనం తతో విదు రితి."
- (తైత్తిరీయోపనిషత్తు)

ఎవడు బ్రహ్మ మున్న దని తెలిసికొనునో, అతడు సన్మనుష్యుడు' అని చెప్పినది. అంతటను వ్యాపించినది, అంతయును తానైనది, ఒకటి యున్న దని ఎఱిగినవాడు – 'ఉన్నవాడు.' అది లే దనినవాడు 'లేనివాడు'. (ఉన్నవాడు అనగా – 'సన్' అని అర్థము.) అంతటను వ్యాపించిన తత్త్వము ఒకటి యున్నది. ఈ కన్పడున దంతయు దాని శరీరమే అని ఎఱింగినవాడు 'సన్మనుష్యుడు'. అట్టివాని మనసున రజో గుణము ఉండదు, సత్త్వ గుణము నిండి యుండును. ఆనంద స్వరూపు డగు బ్రహ్మము నిత్య సన్నిహితమై యుండును. అట్టివాని మనసును ఈ నదిలోని జలములకు ఉపమానముగా చెప్పుటచే, వాల్మీకి ఆ స్థితిలో నున్నా డని గ్రహింప వీలగుచున్నది. రామాయణము వాల్మీకి నుండి రాబోవుచున్నది. దానికి తగిన మనస్థితి కలవా డని సూచించుటకే ఆ నదీ జలములను వర్ణించుట. కాని, కేవల సౌందర్య వర్ణనకై కాదు. అట్టి స్థితిలో నున్న వాల్మీకి – ఆ వనమును తిలకించుచు, కొంచెము దూర మేగెను. అచట నొక చెట్టుపై రెండు క్రౌంచ పక్షుల జంట క్రీడించుచుండెను. అందు కామ పరవశమై యున్న మగ పక్షిని బోయ కొట్టెను. పక్షి నేల పడెను. విల విల తన్నుకొనుచు, మెడను ప్రక్కకు పడవైచి, కాళ్ళు చాచి, రెక్కలు పరచుకొని, రక్తము కారుచు మగపక్షి పడియుండెను. ఆడుపక్షి దాని చుట్టును తిరుగుచు, తాకుచు విలపించుచుండెను. ఆ సన్నివేశమును చూచిన వాల్మీకి హృదయము శోకముతో నిండెను. ఆ శోకము లోపల ఆగక, వెలికి వచ్చెను.

"మా నిషాద ! ప్రతిష్ఠాంత్వ మగమః శాశ్వతీ స్సమాః
యత్ క్రౌంచ మిధునా దేక మవధీః కామ మోహితమ్."

– (బాలకాండ ; 2 – 15)

ప్రతిపదార్థము, భావార్థము :-

నిషాద = ఓ బోయవాడా ! యత్ = ఎందువలన, క్రౌంచ మిథునాత్ = క్రౌంచపక్షుల జంట నుండి, కామ మోహితం = కామ పరవశమై యున్న, ఏకం = ఒక మగ పక్షిని, అవధీః = చంపితివో, అందువలన, త్వం = నీవు, శాశ్వతీ సమాః = చాల సంవత్సరములు, ప్రతిష్ఠాం = నిలుకడను, మగమః = పొందకుందువు గాక !

తాత్పర్యము :-

'ఓ బోయవాడా ! నీవు కామ పరవశమై యున్న క్రౌంచ పక్షుల జంట నుండి మగపక్షిని చంపి పడగొట్టితివి. కావున, నీవు చాల సంవత్సరములు మనకొందువుగాక' ! - అని శపించెను.

వాల్మీకికి కోపము వచ్చి తిట్టిన ఈ వాక్యము మరల పరిశీలింప దగినదా దాయెను. దానిని మరల వాల్మీకి చదువుకొనెను, శిష్యులకు చెప్పెను. అది నాల్గు పాదములు కల్గి, ఒకొక్క పాదమునకు ఎనిమిది అక్షరములు కలిగి యుండెను. వీణాపై పలికించుటకు, లయకు తగి యుండెను. దానినే వారు మరల మరల కీర్తించుటచే, వాల్మీకి నుండి శోకముచే వచ్చిన ఆ మాటలే శ్లోక మాయెను. 'శ్లోక' మనగా - 'మరల మరల కీర్తింపదగినది.' - అని యర్థము.

వాల్మీకి యంతటి ఋషికి, జితేంద్రియమునకు శోక క్రోధ ములు కలుగునా ? కలిగినను, అట్లు కోపముతో వచ్చు తిట్టు మరల మరల కీర్తింపతగినది అగునా ? క్షుద్ర మగు పక్షి చనిపోయి నందుకు వాల్మీకి శోకార్తుడై, బోయను అంతటి తిట్టు తిట్టునా ? అను విషయములు ఆలోచింపదగినవి. వాల్మీకి మహర్షి బ్రహ్మజ్ఞాన సంపన్ను డనియు, ఆ బ్రహ్మమే విశ్వమున కంతకు ఆత్మయై, విశ్వము అతనికి శరీరమునై యుండుట ఎఱింగినవాడు అనియు ఎఱుంగవలెను.

అట్టివా డని తమసానదీ తీర్థమును వర్ణించునపుడు మనకు సూచించును. అట్టివా డగుట చేతనే విశ్వము నంతను పరమాత్మ శరీరముగా ప్రేమించినాడు. అందే దే భాగమునందు వేదన కలిగినను, తన శరీరము నందే వేదన కలిగినట్లు భావించెడి ఉదారుడు. అందుచే, పక్షికి కల్గిన వేదన ఆతని హృదయమున మెదలెను. అది పక్షిది కాదు, వాల్మీకిది కాదు. సాధారణీకరణమును పొందిన ఒక భావము. ఆ భావమే రసమై, 'నే ననుభవించుచున్నాను – ఈ భావము నాది' అను భావన తొలగి, బ్రహ్మానందము వంటి అనుభూతి కలుగును. ఇదియే నాటకములను చూచునపుడు, సామాజికులకు కలిగెడు అనుభూతి – హృదయము నిండగా, నీరు కుండ నిండగా – పైకి పొరలినట్లు, మాటల రూపమున వెలుపలికి వచ్చును. అదియే కవిత్వము. వాల్మీకి నుండి వచ్చినది అట్టి కావ్యము. అతని శోకము తన కొఱకు. అందుచే అది శోకము + లోకము = శ్లోక మాయెను. ఇది మఱల మఱల కీర్తించుటకు తగినది. మామూలు శోక మయినచో, కీర్తింప దగినది కాదు. వాల్మీకి నుండి వచ్చిన మొట్ట మొదటి శ్లోకము ఒక తిట్టు అగునా ? కాదు. ఆ నాడు అవతరించి, లోక రక్షణ మొనర్చి రావణ వధ నొనర్చిన రామునకు మంగళాశాసనము. ఇప్పు డా శ్లోకము యొక్క అర్థము చూడుడు :–

**అంతరార్థము :–**

మా నిషాద = శ్రీనివాసా ! యత్ = ఎందువలన, క్రౌంచ మిథునాత్ = వక్ర గమనము గల రాక్షస ద్వంద్వము నుండి కామ మోహితం = కామ పరవశు డైన, ఏకం = ఒకనిని అనగా – రావణుని, అవధీః = చంపితివో, అందువలన, త్వం = నీవు, శాశ్వతీ స్సమాః = చాల సంవత్సరములు, ప్రతిష్ఠాం = నిలుకడను, అగమః – పొందితివి.

తాత్పర్యము :-

శ్రీనివాసా! వక్ర గతి గల రాక్షస ద్వంద్వమునుండి కామ మోహితుడైన ఒకనిని (రావణుని) చంపి, విడగొట్టితివి. అందువలన, నీవు చాల సంవత్సరములు నిలుకడను పొందితివి.

ఇది ఋషి వాక్కగుటచే, రెండు అర్థములు కలిగి, శ్లోకముగ సాగినది. ఇందు బాహ్యార్థము బోయవానిని శపించుట. అంతరార్థము రామునకు మంగళము పలుకుట. కొలదిగ ఆలోచించినచో - కామ మోహిత మగు మనస్సును జయించి, దానిచే వశపరచుకొనబడిన ఆత్మను తన వశము చేసికొనిన పరమాత్మకు మంగళాశాసనము చేయుట కూడ ఇందు కాన్పించును.

క్రౌంచము ఒక పక్షి. "క్రుంచ్ కౌటిల్య అల్పీ భావయోః" అను ధాతువునుండి క్రౌంచ శబ్దము వచ్చినది. క్రౌంచము వక్రముగా నడచునది, చిన్నది. రావణుడు కూడ వక్ర గమనము కలవాడు, అల్పుడు. అందుచే, క్రౌంచ మనగా - రావణుడు. అట్టి రావణుని చంపిన రామునకు మంగళము. మనస్సు కూడ క్రౌంచమే. అదియు వక్ర గమనము కలది, అల్పమైనది. అదియు కామ మోహితమే. దానిని జయించుటకు పరమాత్మ అనుగ్రహామే కావలెను.

మా = శ్రీకి, నిషాద = నివాస స్థాన మయినవాడు లక్ష్మీపతి, నారాయణుడు. అతడే శ్రీరాముడు రావణుని జయించినాడు. పరమాత్మయే మన మనస్సు జయించునట్లు అనుగ్రహించువాడు. ఇట్లు ఒక్క శ్లోకములో బాహ్యముగ బోయ కథ - ఆంతరముగ రామకథ - దాని లోపల ఆత్మకథయు సాగుటచే, ఈ శ్లోకము చాల ముఖ్యమైనది. ఇది వాల్మీకి నోటి నుండి ఆవిర్భవించిన మొదటి శ్లోకము ఇదియే రామాయణమునకు మూల భూతము. దీనిని మఱల

మఱల వల్లె వేయుచు, శిష్యులతో వాల్మీకి అర్ఘ్య పాద్యముల నిచ్చి, ఆసనముపై కూర్చుండజేసి, తాను కూర్చుండెను. అపుడు బ్రహ్మ వాల్మీకితో -

"మ చ్ఛందా దేవ తే వాణీ ప్రవృత్తేఽయం సరస్వతీ."

- (బాలకాండ : 2 - 31)

"రామస్య చరితం సర్వం కురు త్వం ఋషి సత్తమ !
రహస్యం చ ప్రకాశం చ యద్వృత్తం తస్య ధీమతః."

- (బాలకాండ : 2 - 33)

"తచ్చా ప్యవిదితం సర్వం విదితం తే భవిష్యతి."

- (బాలకాండ : 2 - 34)

'నా సంకల్పము వలననే నీ కీ శ్లోకము వచ్చినది. ఈ విధముగనే రామాయణ మంతయు రచింపుము. రహస్యముగ, ప్రకాశముగ జరిగిన రామ కథ అంతయు నా అనుగ్రహము వలన నీకు కరతలామలకముగ కన్పించును' అని ఆదేశించెను. అంతే కాక -

"న తే వా గనృతా కావ్యే కాచి దత్ర భవిష్యతి."

- (బాలకాండ 2 - 35)

'ఈ కావ్యములో ఏ ఒక్కటియు అసత్యము కాదు.

"యావత్ స్థాస్యంతి గిరయః సరితశ్చ మహీతలే
తావ ద్రామాయణ కథా లోకేషు ప్రచరిష్యతి."

- (బాలకాండ : 2-36)

'కొండలు ఎంత కాలము నిలిచియుండునో, నదులు ఎంత కాలము ప్రవహించునో - అంత కాలము రామాయణ కథ లోకములో ప్రచారమున నుండు'నని వర మిచ్చి, వెడలిపోయెను. ఇట్లు చతుర్ముఖ బ్రహ్మ యొక్క వరముచే లభించిన దివ్య దృష్టి గల వాల్మీకి నోటినుండి ఆవిర్భవించిన రామాయణము - కేవల కథా మాత్రమే కాక, వేదార్థ ప్రతిపాదక మగుటలో సంశయము లేదు. అందుచేతనే ఇది

"ఏకైక మక్షరం ప్రోక్తం మహాపాతక నాశనమ్."

కొ్కక్క అక్షరము మహా పాతకములను నశింప జేయజాలినది' ) పెద్దలు ప్రశంసించిరి. ఇట్లు శ్రీమద్రామాయణమును రచించు ఏ వాల్మీకి మహర్షి సిద్ధము కాగా, నారద మహర్షి ఆతని వద్ద కు చ్చెను. ఆ నారదుని ప్రశ్నించి, రామ కథ నెఱిగి, వాల్మీకి మాయణ రచనమునకు ఉపక్రమించెను.

## శ్రీమద్రామాయణ ప్రారంభము

"తప స్స్వాధ్యాయ నిరతం తపస్వీ వాగ్విదాం వరమ్
నారదం పరిపప్రచ్ఛ వాల్మీకి ర్ముని పుంగవమ్."
- (బాలకాండ 1 – 1.)

తపస్వి యగు వాల్మీకి – తప స్స్వాధ్యాయ నిరతుడు, వాగ్వేత్త లో శ్రేష్ఠుడు, మునిపుంగవుడు అయిన నారదుని ప్రశ్నించెను.'

రామ కథను వాల్మీకి అంతకు ముందే ఎఱుగును. అరణ్యములో రాముడు వాల్మీకి ఆశ్రమమునకు వచ్చెను. రాముని కాలమువ ముని ఎఱుంగనివారు ఎవరును లేరు.

" రామో రామో రామ ఇతి ప్రజానా మభవన్ కథాః."
– ( యుద్ధ కాండ ; 131–97)

జ లంటఱును – 'రాముడు – రాముడు రాము' డని రాముని వార్త నే చెప్పుకొనుచుండెడివారు.

వాల్మీకి బ్రహ్మవరము వలన రామ కథ నంతను చూడ లిగిన శక్తి కల్గినది. అట్టిచో – నారదుని అడిగి తెలిసికొను అవసరము దు. కాని, వాల్మీకి అడిగెను. నారదుడు ఉపదేశించెను. దాని ననుసరించియే రామాయణ రచన సాగెను. దీనిచే 'ఒక రహస్యము

తెలియుచున్నది. వాల్మీకి ప్రశ్నించినది, నారదుడు ఉపదేశించినది కేవల రామ కథ కాదు. అది బ్రహ్మ విద్య. సాక్షాత్ పరబ్రహ్మమే నరుడుగా రాము డను పేరుతో దిగి వచ్చెను. అందుకే 'బ్రహ్మ' అను రెండక్షరములలోని అడుగున నున్న రెం డక్షరములు 'ర మ' అను నవి రామ నామ మైనవి. ఈనాడు నరుడుగా కన్పట్టు ఈ ముడే పరబ్రహ్మము. అతని తెలిసికొనుటకు గురూపదేశము కావలెను. తనకు తెలిసినను, గురువు వలన ఉపదేశమును పొందిననాడే బ్రహ్మ విద్య ఫలించును.

" ఆచార్యా ద్ధైవ విదితా విద్యా సాధిష్ఠం ప్రాపత్
ఆచార్యవాన్ పురుషో వేద. "

బ్రహ్మవిద్యోపదేశమునకు ఆచార్యుడు ఆవశ్యక మని ఉపనిషత్తు తెలుపుచున్నది. అందుచే, ఇచట వాల్మీకి రామ కథను, బ్రహ్మ విద్యను కలిపి, నారదుని వలన ఉపదేశమును పొందవలె నని ప్రశ్నించు చున్నాడు. ఈ ప్రశ్న - బ్రహ్మ విషయ మని, "పరిప్రశ్న" అను క్రియ తెలుపుచున్నది. ఆత్మ జ్ఞానమును గూర్చి శిష్యులు గురువుల నడిగెడు ప్రశ్నకు - 'పరి ప్రశ్నము' అని పేరు. బాహ్యముగ నరుని గూర్చి ప్రశ్నించుచు, ఆంతరముగ బ్రహ్మను గూర్చి ప్రశ్నించినాడు.

ఈ శ్లోకములో గురు శిష్యులకు ఉండవలసిన లక్షణములను వివరించుచున్నాడు. గురువు - నారదుడు. శిష్యుడు - వాల్మీకి.

1) నరు డనగా జీవుడు. 'ర' - నశించునది. 'న' కానిది. 'నర' = ఆత్మ. నరులకు చెందినది నారము. అనగా - అజ్ఞానము. దానిని 'ద' = ఖండించువాడు నారదుడు. అనగా - జీవుని చేరి యుండు అజ్ఞానమును ఛేదించువాడు = గురువు.

2) నరు డనగా - పరమాత్మ. విష్ణు సహస్రనామమున 'నరః' అనునది భగవానుని నామము.

(3) నరుడనగా పరమ పదమును పొందించువాడు. నరునకు సంబంధించినది నారము. అనగా – జ్ఞానము. దానిని 'ద' ఇచ్చు వాడు నారదుడు. అనగా – భగవత్ జ్ఞానమును ప్రసాదించువాడు.

ఇట్లు అజ్ఞానమును ఛేదించి, జ్ఞానము నిచ్చువాడు నారదుడు. అట్టి నారదుడే ఆచార్యుడు.

ఆచార్యునకు మూడు లక్షణము లుండవలయును.

(1) తప స్స్వాధ్యాయ నిరతు డగుట -

తపస్సు = చాంద్రాయణము మున్నగు వ్రతములు. దానిచే శరీరేంద్రియ మనస్సులను కృశింపజేసి, వేదాధ్యయనముచే ధర్మ బ్రహ్మ స్వరూపముల నెఱింగినవాడు కావలెను.

తపస్సు = భోగ సంచయము. భోగములను తగ్గించుకొని, వేదాధ్యయనము చేయువాడు కావలెను.

తపస్సు = బ్రహ్మ జిజ్ఞాన చేయువాడు కావలెను.

తపస్సు = యోగము. యోగమును, స్వాధ్యాయమును అలవఱచుకొనినవాడు కావలెను.

(2) వాగ్విదాం వరు డగుట :-

శబ్ద స్వరూపమును ఎఱింగినవారిలో శ్రేష్ఠుడు కావలెను. వేదాధ్యయనము చేసి, దాని అర్థము నెఱింగి, దానిని ఇతరులకు అందింపగలిగినవాడు కావలెను.

(3) మునిపుంగవు డగుట —

సంతతము భగవ ద్విషయముసే మననము చేయువాడు కావలెను. ఇట్లు అచార్యునకు :-

(1) తప స్స్వాధ్యాయ నిరతి, (2) వాగ్విదాం వరత్వము (3) మునిపుంగవత్వము ఉండవలెను.

ఈ మూడు లక్షణములచే -

(1) శ్రవణము, (2) మననము, (3) ధ్యానము - అను మూడు లక్షణములు కూడ సూచింపబడవచ్చును. లేక - (1) పాండిత్యము (2) బాల్యము (3) మౌనము - అను బ్రహ్మవేత్త కుండెడి మూడు లక్షణములు సూచింపబడవచ్చును.

ఇట్లు ఈ నారదు డను పదము - గురువును సూచించుచదిగా ఎఱుంగవలెను.

నారదుడు (1) నారాయణ ప రాయణుడై, (2) త్రిలోక సంచారియై, (3) కలహాశీలుడై యుండు నని మనకు ప్రసిద్ధి.

గురువుకూడ -

నారాయణ పరాయణుడే (2) ప్రకృతి బంధమును వీడి, పై లోకముల కేగి, మరల భగవ దాజ్ఞచే సంసారుల నుద్ధరించుటకై, ఈ లోకమునకు దిగివచ్చెడి త్రిలోక సంచారియే. (3) ధర్మాధర్మము లకు, జ్ఞానాజ్ఞానములకు కలహమును కల్పించి, ధర్మమునకు విజయము కలిగించెడి కలహాశీలుడే!

కావున, నారదుని గురువుగా భావింపవలెను.

వాల్మీకి శిష్యుడు కదా? ఆతనికి ఉండవలసిన లక్షణము ఒక్క టియే! అది తపస్వి యగుట. తప స్సనగా - ఆలోచన. బ్రహ్మ విషయిక మయిన ఆలోచన కావలెను. తపస్వి యనగా దీనుడు. తాను

పొందవలసిన జ్ఞానమును పొందలే దని దైన్యము పొందినవాడే శిష్యుడుగా నుండవలెను.

ఇట్లు ఈ శ్లోకములో శిష్యాచార్య సంబంధము నిరూపింపబడినది. దాని ద్వారా అవతరించిన రామాయణ కథ బ్రహ్మవిద్యయే యని నిరూపింపబడినది.

వాల్మీకి - నారదుని, ఒక నరుని గూర్చి ఇట్లు ప్రశ్నించెను :-

"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్ కశ్చ వీర్యవాన్
ధర్మజ్ఞ శ్చ కృతజ్ఞ శ్చ సత్యవాక్యో దృఢవ్రతః
చారిత్రేణ చ కో యుక్తః సర్వభూతేషు కో హితః
విద్వాన్ కః క స్సమర్థ శ్చ క శ్చైక ప్రియదర్శనః
ఆత్మవాన్ కో జితక్రోధో ద్యుతిమాన్ కో ఒనసూయకః
కస్య బిభ్యతి దేవా శ్చ జాతరోషస్య సంయుగే."

-(బాలకాండ : 1-2,3,4.)

ఈకాలములో - ఈ దేశమున - (1) గుణవంతుడు, (2) వీర్యవంతుడు, (3) ధర్మజ్ఞుడు, (4) కృతజ్ఞుడు, (5) సత్యవాక్యుడు, (6) దృఢవ్రతుడు, (7) చారిత్రవంతుడు, (8) సర్వభూత హితుడు, (9) విద్వాంసుడు, (10) సమర్థుడు, (11) ఏకప్రియ దర్శనుడు, (12) ఆత్మవంతుడు, (13) జితక్రోధుడు, (14) ద్యుతిమంతుడు, (15) అనసూయుడు, (16) దేవతలకు కూడ భయము గొల్పు కోపము గల నరుడు ఎవడు? అట్టి వానిని ఎఱుంగవలె నని కోరిక కలిగియున్నాను, సమర్థుడవు కనుక, ఇటువంటి నరుని తెలియజేయ ప్రార్థించుచున్నాను' అని, వాల్మీకి పదునాఱు గుణములను పేర్కొని, 'అట్టి గుణములు గల నరుడు ఈ కాలములో - ఈ దేశములో ఎవడు' అని ప్రశ్నించెను

ఈ పదునాఱు గుణములు రామునకు పదునాఱు కళలు. వానితో కూడిన రాముడు రామచంద్రుడు. అందుకే మనవారు రాముని రామచంద్రుడని కీర్తించుచుందురు. ఇందు – వాల్మీకి నరుని గూర్చి ప్రశ్నించెను. కాని, అందులో పరబ్రహ్మమును గూర్చి కూడ ప్రశ్న యిమిడి యున్నది. పరబ్రహ్మమే ఆ యా కాలములలో ఈ లోకమున అవతరించి, సులభుడై, మన విరోధులను తొలగించి, తన్ను చేర్చుకొనుచుండును. అట్టి పరబ్రహ్మమే, నేడు రావణుడు నరుని చేతగాని మరణింప డని నరుడుగా అవతరించెను. అందుచే, బాహ్యముగ నరుడై, ఆంతరముగ బ్రహ్మమై యుండు రాముని గూర్చి ప్రశ్నించు ప్రశ్నలో బాహ్యముగ నరుడుగా ఉండవలసిన లక్షణములు, ఆంతరముగ బ్రహ్మ లక్షణములను చేర్చి యుండెను. అందుచే, ఈ పదునాఱు లక్షణములు కలవాడుగా మానవుడుగా పూర్ణుడు. ఈ పదునాఱు లక్షణములు కలదియే పరబ్రహ్మము. అందుచే, బాహ్యముగ – ఈ ప్రశ్న రామకథా విషయముగ, ఆంతరముగ – బ్రహ్మ విషయముగ నుండె నని ఎఱుంగవలెను.

రావణుడు ఎవరి చేతను చావు లేకుండ వరము కోరుకొని, నర – వానరములను మాత్రము ఉపేక్షించెను. అందుచే, వానిని సంహరించుటకు శ్రీరాముడు నరుడుగా నుండెను. రామాయణమునం దంతటను రాముడు నరుడుగనే కన్పట్టును. యజ్ఞ భూమిలో దేవతల యెదుట సాక్షాత్కరించినపుడు –

"ఏతస్మిన్ అంతరే విష్ణు రుపయాతో మహా ద్యుతిః
శంఖ చక్ర గదా పాణిః పీతవాసా జగత్పతిః."

– (బాలకాండ : 15.16.)

శ్రీరామ జననమునకు ముందు విష్ణువే రాముడుగా అవతరింపనున్నా డని సూచించును. మరియు యుద్ధానంతరము, రావణ వధ అయిన

తరువాత దేవతలు రాముని స్తుతించుచు – 'నీవు నారాయణుడవే' అని పేర్కొనిరి. రామావతారము మొదలు రావణ వధ యగునంత వఱకు రాముడు నరుడుగనే కన్పట్టును. దివ్యత్వము లోన అణగియుండును. అందుచే, ఏ లక్షణము లున్నచో నరుడు నరు డగునో, ఆ లక్షణము లను ఇందు ప్రశ్నించును. ఆంతరముగ బ్రహ్మమే యగుట చేతను, ఇతరు లందఱు రాముని బ్రహ్మముగనే ఉపాసించుటచేతను పరమాత్మ లక్షణములను అంతరార్థమున ప్రశ్నించును. ఇట్లు ఈ ప్రశ్నలలో – రాముని నరునిగను, బ్రహ్మముగను ఎఱుంగవలె నని సూచించుటకు ఈ ప్రశ్న – సమాధానములు రెం డర్థములతో సాగెను. రామా యణ మంతయు వాచ్యముగ రామకథను ప్రతిపాదించుచు, వ్యంగ్య ముగ బ్రహ్మకథను ప్రతిపాదించుచు, ఈ ప్రశ్నలు కూడ వాచ్యముగ నరునిగూర్చి వ్యంగ్యముగ బ్రహ్మమునుగూర్చి సాగును. దానిని వివర ముగ తెలిసికొందము .–

**1. గుణవాన్ కః ? =**

బాహ్యార్థము :–

గుణవంతుడు ఎవరు ? అని ప్రశ్నించెను.

ఏ గుణ మున్న నరుడు నరు డనిపించుకొనునో – అట్టిదియే గుణము. ఏ గుణ మున్న ప్రజలు ఎక్కువగా కొనియాడుచుందురో, ఆ గుణమే గుణ మని చెప్పబడినది. అదియే సౌశీల్యము. ఆ సౌశీ ల్యము కలవాడు శ్రీరాముడు. ఇది మానవునకు ప్రధానముగ ఉండ వలసిన గుణము. శ్రీరాముడు సుశీలుడు.

"మహతః మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్ "

'జాతి చేతను, ఐశ్వర్యము చేతను, విద్యచేతను గొప్పయైనవాడు –

వానిలో తక్కువ యయినవానితో అరమరిక లేక, కలసి యుండుట సౌశీల్యము.' ఇది శ్రీరామునిలో కాన నగును.

శ్రీరాముడు జాతిచే సూర్య వంశమునకు జెందిన క్షత్రియుడు. ఐశ్వర్యముచే - చక్రవర్తి కుమారుడు. విద్యచే వసిష్ఠాదుల శిష్యుడైన విద్యాధికుడు. అట్టి శ్రీరామునకు అంతరంగ మిత్రులు ముగ్గురు.

(1) పల్లెవాడు - గుహుడు.

(2) వానరుడు - సుగ్రీవుడు.

(3) రాక్షసుడు - విభీషణుడు.

వీరు ముగ్గురు జాతిచే కాని, ఐశ్వర్యముచే కాని, విద్యచే కాని రామునకు సమానులు కారు. కాని, రాముడు తనతో సమానముగ భావించి ప్రేమించెను.

(1) గుహుని - "ఆత్మ సమ స్సఖా" (అయో : 50 - 32.) అనును. తనకు దీటైన స్నేహితుడు గుహు డట ! అతడు ఎదురుగా వచ్చినపుడు - "భద్యాభ్య మభిగమా చ్చైవ స్నేహ సందర్శనేన చ " (అయో : 50 - 40.) నడచి వచ్చి ఇంత ప్రేమను చూపించితివే ! ఆతిథ్య మిచ్చినట్లే ! ఇం కేమిచేయవలెను ?' అని శ్రీరాముడు ఎంతో సంతోషించును. గుహునితో ఇంతటి మైత్రికి గుహుని యోగ్యత కాదు. శ్రీరాముని సౌశీల్యమే కారణము.

(2) సుగ్రీవునితో కోరి మైత్రి చేసికొనినాడు శ్రీరాముడు. సుగ్రీవుడు వానరుడు. భార్య, రాజ్యము కూడ పోయి యున్నాడు. అతనితో మైత్రి చేసికొని, అతని సుఖమే తన సుఖము - అతని దుఃఖమే తన దుఃఖ మనునట్లు ప్రవర్తించినాడు. సుగ్రీవుడు వాలిపై కోప ముండుటచే. తాను కూడ కోపము కల్గి, అతనిని చంపెను. తని

పోయి పడియున్న వాలిని చూడగనే సుగ్రీవునకు కోపము తగ్గి, ప్రేమ కలిగెను. ఏడ్చుచు రాజ్యము తనకు వల దని విలపించెను. శ్రీరాముడు అట్టి సుగ్రీవుని చూచి, "సంజాత బాష్పః పర వీర హంతా" (కిష్కిం 24 - 24.) కన్నుల నీరు నిండినవాడు ఆయెను. రాముని మైత్రి ఇట్టిది.

సుగ్రీవుని కోపమే తన కోపము. సుగ్రీవుని ప్రేమయే తన ప్రేమ. అంతే కాదు. మఱి యొక సన్నివేశమును చూడుడు :-

లంకలో వానర సైన్యముతో శ్రీరాముడు ప్రవేశించిన తరు వాత, పట్టణము వెలుపల నున్న కొండపై, లంకను చూచుచుండును. సుగ్రీవుడు కూడ ఆ ప్రక్కనే యుండును. ఎదురుగా రావణుడు కన్ప డెను. సుగ్రీవుడు చూచి, ఆవేశము ఆపుకొనలేక, ఎగిరి రావణునిపై పడి, రావణుని కొట్టి, గీరి, కొరికి, తాను దెబ్బలు తిని, నలిగి, తిరిగి రాముని వద్దకు వచ్చెను. అప్పుడు రాముడు -

"త్వయి కించిత్ సమాపన్నే కిం కార్యం సీతయా మమ."

- (యుద్ధకాండ : 41 - 4.)

'సుగ్రీవా! నీ వేమైన అయియున్నచో - నా కీ సీతతో ఏమి ప్రయోజనము?' అనును. తనకు ఇల్లాలై, తన వెంట అడవికి వచ్చి, తన కష్ట సుఖములలో భాగస్వామిని అయిన సీత కంటెను సుగ్రీవుడు ఎక్కువ అయినట్లు రాముడు భావించెను. ఇచట రాముడు పలికిన ఆ మాటలలో - సుగ్రీవునిపై గల వాత్సల్యమును చూడుడు :- 'సుగ్రీవా! నీవు చనిపోయియున్నచో - సీతతో ఏమి పని?' అని నోటితో అన లేక, 'నీ వేమైన అయినచో' అనును. అశ్లీల మగు మాట కూడ సుగ్రీవుని విషయమున నోటితో రాముడు పలుకలేదు. ఇట్టి మైత్రి ఒక వానరుని యందు కలిగి యుండుట శ్రీ రాముని సౌశీల్యము.

(3) తన్న శత్రువుని యొక్క సోదరుడై, శత్రు పక్షము నుండి వచ్చిన విభీషణుని, రాక్షసుడని శంకింపక, తన వా రందఱు వల దను చున్నను, 'మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కదాచన' (యుద్ధ : 18 - 3.) 'మిత్ర భావముతో వచ్చినవానిని వదలలేను' అని విభీషణు నకు ఆశ్రయ మిచ్చిన పరమోదారుడు శ్రీరాముడు. ఇట్లు విభీషణుని చేరదీయుటకు రాముని సౌశీల్యమే కారణము. ఇట్లే - శబరిని, జటా యువును ప్రేమించిన శ్రీరాముడు సుశీలుడు. దీనిచే, రాముడు గుణ వంతు డని స్పష్ట మగుచున్నది కదా!

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - "గుణవాన్ కః ?"

'గుణవంతు డెవడు ?' ఈ యర్థమునకు - గుణ మనగా సౌశీ ల్యమే యని గ్రహింపవలెను. గొప్పవారు తక్కువవారితో చేరి యుండుట సౌశీల్యము. పరమాత్మ సర్వ జగత్తునకు కారణమైనవాడు. ప్రకృతి సంబంధము లేనివాడు. ఆ ప్రకృతిని నామ రూపములు గల జగత్తుగ పరిణమింప జేసెడివాడు. అట్టివాడై, తనచే సృజింపబడిన ప్రతిపదార్థములో - ఎంత నీచమైనను, వానిలో తాను చేరియుండును

"అనేన జీవే నాత్మనానుప్రవిశ్య, నామరూపే వ్యాకరవాణి."

నామ రూపములు కలవానినిగ ప్రకృతిని మార్చి, అందు జీవులలో చేరియుండి ప్రవేశించును' అని ఉపనిషత్తున చెప్పబడుచున్నది. ఇదియే సౌశీల్యము. ఈ ప్రశ్నచే - 'సర్వ జగ దంతర్యామి ఎవరు ?' అని ప్రశ్నించినట్లు అగును.

(2) వీర్యవాన్ కః ? -

భావార్థము :-

వీర్యము కలవాడు ఎవడు ?

మనసునకు దిగులు కల్గించు శత్రు సైన్యము ఎదురుగా నున్నను, తా నేమియు కలత జెందక, దానిలో ప్రవేశించి, దానిని పలు ముఖము

లుగ చిమ్మివేయ గల శక్తియే వీర్యము. ఇచట కలవాడు రాముడే అని, ఖర - దూషణాది వధలో మనకు స్పష్ట మగును. రాముడు ఒక్కడును ఒక వైపు, పదునాలుగు వేలమంది సైన్యము ఒక వైపు.

"నాదదానం శరాన్ ఘోరా న్నముంచ న్తం శిలీముఖాన్."

- (అయోధ్యా కాండ : 25-38)

బాణములు సంధించుట గాని, విడుచుట గాని గుర్తించుటకు వీలు కాకుండ - ఒక్కడు అందఱకు అన్ని రూపములై యుద్ధము చేసెను. మారీచ సుబాహు వధ, రావణ వధ మున్నగు వానిలో - రాముని వీర్యము స్పష్టమే ! అందుచే, వీర్యవంతుడు రాముడు.

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - " వీర్యవాన్ కః ? "

పరమాత్మ కూడ వీర్యవంతుడే ! జీవులకు జ్ఞానమును సంకోచింపజేసి, వికాసమును కలిగించునది ప్రకృతి. అట్టి ప్రకృతిలో పరమాత్మ కూడ జీవునితో పాటు ప్రవేశించి యుండును. అట్లు ప్రవేశించి యుండియు, తా నేమియు వికారము చెందక, వానిని వివిధముగా, విచిత్రముగా వికారము నొందించువాడు కనుక, పరమాత్మ వీర్యము కలవాడు. దీనిచే, సర్వ జీవులలో తాను ప్రవేశించి, అంతర్యామియై యున్నను, వికార రహితుడై యుండు వాడు ఎవడు ? అని ప్రశ్నింపబడినది.

3. ధర్మజ్ఞః :-

బాహ్యార్థము :-

ధర్మము నెఱింగిన వాడు ఎవడు ?

శ్రీరాముడు సర్వ ధర్మములను ఎఱింగినవాడు. శిష్యుడుగా, పుత్రుడుగా, భర్తగా, ఆశ్రిత రక్షకుడుగా, మిత్రుడుగా, శత్రువుగా

అన్ని విధముల అన్ని ధర్మములు ఎఱింగి ఆచరించెడివాడు. వైదికము లగు యజ్ఞములను ఆచరించినవాడు. యజ్ఞములో జన్మించి, యజ్ఞమును కాపాడి, యజ్ఞ భూమిలో దొరకిన సీతమ్మను వివాహ మాడి, యజ్ఞ విరోధు లగు రాక్షసులను సంహరించి, ఋషులను కాపాడి, వైదిక ధర్మమును కాపాడినవాడు.

"రక్షితా జీవలోకస్య ధర్మస్య పరిరక్షితా
రక్షితా స్వస్య ధర్మస్య స్వజనస్య చ రక్షితా"
(బాల కాండ ; 1–13,14)

తన ధర్మమును, తన వారి ధర్మమును, జీవు లందఱి ధర్మమును కాపాడినవాడు శ్రీరాముడు.

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - 'ధర్మజ్ఞః.'

రక్షణమే పరమాత్మ ధర్మము.

పరమాత్మ కూడ ధర్మజ్ఞుడే! జగత్తు యొక్క సృష్టి స్థితి లయములు రక్షణము. అవి ఎవరి యధీనములో నున్నవో - అది పరబ్రహ్మము.

"యతో వా ఇమాని భూతాని జాయంతే ॥ యేన జాతాని జీవన్తి ।
యత్ప్రయం త్యభిసంవిశంతి । త ద్విజిజ్ఞాసస్వ త ద్బ్రహ్మేతి."
– (తైత్తిరీయోపనిషత్తు)

అని చెప్పబడిన సృష్టి స్థితి లయములు మూడును రక్షణమే! ఆ రక్షణమే పరమాత్మ యొక్క ధర్మము. దానిని ఎఱింగినవాడు - అనగా - జగద్రక్షణమున అడ్డు లేని సంకల్పము కలవాడు ఎవడు? అని పరమాత్మను గూర్చి ప్రశ్నించెను.

(4) కృతజ్ఞః :-

బాహ్యార్థము :-

ఒకరు చేసిన మేలు మరువనివా డెవడు?

చేసిన ఉపకారమును మరువక, ఎల్లప్పుడును జ్ఞాపకము ఉంచు కొనువాడు కృతజ్ఞుడు. శ్రీరాముడు కృతజ్ఞతలో పరాకాష్ఠనందినట్లు ప్రజలు దశరథునితో రాముని గుణములను వర్ణించుచు చెప్పిరి.

"కథం చి దుపకారేణ కృతే నై కేన తుష్యతి
న స్మర త్యపకారాణాం శతమప్యాత్మవత్తయా."
- (అయోధ్యా కాండ : 1-11)

ఎవరేని ఒక ఉపకారమును ఎటులో కష్టపడి చేసినయెడల, ఆ ఉపకారముతో రాముడు సంతోషించి. ఆ ఉపకారమును ఎల్లప్పుడు కొనియాడుచు, ఆనందించుచుండెడివాడు. ఒకరు చేసిన ఉపకారమును స్మరించుటయే కాదు. వంద అపకారములు చేసినను, వాటిని తలంపడు.' జ్ఞాపకముండి తలంపకపోవుట కాదు. మరచి పోవును.

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - 'కృతజ్ఞః' :-

పరమాత్మయే కృతజ్ఞుడే!

"కృతం జానాతీతి కృతజ్ఞః" చేసిన దానిని ఎఱుంగువాడు. కృత మనగా - జీవులు చేసెడి కర్మ. ఆ కర్మ నెఱింగి, దాని కనుగుణ మగు ఫలమును జీవులకు కల్పించుచుండును. తాము చేసిన కర్మను తాము మఱచినను, సర్వేశ్వరుడు మఱువడు. జీవు లందఱి యొక్క అన్ని విధము లగు కర్మల నెఱింగి, ఆ కర్మానుగుణము లగు శరీరముల నొసగి, ఆశరీరములో - జీవులతో పాటు - తాను కూడ ప్రవేశించి, నియమించుచు రక్షించును. ఆ పరమాత్మ లక్షణములనే "గుణవాన్, వీర్యవాన్, ధర్మజ్ఞః, కృతజ్ఞః" అను నాలుగు ప్రశ్నలలో సూచించెను.

(5) **సత్యవాక్యః.**

భావార్థము :-

సత్యమైన వాక్యము కలవాడు.

ఆడిన మాట ఎన్నడును సత్యమే కాని, అనృత మాడి ఎఱుగడు. కైకేయి - తండ్రి గారి కోరికగా పట్టాభిషేకమును మాని, అరణ్యముల కేగవలె నని చెప్పెను. దానిని విని, రాముడు అట్లే యని అంగీకరించెను. అంగీకరించి, 'అమ్మా! తండ్రి గారు స్వయముగ నాతో ఈ మాట ఎందుకు చెప్పలేదు?' అని శ్రీరాముడు ప్రశ్నించెను. అప్పుడు కైక - దశరథుడు స్వయముగ చెప్పలే దని రాముడు మాట తప్పునేమో యని శంకించెను. అప్పుడు శ్రీరాముడు -

"రామో ద్విర్నాభిభాషతే."

- (అయోధ్యాకాండ : 18-30.)

రాముడు రెండు మాటలు మాటాడడు" అనెను.

"విద్ధి మామృషిభిః స్తుల్యం కేవలం ధర్మ మాస్థితమ్."

- (అయోధ్యా కాండ . 19-20.)

'కేవల ధర్మములే అనుసరించెడి ఋషులతో సమానునిగా నన్నెఱుంగుము' అని చెప్పి, ఆడిన మాటకు కట్టుబడి నిలచెను. తల్లి కౌసల్య వల దని వారించినను, లక్ష్మణుడు ప్రార్థించినను, సత్యమును వీడలేక, వన గమనమునకే నిర్ణయించెను. అరణ్యమున కేగి, భరతుడు రాజ్యమును స్వీకరించు మని ప్రార్థించెను. ప్రజలు, మంత్రులు, తల్లులు కూడ భరతుని కోరికకు తమ సమ్మతిని తెలియజేసిరి. జాబాలి నాస్తిక వాదముతో రాముని మరలింపజూచెను. వసిష్ఠుడు గురువుగా ఆదేశింపజూచెను. కాని, శ్రీరాముడు మాత్రము తా నాడిన మాటకు కట్టుబడి, వనవాసమునకే నిశ్చయించి యుండెను. ఇది రాముని సత్య వాక్యమునకు పరమోదాహరణము.

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - సత్యవాక్యః.'

పరమాత్మ కూడ సత్యవాక్యుడే.

సత్యమను శబ్దమే పరమాత్మను తెలియజేయునది ... "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అని తైత్తిరీయోపనిషత్తు చెప్పుచున్నది. సత్య మనునది పరమాత్మ యొక్క స్వరూపమును తెలియజేయునది. ఛాందోగ్యోపనిషత్తు నందు - 'సత్యమ్' అని పరమాత్మకు పేరగుటకు కారణమును ఇట్లు వివరించిరి : "సత్ + తి + యమ్ = సత్యమ్". 'సత్' అనగా - ఆత్మ. ఎల్లప్పుడును మారక ఉండునది. 'తి' అనగా - మారునది - ప్రకృతి. ఈ రెంటిని కలిపి నియమించువాడు - 'యమ్' 'సత్యమ్' అనగా - జీవుని, ప్రకృతిని కలిపి నియమించువాడు అతడే పరమాత్మ. అందుచేత 'సత్యమ్' అనునది వాచకముగా గలవాడు. సత్య వాక్యుడు - పరమాత్మ.

(౬) దృఢవ్రతః.

బాహ్యార్థము :-

తాను పట్టిన వ్రతమును దృఢముగ పాలించువాడు.

'నీ వాడ నని అనిన వానికి అభయ మిచ్చుట నా వ్రతము' అని రాముడు విభీషణ శరణాగతిలో చెప్పెను.

"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే
అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ."
- ( యుద్ధ కాండ ; 18 - 33.)

'ప్రాణమునైనను వదలవలెను. లేక - ఆవశ్యకమైనచో లక్ష్మణుని తో కూడ నిన్నైనను వదలవలెను. కాని, మాట నిచ్చి, అందులో

ముఖ్యముగ బ్రాహ్మణులకు చేసెదనని తిరుగలేను' అని పల్కెను. తన్నాశ్రయించినవారిని రక్షించుటలో రాముని వ్రతము ఇట్టిది.

అంతరార్థము :- పరమాత్మనుగూర్చి - 'దృఢవ్రతః'

పరమాత్మకూడ దృఢవ్రతుడే !

తన్నాశ్రయించినవారికి సంసారబంధమును ఛేదించి, స్వస్వరూపమును కలిగించి, అభయమును అనగా - మోక్షమును ప్రసాదించుటలో పరమాత్మ దృఢ వ్రతము కలవాడు. ప్రళయ కాలమున అచేతన పదార్థముతో సమానముగా ఉన్న జీవునకు ఇంద్రియములతో, మనస్సుతో, బుద్ధితో కూడిన శరీరము నిచ్చి, ఆ శరీరమును ఎట్లు వినియోగించుకొని పరమాత్మను చేరవలెనో తెలుపుటకు వేదములను శాస్త్రములను ప్రసాదించి, దానిని వినియోగించుకొనజాలక, చెడిపోవు వారిని ఉద్ధరించుటకు తానే నానారూపములతో అవతరించి, మహాపురుషుల నవతరింపజేసి, ఎంతో పట్టుదలతో తరింపజేయ ప్రయత్నించును. కావున జీవులను తరింపజేయుటకు పరమాత్మ దృఢవ్రతుడు.

(7) చారిత్రేణ చ కో యుక్తః ?

బాహ్యార్థము :-

మంచి నడువడి కలవాడు ఎవడు ?

జ్ఞానము కంటెను నడువడి ఆవశ్యకము. నడువడిచేతనే పురుషుని స్వభావము తెలియును. మంచి నడువడి లేనివానిని చూచి, లోకము భయపడును. అది అంతటి ఆవశ్యకము కనుకనే, శ్రీరాముడు నడువడిని విడువక ఆదరించెను.

చిత్రకూటమున భరతునితో కలసివెళ్ళిన జాబాలి - నాస్తిక వాదమును ఉపన్యసించును. తండ్రి మాటను పాలించుటకై అడవిలో నుండుట తగదని చెప్పుచు - 'తండ్రి ఎవరు? తల్లి ఎవరు? ఇచట మనము చేసిన పనుల చేతను, పెట్టిన శ్రాద్ధము చేతను తల్లిదండ్రులకు సంతుష్టి కలుగుట - కేవల కల్పన. అందుచే, నీవు రాజ్యమును హాయిగా పాలించుమని చెప్పెను. దానిని విని శ్రీరాముడు - చారిత్ర్యము యొక్క ఆవశ్యకతను వివరించెను .-

"కులీన మకులీం వా శుచిం వా యదివా శుచిమ్
చారిత్ర మేవ వ్యాఖ్యాతి వీరం పురుషమానినమ్."
- (అయోధ్యాకాండ . 109-4 )

'ఉత్తమ కులములో జన్మించుట, లేక హీన కులములో జన్మించుట, పవిత్రు డగుట, వీరుడుగా నుండుట, లేక - డాంబికముగ వీరుడ నని పలుకుట అనువానిలో ఏది ఎవని యందు ఉన్నదో తెలిసికొనవలె నన్న వాని చారిత్రమే వ్యాఖ్యానమై తెలియజేయును.'

మనుష్యుని స్వభావమునకు చారిత్రము వ్యాఖ్యానము. కఠిన మయిన శ్లోకము యొక్క అర్థమును వ్యాఖ్యానముచే గ్రహింప వీలగును. అట్లే, ఈతడు యోగ్యమైన కులమునకు చెందినవాడో? కాడో? అని తెలిసికొనవలెనన్న యోగ్యతాపత్రములు కావు - నిర్ణయించునవి, వాని నడువడియే నిర్ణయించునది. ఇట్లే శౌచము. అనగా - పవిత్రత. ధనము విషయములో లోభపడక యుండుట - అన్ని శౌచముల కంటె గొప్ప శౌచము. "యోఽర్థే శుచి స్స హి శుచిః." ధనమునందు ఎవడు పరిశుద్ధుడో, అతడు పరిశుద్ధుడు అని మనుస్మృతి. అట్టి పరిశుద్ధి తన కున్న దని తాను చెప్పికొనినను, ఇతరులు చెప్పినను నమ్మదగినది కాదు, దానిని నడువడి చేతనే నిరూపించవలెను. ఇట్లే, వీరుడా? వీరు డని ప్రగల్భము కొట్టుకొనువాడా?

లియుటకు కూడ వాని నడువడియే ముఖ్యము. అందుచే -
క్షమునందు లోభము లేనివాడను, సత్య వాక్యమునకు నిల
అని తెలుపుటకు చారిత్రమును విడువరాదు' అని శ్రీరా
త్రము యొక్క ప్రాముఖ్యమును వివరించెను. తాను నడ
క పాటించెను.

ము :-

మాత్మను గూర్చి - 'చారిత్రేణ చ కో యుక్తః.'
మాత్మ చారిత్రము కలవాడే!

త్ర మనగా - నడువడి. సృష్టికి ముందు కదలిక లేక,
అన్న ట్లున్న పరమాత్మ - స్థూల మగు జగద్రూపమున
నడువడి. సృష్టికి ముందును, సృష్టికి తరువాతను ఒకే తత్త్వ
సృష్టికి ముందు కదలిక లేని జీవ ప్రకృతులతో చేరి
అదియే తత్త్వము సృష్టికి తరువాత మార్పు జెందిన జీవ
కదలికచే కదలినట్లు ఉండును. ఇదియే పరమాత్మ
॰రిత్రము. సృష్టికి ముందు సూక్ష్మ రూపమున ఉన్న
ములు అను లిన శరీరమును కదలించి, జగద్రూపమున
కదలినవాడు ఎవడు ? అని పరమాత్మను గూర్చి

భూతేషు కో హితః ?

ు :-

భూతముల మేలును కోరువాడును, ఆచరించువాడును

శ్రీరాముడే అట్టి వ్యక్తి. బంధువులకును, ఆప్తులకును మేలు కలుగవలె నని అందఱును కోరుదురు కాని, మనుష్యు లందఱి మేలును కోరి, వారికి మేలు కలుగునట్లు మాటాడి, వారికి ఆపదలు కలుగు నపుడు దుఃఖపడెడివాడు శ్రీరాముడు ఒక్కడే! అయోధ్యా ప్రజలు రాముని గుణములను కీర్తించుచు ఇట్లు చెప్పుదురు :-

"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః
ఉత్సవేషు చ సర్వేషు పితేవ పరితుష్యతి."

- (అయోధ్యాకాండ 2-40-)

'పట్టణములో మనుష్యున కెవరికైనను ఆపదలు కలిగినచో - ఆపదలు కలిగినవారికంటెను ఎక్కువగా రాముడు దుఃఖించును. వారికి ఏవేని ఆనంద జనకము లగు సంపదలు లభించినచో - తండ్రి వలె సంతోషించును.'

ఈ శ్లోకములో - రాముని సర్వభూత హితత్వము సూచింపబడినది. వీరు, వారు అను భేదము లేక, మనుష్యులలో ఎవరికి ఎట్టి ఆపదలు కలిగినను - పెద్దది, చిన్నది అను తారతమ్యము లేక, వారి కంటెను ఎక్కుడుగా రాముడు దుఃఖించునట! ఆపద కలిగిన వారు - ఆపద తీరగనే విస్మరింతురు. కాని, రాముడు మాత్రము దుఃఖించుచునే యుండునట! దీనికి కారణము - వారికి మేలును కలిగించుట తన బాధ్యత యని భావించుటయే! కాపాడవలసిన తల్లి ప్రక్కనుండగా, ఏమియు తెలియని పసిపాప ప్రాకుచుపోయి నూతిలో పడినది, తల్లి దానితోపాటు ఉరికి, పిల్లను వెలుపలకు తీసినది. పిల్లకు ఆపద తీరినది, నవ్వుచున్నది, కాని, తల్లి మాత్రము దుఃఖించుచునే యున్నది. కారణము - బాధ్యత గల తాను పరాకుగా నుండి, బిడ్డ నూతిలో పడునట్లు చేసితినే ! యని ఆమె ఆ దుఃఖమును మరువ లేదు

అక్లే, రాముడు కూడ అందఱికును మేలు కలిగింపవలసిన తాను పరా కుగా నుండుటచేతనేగదా వారికి అపద కలిగినదని దుఃఖించును ? ఇతడు కేవలము మనుష్యుల యొక్క హితమునే కోరువాడు కాదు. సర్వ భూతముల హితమును కోరువాడు. అందుచేతనే రావణునిచే దెబ్బ తిని, రెక్కలు విరిగి, నేలపై కూలి, ప్రాణము పోవుటకు సిద్ధముగా నున్న జటాయువును జూచి -

"రాజ్యా ద్భ్రంశో వనేవాస స్సీతా నష్టా హతో ద్విజః
దృశీయం మమాలక్ష్మీః నిర్దహే దపి పావకమ్."

- (అరణ్య కాండ : 67-24.)

'రాజ్యము పోయినది, వనవాసము ప్రాప్తించినది, సీత కనబడకుండ పోయినది, ఈ పక్షి చనిపోయినది, ఇది యంతయు నా దురదృష్టము; ఇది అగ్నిహోత్రమును కూడ కాల్చివేయగలదు.' అని, ఆ పక్షి చని పోవుటకు కూడ తన దురదృష్టమే కారణ మని శోకించును. చనిపో యిన తరువాత ఆ పక్షికి స్వయముగ తానే దహన సంస్కారము చేయును. ఇట్లు రాముడు సర్వ భూత హితుడు.

అంతరార్థము :- పరమాత్మనుగూర్చి - 'సర్వభూతేషు కో హితః ?'
పరమాత్మ కూడ సర్వభూత హితుడే.

హితు డనగా ఉపాయమైనవాడు. పరమాత్మను పొందుటకు పరమాత్మనే ఉపాయ మనికఠోపనిషత్తు, ముండకోపనిషత్తు కూడ ప్రతిపాదించుచున్నది.

"నాయమాత్మా ప్రవచనేనలభ్య న మేధయా న బహుధా శ్రుతేన
యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూఃస్వామ్."

పరమాత్మ శ్రవణముచేగాని, మననముచేగాని, ధ్యానముచేగాని లభిం పడు. పరమాత్మ ఎవరిని వరించునో, వానికే తన స్వరూపమును దర్శింపజేయును. మననము చేయు కర్మగాని, జ్ఞానము గాని, భక్తి గాని భగవత్ప్రాప్తికి సాధనములు కావు, భగవానుడే సాధనము.

"సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః."

-(భగవద్గీత: 18-66)

ధర్మము లన్నిటిని పరిత్యాగముచేసి, న న్నొకనినే శరణముగ ఆశ్ర యింపుము. నేను నిన్ను పాపము లన్నిటినుండియు విడిపింతును. చింత పడకుము' అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునితో చెప్పెను. కావున, సర్వభూతములకు హితుడు పరమాత్మయే!

**9) విద్వాన్ :-**

వాహ్యర్థము :-

విద్వాంసుడు ఎవడు ?

విద్వాంసుడు శ్రీరాముడు. సర్వ శాస్త్రముల తత్త్వము నెఱిం గినవాడు, వేద వేదాంగముల యందు పరినిష్ఠితుడు. ధనుర్వేదమందు సుశిక్షితుడు. మంత్రమందును, రహస్య సమాచార సేకరణమందును, నీతి శాస్త్రము నందును, వ్యూహ రచనముల యందును బాగుగ నేర్పు గలవాడు. గజ స్కంధము నందును, అశ్వ పృష్ఠము నందును అధిష్ఠించుటలో ఆరితేరినవాడు. ఇట్లు సర్వ విద్యల యందును పాండి త్యము గలవాడు శ్రీరాముడు.

అంతరార్థము :- పరమాత్మనుగూర్చి - 'విద్వాన్'

పరమాత్మ కూడ విద్వాంసుడే!

"యః సర్వజ్ఞః సర్వవిత్" అని ఉపనిషత్తు పరమాత్మ సర్వమును, సమష్టిగను, వ్యష్టిగను కూడ ఎఱిగినవాడని చెప్పుచున్నది. ఆ జ్ఞానము సంపాదించుకొనినది కాదు, సహజము. ఇట్లే - "స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ" అనియు ఉపనిషత్తు చెప్పుచున్నది. ఈ జ్ఞానము కూడ ఇంద్రియాధీనము కాదు. "పశ్య త్యచక్షుః స శృణో త్యకర్ణః" కన్ను లేకుండ చూచును, చెవి లేకుండ వినును" అనియు, ఉపనిషత్తు ఉద్ఘోషించుచున్నది. సర్వ జగత్ సృష్టికి ఆవశ్యక మగు జ్ఞానము కలవాడు పరమాత్మ!

(10) సమర్థః ?

బాహ్యార్థము :-

సామర్థ్యము కలవాడు ఎవడు ?

కేవలము శాస్త్ర జ్ఞానము ఉన్నంత మాత్రమున ప్రయోజనము లేదు. కార్యరూపమున ఆచరించుటలో సామర్థ్యము ఉండవలెను. శ్రీరాముడు చదివిన విషయములను ఇతరులతో చర్చించుటయందు సమర్థుడు. శీలవృద్ధులు, జ్ఞాన వృద్ధులు, వయోవృద్ధులు కూడ శాస్త్ర విషయములను శ్రీరామునితో చర్చించుచుండెడివాడు. రాజ్య నిర్వహణమున రాజనీతిశాస్త్ర పరిజ్ఞానమును వినియోగించగల సమర్థుడు. యుద్ధ భూమి యందు అస్త్ర విద్యను ప్రదర్శింప గల సమర్థుడు. అందుచే శ్రీరాముడు సమర్థుడు.

**అంతరార్థము** :- పరమాత్మను గూర్చి - "సమర్థః."

పరమాత్మ కూడ సమర్థుడే!

సర్వజ్ఞుడై, సర్వ జగత్తును సృష్టించుటకు సామర్థ్యము ఆవశ్యకము. అదియే శక్తి. "పరాస్య శక్తి ర్వివిధా చ దృశ్యతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ" అని, సర్వజగన్నిర్మాణమును సంకల్ప మాత్ర

ముచే చేయగల సమర్థుడు. సృష్టించిన ప్రతి పదార్థము నందును పరమ మహాత్పరమాణు డగు తాను అణు వగు జీవుని కంటెను అణువై వ్యాపించును. కర్మల నెఱింగి, కర్మానుగుణ మగు శరీర మును ప్రసాదించి, కర్మానుగుణ మగు ఫలము నీయ గల సమర్థుడు.

(11) ఏకప్రియ దర్శనః :-

బాహ్యార్థము :-

ఎల్లప్పుడు ఒకే విధముగ ప్రియమైన దర్శనము కలవాడు ఎవడు ?

ప్రియమైన దర్శనము కలవాడు రాము డొక్కడే ఇతరులను చూచినపుడు చూచినవారికి ఒకపుడు ప్రీతియు, మరియొకపుడు అప్రీతియు కలుగుచుండును. కాని, రాముడట్లు కాదు. చూచినవారికి ప్రీతియే కలుగును. శత్రువులకైనను, మిత్రులకైనను, స్త్రీలకైనను, పురుషులకైనను, జ్ఞానులకైనను, అజ్ఞానులకైనను శ్రీ రాముని దర్శనము ప్రీతినే కలిగించుచుండును, రాముని చూచి, అడవిలో నున్న క్రూర మృగములు కూడ ప్రీతిని పొంది, తమ దుష్టతను వీడి యుండెడివి. రాముని దర్శనముచే ప్రీతిని, దర్శనము లేకుండుటచే అప్రీతిని - వృక్షములు, నదులు కూడ పొందినవి. రాముని చూచి, ప్రేమించి, తిరస్కరింపబడి, లక్ష్మణునిచే ముక్కు, చెవి కోయబడి, ఖరుని వద్దకు వెళ్ళిన శూర్పణఖ -

"తరుణౌ రూప సంపన్నౌ సుకుమారౌ మహా బలౌ
పుండరీక విశాలాక్షౌ చీరి కృష్ణాజినాంబరౌ.

- (అరణ్యకాండ : 19 - 14.)

'యువకులు, సౌందర్యసంపన్నులు, సుకుమారులు, మహా బలశాలులు, తెల్లతామరల వంటి విశాలములైన కన్నులు గలవారు, నార వస్త్ర

ములు – జింక తోళ్ళు ధరించినవారు, ఫల మూలములు ఆహార ముగా కలవారు, జితేంద్రియులు, తాపస వృత్తి నవలంబించినవారు అగు దశరథ పుత్రు లగు రామ లక్ష్మణులు అను అన్నదమ్ము లున్నారు' అని వారి రూపమును ప్రశంసించెను. వాలిని చంపిన రాముని నిందింప వచ్చిన తార – "సా తం సమాసాద్య విశుద్ధ సత్త్వా" (కిష్కిం : 24-30.) ఆ రాముని చూచినంతనే సత్త్వ గుణము ఆవిర్భవించినదియై రాముని దర్శనమున ప్రీతి నొంది –

"త్వమప్రమేయ శ్చ దురాసద శ్చ జితేంద్రియ శ్చోత్తమ ధార్మిక శ్చ
అక్షయ్య కీర్తి శ్చ విచక్షణశ్చ క్షితి క్షమావాన్ క్షతజోపమాక్షః."

(కిష్కింధాకాండ : 24-31.)

నీవు వేదములచే కూడ వర్ణింప శక్యము గాని మహా మహిమాన్వితు డవు. మనస్సుచే కూడ చేర శక్యము గానివాడవు. జితేంద్రియుడవు. ధార్మికులలో ఉత్తముడవు. తఱుగని కీర్తి గలవాడవు. వివేకివి సహనమున భూమికి సాటియైనవాడవు. రక్తాంత నేత్రుడవు' అని స్తోత్రము చేసెనే కాని, అన్యథా భావింపలేదు. ఇంక – ప్రేమ గల దశరథాదులు రాముని చూచి ప్రీతినొందుటలో ఆశ్చర్య మే మున్నది? మన్మథ మన్మథుః – పురుషులకు కూడ మోహము గల్గించువాడు – చంద్రుని వలె ప్రియ దర్శనుడు అగు రాముడు ఎల్లవేళల, ఎల్లఱకు ప్రియమైన దర్శనము కలవాడు.

**అంతరార్థము** :– పరమాత్మను గూర్చి – 'ఏక ప్రియ దర్శనః'

పరమాత్మ కూడ ఏక ప్రియ దర్శనుడే !

ఎల్ల వేళల అందఱకు ఆనందమును కల్గించు దర్శనము కలవాడు పరమాత్మయే ! ఈ లోకములో అన్ని

సత్త్వము, రజస్సు, తమస్సు అను మూడు గుణములు కల ప్రకృతిచే నిర్మింపబడినవి. అందు సత్త్వము సుఖమును కలిగించునది. రజస్సు దుఃఖమును కలిగించునది. తమస్సు శోకమును కలిగించునది, అందుచే, లోకములో ఏ వస్తువైనను ఒకప్పుడు సుఖమును కలిగించునది, వేరొక ప్పుడు దుఃఖమును కల్గించు చుండును. పరమాత్మ మాత్రము శుద్ధ సత్త్వమయుడై, ఆనంద స్వరూపుడై యుండును. అందుచే, ఎల్ల వేళల - ఎల్లరకు పరమాత్మ దర్శనము ఆనందమునే కల్గించున దగుటచే, ప్రియమై యుండును. అందుచే - పరమాత్మ ఏక ప్రియ దర్శనుడు.

**12. ఆత్మవాన్ :-**

భావార్థము :—

ప్రశస్తమైన మనస్సు కలవాడు ఎవడు? ధైర్యము కలవాడు ఎవడు?

'ఆత్మ' యను పదమునకు - మనస్సు, ధైర్యము అనియు అర్థములు నలవు. ప్రశస్తమైన మనస్సు కలవా డగుటచేతనే ఎవరు ఎంత అపకారము చేసినను, క్షమింపగలిగినవాడు శ్రీరాముడు. పట్టాభిషేకము సిద్ధమైనది. దశరథుని యాజ్ఞచే, వసిష్ఠుడు సీతారాములకు దీక్ష నొసంగెను. పట్టాభిషేక సామాగ్రి సిద్ధమైనద, కైక సుమంత్రునిచే రాముని పిలిపించినది. పట్టాభిషేకము లేదు : అడవుల కేగు మని చెప్పినది. వెళ్ళునపుడు - కొలది సేపటిలో పట్టాభిషేకము తన కగునని భావించుచు రాముడు వెళ్ళెను. తిరిగి వచ్చునపుడు - 'తాను రాజు కాడు' అని తెలిసినది. కాని, వెళ్ళు నపుడు రాముని ముఖములో మార్పు లేదు. ఇది ఆతని మన స్థితి. అంతే కాదు. తాను ద్వేషించి దూషించవలసిన కైకను తాను దూషించకుండుటచే గాక, లక్ష్మణుడు, భరతుడు, మొదలగువారు ఎవరు దూషించినను వల దని వారించిన క్షమాశాలి శ్రీరాముడు.

అంతరార్థము :- పరమాత్మను గూర్చి - 'ఆత్మవాన్.'

పరమాత్మయే ఆత్మవంతుడే !

ఆత్మలు తనవిగా కలవాడు. జీవు లందఱు పరమాత్మకే చెందినవారు. అనగా - శేషభూతులు. పరమాత్మయందే ఆధారపడి యుండి, వాని యంశముసకు వినియోగపడదగినవారు. ఆత్మకు శరీరము ఎట్లు శేషభూతమై యుండునో, పరమాత్మకు ఈ ఆత్మలును అట్లు శేషభూతములే ! శరీరము ఆత్మకు వినియోగించుటకు ఎట్లు ఉప యోగపడునో, అట్లే - ఆత్మలు పరమాత్మకు యథేష్టముగ విని యోగించుకొనదగినవియై యుండును.

13. జిత క్రోధః :-

భావార్థము :-

క్రోధమును జయించినవాడు ఎవడు ?

మానవత్వమునకు ఇది ముఖ్య లక్షణము. క్రోధము కలుగుటకు తగిన సన్నివేశ మున్నను, క్రోధము రాకుండ జయించినవాడే మాన వుడు. శ్రీరాముడు క్రోధము లేనివాడు కాడు. క్రోధమును జయిం చినవాడు. అందుచేతనే రామునకు క్రోధము వచ్చినపుడు, రామా యణమున - "క్రోధ మాహారయత్" 'క్రోధము తెచ్చుకొనెను' అనును కాని, 'క్రోధము వచ్చెను' అనడు. క్రోధము తెచ్చుకొనవలెను. క్రోధము తన వశమునం దుండవలెను. కాని, క్రోధమునకు తాను వశుడు కాకూడదు. అందుచేతనే, శ్రీరామునకు కోపము రాదగిన సన్నివేశము కూడ ఒడలు తెలియని కోపమును తెప్పించలేదు. సుగ్రీ వునిపై కోపము వచ్చినపుడు కూడ, ఔచిత్యము చెడకుండునట్లు కబు రంపును గాని, ఆవేశముతో మాటాడలేదు,

"న చ సంకుచితః సంథాః యేన వాలీ హతో గతః."

– (కిష్కింధా కాండ : 30.81.)

'వాలి వెళ్ళిన దారి యింకను మూసి పడలేదు' అని చెప్పుమనెను. పట్టరాని కోపము వచ్చునప్పుడు కూడ, కోపము తన వశేములో నుండుటచే, పలుకులో మార్దవము తగ్గదు. ఇట్లు రామాయణ మంతయు – రాముడు జితక్రోధుడుగనే కన్పట్టును. కాని, రావణు నితో యుద్ధము చేయుచున్నపుడు – రామునకు వాహనముగా నున్న ఆంజనేయునకు దెబ్బలు బాగుగా తగిలి, రక్తము కారుచుండెను. అప్పుడు –

"రావణేన కృతవ్రణం దృష్ట్వా ప్లవగ శార్దూలం కోపస్య వశమే యివాన్."

రావణునిచే గాయపరచబడిన హనుమను చూచి, రాముడు కోపము నకు వశమాయెను. తన కెన్ని కష్టములు వచ్చినను కోపము రాని వానికి, ఆంజనేయునకు దెబ్బలు తగులునపుడు మాత్రమే ఆపుకొనలేని కోపము వచ్చెను.

అంతరార్థము – పరమాత్మను గూర్చి – 'జిత క్రోధః.'

పరమాత్మకూడ జితక్రోధుడే!

ఈ జీవులు పరమాత్మ వలననే సత్తును పొంది, తన స్థితికి, గతికి, ప్రవృత్తికి కూడ కారణమయిన వానిని ఎదిరించి దూషించును. అనంతము లగు భగవదపచారములను చేయుచుండును. అట్టి వానిపై పరమాత్మ కోపము తెచ్చుకొనడు. వాని ననుసరించి ఎటు లైనను రక్షింపవలెనని చూచుచుండును. ధూర్తుడైన కుమారుడు తండ్రితో విరోధించి ఒక సత్రమున చేరి, అచట అధికారిని ఆశ్ర

యించి, జీవించుచుండును. తండ్రి కుమారుని వదలజాలక, ఆ కుమారునకు కనబడకుండ సత్రపు అధికారిని చేరి, వానికి డబ్బు నిచ్చి, కుమారునకు భోజనము పెట్టించుచుండును. కుమారుడు తండ్రి పెట్టించుచున్నాడని తెలియక, అధికారికి విధేయుడై, తండ్రిని ద్వేషించుచుండును. ద్వేషించుచుండినను తండ్రి వదలలేడు. అట్లే - భగవానుడు కూడ, కోపము తెచ్చుకొనక, ఎన్ని అపరాధములు చేసినను మనలను రక్షింప యత్నించుచుండును. అందుచే భగవానుడు జితక్రోధుడు.

(14) ద్యుతిమాన్ ..

కాంతి గలవాడు ఎవడు ?

శ్రీరాముని కాంతి వెన్నెల వలె లోకమునకు ఆహ్లాద జనకమైనది. సామాన్యము కాదు. దండకారణ్యములో ఋషులు -

"రూప సంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్
దదృశు ర్విస్మితాకారాః రామస్య వనవాసినః"

– (అరణ్యకాండ . 1- 12.)

'రామచంద్రుని దివ్య మంగళ విగ్రహమును, కాంతిని, సౌకుమార్యమును, మనోహర వేషమును చూచి విస్మయముతో నిలచి, దృష్టిదోషము తగులునేమో యని మంగళము పాడి రట ! రాముని లావణ్యమును, కాంతిని చూచి విశ్వామిత్రుడు, జనకుడు మున్నగువారు కూడ ముగ్ధులై, మంగళము పలికిరి. తొడపై పరుండి నిద్రించుచున్న రాముని శోభను చూచి సీతమ్మ - "శ్రీమాన్ సుఖ సుప్తః" అని మేల్కొల్పుటకు ఎంతో బాధ పడెను. ఇట్లు శ్రీరాముడు దివ్య కాంతి విరాజితుడు.

ము :- పరమాత్మను గూర్చి – 'ద్యుతిమాన్'

రమాత్మకూడ ద్యుతిమంతుడే !

పరం జ్యోతిః" అని పరమాత్మ యొక్క స్వరూపమును ఉపని
షు వర్ణించినది :-

"తస్య భాసా సర్వ మిదం విభాతి"

ాత్మ వసించు స్థానమున సూర్యుడు, చంద్రుడు, నక్షత్ర
ంరుపులు మున్నగునవి ఏవియు ప్రకాశింపవు. ఈ లోక
ాంతి నొసంగునవి అన్నియు ఆ పరమాత్మ యొక్క కాంతి
ప్రకాశించుచున్నవి.

నూయకః ?

ము :-

నూయ లేనివాడు ఎవడు ?

ణములను దోషములుగా ఎత్తి చూపుట అసూయ. ఈ
లేనివాడు శ్రీరాముడు. గుణములను దోషములుగా చూపక
ి కాదు. దోషములను కూడ గుణములుగ భావించువాడు
డు. అడవికి వెళ్ళు మనిన తండ్రి యందు కాని, ప్రేరేపించిన
ు కాని, ఒక్క దోషమును కూడ తలంపని వాడు
డు.

ము :- పరమాత్మను గూర్చి – 'అనసూయకః'
మాత్మ కూడ అసూయ లేనివాడే !

ర దోషములలో గుణములను ఏరుకొని మనను రక్షించును.
ంకు విముఖుడై యున్న జీవుడు చేయుచున్న పనులలో

పేర్కొనదగినవానిని తానే ఏరుకొని, వాటిని కాపాడును.
కప్పు, మంచి పనులు చేయుట అలవాటు లేని జీవుని
ం ట్లని భగవానుడు అన్వేషించుచుండును. మూడు విధము
కులను పరమాత్మ చూచి, రక్షించును.

ఆనుషంగిక సుకృతము.
ప్రాసంగిక సుకృతము.
యాదృచ్ఛిక సుకృతము.

.ంగిక సుకృతము :-

పొనక వచ్చిన పుణ్యము ఆనుషంగిక సుకృతము. దూడ
- వెతకుటకు ఆలయమునకు వెళ్ళి, దానివెంట పరుగిడుచు
ప్ర ప్రదక్షిణము చేయుట. ఇది అతడు పుణ్యముగా
కాని, పుణ్యమైన పని జరిగినది. దానిని భగవానుడు
తీసికొనును.

ంగిక సుకృతము :-

టలలో శ్రీరంగము, వేంకటాచలము మున్నగు పేర్లను అను
రాక పనిమీద పలికినను, పుణ్యస్థలములను కీర్తించిన
క్రింద, భగవానుడు లెక్క పెట్టుకొనును. ఇది ప్రాసంగిక

దృచ్ఛిక సుకృతము :-

వస్తువులను తాను కాపాడుకొనుటకు కూర్చొని యుండగా
ఇతరుల వస్తువులు కూడ కాపాడబడినచో, అది యాదృచ్ఛిక

ఇట్లు మూఁడు సుకృతములను చూచి పరమాత్మ రక్షించెడి ఉదారుడు. దోషములలో కూడ గుణములనే చూచెడి అనసూయ కుడు పరమాత్మ.

(16) కస్య బిభ్యతి దేవా శ్చ జాత రోషస్య సంయుగే :–

బాహ్యార్థము :–

యుద్ధములో కోపము వచ్చినచో దేవతలు కూడ ఎవనికి భయపడుదురో అతఁ డెవఁడు ?

వెనుక కోపమును జయించినవాడు ఎవడు అని ప్రశ్నించెను. ఇపుడు కోపము వచ్చినచో, దేవతలకు కూడ భయమును గొల్పు కోపము గలవాఁడు ఎవ డని ప్రశ్నించుచున్నాఁడు.

దీనిచే మానవుఁడు కోపము లేనివాడు కాకూడదు. తగనిచోట కోపము రాకూడదు, వచ్చినపుడు కోపము తనవశమందు ఉండవలెను. యుద్ధ భూమిలో తన శత్రువుని చూచి రాముడు కోపము తెచ్చికొను నపుడు – ఆతనికి కోపము లేదని తెలియు దేవతలు గూడ నిజముగ కోపము వచ్చినదేమో యని భయపడి, దూరముగా తొలగుదురు. ఇది శ్రీరాముని కోప విధానము.

అంతరార్థము :– పరమాత్మను గూర్చి – 'కస్య ··· సంయుగే'

పరమాత్మ యొక్క కోపమునకు కూడ దేవతలు భయపడి, తమ తమ పనులను చేయుచుందురని ఉపనిషత్తు చెప్పుచున్నది .–

"భీషాస్మా ద్వాతః పవతే భీషోదేతి సూర్యః
భీషాస్మా దగ్ని శ్చేంద్ర శ్చ మృత్యు ర్ధావతి పంచమ ఇతి."
– (తైత్తిరీయోపనిషత్తు : 2-8-1)

ము వు పరమాత్మ భయము వలననే వీచుచున్నది. పరమాత్మ ము వలననే సూర్యుడు ఉదయించుచున్నాడు. పరమాత్మ ము వలననే ఇంద్రుడు, అగ్నియు తమ తమ పనులను చేయు వారు. చివరకు మృత్యువు కూడ ఆ పరమాత్మ భయము వల పరుగిడుతున్నది,' ఇట్లు పరమాత్మ కోపమునకు దేవతలు కూడ వడుదురు.

ఈ విధముగ వాల్మీకి నారదుని ప్రశ్నించిన ఈ పదునాఱు గుణములలో బాహ్యముగ నరుని గూర్చియు, ఆంతరముగ పరమా త్మను గూర్చియు ప్రశ్నించుట యున్న దని ఎఱుగవలెను. నారదుడు తగినట్లే సమాధాన మొసంగెను. అందుచే రామాయణ ము బాహ్యముగ నరు డగు రాముని గూర్చియు, ఆంతరముగ పరబ్రహ్మమును గూర్చియు ప్రవర్తించిన దని చెప్పుటలో సంశయ మిసు మంతయు లేదు.

వాల్మీకి యొక్క ప్రశ్నకు సమాధానముగ నారదుడు రామకథ ను ఉపదేశించెను. ఇదియే సంక్షేప రామాయణము. ఇది రామాయణములోని మొదటి సర్గ. ఈ సర్గను పారాయణము చేసి న రామాయణమును పూర్తిగ పారాయణ చేసిన ఫలితము నును.

రామాయణము గాయత్రీ మంత్రమును ప్రతిపాదించు నని ఎంచుటకు నారదుడు ఉపదేశించిన ఈ బాల రామాయణము - గాయత్రీ మంత్రము యొక్క మొదటి అక్షరముతో ప్రారంభమై, అక్షరముతో సమాప్త మగును. "తప స్స్వాధ్యాయ నిరతం" శ్లోకం - 'త' కారము గాయత్రీ మంత్రము యొక్క ఆద్యక్షరము. ర్గ చివరి శ్లోకము - "జన శ్చ శూద్రోఽపి మహ త్త్వమీయాత్."

దానిలోని 'యాత్' అను చివరి అక్షరముతో అంత మగును. ఇది గాయత్రీ మంత్రము యొక్క చివరి అక్షరము. దీనిని చదువుటచే గాయత్రీ మంత్రము జపించిన ఫలితము కలుగును.

## శ్రీ రామాయణము - తత్త్వ నిరూపణము

వేదములు, ఇతిహాసములు, పురాణములు ఐదు విషయములను బోధించుచుండును.

"ప్రాప్యస్య బ్రహ్మణో రూపం, ప్రాప్తుశ్చ ప్రత్యగాత్మనః
ప్రాప్త్యుపాయం ఫల ప్రాప్తే, తథా ప్రాప్తి విరోధి చ
వదంతి సకలా వేదాః సేతిహాస పురాణాః."

మానవుడు భగవత్ ప్రాప్తికై జన్మించినవాడు - ఈ జన్మ యొక్క లక్ష్యము భగవత్ ప్రాప్తి, దానికై ఎఱుంగవలసిన విషయములు ఐదింటిని సర్వ వాఙ్మయము, సర్వ మతములు బోధించు చుండును. ఆ అయిదింటికిని అర్థ పంచక మని పేరు. ప్రాప్తి ప్రధానము కావున, దానికి చెందినవి ఐదు విషయములు కోరతగినవి. 'ప్రాప్తి' యనగా - పొందుట. దానికి సంబంధించి -

1. ప్రాప్యము = పొందబడునది,
2. ప్రాప్త = పొందువాడు,
3. ప్రాప్త్యుపాయము = పొందుటకు ఉపాయము,
4. ప్రాప్తి ఫలము = పొందుటకు ఫలము,
5. ప్రాప్తి విరోధి = పొందుటకు ఆటంకము,

అనువానిని ఎఱుంగవలెను. శ్రీ రామాయణము కూడ అంతరార్థమున ఈ ఐదు విషయములను ప్రతిపాదించును.

1. ప్రాప్యుడు :-

పొందబడవలసినది పరబ్రహ్మము అని చెప్పబడు శ్రీమన్నారాయణుడే! ఆతడే సర్వ జగద్రక్షకుడు. ఆ నారాయణుడే శ్రీరాముడై దేవతలకు - ఋషులకు - మానవునకు - వానరులకు - రాక్షసులకు - ...ల్లె వానికి, బోయవానికి, గద్దకు, కాకికి గూడ అనిష్టమును తొల...ంచి, ఇష్టమును కలుగజేసి రక్షించినవాడు. అందుచే, ఆతడే ప్రాప్యు...ని తెలియనగును.

2. ప్రాప్త :-

పరమాత్మను పొందెడువాడు జీవుడు. ఆతడు పరమాత్మకే ...ందినవాడు. పరమాత్మతో విడదీయరాని సంబంధము కలవాడు. ...రమాత్మయే రక్షకుడుగా కలవాడు. పరమాత్మచే ఇష్టము వచ్చి...ట్లు తన కార్యములయందు వినియోగించుకొనదగినవాడు. పరమా...త్మకే పరతంత్రుడు. పరమాత్మకు వలెనే పరమాత్మ భక్తులకు ...గూడ పరతంత్రుడు. ఈ లక్షణముల నన్నిటిని - సీత, లక్ష్మణుడు, ...రతుడు, శత్రుఘ్నుడు మొదలగు వా రందఱును నిరూపించిరి.

3. ప్రాప్త్యుపాయము :-

భగవానుని పొందుటకు ఉపాయము - యజ్ఞము, తపస్సు, ...న్నగు కర్మలు, జ్ఞానము, భక్తి అనునవి. వీని కంటెను ప్రధాన...మైనది - ప్రపత్తి (శరణాగతి). ఇతరోపాయములను విడచి, భగ...వానుడే ఉపాయమని నమ్మి యుండుట ప్రపత్తి. యోగ్యుడగు ...చార్యుని ఆశ్రయించి యుండుటచే గూడ భగవత్ప్రాప్తి లభించును. ...దీని శరభంగుడు, అగస్త్యుడు, జటాయువు, శబరి మున్నగువారు ...రూపించిరి.

4. ప్రాప్తి ఫలము :-

పొందుటకు ఫలము. భగవానునితో విడువక, నిత్యము కలసి యుండి, పరిచర్యలు చేయుటయే అని, లక్ష్మణ - భరత- శత్రుఘ్న హనుమత్ - సీతాదులు నిరూపించిరి.

5 ప్రాప్తి విరోధి .-

పొందుటకు ప్రతిబంధకము. సత్త్వ రజ స్తమో గుణములతో కూడి యున్న ప్రకృతి వికారమగు శరీర సంబంధముచే కలిగిన అవివేకము రావణ, విభీషణ, కుంభకర్ణులతో కూడిన లంకలో బంధింపబడుటయే, సీతమ్మ రాముని పొందుటకు ప్రతిబంధక మయినది కదా !

ఈ విధముగ - ఎఱుంగదగిన ఐదు విషయములను శ్రీమద్రామాయణము ప్రతిపాదించును. దానినే కొంతవఱకు తెలిసికొన యత్నింతము :-

భగవానునితో విడువడి ఈ జీవుడు ఎన్నో జన్మల నెత్తి, ఆ జన్మలలో చేసిన సుకృతము వలన మానవ జన్మ నెత్తును. మానవ జన్మ సర్వోత్కృష్టము. మానవ జన్మయే మనసును జయించి, దివ్యత్వమును పొందుటకు సమర్థమైనది. అందుకై దానిని ఎట్లు ఉపయోగించుకొనవలెనో వివరించుటకై భగవానుడు తానే నరుడుగ జన్మించి, రావణుని జయించి, సీతను పొంది, పట్టాభిషిక్తుడయ్యెను. భగవంతునకు దూరమై, శరీరములో బంధింపబడుటకు కారణము మనస్సు.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధ మోక్షయోః."

'మనస్సే బంధములో పడుటకు, బంధమునుండి విడుటకు కూడ కారణము.' ఆ మనస్సే రావణుడు. "రావయతి - అసత్ప్రలాపాన్ కారయతి ఇతి రావణః" చెడు పలుకులను పలికించువాడు రావణుడు.

మనస్సే చెడు పలుకులను పలికించునది. అవి రెండు. ఆ రెండును రెండక్షరములు కలవి. "1. అహం, 2. మమ" 'నేను - నాది' అనునవి.

"అనాత్మ న్యాత్మ బుద్ధిర్యా అస్వేస్వ మితి యా మతిః
అవిద్యా తరు సంభూత బీజ మేత ద్ద్విధా స్థితమ్".

'తాను కాని శరీరమును తా నని అహంకరించుట, పరమాత్మదే అయి - తనది కాని వస్తుజాతమును తనది యనుకొనుట అను ఈ రెండే అజ్ఞాన మను వృక్షమునకు మూల మగు విత్తనము.' ఈ మనస్సను రావణునకు కూడ రావణునకు వలెనే పది ముఖములు కలవు. మనస్సు వెలుపలికి ప్రసరించు మార్గములే ఇంద్రియములు. అవి పది. జ్ఞానేంద్రియములు ఐదు. కర్మేంద్రియములు ఐదు. చర్మము, నేత్రము, చెవి, నాలుక, ముక్కు- అనునవి జ్ఞానేంద్రియములు. వాక్కు, చేయి, పాదము, మలద్వారము, మూత్రద్వారము అనునవి కర్మేంద్రియములు. ఈ పదియు మనస్సునకు ముఖములు. అందుచేత, మనస్సు కూడ దశాననుడు - దశముఖుడే! అతడు పరిపాలించునది లంక. మనస్సును పరిలించునది శరీరము. శరీరము సంసార మను సముద్రముచే చుట్టబడి యుండును. లంక నూరు యోజనముల సముద్రముచే ఆవరింపబడి యున్నది. రాజస, తామస, సాత్త్విక చిత్త వృత్తులే రావణ కుంభకర్ణ విభీషణులు. రాజస చిత్తవృత్తి రావణుడు. అది లంకను పాలించునపుడు - రాముని భార్య యగు సీత - లంకయందు బంధింపబడి యుండును. రాజస చిత్త వృత్తి ప్రధానముగా నున్నప్పుడు - అవివేకపూర్ణమైన మనస్సు రామునకే శేషభూతమైనదియు, రాముని చేతనే రక్షింపబడదగినదియు, రామునిచేతనే అనుభవింపబడదగినదియు నగు ఆత్మను సీతమ్మను లంకలో బంధించును.

పరమాత్మయే రాముడు, ఆనందము కలవాడు, ఆనందము నిచ్చువాడు, ఆనంద స్వరూపుడు అగు పరమాత్మయే రాముడుగా అవతరించును రామ శబ్దమునకు అర్థ మదియే. పరమాత్మ వసించు స్థానము – పరమ పదము, వైకుంఠము. దానికే అయోధ్య, అపరా జిత అనియు పేర్లు గలవు.

"దేవానాం పూ రయోధ్యా" అని వేదము చెప్పుచున్నది. ఆ రామునకు, జనకుని యజ్ఞక్షేత్రములో దొరకిన సీత భార్య యగును. సీత జీవ స్వరూపమును నటించును. జన్మింపదు, దొర కును. "న జాయతే మ్రియతే వా కదాచిత్" అని ఉపనిషత్తు చెప్పు చున్నది. జనకుని యజ్ఞ క్షేత్రమే కర్మక్షేత్ర మగు శరీరము. ఆ శరీ రములో – అన్వేషించిన లభించునది ఆత్మ. ఆ ఆత్మ భగవానునకే చెందినదై, భగవానునకు భార్యయై యుండును. భార్యకు భర్తతో గల సంబంధము – జీవునకు పరమాత్మతో గల సంబంధము సమా నము. ఆ సంబంధము ఆఱు విధములుగా నుండును.

1. అనన్యార్హ శేషత్వము :- వానికే తప్ప, ఇతరులకు చెందనిదై యుండును.

2. అనన్య శరణత్వము :- అతడే తప్ప, వే రొకడు రక్షకుడుగా లే కుండుట.

3. అనన్య భోగ్యత్వము :- వాని చేతనే తప్ప, ఇతరుల చేత అనుభవింప బడరానిదై యుండుట.

4. తత్ సంశ్లేషైక సుఖిత్వము :- వానితో కూడియుండుటే సుఖ ముగ నుండుట.

5. త ద్విశ్లేషైక దుఃఖిత్వము :- వాని యెడబాటే దుఃఖముగా నుండుట.

6. తదేక నిర్వాహత్వము :- వానిచేతనే నడిపింపబడుట.

ఈ ఆఱు లక్షణములు గల భార్యగా సీత - రామునితో చేరినది. సీతా కల్యాణము ఈ రహస్యమును వివరించును. జనకుడు సీతకు వివాహము చేయవలె నని ధనుస్సును పణముగా పెట్టెను. ఆ ధనుస్సును ఎవ్వరును వంచలేకపోయిరి. విశ్వామిత్రుని వెంట రామలక్ష్మణులు వచ్చిరి. రాముడా ధనుస్సును వంచెను. సీతను భార్యగా పొందెను. ఇచట పణముగా పెట్టిన ధనుస్సు - ఉపనిషత్తులలో ప్రసిద్ధ మగు ప్రణవము ప్రణవ మనగా ఓంకారము.

" ప్రణవో ధనుః శరో హ్యాత్మా బ్రహ్మ త ల్లక్ష్య ముచ్యతే
అప్రమత్తేన వేద్ధవ్యం శరవ త్తన్మయో భవేత్."

- ( *ముండకోపనిషత్తు* : 2 - 4.)

' ప్రణవ మనెడి ధనుస్సులో - ఆత్మ యనెడి బాణమును సంధించి, పరమాత్మను గురి చేసి వదలవలెను. అపుడు ఆత్మ - పరమాత్మలో చేరియుండిపోవును'' అని ముండకోపనిషత్తు చెప్పెను. ప్రణవము ఎవరికి వంగునో, సీత వారికి చెందును. 'ప్రణవము అగుట' అనగా - ప్రణవము నామముగా కలిగియుండుట. నామ మనగా - పేరు. పేరు కలవారివైపు వంగును. ''నమ తీతి నామ'' - అట్లు ప్రణవము వాచకముగా కలవాడు పరమాత్మ. కావున, ఓంకారము వానికే వంగును, రాముడు విల్లును వంచుట, ప్రణవమునకు అర్థము రాముడే యని ఎఱుంగవలెను.

ప్రణవము అ + ఉ + మ్ అని మూ డక్షరములు.

'అ' కారము సర్వ జగ త్కారణము, సర్వ జగ ద్రక్షకము అగు పరమాత్మను తెలియజేయునది.

'మ' కారము జీవుని తెలియజేయునది.

ఉ' కారము వా రిద్దరకు విడదీయరాని సంబంధము కలదని తెలియ జేయునది.

'జీవుడు పరమాత్మకే చెందినవాడు' అని ప్రణవమునకు అర్థము. ఈయర్థమును మననముచేసి, ప్రణవమును జపముచేసిన, పరమాత్మతో నిత్య సంబంధ మేర్పడును. ఇది సీతా కల్యాణమున తెలియును. ఇట్లు పరమాత్మతో జీవుడు భార్య వలె - ఆఱు సంబంధములు కలిగి, పరమ పదము నందైనను, సంసారమందైనను, పరమాత్మతోనే విడదీయరానివాడై యుండును. అందుచేతనే సీతమ్మ - అయోధ్య లోను, అరణ్యములోను రామునితోనే కలిసియుండును. రావణా సురుడు లంకకు తీసికొనిపోయినపుడు కూడ -

"అనన్యా రాఘవేణాహం భాస్కరేణ ప్రభా యథా"
- ( సుందర కాండ 21 15 )

నేను రామునితో వేరైనదానను కాను. సూర్యునితో కాంతి వలె కలిసియే యుందును' అనును. ఇట్లు భగవానునితో జీవునకు గల సంబంధమును సీత నిరూపించును.

అట్లు పరమాత్మతో సర్వదేశ - సర్వకాల - సర్వావస్థల యందును కలిసియుండి, తన వాచిక - కాయిక - మానసిక వ్యాపారములను పరమాత్మకే అర్పించుట, పరమాత్మ కొఱకే చేయుచుండుట జీవునకు స్వభావమై యుండవలె నని లక్ష్మణుడు నిరూపించును. పరమాత్మకు పరతంత్రుడై యుండుటయే జీవ లక్షణ మని భరతుడు నిరూపించును. భగవద్భక్తులకు పరతంత్రుడై యుండుటయే జీవధర్మ మని శత్రుఘ్నుడు భరతునకు నిరూపించును. ఇట్లు - బాల, అయోధ్య, అరణ్య కాండలలో సగము వఱకు జీవ - పరమాత్మలకు గల సంబంధము, జీవ స్వభావము నిరూపింపబడినవి.

ఇట్లు నిత్య సంబంధము గల జీవుడు పరమాత్మనుండి ఎట్లు విడువబడును? ఎందుకు విడువడును? మరల ఎట్లు కలియును? అను విషయములు - మిగిలిన రామాయణమున నిరూపింపబడును. సీత - మహాలక్ష్మి. ఆమె జగన్మాత. రాముడు నరుడుగా అవతరించినట్లే, ఆమె మనుష్య స్త్రీయై సీతగ అవతరించినది. పురుషులు ఆచరించవలసిన ధర్మములను రాముడు తానాచరించి ప్రదర్శించెను. స్త్రీలు ఆచరించవలసిన ధర్మములను సీత ఆచరించెను. సీత మాత యగుటచే, లక్ష్మి వలె జీవులను పరమాత్మతో చేర్చుటలో మధ్యవర్తినియై సహాకరించుచుండును. జీవుల స్వరూపము నెఱింగించుటకు తానే జీవ భావముగ నటించును. ఇట్లు బాహ్యార్థమున, సీత ఆదర్శ గృహిణి, పతివ్రత. అంతరార్థమున ఆమె శ్రీ మహాలక్ష్మిగ జీవునిచే సేవింపదగిన మహిషియై యుండును. జీవుని పరమాత్మతో చేర్చెడి ఘటకురాలై యుండును. జీవుల వలె నటించును. అనాదిగ పరమాత్మతో కలిసి యున్న జీవుడు పరమాత్మకు దూరమై, సంసార మధ్యమున శరీరములో బంధింపబడుటకు కారణము మాయ. ఆ మాయచే, తానను భవింపదగనిదానిని అనుభవింపవలె నని కోరును. దానితో - భగవానునకు దూర మగును. అయోధ్యలోను, దండకారణ్యములోను కూడ రాముని ఒక్క క్షణమైనను విడువక, భోగములను అనుభవించును. ఆనందించుచున్న సీతకు బంగారు చుక్కలు గల మాయ లేడిపై కోరిక కలిగెను. ఆ లేడిని పొందవలె నని రాముని ప్రార్థించి, రాముని దూరము చేసికొనెను. దూషించి లక్ష్మణుని దూరము చేసికొనెను. ఏకాకినియై యుండెను. రావణునిచే బంధింపబడెను. సీత జగజ్జనని. శ్రీ రాముడు మోహన రూపుడు. సీత అంతటి వివేకము లేనిదా? రామునకంటె వేరొక వస్తువును భోగ్యముగ కోరుట యేమి? ఇది యంతయు జీవుడు పరమాత్మ కెట్లు దూర మగునో చూపించుటకే! మారీచుడు మాయా మృగ మాయెను, మాయా మృగ మారీచుని

చూచి, సీత భ్రమించెను. మాయ యనగా - అవిద్య, అజ్ఞానము. మృగ మరీచి యనగా - ఎండమావి. ఎండవేళ గాలి కెగురు ఇసుక రేణువులను చూచి, దప్పిగొన్న లేడి - త్రాగదగిన నీరు అని తలంచి పరుగిడి మరణించును. అట్లే, అనుభవింపదగని విషయములను చూచి, అనుభవింపదగిన వని భ్రమించి, వానికై ప్రాకులాడి, జీవుడు బంధమున పడును. ఆ మృగ మరీచియే (ఎండమావియే) ఈ మృగ మారీచుడు. ఇది మాయ. మాయ మూడు పనులను చేయును. (1) ఒక విధమున నున్న దానిని వేరొకవిధమున కనిపింపజేయును. (2) దానిని అనుభవింపవలె నన్న బుద్ధిని కలిగించును. (3) భగవంతుని స్వరూపమును మరుగుపఱచును. ఇచట కూడ మాయామృగము మారీచుని వలె కన్పించక, లేడి వలె కన్పించెను. సీతకు దాని ననుభవింపవలె నని కోరిక కలిగెను. రాముడు మరుగుపడెను. విషయములు బంగారము వలె మెరసి ఆకర్షించును. అవియే లేడికి గల బంగారు చుక్కలు. ఇట్లు మాయచే విషయములు అనుభవింపవలె నను కోరిక కలుగును. జీవుడే దూరము చేసికొనును. దూరము చేసికొనుట యనగా - భగవంతుని కంటెను ఇతరము లగు విషయములను కావలె నని కోరుట. ఇట్లే, భగవద్భక్తులను కూడ శంకించి, దూషించి, వారిని కూడ దూరము చేసికొనును. దానిచే రావణుడు సీతను చెర పట్టెను. ఆత్మ మనమునకు వశ మగును. ఇట్లు జీవుని బంధమునకు జీవుడే కారణ మని నిరూపించెను.

ఇట్లు విడువడిన జీవుడు మరల భగవంతునితో చేరుటకు కావలసినది ముముక్షుత్వము. అనగా - విడువడవలె నను కోరిక కలిగి యుండుట. ఆ కోరిక కొన్ని కోట్ల జీవులలో ఏ ఒక్కరికో కలుగును. మనుష్యత్వము ఎంత దుర్లభమో, ముముక్షుత్వము అంత దుర్లభము, అట్టి జీవుని పొందుటకు పరమాత్మ విలపించును అన్వేషించును. తానే ప్రయత్నించి పొందును. సీత రావణునిచే

బంధింపబడినది మొదలు, వాని ఐశ్వర్యమును కాని, ధనమును కాని కాంక్షింపక, వాని బంధము నుండి విడువడి, రామునే పొందవలె నని కోరును. రాముడు ఆమెను పొందుటకు వెదుకుడు. శబరి వద్దకు వచ్చును.

శబరి కథ రామాయణ కథకు ఏవిధమయిన సంబంధము లేని కథ. ఆమె మతంగముని శిష్యురాలు. బోయది. కర్మాధికారము లేదు, జ్ఞానము లేదు, గురు శుశ్రూషయే ఆమెకు శరణ్యము. గురువుసేవమ్మ, గురువు మాట ప్రకారము రామ లక్ష్మణులు తమ ఆశ్రమమునకు వత్తు రని ఎదురుచూచుచుండెను. రామ లక్ష్మణులు అచటికి వచ్చిరి. శబరి మతంగాశ్రమమును చూపించి, తమ గురువుల వైభవమును రామ లక్ష్మణులకు చూపెను. వారి ఆజ్ఞతో - యోగాగ్నిలో శరీరమును ఆహుతి చేసికొని, దివ్య తేజముతో విమానముపై దివ్య లోకముల కేగెను, దీనితో - అరణ్యకాండ ముగియును.

అరణ్య కాండలో శ్రీరాముడు శరభంగుని, సుతీక్ష్ణుని, అగస్త్యుని దర్శించును. వారు మహా తపశ్శాలురు, జ్ఞానులు కాని, వారు కూడ రాముని దర్శనమునకై వేచియుండిరి. తమ సర్వస్వము రామునకే అర్పించి, రామునే శర ణనిరి. శరభంగుడు రాముని అనుగ్రహముతో - అగ్నిలో ఆహుతి చేసికొని, మోక్షమును పొందును. జటాయువు రాముని యందు నిరతిశయమైన ప్రీతి కలవాడు. ఆ ప్రేమతో సీతకై రావణునితో యుద్ధము చేసి, ప్రాణముల నర్పించి, రాముని యనుగ్రహముచే మోక్షమును పొందెను. శబరి గురు శుశ్రూష చేసి, యజ్ఞము - తపస్సు లేక, కేవలము గురు శుశ్రూష చేతనే మోక్షమును పొందెను. దీనితో భగవత్ప్రాప్తికి ఉపాయము లన్నింటి కంటెను ఆచార్య శుశ్రూషయే ముఖ్యము అని నిర్ణయ మయినది. అరణ్య కాండ చివర శబరి వృత్తాంతముతో

ఆత్మోజ్జీవనములో ఉపాయము ఆచార్యుడే యని నిర్ణయింప బడినది.

ఆచార్యుడే హనుమ. హనుమ ద్దర్శనముతో కిష్కింధాకాండ ప్రారంభమయినది. హనుమానుని దూతగా వరించి, సుగ్రీవుని మంత్రి యగు హనుమకు శ్రీరాముడు తన అంగుళీయకము నిచ్చి, లంకకు పంపి, సీతా వృత్తాంతమును తెలిసికొని, సైన్యముతో వెళ్ళి, రావణుని చంపి, సీతమ్మతో అయోధ్య చేరి, పట్టాభిషిక్తు డగును. పరమాత్మ ఆచార్యుని దూతగా వరించి, తానే జ్ఞానమును ప్రసాదించి, శరీరమున కారణజన్మునిగా జన్మింపజేసి, వానివలన - ముముక్షు వగు జీవుని స్వభావము నెఱింగి, తానే స్వయముగ ఆ జీవుని బంధించిన మనస్సును మర్దించి తనతో చేర్చుకొని, పరమపదమునకు తీసికొని పోవును. ఇట్లు శ్రీరామాయణ కథ యంతయు తత్త్వ నిరూపణ ముతో అంతరముగ సాగినది.

"మంగళం కోసలేంద్రాయ మహనీయ గుణాత్మనే
చక్రవర్తి తనూజాయ సార్వభౌమాయ మంగళమ్."





పుండ్రై ర్ద్వాదశభి ర్విభ్రాజం విలసితం దండై స్త్రిభి ర్మండితం
కాషాయేణ శిఖోపవీత రుచిరం గోర్మాల చక్రాంబుజమ్
ఆసీనం జలజాసనై శ్చ తులసీ పద్మాక్షమాలాంచితం
యుక్తం చాంజలి ముద్రయా రవినిభం శ్రీభాష్యకారం భజే

# భగవద్రామానుజులు - శ్రీభాష్యము

## ( తృతీయాధ్యాయ - పూర్వార్ధము )

న్యాయ విద్వాన్ - వేదాంత విద్వాన్
సాహిత్య విద్యా ప్రవీణ - సాహిత్య రత్న
ప్రవచన వాచస్పతి - మహోపన్యాసక
విశిఖ వాక్మఖామణి - పౌరాణిక కేసరి
శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు, ఎం.ఏ; బి.ఓ.యల్,



## శ్రీ భా ష్యో పా స న ము

ఉపనిషత్తులకు వేదాంత మని వ్యవహార మున్నది. ఈ వేదాంతము ఒక మహా సముద్రము. వీనిని మథించినందున లభించునది 'అభయం అమృతం బ్రహ్మ.' ఈ బ్రహ్మ అను అమృతమును ఆస్వాదించు వారికి అపునరావృత్తి లక్షణ మగు ఆనందము అందుబాటుతో నుండును. అందువలన, ఈ అమృతమును బాదరాయణ భట్టారకులవారు 545 సూత్రముతో ఏర్పాటు చేసిన 156 అధికరణములలో నిబంధించి యుంచినారు. రుచి ఎరిగిన పూర్వాచార్యులు ఈ పరబ్రహ్మ పీయూష భాండమును బాగుగా భద్రపరచినారు. దీనినే ఒక చుక్క కూడ జారిపోని రీతిలో భగవద్రామానుజులు అక్షర బద్ధ మొఖరించి, ఆస్వాదించు డని శ్రీభాష్య రూపమున మన కందించి యున్నారు. అందువలన, శ్రీభాష్య మనగా - ఉపనిషత్ ప్రతిపాద్య మగు పరబ్రహ్మ యొక్క అభయ అమృత స్వరూప మగు ఒక అక్షరాకృతి యని భావింపబడుచున్నది. దీనికి మనసు గల మంచివా

రందరు అనుదిన మాస్వాదించి యుజ్జీవించవలయు నని స్వామి శ్రీ భాష్యకారులు సెలవిచ్చి యున్నారు. ఈ శ్రీభాష్యమునకు వ్యాఖ్యేయ మగు బ్రహ్మసూత్ర సముదాయము 4 అధ్యాయములలో విభ జింపబడి యున్నది. ఒక్కొక్క అధ్యాయమును కూడ - సూత్రకారు లగు బాదరాయణులవారే 4 పాదములలో విభజించి యున్నారు. ప్రధాన ప్రతిపాద్య మగు అంశము యొక్క అవాంతర భేదముల ననుస రించియున్న ఈ అధ్యాయ పాద విభాగము అందరకును అనుమతమే. ఈ నాలుగు అధ్యాయములలో విభక్త మగు వేదాంత శాస్త్రమును మన శ్రీభాష్యకారులు అర్థ బోధ సౌకర్యము కొరకు రెండు వర్గము లుగా క్రోడీకరించి యున్నారు. వానిలో మొదటి రెం డధ్యాయ ములు ఒక పేటిక యైనచో - చివరి రెం డధ్యాయములు కలిసి మరి యొక పేటిక. మొదటి పేటిక సిద్ధ విషయ స్వరూప పరబ్రహ్మ తత్త్వ మును భద్రపరచుకొనినది. రెండవ పేటిక సాధ్య స్వరూపమును సంరక్షించుచున్నది.

సాధ్యమును హిత మనియు, పురుషార్థ మనియు రెండు వర్గము లుగా విశ్లేషించుటకు వీ లున్నది. హిత మనగా - ఇష్ట సాధన మైనది. పురుషార్థ మనగా - అనుకూల మిది యను భావనతో ఆశించునట్టి ఇష్టము. ఈ ఇష్టమునే ఫల మని యందురు. దాని స్వరూ పమును నాల్గవ అధ్యాయములో చక్కగా సమీక్షించి యున్నారు. అందువలన, ఆ అధ్యాయమునకు ఫలాధ్యాయ మనియే పేరు. ఈ ఫల మునకు - లేక, ఇష్టమునకు సాధన మైనది నియతముగా మొదట కదా ఉండవలెను ! అందువలన, మూడవ అధ్యాయము ఇష్ట మగు ముక్తి రూప ఫలమునకు సాధన మగు ఉపాసనము యొక్క సర్వాంగ సుందర మగు స్వరూపమును సమీక్షించుట కేర్పాటు చేయబడినది. హితమును కాని, పురుషార్థమును కాని నిర్ణ యించుకొనుటకు ముందు - తత్త్వ మెద్దియో తెలియవలసి యుండును. ఏ మనగా - తత్త్వము

ననుసరించియే హితమును, పురుషార్థమును కూడ నిర్ణయింపవలసి యుండును. అందువలన, తత్త్వ నిర్ణయము చేయు సమన్వయ అవిరోధాధ్యయములు పూర్వ ద్విక ముగా మొదట వివరింపబడినవి. ఇక – ఉత్తర ద్విక యను రెండవ పేటిక యందును – కార్య కారణములకు గల పౌర్వాపర్యమును బట్టి, సాధన రూప మగు ఉపాసనమును ఉపదేశించు అధ్యాయము పూర్వస్థానమును సంపాదించుకొనినది. ఫల స్వరూపమును వివేచించు అధ్యాయము అంతిమ స్థానము నాక్రమించుకొనినది. వీనిలో – చివరి అధ్యాయమునకు ఫలాధ్యాయ మను పేరు ఏర్పడినట్లే, దీనికంటె ముందు గల మూడవ అధ్యాయమునకు ఉపాసనాధ్యాయమను పేరు వ్యవహారములో నున్నది. ఇపు డీ వ్యాసములో – ఈ ఉపాసనాధ్యాయ సారమునే అనుభవించవలసి యున్నందున, దీనికి – 'శ్రీభాష్యోపాసనము' అను శీర్షిక ఉంచబడినది.

శ్రీభాష్యోపాసన మనగా – శ్రీభాష్య గ్రంథములో ఉపాసన స్వరూపమును సవిమర్శించు మూడవ అధ్యాయము యొక్క సారము ననుభవించుట యనియే ఇచట తాత్పర్యము. ఈ ఉపాసనాధ్యాయము మొత్తము 181 సూత్రములలో నిబంధింపబడి యున్న 55 అధికరణములు గలదిగా భాసించుచున్నది. ఈ అధ్యాయముకూడ, మిగిలిన అధ్యాయముల వలెనే, నాల్గు పాదముల యందు ఆధారపడి యున్నది. ఈ నాలుగు పాదములు కూడ ఉపాసనమునకు సంబంధించిన ప్రధాన విభిన్నాంశములను నాతి విస్తరముగా వివరించుచున్నవి. ఈ నాలుగు పాదము లందును మొదటి రెండు పాదములు ఒక పేటికగను, చివరి రెండు పాదములు మరి యొక పేటికగను మనము భావింపవచ్చును. భగవంతుని ఉపాసింపవలె నన్న భావన మన కేర్పడిననే కాని మనము ఉపాసనమును ఆరంభింపముగదా ! మరి మన మా ఉపాసన మారంభింపవలె ననిన, రెం డంగములు మన కుండవలయును

వీనిలో మొదటిది - మన మిప్పుడు అనుభవించు సాంసారిక భోగముల యందు కాని, ఇంద్రాది పరలోక భోగముల యందు కాని, కోరికలు లేకపోవుట. రెండవది - మన ముపాసించు భగవంతుని యందు మనకు విశేషమైన ఆశ, అభినివేశము లేర్పడుట. ఈ రెండును మొదటి పేటికలో వివరింపబడి యున్నవి. ఇట్లు ఈ పేటిక ఉపాసనారంభమునకు కావలసిన సామగ్రిని వివరింప, రెండవ పేటిక సాంగోపాసనమును సమీక్షించును. సాంగోపాసన మనగా నేమి? ప్రధానము లగు ఉపాసనల స్వరూపమును, ఆ ఉపాసనలు చేయవలసిన విధానమును తెలుపు అంగముల స్వరూపమును కూడ తెలిసికొనినచో తప్ప, తెలియదుగదా! అందువలన, మూడవ పాదములో - ఉపాసనలు, నాల్గవ పాదమున అంగములు కూడ విచారించబడినవి.

ఇట్లు రెండు పేటికలలో కుదించబడిన తృతీయాధ్యాయము యొక్క నాలుగు పాదములకును వరుసగా (1) వైరాగ్య పాదము (2) ఉభయ లింగ పాదము (3) గుణోపసంహార పాదము (4) అంగ పాదము అను పేరు లేర్పడి యున్నవి. వీనిలో - వైరాగ్య పాదము మొదటిది. దీనిలో 27 సూత్రము లందు 6 అధికరణములు నిబంధించ బడి యున్నవి. ఈ ఆరు అధికరణము లందును - పంచాగ్ని విద్య ప్రధానముగా ప్రబల యుక్తులతో పరీక్షించబడినది.

ఈ పంచాగ్ని విద్యను పరీక్షించుటలో శాస్త్రకారులకు ఒకటియే తాత్పర్యము. అదే మనగా, మనకు వైరాగ్యమును కలిగించుటయే. మనకు వైరాగ్యము కలుగగనే ఈ మోక్షశాస్త్రమును వినుటకు సిద్ధపడితిమా? అని మన మే మాత్రము కూడ విచారింప వలదు. ఏల ననగా - వైరాగ్యము రెండు విధము లట! ఒక రకము వైరాగ్యము కేవలము శ్రవణము నందు మాత్రమే మనకు ప్రవృత్తిని, కలిగించగలదు. ఇది అల్పమైనది. మరి యొక రకము వైరాగ్యము భగవ

దుపాసనము నందును మనకు ప్రవృత్తిని కలిగించుటలో ఉపయోగ పడునట ! ఇది బహు విధ దోష దర్శనము చేత తప్ప, కలుగదు. అందువలన, ఈ వైరాగ్యపాదమున ప్రకృతము బహు విధ దోష దర్శనము చేయించి, వైరాగ్యమును కలిగించ జాలిన పంచాగ్ని విద్య - ప్రధానముగా పరీక్షించబడుచున్నది. అట్టి పంచాగ్ని విద్యను ఇట పరిశీలింతము :-

## పంచాగ్ని విద్యా పరిచయము

పంచాగ్ని విద్య యనునది - ఛాందోగ్య ఉపనిషత్తుకు సంబంధించిన పంచమ ప్రపాఠకములో నిబంధింపబడి యున్నది. అరుణముని కుమారుడు ఆరుణేయుడు. అతడు తన పుత్రుడగు శ్వేతకేతువుకి, తనకు వచ్చిన విద్యల నన్నిటిని ఉపదేశించెను. విద్యా స్నాతుడైన శ్వేతకేతువు - పంచాల దేశాధీశుని సభలో నొకనాడు పాల్గొనెను. అపుడు పంచాల రాజు అగు ప్రవాహణుడు అతనిని ఐదు ప్రశ్న లడిగెను. ఒకటి :- కర్మలు చేయువారు చేరు లోకము తెలియునా ? అని. తెలియ దనినాడు శ్వేతకేతువు. రెండవది :- ఆపై లోకముల నుండి తిరిగి ఈ లోకమునకు తిరిగి వచ్చు విధాన మెద్దియో తెలియునా ? అని. తెలియ దనినాడు శ్వేతకేతువు. మూడవది :- దేవయాన - పితృయాణ మార్గముల భేదములు తెలియునా ? అని. అదియును తెలియ దనినాడు శ్వేత కేతువు. నాల్గవది :- అనేకులు వెళ్ళుచున్నను ఆ పర లోకము ఏల నిండిపోవుటలేదు ? అని. ఐదవదో - మన శ్వేతకేతువుకు ఇదియును తెలియలేదు. అపుడు ఐదవ ప్రశ్నను అడిగినాడు ప్రవాహణుడు :- భూత సూక్ష్మములు ఐదవ ఆహుతిలో - 'పురుష' శబ్దముతో వ్యవహరింపబడునుగదా ! అది ఎట్లు జరుగునో తెలియునా ? అని. చివరి కిదియు తెలియ దనినాడు శ్వేతకేతువు. అపుడు

పంచాలరా జన్నాడు :- ఏమయ్యా ! తండ్రి గారి వద్దనే అన్ని విద్యలను నేర్చుకొనినావుగదా ! మరి - ఈ విషయములు తెలియనివాడు విద్య నేర్చినవాడు కాగలడా ? అని.

శ్వేతకేతువు చాల బాధపడి, తండ్రిగారివద్దకు వచ్చి, అన్ని విద్యలు నేర్పకనే మీరు నా కన్ని విద్యలు నేర్పితి నన్నారు. కాని, పంచాలరాజు న న్నడిగిన ఐదు ప్రశ్నలలో ఒక్క ప్రశ్న కేనియు నేను సమాధానము చెప్పజాలనైతిని' అని అన్నాడు. అపుడు ఆరుణేయుడు ఇట్లు పలికెను :- 'బాబూ ! నాకు తెలిసిన విద్యల నన్నిటిని నీకు చెప్పివేసితిని ఈ అయిదు విషయములు నాకును తెలియవు. తెలిసి యున్నచో నీకు చెప్పియుండెడివాడనే గదా !' అని. ఇట్లు బదులు పలికి, పంచాలరాజు వద్దకు వచ్చెను. రాజుగా రాతనిని గౌరవించి, 'ఏమి వలయునో ఆదేశించుడు స్వామీ !' అనెను. అపుడు ఆరుణేయ మహర్షి - 'నా కుమారుని అడిగిన అయిదు విషయములను గురించి తెలిసికొనవలెననియే వచ్చితిని. దయ యుంచి, ఆ విషయముల నుపదేశింకవలె మహారాజా !' అని అర్థించెను.

అపుడు పంచాలరా జిట్లు పలికెను, .- గౌతమ మునిచంద్రా! ఈ విద్య తెలిసిన బ్రాహ్మణు లిపు డెవరును లేరు. కనుక, నేనే తమ కీ విద్యను చెప్పవలసి యున్నది. ఈ పంచాగ్ని విద్య తెలిసిన బ్రాహ్మణులలో తామే మొదటివారు కాగలరు సుమా ! ఐనచో - కొంత కాలము మా వద్ద తాము నివసించవలె స్వామీ ! అవకాశము ననుసరించి తప్పక తమ కీ విద్యను తెలుపగలను' అని. భూత సూక్ష్మములు ఒక ఆహుతిలో - 'పురుష' శబ్దములో వ్యవహరింపబడు విధానమును తెలిసికొనినచో, మిగిలిన నాలుగు ప్రశ్నలకును సమాధానము సులభముగా తెలియగలదు. కనుక, కొంత కాలము తన

వద్ద గురుకులవాస మొనరించిన మహర్షికి-పంచాలరాజు ఈ పంచాగ్ని విద్యను తొలుత నుపదేశించెను. పుణ్యకర్మ లొనరించి, పై లోకములకు చేరినవారు - తమ కర్మ ఫలముల ననుభవించిన తరువాత, ఈ లోకమునకు తిరిగి వచ్చు విధాన మిందు వివరింపబడుచున్నది.

పై లోకమున పుణ్యఫల మనుభవించిన జీవునకు - తిరిగి రాక సందర్భమున ముఖ్యముగా ఐదు స్థానములు విశ్రాంతి నిచ్చునవిగా భావింపబడుచున్నవి. ఈ ఐదు విశ్రాంతిస్థానములను ఐదు లోకములుగా పేర్కొనుచు, ఉపనిషత్తు ఉపదేశించుచున్నది. వీనిలో మొదటి లోకమునకు ద్యు లోక మని పేరు. ఈ లోకమును ఒక అగ్నిగా రూపించుకొందము. జీవుని ఇంద్రియములు ఈ లోకమునకు చేరవలసిన యాగాది క్రియా కలాపములను చేయు గావున, ఆ ఇంద్రియములు హోమము చేయు దేవతలను రూపించుట జరుగును. ఈ జీవు డను హోమ ద్రవ్యమునకు - అనగా - హవిస్సునకు శ్రద్ధ యని పేరు. తనకు ద్యు లోకమునందు గల శ్రద్ధ కనుగుణముగా కర్మలు చేసెను గనుక, అట్టి శ్రద్ధను బట్టియే ఆ లోకమును చేరును గనుకను జీవున కచట శ్రద్ధ యను పేరు వచ్చెను. అయినచో - ఇట్లు ద్యు లోకము చేరిన జీవుడు - అచట దేవతల అనుభవమునకు యోగ్యదేవతల అనుభవమునకు యోగ్య మగు రూపు దిద్దుకొని, సోమరాజుగా వ్యవహరింపబడు నట !

కర్మానుభవానంతరము ఈ సోమరాజను జీవుని - పర్జన్య లోక మనెడు అగ్నిలో ఆహుతి చేయగా, అతడు వర్ష మను పేరుతో వ్యవహరింపబడును. ఈ వర్ష రూపమున నున్న జీవుని, మూడవది యగు పృథివి యను లోకమున ఆహుతి చేయగా - అన్న మను పేరుతో వ్యవహార మేర్పడు నట ! నాల్గవ లోకము అను అగ్ని - పురుష రూపముగా పేర్కొనబడుచున్నది. ఈ పురుషాగ్నియందు

ఆహుతి చేయబడిన అన్న మనెడు జీవునకు - రేతస్సు అను వ్య
హార మట ! చివరిది - ఐదవది యైన అగ్ని - స్త్రీ రూప మగ
లోకము. ఈ రూపాగ్ని యందు జరుగు ఆహుతి ఐదవది. స్త్రీ
యందు ఆహుతి చేయబడిన జీవునకు - గర్భ మని పేరు. ఈ ఐద
ఆహుతిలోనే జీవునకు ఇంతవరకు కానరాని భూత సూక్ష్మములతో
కలిసి, ముద్దగా వర్షముగనో, అన్నముగనో, రేతస్సుగనో వ్యవహ
రింపబడువానికి - పురుష పదముతో వ్యవహార మేర్పడు నట ! ఆ
గర్భమున పది నెలలో, పదకొండు నెలలో గర్భవాస క్లేశము నను
వించి, జనన సమయమున కూడ మిగుల ఆయాసము ననుభవించి
మనుష్యుడుగనో, పశువుగనో, పక్షిగనో కర్మానుగుణముగా పుట్టు
నట ! ఇది పైలోకములనుండి జీవుడు వర్షముగా, అన్నముగా, రే
తస్సుగా, గర్భముగా ఏర్పడి, దిగి వచ్చు విధానము. ఆ యా స్థితు
లలో ఏర్పడు క్లేశములను గమనింప గలిగినచో, వైరాగ్యము బాగుగ
ఏర్పడు అవకాశ మున్నది.

వైరాగ్యము గలిగి, తాను భూత సూక్ష్మాది ప్రకృతి సంబ
ధమును కలిగి యుంటిని గనుక, ఇట్టి క్లేశము లనుభవింపవలసి వచ్చి
నది అని తెలిసికొనిన జీవుడు - శుద్ధాత్మ జ్ఞానము గలవాడై, భ
వంతుడే ఉపాయ మను అధ్యవసాయము కలిగి, అర్చిరాది మా
ముగా స్వామి సన్నిధికి జేరి, స్వస్వరూపావిర్భావము చెందును.
అర్చిరాది మార్గమునకే దేవయాన మని పేరు. ఈ మార్గమున పం
నించినవారు - పునరావృత్తి రహిత మగు పరమాత్మ సన్నిధికి జే
శాశ్వతానంద మందుదురు. ఇట్లు కాక, ఎవరు స్వర్గాది సుఖములంద
దానశక్తి గలవారై, యాగ - దాన - హోమాది కర్మల నా
రింతురో, వారు - పితృయాణ మార్గమున పై లోకములకు చేరి, క
ఫలముల ననుభవించి, అనంతరము మరల ఈ లోకమునకు పై
పేర్కొనిన విధముగా వచ్చుచుందురు. ఇట్లు దేవ యానము పున

వృత్తి రహిత మగు శాశ్వతమైన ఆనంద స్థితిని సంపాదించి యిచ్చునట్టి మార్గము. పితృయాణము పునరావృత్తిని కలిగించు మార్గము. ఇదియే ఈ రెండు మార్గములకు గల వ్యత్యాసము. అది పంచాలరాజు అడిగిన మూడవ ప్రశ్నకు సమాధానము, పంచాగ్ని విద్య - ఐదవ ప్రశ్నకు సమాధానము.

ఎందరో వెళ్ళుచున్నను, పై లోకములు ఎందుచే నిండుటలేదు ? అను నాల్గవ ప్రశ్నకు సమాధానముగా పంచాలరాజు - మరొక రహస్యమును చెప్పెను. కొందరు జీవులు దేవయాన మార్గమున గాని, పితృయాణ మార్గమున గాని పయనించ రట ! వీరు కేవలము పాపములనే చేసినవారు. వీరిని దేవయాన - పితృయాణముల కంటె అతిరిక్తమైన తృతీయ స్థాన మట ! అనగా - వీరు ఎచ్చటికిని వెళ్ళుట అనునది ఉండదు. క్రిమి - కీట - దంశ - మశకాదులు చచ్చుటయు, వెంటనే మరియొక శరీరముతో ఇచటనే పుట్టుటయు జరుగుచుండును. ఇట్లు పాప కర్మ నాచరించినవా రనేకులు మరణించుచున్నను. వీ రా పుణ్యలోకములకు వెళ్ళుటలేదు. కనుక, ఆ లోకములు నిండుట లేదని నాల్గవ ప్రశ్నకు సమాధానము. ఇక పుణ్య కర్మ లాచరించినవారు చేరు లోకములు - ద్యు లోకాదు లని మొదటి ప్రశ్నకు సమాధానము. వారు తిరిగి వచ్చు విధానమును గురించిన విషయమునకు సంబధించినది రెండవ ప్రశ్నకు సమాధానము కూడ ఈ పంచాగ్ని విద్యలో ఇమిడి యున్నది. ఇది పంచాగ్ని విద్యకు సంబంధించిన సంక్షిప్త పరిచయము.

## అధికరణార్థ వివరణము

ఇక - వైరాగ్య పాదములోని ఆరు అధికరణము లందలి మొదటిది యగు తదంతర ప్రతిప త్త్యధికరణమును సమీక్షింతము. ఐనచో - మొదట, అధికరణ మనగా నేమియో మన మవగాహన మొనరించుకొనవలసి యున్నది. సాధారణముగా అధికరణ మన, ఏదేని ఒక విషయ వాక్యార్థ మును నిర్ణ యించుచుండును. ఈ అధికరణము కేవలము ఒకే నొక సూత్రముగ నుండవచ్చును. ఒకటి కంటె అధికముగ కొన్ని సూత్రముల సముదాయ రూపముగను ఉండవచ్చును. ఇక, ప్రతి అధికరణమునందును మనము ఆరు విధము లగు విషయములను తెలిసికొనవలసి యుండును.

వానిలో మొదటిది - అధికరణ మేర్పడుటకు గల సంగతి. పూర్వాధికరణముతో ప్రకృతాధికరణమునకు గల సంబంధమును సంగతి యని వ్యవహరింతురు. ఇదియే ప్రకృతాధికరణమును ప్రారంభించుటకు ప్రధాన కారణముగా మనము గుర్తించవలసి యున్నది. ఈ సంబంధము జిజ్ఞాసా గర్భితమై యుండును. జిజ్ఞాస యొక్క క్రమము ననుసరించియే అధికరణముల క్రమ మేర్పడి యుండును. సంగతి తరువాత గమనించవలసినది విషయము. ఈ యధికరణము ఏ విషయ వాక్యార్థమును చర్చించి నిర్ణ యించవలసి యున్నదో - దానిని అనగాహన మొనరించుకొనవలె. అదియే విషయము. మూడవది సంశయము. ఒక విషయమును చర్చించి నిర్ణ యింపవలెనన్న, ఆ విషయమున సంశయ మున్నదని కదా తాత్పర్యము! సంశయము కలుగుటకు అనేక కారణము లుండవచ్చును. అందువలన, ప్రకృతములో సంశయమే కారణము వలన కలుగుచున్నదో కూడ నిరూపించ వలసి యుండును. జిజ్ఞాస లేక అధికరణ మేర్పడనట్లు, సంశయము లేక,

చర్చించి నిర్ణయించు ప్రసక్తియే యుండదుగదా! అందువలన, సంశయము కూడ అధికరణార్థమును అవగాహన మొనరించుకొనుట ఆవశ్యకమై యుండును. నాల్గవది పూర్వ పక్షము. సంశయములో - ఔనా? కాదా? అను రెండు భాగములు కదా ఉండును! ఈ రెండు భాగములందను ఖండించబడు భాగమును పూర్వ పక్ష మందురు. ఈ ఖండనార్హ భాగమును కూడ యుక్తితో చక్కగా నిరూపించవలసి యుండును. అంతేకాదు. ఈ పూర్వపక్షము ఏ దర్శన కారుల సిద్ధాంతచ్ఛాయ ననుసరించునో, అట్టి దర్శన కారుల శాస్త్రార్థమును చక్కగా అవగత మొనరించు కొనవలసి యుండును. సూత్రకారులు వారి పేర్లను కూడ అచ్చటచ్చట పేర్కొనుచుందురు. ఇది పూర్వపక్ష ప్రతిపాదన పద్ధతి. ఇక ఉత్తర మనునది - ఐదవ అంశము. పూర్వ పక్షమున పేర్కొనబడిన యుక్తులను - ప్రమాణములను ఖండించుచు, బలహీన పరచుచు, సరియైన యుక్తులతో ప్రమాణములతో సాగు కథనే ఉత్తర మందురు. దీనితో - సంశయములోని ఒక భాగము ఖండించబడును. ఇక - ఖండించబడక మిగిలియున్న భాగమును దృఢపరచి, ప్రకృతమైన ప్రధాన శాస్త్రార్థముగా వానిని సమన్వయ పరచి, నిర్ణయము చేయుటయే. చివరిదిగా పేర్కొన దగిన ఆరవ అంశము సిద్ధాంతము. ఈ విధముగా ఆరు అంశములతో అలరారుచున్నదే అధికరణము. ప్రతి అధికరణమునందును ఇన్ని విషయములను విమర్శించి నిరూపించుట ఈ చిన్న వ్యాసమున కుదురదు. ఐనచో - మొత్తము విడిచినచో - శాస్త్ర గౌరవ మర్యాదలకు అపచారము చేసిన ట్లగును. కనుక, ఈ మొదటి అధికరణమందే ని ఆరు విషయములను సంగ్రహముగా అనుసంధించుకొందము గావుత!

—★—

# తృతీయాధ్యాయము – ప్రథమ పాదము

## 1. తదంతర ప్రతిపత్త్యధికరణము

అధికరణారంభ సూత్రము లోని మొదటి పదమును బట్టియే సాధారణముగా అధికరణమునకు పేరు ఏర్పడుచుండును. ఈ అధికరణములో మొత్తము ఏడు సూత్రము లున్నవి.

"తదంతర ప్రతిపత్తౌ రంహతి సంపరిష్వక్తః ప్రశ్న ప్రతివచనాభ్యామ్" అనునది మొదటి సూత్రము. ఈ సూత్రము యొక్క మొదటి పదము 'తదంతర ప్రతిపత్తి' అనునది. అందువలన, ఈ అధికరణమునకు 'త దంతర ప్రతిప త్త్యధికరణ' మని పేరు. ఈ అధికరణమున వేద వాక్యార్థ విచారమే చేయబడుచున్నందున, ఇది మీమాంసా శాస్త్ర ముననే ఉండవలసి యున్నది. మీమాంసా శాస్త్రమందే వేదార్థ విచారము చేయునదియే కదా ! ఇట్లు ఈ అధికరణమునకు శాస్త్ర ముతో సంబంధము నిరూపింపబడినందున, 'శాస్త్ర సంగతిని' చూపించిన ట్లగును.

ఈ మీమాంసా శాస్త్రము కూడ – పూర్వ కాండము, ఉత్తర కాండము అని రెండుగా విభక్తమై యున్నది కదా ! పూర్వ కాండము కర్మ ప్రతిపాదకములగు వేదవాక్యముల అర్థమును విచారించగా, ఉత్తర కాండము ఉపనిష ద్వాక్యార్థము చేయును. పంచాగ్ని విద్య ఉపనిషత్తులకు సంబంధించినది. అందువలన, పంచాగ్ని విద్యా వాక్యార్థ విచారము చేయు ఈ అధికరణము ఉత్తర కాండమున ఉండవలసి వచ్చినది, ఇట్లు చెప్పుటవలన. ఈ అధికరణమునకు 'కాండ సంగతి' చెప్పిన ట్లగును. ఈ ఉత్తర కాండము కూడ రెండు 'ద్వికములు'గా కదా విభజించబడినది. పూర్వ ద్వికము ఉపాసనా విషయ మగు బ్రహ్మను చర్చించినందున – 'విషయ ద్వికము', రెండవది – 'విషయి ద్వికము' వీనిలో సే

ఉపాసనా ఫలములు చర్చించబడును గదా ! ఈ అధికరణములోని వాక్యార్థ విచారము 'పంచాగ్ని విద్య' యను ఒకా నొక ఉపాసనకు సంబంధించినది. కనుక, ఈ అధికరణము రెండవ ద్వికమున చేరినది. ఇట్లు నిరూపించినందున - 'ద్విక సంగతి'ని చూపించిన ట్లగుచున్నది,

ఒక్కొక్క ద్వికమున రెం డధ్యాయములు గదా ఉండును!

అట్లే ఈ రెండవ ద్వికమున కూడ రెం డధ్యాయము లున్నవి. వీనిలో - మొదటి అధ్యాయమున, ఉపాసనా ప్రతిపాదక వాక్యముల అర్థమే వివరింపబడుచున్నది. అందువలన, ఈ అధికరణము రెండవ ద్వికము లోని మొదటి అధ్యాయముననే ఉండవలసి యున్నది దీనితో - ఈ అధికరణమునకు 'అధ్యాయ సంగతి' చెప్పబడిన ట్లైనది. ప్రతి అధ్యాయము కూడ, నాలుగు పాదములలో నిబద్ధమై యున్నది కదా! మరి - ఈ అధ్యాయము కూడ నాలుగు పాదములు కలిగి యున్నది. వీనిలో - మొదటి పాదమును 'వైరాగ్య పాద' మనుచున్నాము. వైరాగ్య ప్రతిపాదక వాక్యముల అర్థము ఈ పాదములోని అధికరణములలో విచారించవలసి యుండును. పంచాగ్ని విద్య వైరాగ్య ప్రతిపాదక మని భావించితిమి కదా ! అందువలన, ఈ పంచాగ్ని విద్యా వాక్యార్థమును విచారించు ప్రకృతాధికరణము ఈ అధ్యాయము లోని మొదటి పాదమున స్థానము సంపాదించుకొనినది. దీని వలన మనకు - 'పాద సంగతి' యను నదియు ఈ అధికరణమునకు కల దని తెలియవచ్చును.

ఇక పీటికా సంగతి. పేటిక యనగా - పెట్టె. ఈ శాస్త్రమును ఉపదేశించవలసిన తత్త్వహిత పురుషార్థములు మూడింటి యందును పూర్వ ద్విక మని చెప్పికొనిన మొదటి రెం డధ్యాయములు తత్త్వ మును భద్రపరచిన పేటిక యని తలంచితిమి. రెండవ ద్వికము మరి

యొక్క పేటిక. ఈ రెండవ పేటికయందే కదా హిత పురుషార్థములు కూడ చోటు చేసికొనును! వీనిలో - 'పంచాగ్ని విద్య' ఇష్ట సాధన మగు హిత స్వరూప మైనందున, ఈ రెండవ పేటికయందే ఆ విద్యను చర్చించు అధికరణమునకు స్థానము లభింపవలసి యున్నది. ఇట్లు ఈ అధికరణమునకు 'పేటికా సంగతియు' ఉపపన్న మని తెలియ నగును. ఇక చివరిది - అధికరణ సంగతి. ఈ అధికరణము కంటె పూర్వాధికరణము సంజ్ఞామూర్తిక్ల్‌ప్త్యధికరణము. దీనిలో - జీవుని నామ రూప వ్యాకరణము అనగా - సృష్టి చేయువాడు పరమాత్మయే యని నిర్ణయింపబడినది.

దానిలో జీవునకు దేవ మనుష్య పశ్వాది నామములు గల శరీరములతో సంబంధ ముండు నని తెలియవచ్చును. ఈ పేర్లు గల శరీరములు స్థూలములు, కంటికి కనిపించునవి. ఇట్లు పేర్లు మారనివి, సూక్ష్మములు. కంటికి కనిపించనివి అగు శరీరములు కూడ జీవునకు ఏర్పడుచుండు నను విషయము స్మరణమునకు రావచ్చును. అందువలన, జీవునకు సూక్ష్మ సంబంధమును తెలుపు ఈ అధికరణము పూర్వాధికరణ మగు సంజ్ఞామూర్తిక్ల్‌ప్త్యధికరణమునకు తరువాత నిరూపింపవలసివచ్చినది. ఇట్లు తెలిసికొనినచో - 'అధికరణ సంగతి' అనునది కూడ అవగత మగును.

ఇట్లు పైన పేర్కొనబడిన సంగతు లన్నియు - ఈ అధికరణ మిచ్చటనే ఉండుటకు గల ఉపపత్తులను ప్రకాశింపజేయుచున్నది. ఈ సంగతులు కాక, పౌర్వాపర్యము కల విషయములకు చెప్పికొను ప్రసంగాదులు ఆరు విధముల ప్రసంగము లుండును. ప్రకృతాధికరణము పూర్వాధికరణమునకు తరువాత నిరూపించుటకు - 'నిర్వాహకైక్యము' సంగతి యనవచ్చును - అని మాత్రము గమనింతము. పూర్వాధికర

ములో వివరింపబడు సూక్ష్మ శరీర సంబంధము కాని, ఈ అధికర
ములో వివరింపబడు సూక్ష్మ శరీర సంబంధము కాని జీవునకు పర
త్మ వల్లనే ఏర్పడును కదా! అందువలన 'నిర్వాహ కైక్య'
'సంగతి' యని తెలిసికొనవచ్చును. ఇట్లు అధికరణమున గల
విషయములలో - 'సంగతి' యనునది సంగ్రహముగా నిచట
ింపబడినది.

సంగతికి తరువాత అధికరణమున గమనింపవలసిన అంగము
యము.' దేనిని చర్చించి నిర్ణయించుట జరుగునో - దానిని ఆ
రణము యొక్క విషయమును నిర్ణయించుటలో కొంత ఉపయుక్త
ను. అంతకంటెను, బోధాయనాది ప్రాచీన పరమర్షుల సంప్ర
యము ననుసరించియే విషయ నిర్ణయ మొనరించుట సమంజస మని
ష్యకారులవారి అభిప్రాయము. ప్రకృతాధికరణ విషయము
వాగ్ని విద్య' యని మనము తెలిసికొనవలెను, వృత్తి కారు
బోధాయనులు, భాష్యకారు లగు ద్రవిడాచార్యులు, వాక్య
లగు బ్రహ్మనంది మొదలగు ప్రాచీనులు ప్రదర్శించిన మార్గ
నిష్కంటక మొనరించుటయే శ్రీ భాష్యకారుల అభిమతము.
, వీరు చూపిన విషయమే ఆ యా అధికరణములలో నిర్ణ
పబడు విషయ మని తెలిసికొనవచ్చును. ఇపుడు లభించు బ్రహ్మ
త భాష్యములలో ప్రాచీనమైనది శ్రీ శంకరుల వారి సూత్ర
ష్యము. అధికరణముల విషయమును నిర్ణయించుటలో - వారి
త భాష్యమునకును ప్రకృత మగు శ్రీభాష్యమునకును మతభేద
ముగ కానరాదు. కనుక, ప్రకృతాధికరణమున చర్చించి,
యింపబడునది పంచాగ్ని విద్యా ప్రతిపాదక వాక్యముల అర్థ విశే
యని మనము భావింపవచ్చును,

అధికరణమునకు సంబంధించినది, తెలిసికొనదగినది అగు మూడవ అంగము 'సంశయము.' సంశయ మనగా - ఒక వస్తువు నందు పరస్పర విరుద్ధము లగు రెండు సమాన ధర్మములు భాసించి నందున, విశేషమును తెలిసికొనగోరు వ్యక్తికి కలుగు జ్ఞాన విశేషము. ప్రస్తుతాంశ మగు పంచాగ్ని విద్యా విచారమునకు ప్రయోజన మగు సంశయ స్వరూపమును గ్రహింతము. పై లోకములలో జీవుడు తన పుణ్య కర్మ ఫల మగు సుఖము ననుభవించును గదా ! అపుడు, ఆ యనుభవమునకు అనుగుణమైన స్థూల శరీరము కలిగి యుండును. అట్లే ఆ పుణ్య విశేషము క్షీణించిన పిమ్మట తిరిగి ఈ లోకమునకు వచ్చును. వచ్చిన తరువాత ఈ లోకమున అనుభవించ వలసిన సుఖ దుఃఖములకు తగిన శరీరమును ధరించును. ఈ విషయ ములు పంచాగ్ని విద్య యందు ఉపదేశింపబడినవి. పై లోకము లలో ఏర్పడిన శరీరము కాని, ఈ లోకమున నేర్పడు శరీరములు కాని స్థూలము లగు భూతముల చేత ఏర్పడినవి. భూతము లనగా — పృథివి, జలము తేజస్సు, వాయువు, ఆకాశము అనెడు ఐదు ద్రవ్య ములు. వీనిచేతనే ఈ శరీరము లన్నియు ఏర్పడుచున్నవి. అయినచో - కంటికి కానవచ్చు శరీరము లైనచో - స్థూల శరీరము లని యందురు. కంటికి కానరానివి యైనచో - సూక్ష్మ శరీరము లని వాకొందురు. ఇవి సూక్ష్మభూతములచేత ఏర్పడునవి. ఈ సూక్ష్మ శరీరములు జీవు లకు ఎట్టి అనుభూతులను కలిగించవు. కనుక, వీనిని శాస్త్రకారులు 'శరీరములు' అని కాక, భూత సూక్ష్మములు' అని వ్యవహరింతురు.

ఇపుడు పంచాగ్ని విద్యను ప్రతిపాదించు అంశము - జీవుడు పుణ్య క్షయమునకు పిమ్మట, పై లోకముల నుండి ఈ లోకములకు చేరును అని గదా ! పై లోకములలోని స్థూల శరీరము పై లోకముల

లోనే అంత మొందును. ఈ లోకములలోని శరీరము ఈ లోకము లోనే మాతృ గర్భమున జేరును. ఈ శరీర మేర్పడునపుడే ఈ జీవు నకు 'పురుష' అను పేరు ఏర్పడును. 'పురుష' అనగా – 'శరీరము గల జీవుడు' అని యర్థము. ఇక యిపుడు మనకు గలుగు సంశయ మే మనగా – పై లోకముల శరీరము పై లోకములలోనే అంత మొందిన తరువాత. ఈ లోకమున ఇంకను మాతృ గర్భము చేరని దశలో, ఈ జీవుడు వరుసగా – ద్యులోకము, పర్జన్య లోకము, పృథివీ లోకము, స్త్రీ లోకము మున్నగు ఐదు లోకములయందును సంచరించును గదా! అపుడు శరీరము కలిగి యుండునా? లేదా?

ఏదేని అనుభవమును కలిగించునదియే శరీరము. ఈ ఐదు లోక ములలో సంచరించునపుడు ఎట్టి అనుభూతియు ఉండదు. అందువలన, శరీరము లేదు' అనుకొనరాదు. శరీరము లేని దశ యని తలంచినచో, ప్రకృతి సంబంధము లేని దశ యని కదా అర్థము. ప్రకృతి సంబంధము లేని జీవుడు ఈ లోకములలో కర్మవశ్యుడై సంచరించుటయే కుదురదు. ఈ లోకమున దేనినో అనుభవించుటకు వచ్చు జీవుడు – కర్మవశ్యుడు కాకుండునా? కర్మ కలవాడైనచో, ప్రకృతి బద్ధుడే యగును. కాని, ప్రకృతి నుండి ముక్తుడు కాడు గదా! అందువలన, పై లోకముల నుండి ఈ లోకములకు వచ్చు జీవుడు – ప్రకృతి సంబంధము కలవా డనియే అంగీకరింపవలెను. అయినచో – సుఖ దుఃఖాదుల ననుభ వింపజేయు స్థూల శరీరము మాత్రము లేదు. ప్రళయ కాలములో నున్నట్లు ప్రకృతి సంబంధ మున్నది.

స్థూల శరీరము లేదు. ఇక ఉన్న దేమి! సూక్ష్మ శరీరము. దానిని శరీర మనుట కేవల గౌణము. శరీరమువంటి దేదియో జీవుని

న ప్రకృతి యున్నదని తాత్పర్యము. అందువలననే వీనిని
్ౕమము లని వ్యవహరింతు రనుకొని యుంటిమి కదా !

ను ఈ పంచాగ్ని విద్యా విచారమునకు పూర్వ మున్న
మనగా - ఒక లోకమునుండి మరియొక లోకమునకు వెళ్ళి
ను భూత సూక్ష్మములతో సంబద్ధుడై వెళ్ళునా ? భూత
లతో బద్ధుడై కాకనే వెళ్ళునా ? అని. ఐనచో - భూత
బంధము లేనిచో ముక్తియే యని కదా ఇంతకు మున్ను
వించితిమి ! ఇక సంశయ మేల కలుగవలె ? అని శంకింప
మనగా - ఇట్లు భావించినవారము మనము. మన మనగా -
ర్శనానుయాయులము. మరి - ఇతర దర్శనకారులు కూడ
వారిలో జీవున కే చలనమే లే దందురు. నైయాయికులు,
ను, జీవుడు సంచరింపగల్గినను, భూత సూక్ష్మములు -
పరిణామ రూపములు, వ్యాపకములు కనుక, జీవుని అంటి
అవియును తిరుగనక్కరలే దందురు సాంఖ్యులు. జీవులే
రి యొక శరీరములోనికి దూకుదు రందురు జైనులు. ఆ
ములతో క్రొత్త క్రొత్త భూత సూక్ష్మములే ఏర్పడు
దురు బౌద్ధులు. ఇట్టి విరుద్ధ భావ ప్రతిపాదక వాక్యము
వుడు, జీవుడు భూత సూక్ష్మ సంబంధము కలిగియున్నాడా ?
అని, పూర్వము చూపెట్టినట్టి సంశయ మేర్పడుటకు అవకాశ
ఈ సంశయమును తొలగించుటకు పంచాగ్ని విద్యా విచార
రూప అర్థమును వివరించు ఈ అధికరణము ఆవశ్యకము. ఇట్లు
కము' కూడ 'అధికరణ స్థితిని' సమర్థించును.

క పూర్వపక్ష మనునది - అధికరణమునకు సంబంధించిన
ంగము. ఇది ఏదేని ఇతర దర్శనకారుల మతమునకు సంబం

థించినదిగా గాని, శ్రోతకు వస్తు స్థితిని బట్టి ఏర్పడు ఆభాస రూపమున అభిప్రాయ రూపమున గాని ఉండవచ్చును. దీనిని సయుక్తికముగా ఖండించునది తరువాతిది ఉత్తర పక్ష మనబడును కనుక, దీనికి పూర్వ పక్ష మని పేరు ఏర్పడినది. సాధారణముగా అధికరణము పూర్వపక్షమును ప్రతిపాదించు, సూత్రముతో ప్రారంభ మగును. కాని, ఎచ్చట సిద్ధాంత ప్రతిపాదక సూత్రములతో పూర్వ పక్షమూహించు కొను నవకాశ ముండునో, అచ్చట బాదరాయణ భగవానుడు పూర్వపక్షమును సూత్రీకరింపడు. ప్రకృతాధికరణమున పూర్వపక్షముతో కలిసి, ఉత్తర పక్షమును చెప్పు సూత్రములు మూడు, కేవల ఉత్తరమునే చెప్పు సూత్రములు నాలుగు ఉన్నవి. వీని యందును - సిద్ధాంతమును ప్రతిపాదించుటకు అనువైన ఉత్తర పక్షముతో మొదటి సూత్ర మారంభింపబడినది. ఇందులో - ఒక లోకము నుండి మరియొక లోకమునకు వెళ్ళు జీవుడు - సూక్ష్మ శరీర సంబద్ధుడు గనే వెళ్ళు నను అంశము ప్రతిపాదింపబడుచున్నది.

దీనినిబట్టి, మన మూహించుకొనవలసిన పూర్వపక్షము యొక్క ఆకారమును నిర్ణయించుకొనవలెను. ఇపుడు పూర్వపక్ష మిట్లుండును :- జీవుడు ఒక లోకమునుండి మరి యొక లోకమునకు వెళ్ళునపుడు - భూత సూక్ష్మముల సంబంధము లేకనే వెళ్ళును. ఏమనగా, స్థూల శరీరములుగా కదా భూత సూక్ష్మములు అవసరమై యుండుట ! అయినచో - భూత సూక్ష్మములు ఏ లోకమునకు వెళ్ళిన ఆ లోకముననే లభింపగలదుగదా! అట్టిచో - వీనితో బంధింపబడి వెళ్ళవలసిన అవసరమే లేదు. మరొక్క మాట ! పంచాగ్ని విద్యలో ఎచ్చటను జీవుడు భూత సూక్ష్మములు కలవాడుగనే వెళ్ళుచుండు నని చెప్పబడలేదుగదా ! పంచాగ్నివిద్యకు సంబంధించినంతవరకు జీవుడు, భూత సూక్ష్మములు అని ఎచ్చటను లేదు. పై లోకముల నుండి శ్రద్ధ - సోమరాజుగా, సోమరాజు వర్షముగా, వర్షము అన్న

ముగా, ఆ అన్నము రేతస్సుగా, రేతస్సు గర్భముగా పరిణమించు ననియే చెప్పబడి యున్నది. ఇది యేనయా ఐదవ ఆహుతిలో నీరు 'పురుష' శబ్దముచేత వ్యవహారింపబడుట యనగా అని పంచాలరాజ చెప్పినాడు. ఇది తెలియునా ? అనియే మొదట అత డడిగెను.

కావున, పంచాగ్ని విద్య లోని ప్రశ్న వలన గాని, ప్రతివచనమువలనగాని జీవునకు భూత సూక్ష్మముల సంబంధమే ప్రసక్తము కాదు. ఇక ఈ శ్రద్ధా, సోమరాజు మొదలగు పదములు - ఆ యా పేర్లు గల శరీరముతో కూడుకొనిన జీవులనే చెప్పుచున్నవి అని తలంచుటకును వీలులేదు. ఏ మనగా - "తం దేవాః భక్షయంతి" ఆ సోమరాజును 'దేవతలు తినుచుందురు' అని ఉపనిషత్తు చెప్పుచున్నది. 'జీవులను తినుట' అనునది ఉండదు గదా ! ఇట్లు భూతసూక్ష్మములు అంతటను లభించునవియే కనుకను, పంచాగ్నివిద్యాప్రశ్న ప్రతి వచనములలో నెచటను చెప్పబడనందునను, అందును చెప్పబడనందునను, అందు చెప్పబడిన సోమరాజాది శబ్దములకు ఆ యా శరీరములు గల జీవు లను అర్థము కుదురదు కనుకను - ఒక లోకము నుండి మరియొక లోకమునకు వెళ్ళు జీవులు భూత సూక్ష్మములతో కలిసి వెళ్ళుదు రనుటలో ప్రమాణము లేదు. అందువలన, 'భూత సూక్ష్మములతో కలిసి జీవు లుందురు' అను మాట కుదురదు కనుకను - ఒక లోకము నుండి మరి యొక లోకమునకు వెళ్ళు జీవులు 'భూత సూక్ష్మములతో కలసి జీవు లుందురు' అను మాట కుదరదు. సూక్ష్మ శరీర మనునది జీవులకు లేదు. ఇదియే సంగ్రహముగా పూర్వ పక్షము యొక్క సారము. ఇక ఈ పూర్వపక్షమును ఖండించు 'ఉత్తరమును'ను పరిశీలింతము. పంచాగ్ని విద్యా ప్రశ్న - ప్రతివచనములను బట్టి, జీవుడు భూత సూక్ష్మములతో సంబంధము కలవాడుగనే సంచరించు నని తెలియుచున్నది. భూత సూక్ష్మములు మరి యొక చోట లభింపవేమో నని జీవుడు తన వెంట తీసుకొని వెళ్ళు

నని ఎవరును అనలేదే ! ఇక సూక్ష్మశరీరము లేక జీవుడు ఈ ప్రకృతి మండలములో నుండలేడనియే అనుచున్నారు. ఇదియును ఈ పంచాగ్ని విద్య - చెప్పుచునే ఉన్నది. ఇందులో - "ఆపః" నీరు పురుషశబ్దముతో వ్యవహరింపబడుట యనగా నేమి ? నీరు 'శరీరముగా గల జీవుడు' అనగా - సూక్ష్మ శరీరము గల జీవుడు - స్థూల శరీరము గలవాడుగా వ్యవహరించుటకు యోగ్యుడగు ననియే తాత్పర్యము.

ఐదవ ఆహుతిలో గదా నీరు చెప్పబడినది ! మొదటి ఆహుతిలో వేరుగా నున్నది. అచట శ్రద్ధయొక్క ఆహుతి చెప్పబడినది కదా ! అని శంక కలుగవచ్చును. కాని, అడిగిన ప్రశ్న యెద్దియో తెలియునా ? ఐదవ ఆహుతిలో 'నీరు' పురుష వ్యవహారము చెందుట తెలియునా ? అనియే కదా ప్రశ్న ! ప్రతివచనము కూడ అట్లే యున్నది. కనుక, అడిగినది నీటిని గురించియు చెప్పినది శ్రద్ధాదుల గురించియు అనుకొనినచో, ప్రశ్న - ప్రతివచనములు కుదురవు. ప్రశ్న ప్రతివచనము కుదరవలె నన్న, నీరు శరీరముగా గల జీవుడే శ్రద్ధా సోమరాజాది శరీరములు గలవాడుగా పేర్కొనబడె నని అంగీకరించవలెను. ఐనచో - "తం దేవాః భక్షయంతి" ఆ సోమరాజును దేవతలు తిందురు అని కదా ఉపనిషత్తు చెప్పుచున్నది ! జీవుని దేవతలు తిందురా ? అను శంక అనుచితము. 'భక్షింతురు' అనగా - అనుభవింతు రనియే అర్థము. 'దెబ్బలు తిందురు' అనగా - మ్రింగుదు రని యర్థమా ?

సోమశరీరము గల జీవుని దేవతలు తమ భోగమునకు సాధనముగా జేసికొందురు. దేవతలు తినరు. త్రాగరు. "న హ వై దేవా అశ్నంతి, న పిబంతి" అని వేదము చెప్పటలేదా ? కనుక, శ్రద్ధాది

శబ్దములు ఆ యా శ్శరములు గల జీవులను అర్థమునే చెప్పుచున్నదన వలయును. పితృ యాణము నుపదేశించు సందర్భమున, స్పష్టముగా జీ వులు చెప్పబడియున్నారు. యాగ దానాదులు ఫలాసక్తితో చేసినవారు చంద్రలోకము వరకు వెళ్ళగల రనియు. అచట సోమరాజు లగుదు రనియు, మరల తిరిగి వచ్చి, కర్మానుగుణ మగు శ్శరమును చెందుదు రనియు గదా స్పష్టముగ చెప్పబడియున్నది ! అయినచో - "ఆపః" అని, ఒక నీరు మాత్రమే కదా శరీరముగా నున్నట్లు చెప్పబడినది ! ఐదు భూత సూక్ష్మముల ప్రసక్తి లేదే యని తలంపరాదు, ఈ బ్రహ్మాండములో - కేవల జలము, కేవల పృథివి అనునవి లేనే లేవు. సృష్టి సందర్భమున, పంచీకరణమునకు ఉప లక్షణముగా త్రివృత్కరణము ఉపదేశించబడినది. తాత్పర్య మే మనగా - ప్రతి భూతము కూడ తాను సగభాగమే ఉండుచు, మిగిలిన సగ భాగమును మిగిలిన నాలుగు భూతముల నాలుగు సమా నాంశములతో కలిసియే యుండును. అందువలన, 'నీరు' అనినను, పంచ భూత సూక్ష్మము లను అర్థ మేర్పడును గదా ! అయినచో - 'నీరు' అనియే ఏల నవలె ? పృథివి యనియో, తేజ స్సనియో ఏల నన లేదు ? అనగా - 'ద్రవ్య మగు నీటి భాగ మపుడు హెచ్చుగా నున్నందున' అని సూత్రకారులు చెప్పియున్నారు. అందువలన, భూత సూక్ష్మములు కలవారుగనే జీవులు సంచరింతు రని పంచాగ్నివిద్య ప్రతిపాదించుచున్నట్లు అంగీకరింపవలె నని ఉత్తరము.

ఇంతే కాదు. పంచాగ్ని విద్యా ప్రకరణములో జీవులు సూక్ష్మ శ్శరము గలవారుగనే సంచరింతు రను అర్థమునే చెప్పికొనుటకు ఇత రము లగు నుపనిషద్వాక్యములు గూడ ఉపోద్బలకములు కావచ్చు నందురు సూత్రకారులు బృహదారణ్యకోపనిషత్తులో

"త ముత్క్రామంతం ప్రాణా నూత్క్రామతి, ప్రాణ మనూత్క్రామంతం సర్వే ప్రాణా అనూత్క్రామంతి."

అను వాక్యము జీవునితోపాటు ప్రాణము, ప్రాణముతో గూడ ఇంద్రియములు ఉత్క్రమించు నని చెప్పుచున్నది. భగవద్గీత కూడ, జీవుడు శరీరము లోనికి వచ్చునపుడు గాని, శరీరమును విడిచి వెళ్ళు నప్పుడు గాని మనస్సుతో సహా ఆరు ఇంద్రియములను వెంట దీసుకొని వెళ్ళు నని చెప్పుచున్నది .-

" మన షష్ఠా నీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి
శరీరం య దవాప్నోతి యచ్చా ప్యుత్క్రామతీశ్వరః
గృహీ త్వైతాని సంయాతి వాయు ర్గంధాని వాశయాత్."

- ( భగవద్గీత : 15.7.8 )

ఇంద్రియములను తీసికొని వెళ్ళుటకు - వానికి ఆశ్రయముగా భూత సూక్ష్మము లుండవలె కదా ! అందువలన, జీవుడు భూత సూక్ష్మ సంబంధము కలవాడుగనే సంచరించు ననుట వేదాంత దర్శన సిద్ధాంతము. అయినచో - ఈ బృహదారణ్యకోపనిషత్తునందే మృతుని వా గింద్రియము అగ్నిని, ప్రాణము వాయువును, చక్షురింద్రియము సూర్యుని చేరి, లయ మందు నని యున్నది ! జీవుడు తన వెంట తీసుకొని వెళ్ళుట ఎట్లు పొసగును ? అను శంక కలుగ వచ్చును. కాని ఇచట యథాశ్రుతముగా గ్రహింపకూడదు. ఆ రీతిగా పోయినచో - లోమములు ఓషధులను, కేశములు వనస్పతు లను చేరి, లయ మందును - అనునది అనుపపన్నము గదా ! అందు వలన, వాగాది ఇంద్రియములకు అధిష్ఠాన దేవతలుగా నున్న అగ్ని మొదలగు దేవతలు - ఆ ఇంద్రియములను విడచివెళ్ళుదు రని యర్థము చెప్పవలెను. అధిష్ఠాన దేవతలు లేని ఇంద్రియములు కలిగి యున్నది శరీరము కనుక, అపు డెట్టి జ్ఞానము ఉండదు, ఇట్లు ఉత్తరము చేత పూర్వ పక్షము నిరస్తమైనది.

ఇక 'సిద్ధాంతము.' ఉత్తరమునే సిద్ధాంతముగా చెప్పి, ఈ ఆరవ అంశమును 'నిర్ణయము'గను కొందరు వ్యవహరింతురు, పైన జరిపిన విచారము నంతయు ప్రకృతమున కుపయోగించుకొనుచు, దృఢ పరచిన పరినిష్పన్నార్థమునే 'నిర్ణయ' మందురు. ఈ అధికరణము చేయు నిర్ణయము 'జీవులకు సూక్ష్మ శరీరము కలదు' అని జీవులకు సూక్ష్మ శరీరము కల దను అంశమే ఈ అధికరణము యొక్క సిద్ధాంతముపై విచారముతో సూక్ష్మ శరీర మున్నదను కొనినపుడు - అదియు ప్రాకృతికమే కనుక, వదిలించుకొనవలె నను బుద్ధి యేర్పడును. అదియే ఈ స్థూల శరీరమునందును దుఃఖ మూల మైనందున, హేయత్వ బుద్ధి ఏర్పడును. ఇట్లు వీనియందు వైరాగ్య మేర్పడిన యెడల, ఉపాసనారంభమున కవకాశము కల్గును

సూక్ష్మ శరీరము లే దనుకొనినవాడు స్థూల శరీరముపోయిన నా డిక ప్రవృత్తి బంధము లేదు కనుక, ముక్తి యని భ్రమ ఏర్పడి, ఈ శరీరము మన ప్రయత్న మక్కర లేకయే పోవును కనుక, వైరాగ్యము కాని, ఉపాసనారంభము కాని ఉపపన్నమే కాదు. ఉపాసనయే అవసరము లేనపుడు - చేయవలసిన పరబ్రహ్మను గురించి తెలుసుకొనవలసిన యవసరమే లేదు. కనుక, బ్రహ్మవిచారరూప మగు వేదాంత శాస్త్రము నిష్ఫలము - ఆరంభింపవలసిన యవసరము లేదు' అని మూలచ్ఛేద మేర్పడును. ఈ యధికరణము నుండి, పైన చెప్పిన విధముగా నిర్ణయ మేర్పడిన, వైరాగ్యపూర్వకముగా ఉపాసన ఆరంభించుటకు అవకాశ మున్నందున, ఉపాసించవలసిన పరతత్త్వమును గురించి బాగుగా తెలిసికొనవచ్చును. అపుడు బ్రహ్మవిచారరూప మగు ఈ వేదాంత శాస్త్రము ఫలవంత మగును. ఆరంభింపవలసి యుండును. ఇదియే అధికరణము యొక్క సిద్ధాంతము - లేక, నిర్ణయము.

ఇట్లు ఈ అధికరణము లోని ఆరు అంగములును ఇచట సంగ్రహముగా వివరింపబడినవి. కొందరు ఈ అధికరణమునకు విషయ వాక్యముగా పితృ యాణమునకు సంబంధించిన ప్రశ్న - ప్రతివచనములను మాత్రమే స్వీకరింతురు. ఐనచో - పితృయాణ వివరణమునకు మాత్రమే ఉదాహరణ విషయముగా స్వీకరింపవలసియుండ, మొత్తము అధికరణమునకు విషయ వాక్యముగా పితృయాణ వాక్యమును మాత్రమే కాక, పంచాగ్నివిద్యా వాక్యమును శ్రీభాష్యకారులు విషయ వాక్యముగా స్వీకరించి రని తెలియవలెను. ఇట్లే అధికరణార్థ సార సంగ్రహము ముగియుచున్నది.

## 2. కృతాత్యయాధికరణము

మొదటి అధికరణములో - పుణ్య కర్మ లొనరించిన జీవుడు పై లోకములకు వెళ్ళునపుడు, భూత సూక్ష్మములు గలవాడుగనే వెళ్ళు నని తెలిసికొంటిమి. అట్లు ద్యు లోకము వరకు వెళ్ళిన జీవుడు - అచ్చట భోగముల ననుభవించుటకు యోగ్యమగు స్థూల శరీరమును సంపాదించుకొనును. వానిని - 'సోమరాజు' అని వ్యవహరింతురు. ఆ శరీరమునకు కూడ ఇచటినుండి వెన్నంటి వచ్చిన భూత సూక్ష్మములే కారణములు. ఆ స్థూల శరీరమును చెంది, అత డనుభవించునది కూడ నిత్యమైనది కాదు. అత డచటను స్వతంత్రుడు కాడు. అతనిని దేవతలు అనుభవింతురు. తరువాత, వర్ష - అన్న - రేతస్ రూపములలో వానికి ఎట్టి భోగములును ఉండవు. తరువాతిది యగు గర్భ రూపము ఏర్పడినపుడు, స్థూల శరీరము కలిగినందున, మాతృకుక్షి యందును, పిదప - జనన సమయమునందును కలుగు బాధలు తెలిసికొనినందున, జీవునకు వైరాగ్యము వృద్ధి యగుటకు

అవకాశ ముండు నని ప్రథమాధికరణమునకు ఈ వైరాగ్య పాదము వీలు కల్పించినది.

ఈ రెండవ అధికరణములో - పై లోకముల నుండి దిగి వచ్చిన జీవుడు - కర్మ శేషమునుబట్టి, మనుష్యుడుగనో, క్రిమి కీట కీటములుగనో జన్మించవచ్చు నని పరిశీలింపబడుచున్నది. దీనిని బట్టి, 'అయ్యో! ఈ లోకమునకు వచ్చుటయు, మరల కర్మ లాచరించి, పై లోకములకు వెళ్ళుటకేనా ?' అని వైరాగ్యము కలుగవచ్చును. లేక, శ్వ - సూకరాది నికృష్ట జన్మ కలుగు అవకాశ మున్నది కదా! అని కూడ వైరాగ్యము కలుగవచ్చును. కనుక, వైరాగ్యరూప మగు ఒకే కార్యము ఈ రెండు అధికరణములకును ప్రతిపాద్య మగు అంశము. అందువలన, ఈ అధికరణమునకు పూర్వాధికరణముతో - లేక, 'కార్య కారిత్వ' మను సంగతిని చెప్పికొనవచ్చుచు.

'అర్చిరాది మార్గ మును దేవయాన మందురు. ఆ మార్గమున వెళ్ళువారు - ముక్తి ధామమును జేరుదురు. వారికి పునరావృత్తి లేదు. ధూమాది మార్గ మును పితృయాణ మందురు. ఈ మార్గ మున వెళ్ళువారు ద్యు లోకమును చేరుదురు' అని పంచాలరాజు గౌతము నకు దేవయాన పితృయాణములను వివరించెను. ఆ సందర్భమున, ఈ పితృయాణమున ద్యులోకము చేరినవారు తమ కర్మఫలభోగ పర్యం తము అచట ఉందు రనియు, ఆ తరువాత దిగివత్తు రనియు చెప్పినాడు.

"యావ త్సంపాత ముషిత్వా, అథ ఏత మేవ అధ్వానం పున ర్నివర్తంతే."

ఇది ఈ అధికరణమునకు విషయ వాక్యము. ఈ 'వాక్యము' యొక్క అర్థమునే చర్చించి, నిర్ణయింపవలసి యున్నది. 'పుణ్య మున్నంత వరకు అచటనే ఉండి, పిదప అదియే మార్గమున తిరిగి వత్తురు' అని ఈ వాక్యము యొక్క సాధారణమైన అర్థము.

ఇక ఇచట సంశయ మేమి? తెలిసికొందము. ఈ లోకముల నుండి జీవుడు పై లోకమునకు వెళ్ళుటకు సాధనముగా పుణ్య మున్నది. ఈ పుణ్యము నంతయు అచట అత డనుభవించెను. ఇక ఈ లోకమునకు తిరిగి వచ్చుటకు సాధకముగా వీనికి ఏమేని కర్మ కలదా? ఉండునా? కర్మ ఏమియు లేనపుడు, ఈ లోకమునకే ఏల తిరిగి వచ్చుట? అచ్చట ఉండుటకు సాధన మగు కర్మ లేనందున' అని సమాధానము కుదురదు కదా! ఐనచో - ఈ లోకములకు వచ్చుటకు కారణ భూతముగా కర్మ ఉన్నది అని తలంతు మన్నను, అది పొసగదు. ఏల నన, "యావ త్సంపాతం" అనగా - 'కర్మ ఉన్నంతో' అని అర్థము. కర్మ ఉన్నంత వరకు ఆ లోకములో అనుభవించుట జరిగినది గదా! ఇక కర్మ ఉండుటకు ప్రసక్తి లేదు. అందువలన ఈ లోకములకు తిరిగి వచ్చు జీవుడు - కర్మ కలవాడు కావచ్చునా? లేదా? అనగా - తిరిగి వచ్చు జీవునకు కర్మశేష మేదేని కొంత ఉండునా? లేదా? అను సంశయ మేర్పడుటకు అవకాశము రాదా?

కర్మశేషము కలిగి ఉండుటకు అవకాశము లేదని పూర్వ పక్షము. "యావ త్సంపాతం" అనగా - కర్మ ఉన్నంత కాల మని యర్థము కా దనును పూర్వపక్షి. మ రే మనగా - 'మొత్తము కర్మ ఫలము ననుభవించి' అని యర్థ మట! ఈ యర్థమే చెప్పికొనవలె ననుటకు - సమాన ప్రకరణ సంబంధ మగు మరి యొక శ్రుతి వాక్యము ఉపోద్బలక మనును.

"ప్రాప్యాంతం కర్మణ స్తస్య యత్కించ దేహ కరోత్యయమ్."

అను వాక్యము - జీవుడు ఈ లోకములో చేసిన ఏ ఏ కర్మ కలదో, దాని అంతమును ఆ లోకమున చెందించుకొనును' అను అర్థమును చెప్పుచున్నది. ఈ వాక్యములోని "యత్కించ" పదము వలన, మొత్త మను అర్థము వచ్చెను. కనుక, ప్రకృత విషయ వాక్యములోని

"యావత్" పదమునకు కూడ ఎంత కలదో, అంత అనగా - మొత్తము అర్థమును చెప్పికొనుటయే న్యాయము. ఇట్లు అంతయూ అనుభవింపబడినందున, కర్మ శేషము ఏ మాత్రము ఉంచుటకు వీలు కనుపించుట లేదు. ఇది పూర్వపక్ష సారాంశము.

ఉత్తరముగా బాదరాయణ భట్టారకులవారు — శ్రుతి స్మృతులను ప్రమాణముగా పేర్కొనుచున్నారు. పై లోకములలో కర్మ ననుభవించి దిగివచ్చు జీవుడు - కర్మ శేషము కలవాడుగనే దిగివచ్చు ననుట శ్రుతి స్మృతి ప్రమాణ సిద్ధము. శ్రుతియు - ఇదియే ఛాందోగ్యములోని వాక్యము. "తద్య ఇహ రమణీయ చరణాః" - ఇత్యాదికము. దీనిని చెప్పబడు అంశము ఇది .- 'దిగివచ్చు జీవులు మంచి ఆచారము కలవారైనచో - మంచి పుట్టుక, మనుష్య జన్మ కలవారగుదురు, దురాచారము కలవారైనచో - చెడ్డ పుట్టుక, శ్వ - సూకరాది జన్మ కలవారగుదురు' అని ఈ వాక్యార్థము. కుదురవలె ననగా - దిగివచ్చు జీవులు — కొంత పుణ్యమో, పాపమో కలవారే అయియుండు రని అంగీకరింపవలెను. పుణ్య పాపములు లేనివారికి - మంచి పుట్టుక కుదురదు, చెడ్డ పుట్టుక కూడ కుదురదు గదా ! అందువలన, దిగివచ్చువారికి కర్మశేష ముండు ననుటలో - ఈ శ్రుతి వాక్యము ప్రమాణము.

ఇట్లే, శ్రుతి వాక్యములును కలవు. గౌతమ సూత్రములలో ఒక చోట -

"వర్ణా ఆశ్రమా శ్చ స్వ కర్మ నిష్ఠాః ప్రేత్య, కర్మఫల మనుభూయ, తతః శేషేణ ... ...."

ఇత్యాది సూత్ర మున్నది. దీని తాత్పర్య మిది :- 'ఆ యా వర్ణ - ఆశ్రమములకు చెందినవారు - వారి వారి కర్మలను పై లోక ములలో అనుభవించి, మిగిలిన కర్మతో మంచి జన్మనో, చె

జన్మనో పొందుదురు' అని. ఇట్లే ఆపస్తంబ గృహ్యసూత్రము కూడా
"తతః పరివృత్తౌ కర్మ ఫల శేషేణ ...... "
ఇత్యాదికము ఇంచు మించుగా పై తాత్పర్యమునే వివరించుచున్నది;
ఇట్లు, శ్రుతి స్మృతి ప్రమాణముల వలన, కర్మ శేషము గలవాడు
గనే తిరిగి వచ్చు నని అంగీకరింపవలెను.

ఇక "యావత్" అను చోట - "య త్కిం చ" అని ఒకచోట
మొత్తము కర్మ అనుభవించినట్లు చెప్పబడుచున్నదిగదా! అని
అనరాదు. అచట "యావత్" అను దానికి - 'మొత్తము' అను
అర్థము కాదు, మొత్త మనగా - ముందు చేయు కర్మయు కావలసి
యుండును కదా! దానిని కూడ అనుభవించుట కుదురవచ్చునా?

అందువలన, మొత్త మనగా - శరీరముతో అనుభవించుటకు
కారణమైన కర్మ ఉన్నంత వరకు అని మాత్రమే అర్థము చెప్పకొన
వలెను. మనుష్య పశ్వాది శరీరముతో అనుభవించవలసిన కర్మను
స్వర్గములో - దేవ శరీరముతో అనుభవించుట అనుపపన్నము కదా!
అందువలన, "య త్కించ" అనునదియు స్వర్గానుభవ సాధన మగు
మొత్తము కర్మను చెప్పనే కాని, భూలోకానుభావ్య కర్మలకు చెప్ప
జాలదు. అందువలన, కర్మ శేషము కలవారుగనే, అనగా - స్వర్గ
ములో అనుభవించినదానికంటె అతిరిక్త మగు కర్మ కలవారుగనే
జీవులు తిరిగివత్తు రని అంగీకరింపవలసి యున్నది. ఇచట-'తిరిగి వచ్చు
నపుడు - పితృ లోకములకు వెళ్ళుట ఉండదు. పైకి వెళ్ళునపుడు
మాత్ర ముండును. ఈ మార్పును సూచించుటను సూత్రకారులు -
"యథేతం అనేకం చ" అని అనుగ్రహించిరి. పైకి వెళ్ళి నట్లుగను,
కొంత మార్పుగను దిగివత్తు రని తాత్పర్యము.

కర్మ కలవారుగనే దిగివత్తు రను విషయమున శ్రుతి వాక్యము
- "రమణీయ చరణాః" ఇత్యాదికమును ప్రమాణముగా పేర్కొ[illegible]

యున్నది. ఈ వాక్యమున - "చరణ, "కపూయ" అను శబ్దము లున్నవి. చరణ మనగా - ఇచట ఆచరణ మని యర్థము. సదాచారము గలవారు మంచిజన్మను, దురాచారము గలవారు చెడ్డజన్మను పొందగల రని తాత్పర్యము. ఇట్లు ఇచట సదాచార దురాచారములే పేర్కొనబడినవి కాని, పుణ్య పాపములు కావు అని పూర్వపక్షి ఒక శంకను వెలువరించును. అదే మనగా - 'ఆచార మనగా కర్మయే కదా ! అనుకొనరాదు. ఆచారమును శీల మనియు, ప్రవర్తన యనియు లోకులు వ్యవహరింతురు. వేదమునందును శిక్షావల్లి వాక్యము - "యాన్యనవద్యాని కర్మాణి" అనునది కర్మలను, 'యాన్యస్మాకగ్ం సుచరితాని" అనునది ప్రవర్తనను చెప్పుచున్నవి గదా ! అందువలన, దిగివచ్చు జీవుడు తన ప్రవర్తనను బట్టి, జన్మనెత్తగల డని ఆ శ్రుతి వాక్యమునకు తాత్పర్యము చెప్పవలె. అపుడు కర్మ కలవాడుగా దిగివచ్చు ననుటలో ప్రమాణము లభించదు. కనుక, పూర్వపక్షమే నెగ్గును' అని.

ఈ శంకను నివారించుటకు వ్యాస భగవానుడు మొదట - ఆచార్య కృష్ణాజిని గారి సమాధానమును సూత్రీకరించిరి. వారేమనినా రనగా - 'కేవల ఆచారము వలన పుణ్య పాపములు కలుగుటకు వీలు లేదు. కనుక, ఇచట 'ఆచారము' అనునది అప్రధానమై పుణ్యపాపకర్మలనే తెలియజేయును' అని. ముఖ్యార్థము అప్రధానమై, మరియొక అర్థమును తెలియజేయట జరిగినపుడు, ఆ యర్థము లక్షణ యనెడి మరియొక వ్యాపారము చేత ఏర్పడుచున్న దని గ్రహింపవలెను. ఐనచో - ఆచారము నిష్ఫల మనుకొనరాదు. పుణ్యకర్మ చేయుటకు ఆచారము యోగ్యతను సంపాదించి యిచ్చును. ఇట్లు కర్మ అనునది - పుణ్యమును సంపాదించునది యనియు, ఆచారము ఆ కర్మాచరణమునకు వలయు యోగ్యతను సమకూర్చు ననియు తెలియవలెను.

ఈ విషయమున ఆచార మనగా - 'పుణ్యా పాపములే' అని చెప్పుచుండెడివా రట ఆచార్య బాదరి. 'చరణ' శబ్దము 'లక్షణ' అను మరి యొక వ్యాపారము నాశ్రయించవలసిన పని లేక, ముఖ్య వ్యాపారము చేతనే పుణ్యపాప రూప మగు అర్థమును చెప్ప నని వీరి సమాధానము. "పుణ్యా మాచరతి" పుణ్యము చేయుచున్నాడు' అను చోట - ఆచారము వేరు, పుణ్యము వేరు కాదు గదా ! అని యందురు. ఐనచో - కర్మ, ఆచారము అని వేరు వేరుగా ప్రయోగము లున్నచోట ఎట్లు నిర్వహింపవలె ననగా - గోబలీ వర్ద న్యాయముచేత, కొంచెముగా అచట అర్థ భేదము చెప్పవచ్చు నందురు ప్రత్యక్ష శ్రుతివాక్యముచేత చెప్పబడునది పుణ్య మనియు, శిష్టుల యొక్క సదాచారము చేత అనుమిత మగు శ్రుతిచేత విధింప బడినదానిని ఆచార మనియు వ్యవహరింతు రనవచ్చును. పాదప్రక్షా లనా ద్యాచారమునకు యాగాది పుణ్యకర్మానుష్ఠాన యోగ్యతా సంపాదన రూప మగు ఫల మున్నది. ఇట్లు కర్మ శేషము కలవారుగనే దిగివత్తు రని ప్రత్యుత్తర మీయబడినది. బాదరిఆచార్యుల సమా ధానమునందే బాదరాయణులవారికి సమ్మతి యున్నందున, వారి సమాధానముతో ఈ అధికరణము ముగించబడినది.

ఇట్లు, కర్మశేషముతో తిరిగి వచ్చి, మరల పుణ్యకర్మలు చేసి, పై లోకములకు వెళ్ళుచు వచ్చుచుండుట అనునది కాని, సూకర, సృగాలాది జన్మలు కూడ రావచ్చు ననునది కాని దృఢముగా తెలిసికొనినచో, వైరాగ్యము కలిగి, భగవ దుపాసనకై యత్నించుట జరుగవచ్చును. అందువలన, భగవ తత్త్వ నిర్ణయాత్మక మగు ఈ శారీరక మీమాంసా శాస్త్ర మారంభింపవలయు ననునది ప్రకృత సిద్ధాంతము.

## 3. అనిష్టాది కార్యాధికరణము

పూర్వాధికరణములో జీవులు పుణ్యకర్మ ననుభవించిన పిదప, ఈ లోకమున తమ తమ కర్మశేషమును అనుభవించుటకు - కర్మకల వారుగనే దిగివత్తు రని నిర్ణయము చేసినందున, తా మిట్లు జన్మ మెత్తుచు, దుఃఖముల ననుభవించుచుంటి మను జ్ఞానము గలవారై, ప్రాపంచిక విషయ భోగములయందు వైరాగ్యమును సంపాదించు కొందు రని సూచింపబడినది. ప్రకృతాధికరణమున - పుణ్యము చేసినవారు గాని, పాపము చేసినవారు గాని చంద్రలోకము చేరుట యను సాధారణ సుఖ భోగము కూడ లభించజాల రను విషయము నిర్ణయింపబడుచున్నది. దీనివలన, సామాన్య సుఖమునకు కూడ నోచు కొనకనే మే మీ సంసార చక్రమున తిరుగుచున్నామే ! అని పాపు లకు కూడ వైరాగ్యము కలుగుటకు అవకాశ మున్నది. అందువలన పూర్వాధికరణమునకు, ప్రకృతాధికరణమునకు వైరాగ్యరూప ఏక కార్య కారిత్వమే సంగతి యనవచ్చును.

యాగ దానాది పుణ్య కర్మలు చేసినవారు చంద్ర లోకము చేరి, కర్మావసానములో దిగివత్తు రను విషయము పైన ఈ యధికర ణములో చర్చించబడినది. ఇది ఛాందోగ్యోపనిష ద్వాక్యార్థ విచారము చేయు అధికరణము. ఈసందర్భమున, కౌషీతకి ఉపనిషత్తుకు సంబంధించిన వాక్య మొకటి స్మరణకు వచ్చినది :-

"యే వై కే చ అస్మా ల్లోకాత్ ప్రయంతి చంద్రమస మేవ తే సర్వే గచ్ఛంతి."

అనునదియే ఆ వాక్యము. ' ఈ లోకమునుండి వెళ్ళినవా రెల్లను, చంద్ర లోకమునే చేరగలరు' అని ఈ వాక్యమునకు అర్థము. ఇట్లు అర్థసామ్యమును బట్టి, స్మరణకు వచ్చిన అంశమై యున్నను, తెలిసి కొనవలసిన యంశమే కనుక, ప్రకృతాధికరణములో - పై కౌషీతకి

ఉపనిషత్తుకు సంబంధించిన వాక్యము యొక్క అర్థము చర్చించబడు చున్నది. స్మరణకు వచ్చిన ప్రకృతోప యోగి విషయమును చెప్పుట ప్రసంగ సంగతివలన నని గ్రహింపవలెను.

పైన పేర్కొనబడిన కౌషీతకి ఉపనిషత్తు యొక్క వాక్యమే ఈ అధికరణముకు అర్థ నిర్ణయము చేయవలసిన వాక్యము. వచ్చినవా రందరు చంద్రలోకమును చేరుదు రని ఈ వాక్యము చెప్పుచున్నది. పై అధికరణ విషయము యాగ దానాది కర్మలు చేసినవారు చంద్ర లోకము వెళ్ళుటను సూచించినది. అందరు చంద్ర లోకమును చేరు దురా? పుణ్యాత్ములు మాత్రమేనా? అని మనకు సందేహము కలుగు అవకాశ మున్నది కదా! అందువలన, ప్రకృతాధికరణ మారంభింప బడుచున్నది. ఈ అధికరణములో పది సూత్రము లున్నవి. వానిలో మొదటి ఐదుసూత్రములు పూర్వ పక్షమును, తరువాతి ఐదు సూత్ర ములు ఉత్తర పక్షమును నిరూపించును.

కౌషీతకీ వాక్యము స్పష్టముగా 'అందరును' చంద్రలోకమును చేరుదు రని చెప్పియున్నందున, పుణ్యము చేయనివారు, పాపము చేసినవారు కూడ చంద్ర లోకమునకు వెళ్ళుదు రని పూర్వ పక్షము. ఈ భూ లోకమున పుట్టువా రందరు చంద్రలోకము నుండి దిగి రావల సినవారే కదా! ఐనచో - పుణ్యాత్ములకును, వీరికిని కొంత వ్యత్యాస మున్నది. పుణ్యాత్ములు నరకమునకు వెళ్ళరు. నేరుగా చంద్ర లోక మునకే చేరుదురు, పాపాత్ములు నరక లోకములకు వెళ్ళి, అచట పాప ఫల మనుభవించి, పిదప, చంద్ర లోకమునకే చేరుదురు. పాపా త్ములు నరక లోకములకు వెళ్ళి, అచట పాప ఫల మనుభవించి, పిదప, చంద్ర - పర్జన్య - పృథివి - పురుష - స్త్రీ లోకములకు దిగి

వత్తురు. పాపులు తనకు వశ మగుచుందు రని – "పునః పునః వశ మాపద్యతే మే" అని యముడు చెప్పుననును కఠోపనిషత్తు. "సర్వే చైతే వశం యాంతి యమస్య భగవన్ కిల!" ఈ పాపు లందరును యమునకు వశు లగుదు రని విష్ణుపురాణము వాకొనుచున్నది. అంతే కాదు. వివిధ పాపానుభవమునకు అనుగుణముగా రౌరవాది నరకము లేడు విధములుగా నున్న వనియు పౌరాణికులు పేర్కొనుచున్నారు. ఐనచో – ఇవ యన్నియు యముని యధీనము నందే కలవు. కనుక, పాపులు యమ లోకములో పాపము లననుభవించి, చంద్ర లోకము చేరుదురు అనునది పూర్వ పక్ష సారము.

పుణ్యము చేయనివారు కాని, పాపులు కాని చంద్ర లోకము నకు జేరు ప్రసక్తి లే దని సిద్ధాంతము. పంచాగ్ని విద్యలో కాని, మరే ప్రకరణమునగాని దేవయానము బ్రహ్మోపాసనము చేసినవారి నిమిత్త మనియు, పితృయాణము పుణ్యకర్మ లొనరించినవారి నిమిత్త మని పేర్కొనబడుచున్నది. కౌషీతకి లోని వాక్యమున – 'అందరు' అనగా, యాగ దానాది పుణ్య కర్మలు చేసినవా రందరు అని యర్థము, ఈ లోకమున జన్మించువా రందరు చంద్రలోకము నుండి దిగి రావలసిన నియమ మేదియు లేదు. కేవలము పాపము లొనరించినవారు ఈ రెండు మార్గములలో దేనినుండియు వెళ్ళరు. వారిది మూడవ ప్రస్థానము అనియు ఉపనిషత్తు చెప్పుచున్నది. "అథైతయోః పథోర్నకతరేణ ...... ఏతత్ తృతీయం స్థానమ్" అని. అందువలన, ఇచటనుండి వెళ్ళువా రందరును చంద్రలోకమునకు వెళ్ళుదు రని నియమము లేదు.

ఇట్లే, ఈ లోకమున పుట్టువా రందరు – చంద్ర లోకము నుండియు రావలయు నని గాని, తల్లి గర్భము నుండియే – అనగా. పంచమాహుతి వల్లనే పుట్టవలయు నని కాని నియమ మేదియు లేదు,

ద్రౌపది, ధృష్టద్యుమ్నుడు యజ్ఞకుండము నుండికదా ఆవిర్భవించినట్లు లోకులు చెప్పకొనుచున్నారు ! శ్రుతియు - అండజము, జీవజము, ఉద్భిజ్జము అని, ఈ లోకమున పుట్టువారిని మూడు విధములుగా విభజించినది. గ్రుడ్డు వలన పుట్టునవి, మాతృ గర్భము నుండి పుట్టునవి. భూమిని భేదించుకొని పుట్టునవి అని ప్రాణులు మూడు రకము లట ! వీనిలో మొదటి కోవకు చెందినవి - కోళ్ళు, పక్షులు మొదలగునవి, రెండవ కోవలో - మనుష్యులు, పశువులు చేరును. మూడవ కోవలో - మొక్కలు మొదలగు స్థావరములతో బాటు, స్వేదజము లగు పేలు మొదలగు నవి చేరును. వీనిలో - మొదటి రెండు వర్గములకు చెందిన ప్రాణులు పంచమాహుతి వలన ఏర్పడిన వారు. చివరి వర్గము లోని ప్రాణులకు పంచమాహుతి అవసరము లేదు గదా ! బ్రహ్మ - రుద్ర - సనత్కుమారాదులకు కూడ పంచమాహుతి ప్రసక్తి లేదు గదా !

ఇట్లు స్థూల శరీరారంభమునకై పంచమాహుతి కావలయు నని నియమము లే దని తేలినందున, పాపులు కూడ చంద్రుని చేరి, దిగరావలసిన యవసరము లేదు. అందువలన, కౌషీతకి పర్యంక విద్య లోని పై వాక్యమున గల 'అందరును' అను పదమునకు - 'పుణ్య కర్మలు చేసినవా రందరును' అనియే అర్థ మను నిర్ణయము ఈ యధి కరణమున చేయబడుచున్నది. చంద్రలోక ప్రాప్తి రూప మగు సుఖ లేశము కూడ లేదుగదా! అని, పాపులను కూడ వైరాగ్య జనన మూలమున బ్రహ్మోపాసనారంభమునకు ఉపయుక్త మగు ఈ యధి కరణము బ్రహ్మవిచార రూప మగు శాస్త్రమును అధ్యయనము చేయవలయు నని ఉద్బోధించుచున్నది.

## 4. తదన్తరప్రతిపత్త్యధికరణము

ప్రసంగ సంగతి ననుసరించి పర్యంక విద్యకు సంబంధించిన వాక్యార్థ విచారము పై యధికరణమున చేయబడినది. ఇక ప్రకృత మగు జీవావరోహణ ప్రతిపాదక వాక్యార్థము – ఈ యధికరణమున చర్చించబడుచున్నది. కనుక, ఈ యధికరణము అవసర సంగతితో ఆరంభించబడిన దనవచ్చును. వైరాగ్య రూప మగు ఏక కార్యతా రీత్యా మున్నందున, కార్యైక్య మను సంగతిని కూడ చెప్పవచ్చును. సూక్ష్మ శరీరము గల జీవుడు దిగివచ్చునపుడు – ఎట్టి అనుభవము లేక, కేవలము అచేతనము వలెనే కొన్ని స్థానములలో నుండు నని, ఈ అధికరణములో నిర్ణయింపబడుచున్నది. కనుక, ఈ అధికరణము కూడ వైరాగ్య జననమున ఉపయుక్త మగుచున్నది గదా!

జీవులు ఈ లోకమునకు దిగివచ్చునపుడు, వెళ్ళిన మార్గము కంటెను కొంత మార్పు ఉండును అని చెప్పికొనినాము కదా! అ దే మనగా, వచ్చునపుడు జీవులు – ఆకాశము, వాయువు, మేఘము, వర్షము అనువాని రూపముతో రాగల రని శ్రుతి చెప్పుచున్నది :-

"ఆకాశాద్వాయుం, వాయు ర్భూత్వా ధూమో భవతి .... "

ఇత్యాది వాక్యముతో – ఈ వాక్యము ఈ యధికరణమునకు విషయ వాక్యము. ఇచట సంశయ మేమనగా – జీవుడు ద్యు లోకములో – "సోమో రాజా భవతి" సోమరాజు కాగలడు అనినట్లు, 'దేవుడు కాగలడు' అనినట్లు, 'మనుష్యుడు కాగలడు' అనినట్లు 'ఆకాశము కాగలడు' 'వాయువు కాగలడు' 'వర్షము కాగలడు' 'అన్నము కాగలడు' అని చెప్పును గదా శ్రుతి! సోమదేవుడు కాగల డనగా – సోమదేవ శరీరము కలవా డగు నని తాత్పర్యము. ప్రకృతమున,

ఆకాశ శరీరము కలవా డగు నని తాత్పర్యము. ప్రకృతమున ఆకాశ శరీరము కలవా డగు నని యర్థమా? లేక – ఆకాశాదుల స్వభావము కలవా డగు నని యర్థమా? అని సంశయ మేర్పడును. అపుడు, ఆకాశ శరీరము కలవా డగు ననియే అర్థము చెప్పవలె నని పూర్వ పక్ష మేర్పడును. ఏల నన, ఒక ప్రకరణములో – 'కాగలడు' అను దానికి – ఆ శరీరము గలవాడుగా కాగలడు' అను అర్థము చెప్పికొని నందున, అదియే ప్రకరణమున, అదియే శబ్దమునకు మరి యొక విధ ముగా అర్థము చెప్పికొనుట సమంజసము కాదుగదా! ఇట్లు పూర్వ పక్ష మేర్పడగా, ఆకాశాది శరీరము కలవాడను అర్థము సమన్వయము కాదుకనుక, ఆకాశాది స్వభావము కలవా డగుననియే చెప్పవలె నని సూత్రకారులు నిర్ణయించిరి, సోమదేవాది శరీరము కలవా డైనపుడు, ఏదియో యొక అనుభూతి యుండును. అట్టిచో – ఆకాశ వాయు మేఘ వర్షాది శరీరకు డై నందున, ఎట్టి అనుభూతియు లేదు కదా! అనుభవ మును కలిగించక, అది శరీర మెట్లగును? శరీరమును తాను వినియో గించుకొనవలె గదా! ఆకాశాదులను జీవుడు తన సంకల్పము చేత, తన కొరకు వినియోగించుకొనజాలడు గదా!

అందులన, జీవుని సూక్ష్మ శరీరము ఆకాశాది తాదాత్మ్యము పొందినందున కలుగు విశేష మేమియు లేదు. సోమదేవ మనుష్యాది శరీరము లేర్పడినపుడు, సుఖ దుఃఖా ద్యనుభూతి ఉన్నది. కనుక అచ్చట ఆ యా శరీరములు కలవా డగు నని చెప్పికొనినాము. ఇచట ఆకాశాది స్వభావము మాత్రమే సమన్వయము కావచ్చును. ఆకాశ మను శబ్దము చేతనే జీవుని చెప్పకొనవలసి యుండుటయే జీవునకు ఆకాశాది స్వభావము నాహరించుట! ఇట్లు ఆకాశాది సంబంధము వలన, ఆకాశాది శబ్దవాచ్యత్వ రూప మగు ఆకాశాది సాదృశ్య మేర్పడు ననియే సిద్ధాంతము.

## 5. నాతిచిరాధికరణము

పై లోకముల నుండి జీవుడు దిగి వచ్చునపుడు – ఆకాశ, వాయు, మేఘ, వర్షాది స్వభావము కలవాడగుచు వచ్చునని పూర్వాధికరణమున నిర్ణయింపబడినది. ఇట్టి అచేతన సదృశ స్థితి – వైరాగ్యమును కలిగింప వచ్చును. ప్రకృతాధికరణమున కూడ మరియొక విధముగా అచేతన సదృశ స్థితియే పేర్కొనబడుచున్నది. అందువలన, కార్యైక్యమే సంగతి యని గ్రహింపవచ్చును. విషయ వాక్యము కూడ ఈ జీవుని అవరోహణమునకు సంబంధించినదే. ఐనచో – ఇపుడీ వాక్యము చివరి వరకు, అనగా, – "అతో వై ఖలు దుర్నిష్ప్రపతరం" అను వరకును గ్రహింప నగును, ఇపుడు సంశయ మే మనగా – దిగి వచ్చు జీవుడు, ఆకాశాదులను విడిచి యుండలేని స్థితి యేర్పడ వచ్చునుగాక, కాని, ఈ ఆకాశాదులలో గలిసి, త్వరలోనే – వెంట వెంటనే దిగిరాగల డని తలంచవచ్చునా? లేక, అట్లు త్వరలోనే దిగి రాగల డనుటలో నియమ మేదియు లే దని భావింపవలెనా? అని.

ఆకాశమైన తరువాత వాయువు కాగలడు, వాయువైన తరువాత ధూమము కాగలడు అనుచు ఈ క్రమమును ఉపనిషత్తు ఉపదేశించుచున్నది. ఇచట వెంటవెంటనే, ఆకాశ – వాయు – ధూమ మేఘ వర్ష వ్రీహి యవాది రూపము లేర్పడు నని చెప్పబడలేదు. చెప్పబడని నియమమును కల్పించుట అనవసరము కదా! కనుక, ఆకాశ వ్రీహి యవాది రూపమును వెంట వెంటనే పొందు నను నియమము లేదని పూర్వపక్షి మేర్పడును. దానికి సూత్రకారులు నియమ మున్న దనుటకు ప్రమాణమును సూత్రములో చూపించుచున్నారు.

"తది హ వ్రీహి యవా ఓషధి వనస్పతయ స్తిల మాషా ఇతి జాయంతే."

వర్షము యొక్క సంబంధమును చెందిన జీవులు భూమిపై బడి, వరి మొదలగు ధాన్య రూపమునో, ఓషధి రూపమునో, తిల మాషాది రూపమునో ధరింతు రని చెప్పి, పిదప - "అతో వై దుర్నిష్ప్రపతరం" అని ఉపనిషత్తు చెప్పును. ఈ వ్రీహి యనాది భావము నుండి నిష్క్రమించుట చాల కష్టము అని ఆ వాక్య తాత్పర్యము. ఇట్లు వ్రీహి యనాది భావము నుండి వెడలుట చాల కష్ట మని చెప్పినందున, దీనికంటెను పూర్వము లగు ఆకాశ వాయు వర్షాది భావముల నుండి వెడలుట కష్టము కాదని కదా తెలియుచున్నది! నీటి నుండి వెడలుట కష్ట మనగా - కాలము చాల పట్టు నని కదా! తాత్పర్యము! ఇట్లిచట ఆలస్యము జరుగునని విశేషించి శబ్దము చెప్పుచున్నందున, మిగిలిన ఆకాశ వాయు వర్షాది స్థితి వెంట వెంటనే కలుగగల దను నియమమును సూచించిన దైనదని అని సిద్ధాంతము. శీఘ్రముగా జరిగినను, అచేతన సదృశ స్థితి హేయమైనందున, వైరాగ్య హేతువు కావచ్చును. కనుక, వైరాగ్య పాదములో ఈ యధికరణమునకు స్థానము లభించినది.

## 6. అన్యాధిష్ఠితాధికరణము

ఇది ఈ వైరాగ్య పాదములోని చివరి అధికరణము. దీనికిని పంచాగ్ని విద్యకు సంబంధించినదే విషయ వాక్యము. పై యధికరణములో వలెనే జీవునకు ఏర్పడు అచేతన సదృశ స్థితియే ఇందునను నిరూపింపబడుచున్నది. ఐనచో - విషయము, సంశయము భిన్నమైనందున, అధికరణము భిన్నమైనది. కనుక, దీనికిని ఏక కార్యకారిత్వమే సంగతి. దిగివచ్చు జీవునికి వ్రీహి యనాది రూప మేర్పడు నని చెప్పు వాక్యము దీనికి విషయ వాక్యము. ఇచట ఆకాశ వాయు మేఘ వర్షాది భావము వలెనే వ్రీహ్యాది భావము కూడా జీవునకు వాని స్వభావమును మాత్రమే కలిగించునా? లేక - వ్రీహ్యాది శరీరము కల్

వానిగా చేయునా ? అని సంశయము కలగవచ్చును. ప్రీహి యవాదులుగా పుట్టుదురు' అను చోట - ఈ సంశయ మేల ? అనగా వాస్తవముగ ఆకాశాదులు ఎవరికిని శరీరములు కావు. కాని, ప్రీహి యవాదులు జీవాధిష్టితములై, జీవునకు సుఖ దుఃఖ భోగములకు సాధనము లగును గదా ! అందువలన, వర్షముగా భూమిపై బడిన జీవులు - ప్రీహి యవాది శరీరములు గల వా రగుదురను కొనవలెనా ? లేక - ఇతర జీవులకు శరీరములుగా నున్న ప్రీహి యవాదులతో కేవలము సంశ్లేషించి యుంచు నని తలంపవలెనా ? అని సందేహము, వీనిలో - మొదటిది పూర్వపక్షము, రెండవ అంశము సిద్ధాంతము.

ఆకాశాది భావము చెప్పునప్పుడు ఆకాశముగా కాగలడు, వాయువు కాగలడు అని చెప్పుచు - ప్రీహి యవాది భావమును చెప్పునపుడు మాత్రము - "జాయంతే" 'పుట్టుచున్నారు' అని చెప్పబడి యున్నది. 'పుట్టుక' అనగా - స్థూల శరీర సంశ్లేషమే కదా ! అందువలన, దిగివచ్చు జీవులు ప్రీహి యవాది శరీరములు కలవారు కాగల రనియే చెప్పవలె నని పూర్వపక్ష సారాంశము. ఆకాశాది స్థితిని చెప్పినపుడు - "భవతి" 'కాగలడు' అని, ప్రీహ్యాది భావమును చెప్పునపుడు "జాయన్తే" 'పుట్టగలరు' అని శబ్ద ప్రయోగములో కొంత భేద మున్నను, అర్థ స్థితి ననుసరించినపుడు - రెండు విధములగు శబ్ద ప్రయోగములకును అర్థ భేదములో తాత్పర్యము లే దనియే చెప్పవచ్చు నని సూత్రకారులు సమాధానపరచియున్నారు.

పుట్టుకను చెప్పినపుడు - ఉపనిషత్తు పుట్టుకకు కారణమైన కర్మనుకూడా చెప్పినది :-

"రమణీయ - చరణాః రమణీయాం యోనిమాపద్యంతే... "

'పుణ్యము కలవారు ప్రశస్తమైన జన్మను పొందుదురు' అని యనచో - ప్రీహి యవాదులుగా జన్మింతు రనినపుడు - కర్మను

చెప్పలేదు. ఆకాశాది భావమును చెప్పునప్పుడను - కర్మను చెప్పలేదు. కనుక, వ్రీహ్యాదులుగా ఉదయించుట కూడ మరియొక జీవునకు శరీరముగా నున్నవానితో సంబంధించుట మాత్రమే అర్థమని భావింపవలెను. ఆకాశాదులుగా అగుట యనినను, వ్రీహ్యాదులుగా పుట్టుట యనినను ఒకటియే. అనగా - ఆకాశాదులుగా అగుట యనగా - ఆకాశాది సంబంధము కలవాడగుటనియే చెప్పుకొనవలెగాని, దిగివచ్చు ప్రతి జీవుడు - ఒక్కొక్క ఆకాశ మేఘాదుల స్వరూపాభేదము చెందడు గదా! అట్లే, పుట్టుననినను, వ్రీహి సంబంధము కలవాడగుననియే చెప్పనగును. ఇట్లు - "భవతి" యను దానివలె - "జాయంతే" యనుదానికిని గౌణార్థమునే స్వీకరింపవలె కాని, స్థూల శరీర సంబంధ రూపమగు ముఖ్యార్థమును స్వీకరింపరాదని తాత్పర్యము.

మరియొక మాట :- వ్రీహ్యాదులు ఈ దిగివచ్చు జీవునకు శరీరములు కాగల వనుకొనినచో - ఆశరీరములు ఈ జీవునకు ఏదేని భోగమును కలిగించవలెను. మరి - ఏదేని అనుభూతి కలుగవలె ననగా - ఆ యనుభూతికి కారణమగు కర్మ ఉండవలసి యుండును. అట్టి కర్మ - స్వర్గ సుఖమును కలిగించి, క్షీణించినది. మరియొక కర్మ - వీనికి స్థూల శరీర సంబంధ మేర్పడిన వెంటనే ఫలితమును అనుభవింపజేయనున్నది. స్థూల శరీరము పంచమాహుతిలో మాతృగర్భమున ఏర్పడనున్నది. ఈ మధ్య - ఆకాశాది భావము నుండి గర్భస్థితి ఏర్పడువరకు ఎట్టి కర్మానుభవమును లేదు. అందువలన, స్థూల శరీర మేర్పడు ప్రసక్తి లేదు. కేవలము భూత సూక్ష్మములతో మాత్రమే జీవుడు అంటియుండి, ఆకాశాదులతో సంబంధించుచు, గర్భస్థితిని చెందును. అందువలన, ఇతర జీవుని శరీరముగా గల వ్రీహి యవాదులతో దిగి

వచ్చు జీవునకు ఈ సంబంధము మాత్రమే ఏర్పడును. కాని, వ్రీహి ముఖ వాదులు కాజాలవని సూత్రకారులు పూర్వపక్షమును నిరసించు చున్నారు

ఇనచో - స్వర్గ సాధనముగా చేసినవారికి కొంచము అపవిత్రము అనగా - పాపము కూడ అప్రయత్నముగా సంక్రమింపవలె నట! అగ్నిషోమీయాది యాగములలో - పశుమారణ కర్మకూడ ఉన్నది. పశుమారణ మనగా — హింసయే కదా! "న హింస్యాత్" అని, వేదము హింసను నిషేధించినది. వేద నిషిద్ధ మగు కర్మ చేసి నందున, పాప మేర్పడగల దని మీమాంసకుల సిద్ధాంతము సర్వ సమ్మతమైనది. కాని, మీమాంసకు లిచట ఉత్సర్గాపరాధ న్యాయము ననుసరించి, యాగీయ పశు హింసాతిరిక్త హింసయే వేదము చేత నిషేధింపబడిన దని నిరూపించియున్నారు. విషయము వేరు గనుక, ఉత్సర్గాప వాద న్యాయమిచట సమన్వయము కాజాల దని సాంఖ్యులు, వక్కాణింతురు. ఆహవనీయము నందు హోమము చేయ వలయునని సామాన్య విధి యొకటి కలదు. కాని, అశ్వమేధ యాగ ప్రకరణమున అశ్వముయొక్క పదము నందు హోమము విధించబడి యున్నది. ఇచట విషయ మొకటియే కనుక, ఉత్సర్గాపవాదన్యాయము కుదురును. అట్టి అశ్వపదాతిరిక్తస్థానమున హోమము చేయవలసి వచ్చిన, ఆహవనీయములో చేయవలయునని, విధి సంకోచము చేయ వచ్చును.

కాని, ప్రకృతములో హింస చేయనేకూడ దనునది సామాన్య ముగా నిషిద్ధము. ఈ నిషిద్ధమైన హింస పాపమును కలిగించి తీరును. ఇక స్వర్గము కొరకు చేయు యాగములోని దగు హింస యాగమునకు ఉపకరించును. కనుక, రెండు వాక్యములకును విషయము వేరు కనుక,

విరోధమే లేదు. మరి ఇచట ఉత్సర్గాపవాద న్యాయ ప్రసక్తియే లేదందురు సాంఖ్యులు. ఐనచో, పాపము కలిగించు ననుకొనినచో, యాగ మెవ్వరును చేయ రనుకొనరాదు. పాపమునకంటెను సుఖ హేతు వగు పుణ్యము హెచ్చుగా నున్నందున, సుఖేచ్ఛ ప్రబలమై, యాగ మున ప్రవర్తింప జేయవచ్చును. ఇట్లు విధి నిషేధములకు విషయ భేద మున్నందునను, విరోధము లేనందునను, ఉత్సర్గాపవాదన్యాయ మున ఇచ్చట ప్రసక్తి లే దందురు

దీనిని బట్టి, రాగప్రాప్త హింసయే పాపజనకము కాని, విధి ప్రాప్త మగు యాగీయ పశుహింస పాపజనకము కాదనియు వాదించ రాదు. ఏమనగా, యాగీయ పశుహింసయు స్వర్గాది రాగప్రాప్తమే కదా! అందరును పశుయాగము చేసితీరవలె నని విధి లేదు కదా! స్వర్గమును కోరువారు మాత్రమే పశుయాగము చేయవచ్చు ననియు, పశుయాగములో - పశుసంజ్ఞపన మొనరించవలె ననియు చెప్ప బడినది. కనుక, లౌకికముగా జేయు పశుహింస కాని, వైదిక కార్యోప యోగి పశుహింస కాని - రెండును రాగ ప్రాప్తములే అంమవలన, యాగాదు లొనరించి, స్వర్గమున తత్పుణ్య ఫలము ననుభవించిన జీవులు - ఆ యాగము వలననే ఏర్పడిన పాపము ననుభవించుటకు వ్రీహి యవాది శరీరము గలవారుగా పుట్టుదు రను అర్థమే న్యాయ మని తోచును.

"శరీరజైః కర్మదోషైః యాని స్థావరతాం నరః."

అని మనుస్మృతి కర్త - స్థావర జన్మను పాప ఫలితముగా చెప్పి యున్నాడు. కనుక, దిగివచ్చు జీవులు వ్రీహి శరీరము గలవారుగా పాపము ననుభవించుటకు పుట్టుదు రనునది పూర్వపక్ష సమర్థము. ఈ సమర్థనము సాంఖ్య ఛాయలో జరిగెను. ఐనచో సూత్రకారులు

అగ్నీషోమీయాది యాగీయ పశు వధమును హింస యనియే అంగీక రింపవలసిన దని వాకొనుచున్నారు. ఇచట ఉత్సర్గాపవాదన్యాయము ప్రవర్తించునా? లేదా? అని శ్రీభాష్యకారులు చర్చించియుండలేదు. వారు - సూత్రాక్షర వ్యాఖ్యానము నందు మాత్రమే ప్రవర్తింతు మని కదా చెప్పియున్నారు! యాగీయ పశుహింస హింసయే కాదను టకు శబ్దమే ప్రమాణ మని సూత్రకారులు చెప్పుచున్నారు. ఆ శబ్ద మును శ్రీభాష్యకారులు చూపుచున్నారు. యాగమున వధించబడిన పశువునకు స్వర్గలోకప్రాప్తి కలుగు నని అచ్చటి వేదవాక్యమే చెప్పుచున్నది :-

"హిరణ్య శరీరః ఊర్ధ్వం స్వర్గం లోక మేతి."

బంగారు శరీరము అనగా - అందమైన శరీరము గలిగి, స్వర్గలోకము చేరును' అని దీని యర్థము. పశువుకు, పశుహింస చేసినవానికిని స్వర్గ రూప ఫలముకదా వేదము చెప్పుచున్నది! స్వర్గము సుఖమునకు నిల యము. అట్టి సుఖమును కలిగించునది ఈ యాగములోని మారణ వ్యాపారము వలన, పశువునకు ఏమాత్రమేని స్వల్ప సుఖము కలిగి నను, గొప్ప సుఖమునకు సాధన మగుట వలన, హింస యనరాదు. "రవా ఉపత న్మియసే ... " ఇత్యాదిమంత్రము గూడ, యాగీయ పశువు యొక్క స్వర్గ ప్రాప్తిని చెప్పుచున్నది. ఆరోగ్యము కొరకు వైద్యు లొనరించు ఛేదనాదులు హింస యనబడవు గదా! అందు వలన, యాగము చేసి, స్వర్గమున సుఖ మనుభవించి తిరిగి వచ్చువారికి ఆ యాగము వలన కలిగిన పాపమేమియు లేదు కనుక, స్థావర శరీర మును పొందవలసిన యవసరము లేదు. అట్టిచో - వ్రీహ్యాది శరీర ములు గలవా రెందులకు కావలెను? ఆకారాది సంబంధము వలెనె వ్రీహ్యాది సంబంధ మేర్పడు ననియే వాక్యార్థము.

రిపొయొకమాట :- ప్రీహి యవాది సంబంధమును చెప్పిన తరు
త స్సంబంధమును చెప్పునపుడు కూడ - "తద్భావ ఏవ
అని, రేత స్సేక మొనరించు పురుష సంశ్లేష మాత్రమే
ందున, వ్రీహి భావ మనగా కూడ వ్రీహి సంశ్లేష కాని,
ర మేర్పడుట కాదని గ్రహించవలెను. పృథక్ స్థిత్య వర్ణ
మాత్రమే యని సిద్ధాంతము. కనుక, ఇతరజీవునకు సంబంధ
కాని, స్థూల శరీర ప్రాప్తి కాదని ఈ యధికరణ
ము.

ఈ పాదములోని ఆరు అధికరణములును పంచాగ్ని విద్యా
ల అర్థమును చర్చించి, నిర్ణయించి, జీవుని యొక్క జా గ్ర
పేర్పడు సుఖ దుఃఖముల దర్శింప జేసినది. ఈ వాక్యార్థ
వలన, దుఃఖమునందు మాత్రమే కాక, అనిత్య మై నందు
ఖ మిశ్రిత మై నందునను సుఖ భోగము నందును వై రా
హేయత్వ బుద్ధియు కలిగి, నిత్యానంద సాధన బ్రహ్మ విచార
పతిపాద్య బ్రహ్మోపాసనయం దభిరుచి కలుగవచ్చును.

# తృతీయాధ్యాయము - ద్వితీయ పాదము

## 1. సంధ్యాధికరణము

భాష్యము యొక్క మూడవ అధ్యాయములో - ఉపాస
గాపింపబడును. పరమాత్మను ఉపాసించుటకు - పరమాత్మ
ముల యందు వై రాగ్య మావశ్యకము. పరమాత్మ యందు
వలయును. పరమాత్మ వ్యతిరేకములు ప్రాపంచిక భోగ
నియందు వై రాగ్యము కలుగవలె ననిన తన యందలి దోష
తెలిసికొనవలెను. మొదటి పాదమున వై రాగ్యమునకు ఉప

యుక్తము లగు దోషములు దర్శింపజేయబడినవి. ఐనచో - ఈ దోషము లన్నియు జీవుని జాగర దశకు సంబంధించినవి. జాగర దశ లోనే కదా జీవుడు స్వర్గాదులు సుఖ మని భ్రమపడి, తత్ప్రాప్తి కొరకు ప్రయత్నించుచుండును! తత్ఫలముగా కదా - పై లోకములకు వెళ్ళును! పిదప ఈ లోకములకు తిరిగి వచ్చును! ఈ దశలో - జీవు డనుభవించు సుఖ దుఃఖాదులు ఎంతటి హేయములో - మొదటి పాదమున - చర్చించబడిన పంచాగ్ని విద్య వలన తెలిసికొనగలిగితిమి. ఇక, స్వప్నదశలోని భోగములపై కూడ రోత కలుగవలెను.

స్వాప్నిక భోగములు కూడ మిశ్ర దుఃఖములు, అశాశ్వత ములు కనుక, అట్టి భోగముల ననుభవింపజేయు స్వప్నాది దశలను గురించియు మనము తెలిసికొనవలసి యున్నది. అపుడు వానియందును వైరాగ్యము కలుగవచ్చును. అందువలన, ప్రకృత పాదమున మొదట స్వప్న సుషుప్తి మూర్ఛా దశలను గురించి వివరించు వాక్యముల అర్థ మును చర్చించుచున్నారు. ఇవియు - వైరాగ్య వర్ధకము లైనచో మొదటిపాదముననే కదా నిరూపింపబడవలసియుండును! ఐనచో - ఈ రెండవ పాదమున వీనికి స్థాన మెట్లు లభించెను? అని శంక ఏర్పడ వచ్చును. స్వప్నాది దశలపట్ల కూడ వైరాగ్యము కలుగవలె నన్న, స్వప్నాది స్వరూపములు గూడ తెలియవలె గదా! ముఖ్యముగా - స్వప్న దశలో కూడ, జాగర దశలో వలెనే, అనేక సుఖ దుఃఖ భయాదుల అనుభూతులు కలుగుచున్నవి. ఈ యనుభూతులకు సాధనము లగు పదార్థములు స్వప్నమున కానవచ్చుచున్నవి. వీనిని జీవుడే తన తన సంకల్పముతో సృష్టించుకొనజాలడు. ఐనచో - ఇవి యును పరమాత్మ చేతనే సృష్టింపబడినవి. ఈ కారణముల వలన, పరమాత్మ యొక్క ప్రభావాతిశయము విశద మగుచున్నది.

పరమాత్మయందు రాగము కలుగుటకును, పరమాత్మ గుణము లను నిరూపించుటకును ఈ రెండవ పాద మేర్పడినది. 'జన్మాది కారణ

భూతుడు పరమాత్మ' అని మాత్రమే ఇంతకు మున్ను తెలిసినది. 'స్వప్నాది కారణము కూడ పరమాత్మ' యని తెలిసినచో, పర మాత్మ యొక్క- మరియొక గుణము కూడ విదిత మగును కదా! జాగర దశలో - జీవుని యాగాది ప్రయత్నములు కానవచ్చుచున్నవి, స్వప్నాది దశలలో జీవుని ప్రయత్న లేశము కూడ లేదు. ఇట్లు పర మాత్మ యొక్క- గొప్ప ఐశ్వర్య గుణము - స్వప్నాది దశ విశేష విజ్ఞాన మూలముగా మనకు తెలియును. జాగర దశలోని సృష్టి కార్య మంతయు పరమాత్మ - చతుర్ముఖుని ద్వారా జరిపించును. స్వప్నాది సృష్టి - పరమాత్మ సాక్షాత్తుగా జరిపించును. ఇట్లు పరమాత్మ యొక్క- మహా మహిమ శాలిత్వము, అనంతాశ్చర్యావహత్వము మొద లగు గుణ గణములు - ఈ స్వప్నాది దశా విశేష విచార మూల ముగ తెలియవచ్చుచున్నవి. కనుక, వైరాగ్య జనకనులు మాత్రమే గాక, పరమాత్మయందు అభిరుచికిని కారణభూతము లగు ఈ పాదము లోవి మొదటి నాలుగు అధికరణములకు ఈ పాదమున స్థానము లభించిన దని తెలియ నగును.

ఈ పాదమున భగవంతునకు రెండు చిహ్నములు ప్రతిపాదింప బడుచున్నవి. ఒకటి :- అఖిలహేయ ప్రత్యనీకత్వము. మరి యొకటి:- అనంత కల్యాణ గుణాకరత్వము. వీనిబట్టి, ఈ పాదమునకు - 'ఉభయ లింగ పాదము' అని వ్యవహార మేర్పడినది. వైరాగ్యము వలెనే పరమాత్మయం దనురాగము కూడ, ఉపాసనకు ఉపాయమని భావించి తమి. పరమాత్మ గుణ నిరూపణము - ఆయనయం దనురాగమును కలిగింపజేయును గదా! ఇట్లు ఉపాసన రూప మగు వేద వాక్యమునే పై పాదములో ప్రతిపాదింపబడిన అంశములు కాని, ఈ పాద మున ప్రతిపాదింపబడిన అంశములు కానీ చేయుచున్నందున,

కార్త్ర్యైక్య సంగతిని బట్టి, ద్వితీయపాద మారంభించబడుచున్న దన వచ్చును. పూర్వాధికరణము వలెనే ఈ యధికరణము కూడ, స్వాప్నిక దోష దర్శన ద్వారా జీవుని వైరాగ్యమునకే కారణ మగు విషయ ముల నిరూపించుచున్నందున ఏకకార్యకారిత్వమే అధికరణ సంగతిగా చెప్పుకొనవచ్చును. తన సంకల్పము లేకనే, జీవునకు వ్రీహ్యాదిభావము ఏర్పడినట్లు పూర్వాధికరణమున తెలిసినది. స్వప్న దర్శనాదులు జీవునికి సంకల్పము వలన కలుగుచున్నవి కదా! అను శంక ఏర్పడ వచ్చును, ఈ శంకను తొలగించుటకు స్వప్నదశాది రూపనము.

"సంధ్యే సృష్టిః ఆహహి" అను సూత్రము ఈ పాదములోని మొదటి సూత్రము. దానిలోని మొదటి పదముతో ఈ యధికరణము నకు సంధ్యాధికరణ మని పేరు ఏర్పడినది. ఈ యధికరణములో మొత్తము ఆరు సూత్రములున్నవి. మొదటి రెండు సూత్రములు పూర్వపక్షమును, తరువాతి నాలుగు సూత్రములు సిద్ధాంతమును ప్రతి పాదించును. స్వాప్నావస్థను వివరించుట - ఈ యధికరణ కృత్యము. బృహదారణ్యకోపనిషత్తుకు సంబంధించిన "న తత్ర రథాః ... న హి కర్తా" అనునది ఈ యధికరణ విషయ వాక్యము. ఆ దశలో రథ ములు కాని, రథ మార్గములు కాని, ప్రమోదములు కాని, నదులు కాని ఏవియు ఉండవు. "ఐనచో, వాని నన్నిటినీ సృష్టి పరుపగల వాడు కర్త కదా!" అని ఆ విషయ వాక్యము యొక్క తాత్ప ర్యార్థము. ఇచట వాడు కర్త కదా అనుచోట - వాడు జీవుడా ? పర మాత్మయా ? అనగా - స్వాప్నిక పదార్థ సృష్టి జీవకర్తృకమా ? పరమాత్మకర్తృకమా ? అను సంశయ మేర్పడ వచ్చును.

ఒక్కమాట :- సంశయముయొక్క ఆకారము సిద్ధాంత సూత్ర ములచే ఏర్పడిన నిశ్చయము వలన, నివర్తనీయమైనరీతిలో చెప్పవలసి

యుండును. సిద్ధాంత సూత్రములు నాలుగింటిలోను సృష్టి యొక్క జీవ కర్తృత్వమును నివర్తింపజేయు నిర్ణయము చేయబడుచున్నది. సంశయములోని ఒక కోటి కదా పూర్వపక్షము! తన్నివర్తకముగా సిద్ధాంత సూత్ర ముండును. అందువలన, ఈ యధికరణమునందు సృష్టి యనునది జీవుని సంకల్పము వలననా? పరమాత్మ సంకల్పమువలననా? అనునదియే సంశయము యొక్క ఆకారము. "సంధ్యం తృతీయం స్వప్న స్థానం" అని, సంధ్య మనగా - స్వప్నముగా చెప్పబడినది. జాగర దశకును, సుషుప్తి దశకును మధ్యభాగమున సంధిలో ఉండునది కనుక, స్వప్నమునకు సంధ్య మని పేరు. ఈ దశ లోని సృష్టి - జీవ కర్తృత్వమే యని పూర్వపక్షము.

స్వప్నము లోని వస్తువులు జాగ్రద్దశలో వానివలెనే సృష్టించబడినవా? లేక, కేవలము రజ్జు సర్పాదుల వలె భాసించునట్టివా? అనగా - స్వప్న పదార్థములది కూడ సృష్టియే యగునా? కాదా? అను సంశయమును, 'సృష్టి కాదు' అను సిద్ధాంతము ఈ సూత్రముతో చేయు అవకాశ మున్నది. ఐనచో - అప్పుడీ సూత్ర మొకటియే ఒక అధికరణముగా ఏర్పడును. అదియును దోషము కాదు. కాని, శ్రీభాష్యకారులు తమ బుద్ధికి తోచినట్లు గాక, ప్రాచీన మగు ఆర్ష సంప్రదాయము ననుసరించినవా రగుటచే, దీనిని ప్రత్యేక అధికరణముగా ప్రాచీనులు చెప్పనందున, వీరును ఆ రీతిగా చేయలే దని భావింపవచ్చును. ఇది పరమాత్మ సృష్టియే యని నిర్ణయించినను, సృష్టియా? కాదా? అను సంశయము తొలగిపోవుచునే ఉన్నది గదా! అందువలన, ప్రాచీనులును అధికరణ భేదము చేయలే దని గ్రహింపవలసి యున్నది.

ఈ సృష్టి జీవ కర్తృకమే యని పూర్వపక్ష మేర్పడుటకు - 'అతడు కర్త గదా!' అను వాక్యములోని 'అతడు' అను పదము కారణము. అతడు అను శబ్దము జీవునినే ఇచట చెప్పుచున్న దని పూర్వపక్ష తాత్పర్యము. కారణ మే మనగా - ప్రక్రాంత మగు అర్థమునే 'తత్' శబ్దము చెప్పును కదా! పైన స్వప్నానుభవము చెప్పబడినది. "స యత్ర ప్రస్వపితి" 'అత డెపుడు పరుండునో' అని, జీవుడే పై వాక్యములలో చెప్పబడినాడు. ముందు కూడ, జీవుని గురించిన వాక్యములే కానవచ్చుచున్నవి. కనుక, ఇచట - 'అతడు' అనగా - జీవుడే తాను కోరుకొనువానిని స్వప్నములో సృష్టించుకొనునని చెప్పువాక్య మున్నది :-

" య ఏష సుప్తేషు జాగర్తి కామం పురుషో నిర్మిమాణః."

అనునది. జీవుడు కోరుకొనునవి యేవియో - మృత్యువు నచికేతునకు ఈయగల ననినపుడు పేర్కొనబడినవి :-

"శతాయుషః పుత్ర పౌత్రాన్ వృణీష్వ ... "

'చిరంజీవు లగు పుత్ర పౌత్రులను కోరుకొనుము' అను సందర్భమున, కోరుకొనుదానిని చెప్పియున్నాడు కదా! ప్రజాపతి వాక్యములో జీవునకు సత్యకామత్వ - సత్య సంకల్పాదులు చెప్పబడినవి. అందువలన, తన సంకల్పము చేత జీవుడు చేసిన 'సృష్టియే స్వప్న పదార్థ సృష్టి' యని పూర్వపక్షము.

ఈ యంశమునకు సూత్రకారులు చక్కగా సమాధాన మొసంగి యున్నారు. స్వప్న వస్తువు లగు రథములును, రథ మార్గములును పరమాత్మచే సృష్టింపబడినవియే కాని, జీవుడు సృష్టించుకొనినట్టివి

కావు. జీవునకు సత్య సంకల్పత్వము అనగా - సంకల్పించుకొనినట్లు పదార్థముల నేర్పరచుకొనగలుగుట ఉండవచ్చును. ప్రజాపతి వాక్యములో ఉపదేశింపబడియు ఉండవచ్చును. కాని, ఈ సత్య సంకల్పత్వము జీవునకు ప్రకృతి సంబంధము నశించిన పిదప, పరిశుద్ధాత్మ స్వరూపావిర్భావముతోనే అభివ్యక్త మగును. ప్రకృతి బద్ధుడై జీవు డున్నపుడు - తాను సంకల్పించుకొనిన విధముగా పదార్థముల నేర్పాటు చేసికొనగలిగెడు శక్తి - సంపూర్ణముగా అభివ్యక్తము కాదు. ఇది ఎల్లరకును అనుభవ సిద్ధమే గదా ! అందువలన, స్వప్న వస్తువులను తాను సంకల్పించుకొని, జీవుడు సృష్టించుకొనజాలడు.

స్వప్నములో సృష్టించబడిన రథాది పదార్థములు - ఆ స్వప్న ద్రష్టను ఒకనికే తప్ప, మరి యొకనికి కానరావు. అందువలన, ఇతరుల కెవరికిని ఎట్టి అనుభవమును కలిగించజాలవు. ఇది ఈ పదార్థముల యొక్క ఆశ్చర్యకర మగు సత్త. తా నింతకు ము న్నెన్నడును అనుభవించని వస్తువులను, లేక - అనుభవించిన వస్తువుల కంటె విలక్షణములుగా అనుభవించు వస్తువులను ఆశ్చర్యకరములుగా పేర్కొనుట కదా జరుగుచుండును ! సీతమ్మవారి ఆశ్చర్యకర రూపమును - ఇంతకును నెవ్వరి యందును కానరాని అందమును వివశ పరచుచు వాల్మీకి భగవానుడు - 'దేవ మాయ వలె నున్నది సీతమ్మ'

"జనకస్య కులే జాతా దేవమాయేవ నిర్మితా."

అని వర్ణించినాడు. కనుక, 'మాయ' యనగా - అసత్య మని యర్థము కాదు, ఆశ్చర్య మని యర్థము. మాయ యనగా -

"మాయాం తు ప్రకృతిం విద్యాత్ "

అను ఉపనిషద్వాక్యము ననుసరించి - 'అచేతన ప్రకృతి' అనియు అర్థము చెప్పవచ్చును. ప్రకృత సందర్భమున కనుగుణముగా - 'ఆశ్చర్యకర మగు అచేతన ప్రకృతి నిర్మితము సీతమ్మ శరీరము' అని చెప్పవచ్చును. ఇట్లే, ఇచట స్వప్న పదార్థములు మాయా మాత్ర మని సూత్రకారు లనుటయుండుటను స్వప్నద్రష్ట యగు ఒక్కని యనుభవమునకు మాత్రమే గురి యగుచు, ఇతరానుభవ అయోగ్యములుగా నున్న స్వాప్నిక రథాది పదార్థములు ఆశ్చర్యకర ప్రకృతితో పరమాత్మచేత నిర్మింపబడినవి అను అర్థమే ఏర్పడుట కవకాశము కలదు.

మాయ యనగా - 'జ్ఞానము' అనియు అర్థ మున్నది. ఆ యర్థమును స్వీకరించి - స్వప్నములోని వస్తువులు భాసించుట మాత్రమే కాని, వాస్తవికములుగా లేవు' అను అర్థము కూడ సూత్ర కారులకు వివక్షితమైయుండరాదా ? అనగా - ఉండరాదు. జ్ఞాన మాత్రమే కాని, వస్తువులు లే వను అర్థమును స్వీకరించినచో - 'వానిని సృష్టించును'

"రథాన్ రథయోగాన్ పథః సృజతే."

అను వాక్యము సమన్వయము కాదుగదా ! పరమాత్మ వానిని సృష్టించు ననగా - 'అవి ఉన్నవి' అని కదా అర్థము ! అందువలన, ఇచట సమాధాన సూత్రములో సూత్రకారులు స్వాప్నిక వస్తువులను మాయామాత్రములుగా పేర్కొనుట అసత్య మని చెప్పుటకు కాదు, ఆశ్చర్యము లని చెప్పుటకే.

జాగర దశలో జీవుడు కొన్ని ఘట పటాది కార్యములను నిర్మించుట కనుపట్టుచున్నది. వాని జ్ఞానము ప్రకృతిచేత ఆవరింపబడి యున్నను, జాగర దశలో కొంచెము ప్రకాశించుట కూడ ఉండు నని దీనితో మనము గ్రహింపవచ్చును. కాని, స్వప్నదశలో - పూర్తిగా

ప్రకాశింపకుండుటయే గదా చూచుచున్నాము! అప్పుడు తాను సంకల్పించుట కూడ జరుగుచున్నట్లు అనుభవము లేదు గదా! అందువలన, జీవ స్వరూపము యొక్క అభివ్యక్తి జాగరములో నున్నంతమాత్ర మేని స్వప్న దశలో ఉండుటలేదనవలె గదా! అపుడు సంకల్పరూప కారణమే లేనందున, ఆ యా వస్తువులను స్వప్నమున జీవుడే సృష్టించు ననుకొనుట అసంబద్ధ మగుచున్నది. అందువలననే సూత్రకారులు -

"మాయా మాత్రం తు కార్త్స్న్యేన అనభి వ్యక్త స్వరూపాత్"

అని కటాక్షించి యున్నారు. "కార్త్స్న్యేన" అనగా - మొత్తము, సంపూర్ణముగా అని యర్థము. జాగర దశలో గల ఆ కొలది సంకల్ప పాటవాదులు కూడ లేనందున, స్వప్నదశలో స్వరూపము సంపూర్ణ ముగా అనభివ్యక్తము. అట్టి స్వరూపము గల జీవుని అనుభవ విషయము లగుచున్న ఆ వస్తువులు - ఆ జీవుని సంకల్పము వల్లనే సృష్టింపబడిన వనుట అనుపపన్నము. జీవుడు సృష్టించుకొని అనుభ వించు వస్తువులు ఆశ్చర్యములు కూడ కాజాలవు. అందువలన, స్వప్న వస్తుసృష్టి జీవ కర్తృకము కాదు, పరమాత్మ కర్తృకమే అని చెప్పవలసి యున్నది.

ఆ ప్రకరణములో - 'అతడు కర్త గదా!' "న హి కర్తా" అను నపుడు - పూర్వాపర వాక్యములలో పరమాత్మను గురించి ప్రస్తావించబడకుండుట వాస్తవమే. కాని, స్వప్న ప్రతిపాదక మగు కఠోపనిష త్సంబంధ ప్రకరణములో - "య ఏషు సుప్తేషు జాగర్తి" అని యారంభించి, "త దేవ శుక్రం తద్ బ్రహ్మ తదేవామృత ముచ్యతే" అనుచు - స్వప్న పదార్థ నిర్మాణ మొనరించునది పర బ్రహ్మమే అని స్పష్టముగా వివరింపబడి యున్నది. కనుక, బ్రహ్మయే

స్వప్న సృష్టికర్త యని నిస్సంశయముగా నిర్ణయింపవచ్చును. దీని ననుసరించి – "స హి కర్తా" అనుచోట కూడ – 'అతడు' అనగా – స్వప్న వస్తు ద్రష్టగా ప్రసిద్ధి బడసిన పరబ్రహ్మ యనియే అర్థము చెప్పికొనుట ఉచితము కదా! దీనిని బట్టి – 'స్వప్న వస్తువులు జీవ సృష్టములు కావు' అని నిరూపితమైనది.

ఐనచో – ప్రజాపతి వాక్యములో సత్య సంకల్పత్వము జీవునకు చెప్పబడియే యున్నది కదా! అదియు ఆగంతుకము కాదు. సహజ సిద్ధ మనియే కదా సిద్ధాంతము! అట్లైచో – ఆ స్వరూపము అభివ్యక్తము కాకుండుటకు కారణ మేమి? అనగా పరమాత్మ సంకల్పమే కారణ మని యందురు. అనాది కర్మ సంబంధముతో జ్ఞాన స్వరూపము ఆవరింపబడి యున్న జీవుడు చేయు పాపముల ననుసరించి, పరమాత్మ – వాని యొక్క స్వరూపము అభివ్యక్తము గాకుండునట్లు కనుపడని విధముగా నుంచును. ఆయన సంకల్పమును బట్టి, జీవునకు బంధ విముక్తి ఏర్పడు నని శాస్త్ర ముపదేశించుచున్నది. బంధ దశ యనగా – ప్రకృతి సంసర్గము కలిగియున్న దశ. అది స్థూల శరీర సంబంధ రూపము కావచ్చును. సూక్ష్మ శరీర సంబంధ మాత్ర రూపము కావచ్చును. సృష్టి దశలో జీవులు స్థూల శరీరము కలవారై యుందురు. ప్రళయ దశలో కేవల సూక్ష్మ ప్రకృతి సంశ్లిష్టులై యుందురు. ఎట్టి స్థితి యందును స్వరూప తిరోభావమే కాని, అభివ్యక్తి ఉండదు. పరంజ్యోతి స్వరూపు డగు పరమాత్మను చేరిన దశలో మాత్రమే స్వస్వరూపావిర్భావము చెప్పబడుచున్నది. అందు వలన, స్వప్న దశలో జీవుడు కొన్ని వస్తువులను సృష్టించుకొనుట అసంభవము. స్వప్నము నందలి సృష్టి పరమాత్మదే.

మరి యొక మాట :– స్వప్నము శుభాశుభ సూచక మనియు శ్రుతి ఉద్ఘోషించుచున్నది :–

"యదా కర్మసు కామ్యేషు స్త్రియం స్వప్నేషు పశ్యతి
సమృద్ధిం తత్ర జానీయాత్ తస్మిన్ స్వప్న నిదర్శనే."

స్వప్నములో స్త్రీ సందర్శనము సమృద్ధికి సూచక మని ఛాందోగ్యోప నిషత్తు చెప్పబడినది గదా ? సూచకములను జీవుడు సృష్టించుకొను నని తలంచినచో, అశుభ సూచకములను సృష్టించుకొనుట అనుపపన్న మగును గదా ! అందువలన, స్వప్న సృష్ట పదార్థములు జీవ సంక ల్పాయత్తములు కావు. పరమాత్మ సంకల్పాయత్తములే యనవలె నని సిద్ధాంతము.

దీనివలన, జాగర దశ వలె స్వప్న దశయు ఒకటి కల దని తెలిసికొనవచ్చును. ఈ స్వప్న దశలోని వస్తువులనుకూడ పర మాత్మయే సృష్టించు ననియు భావింపవచ్చును. జాగర దశలోని పదార్థములు అనేక వ్యక్తుల యొక్క అనుభవమునకు కారణము లగును. స్వాప్నిక పదార్థములు ఏక వ్యక్తి మాత్రానుభవమునకే కారణము లగును. జాగర దశలో కానవచ్చిన గరుడాదులవలె స్వప్నమున కానవచ్చిన స్త్రీ ప్రభృతులు శుభ సూచకములుగా తెలియనగును. జాగర దశలోనివి మన కొక విధమైన అనుభవమును కలిగించుటకే పరమాత్మచేత సృష్టించబడుచున్నవి. కనుక, సత్యములే. అట్లే, స్వప్న దశలో నివియు మన కొక విధ మగు అనుభవము కొరకు పరమాత్మచేతనే సృష్టించబడినవి. అందువలన, జాగ్ర ద్దశలోని పదార్థముల వలె స్వప్నము లోని వస్తువులును సత్యములే. కనుక, జాగర దశానుభూతుల వలెనే స్వప్న దశానుభూతులును వైరాగ్య జనన మూలమున భగవ దుపాసనకు ఉపయుక్త మగుచున్న వని తన్నిరూపక వాక్యార్థ విచారి రూప మగు ఈ యధికరణము ఈ ప్రకరణమున స్థానమును సంపాదించుకొనినది.

జాగ్ర ద్దశలోనే పరమాత్మ జీవుని చిత్ర విచిత్ర కర్మల కను గుణ మగు అనుభూతుల నందించుటకు స్వప్న దశయందును తదేక మాత్రానుభావ్యము లగు, అశ్చర్యకరము లగు వస్తువులను సృష్టించు చున్నా డని ఈ యధికరణము నిర్ణయించుచున్నందున, పరమాత్మ యొక్క అద్భుత శక్తిరూప గుణావిష్కరణ మొనరించిన ట్లగు చున్నది. ఉపాసనానుగుణ మగు భగవ దభిరుచిని పెంపొందించి, ఉపాసన యందు ప్రవర్తింపజేయునది భగవద్గుణానుసంధానమే కదా! అది ఈ రెండవ పాదమునకు విషయ మని భావించితిమి. కావున, స్వాప్నికాద్భుత పదార్థ సర్జనోచిత విలక్షణ శక్తి, కావితా రూప మగు గుణమును తెలియజేయు ఈ యధికరణము - ఈ పాద ముతో సంగతమైనది.

## 2. తదభావాధికరణము

స్వప్న పదార్థ సృష్టి కర్తృత్వమువంటిదే మరి యొక గుణము పరమాత్మకు సంబంధించినది. అదేమనగా - జాగర దశ యందును, స్వప్నదశయందును బహువిధ కిష్టము లనుభవించి, అలసిపోయిన జీవుల శ్రమను తొలగించుటకు పరమాత్మ తన ఒడిలో జీవు లను విశ్రమింప జేయుట, నేద దీర్చుట అనునది సుషుప్తి దశలో జరుగు పని. ఈ గొప్ప గుణమును చెప్పునది ఈ యధికరణము. ఇట్లు ఇదియు ఒకానొక గుణావిష్కరణ మొనరించు నదియే కనుక, పూర్వాధికరణముతో దీనికి కార్యైక్యమే సంగతి యనవచ్చును. స్వప్న దశవంటిదే జీవునకు ఇదియు ఒక దశా విశేషమే యైనందున, స్మృతి కలుగవచ్చును. స్వాప్నిక పదార్థ సృష్టి భగవంతునిదే యని అంగీకరింపవచ్చును. కాని, సుషుప్తి దశలో ఆధారముగా నుండువాడు భగవంతు డొక్కడే యను నియమము లేదు. నాడులందును, పరీతత్తు

నందును అచ్చు డుండును జీవు డని శ్రుతులు చెప్పుచున్నవి గదా! అని శంక కూడ ఏర్పడవచ్చును. కనుక, ఈ యధికరణ మిచట ఉండ వలసివచ్చినది.

ఛాందోగ్య - బృహదారణ్యకోపనిషత్తులలో - సుషుప్తి దశకు సంబంధించిన వాక్యములు ఈ యధికరణమునకు విషయములు. ఛాందోగ్యములో ఒక చోట - "ఆసునాడీషు సృప్తో భవతి" పడుకొనినవాడు కలలు కూడ కనకుండ నున్నపుడు — ఈ నాడులలో తిరుగును' అని యున్నది. బృహదారణ్యకములో - "హితా" అను పేరు గల డెబ్బది రెండు వేల నాడులు హృదయము నుండి 'పురీతత్తు' అనబడు నొక మాంస పిండము వరకును వ్యాపించియుండు నని చెప్పి, "తాభిః ప్రత్యవసృప్య పురీతతి శేతే" ఆ నాడుల నుండి వచ్చి పురీతత్తులో జీవుడు పరుండును' అని చెప్పబడి యున్నది. ఛాందోగ్యము లోని సద్విద్యా ప్రకరణమున - "సతా సోమ్య తదా సంపన్నో భవతి" సుషుప్తి యందు - సచ్ఛబ్దవాచ్యు డగు పరమాత్మ యందు సంశ్లేషము చెందియుండునే యని యున్నది.

ఈ వాక్యములను బట్టి, ఇవి మూడును జీవుని సుషుప్తి దశకు ఆధారములు అని భావింపవలసి యున్నది. ఐనచో - మూడిటి యందు ఒకేసారి ఒక జీవు డుండుట ఉపపన్నము కాదు. కనుక, నాడులం దైనను, పురీతత్తునం దైనను, బ్రహ్మయం దైనను ఉండవచ్చు నని తెలియవలెను. ఇట్లు తెలియవలె ననగా - వికల్పముగా నుండుట అని భావించితి మని యర్థము. వికల్ప స్థితిని అంగీకరించినచో - అనుపపత్తి యొకటి ఉన్నది. శాస్త్రమున వికల్ప మనగా - శాస్త్రకారులు ఎని మిది దోషములు కలదిగా చెప్పుచుందురు. ప్రస్తుతము అనుపపత్తి

యే మనగా - నాడులలో నున్నపుడు పురీతత్తు నందును, బ్రహ్మ యందును లేడనియే చెప్ప నొప్పును. కనుక, ఆ రెంటి యందును జీవుని ఉనికిని చెప్పు శాస్త్రమునకు బాధ ఏర్పడును. దానియం దున్నపుడు బాధ ఉండదు. మరి యొక చోట నున్నపుడు దీని యందు లేడు గనుక, దీనిని చెప్పు శాస్త్రమునకు బాధ యేర్పడును. ఈ బాధ ననుభవింపజాలక, మూడిటి యందును ఉండుననగా - ఒక జీవునకు మూడిటి యందు ఉనికి బాధితము కదా! అందువలన, ఈ మూడు స్థానములకు వికల్పమా? సముచ్చయమా? అని సంశయ మేర్పడును.

సాధారణముగా పూర్వపక్షి మొదటి వికల్ప పక్షమునే సమర్థించును. సముచ్చయము అనగా - మూడిటి యందును కలిసి యుండుట అసంగతము కనుక, వికల్ప పక్షమునే ఆశ్రయించవలె నని పూర్వపక్షము. మూడు స్థానముల యందును కలిసియుండజాలనంత బృహత్ స్వరూపము జీవునకు లేదు. జీవుడు అణు స్వరూపుడ గదా! అందువలన, అగతికము గావున, పాక్షికముగా ఏర్పడు శ్రుతి వాక్య బాధ వహించవలె నని పూర్వపక్షి మతము.

వాస్తవముగా గత్యంతరము లేనిచో, శ్రుతివాక్య బాధ అంగీకరించవచ్చును. కాని, సముచ్చయ పక్ష మను ఒక గతి ఉన్నది కనుక బాధ నాశ్రయించుట సమంజసము కా దని సమాధానము. నాడుల యందును, పురీతత్తునందును, బ్రహ్మ యందును అణు స్వరూపు డగు ఒక వ్యక్తి ఒకేసారి శయనించుట అసంభవము గదా యని భావింపరాదు. సాక్షాత్తుగా ఒక చోట, పరంపరగా మరి రెండు స్థానము లందును శయన వ్యవహారము ఉపపన్నము కావచ్చును. లోకము నందును మేడపై మంచము నందలి పరుపుపై పరుండిన వ్యక్తిని గురించి, మేడపై పరుండినా డనియు, మంచముపై పరుండినా డనియు, పరుపుపై పరుండినా డనియు వ్యవహరింతురు కదా! ఇచట

పరువుతో సాక్షాత్తుగ సంబంధము. మిగిలిన రెంటితోను పరంపరగా సంబంధమును చెప్పుకొనవలెను. ఇట్లే, ఇచ్చటను - నాడులు, పురీతత్తు అనునవి - మేడ, మంచము వంటివి బ్రహ్మ సాక్షాత్తుగా జీవునకు ఆధార మని భావింపవచ్చును

ఐనచో - నాడులతోనో, పురీతత్తులతోనో సాక్షాత్సంబంధమును చెప్పి, బ్రహ్మనే మేడ స్థానములోనో, మంచము స్థానములోనో ఉంచవచ్చును గదా! సాక్షాత్సంబంధము బ్రహ్మతోనే కలదనుటకు ప్రమాణ మేమి? అనగా .. మేలుకొనిన సమయ స్థితిని చెప్పు వాక్యమే ప్రమాణ మందురు.

"సత ఆగమ్య న విదుః సత ఆగచ్ఛామహే."

అను ఛాందోగ్య వాక్యము - 'సచ్ఛబ్ద వాచ్యు డగు పరమాత్మ నుండి మేలుకొని వచ్చు జీవులు - తాము పరమాత్మ నుండి వచ్చుచున్నా మని తెలిసికొన జాలరు' అని చెప్పుచున్నది. ఈ వచ్చుట అనునది - 'పరమాత్మ నుండి' యని స్పష్ట మగుచున్నందున, పరమాత్మతోనే సాక్షాత్సంబంధమును చెప్పవలసి యున్నది. ఇట్లు సుషుప్తి దశ యందును జీవునకు సాక్షా దాధారముగా నుండుట యను నొక గుణము పరమాత్మ ఇందు చెప్పబడినందున, ఇదియు ప్రకృతోపయుక్తమైనదిగా భావింపవలెను.

## 3. కర్మానుస్మృతిశబ్దవిధ్యధికరణము

'సత్సంపత్తి' యనగా - పరమాత్మ యందు
సుషుప్తి యని నిర్ణయింపబడినది. ఐనచో, ఈ
స్వరూపమే యగునా? ముక్తి కంటెను
సంశయము. దీనికి సమాధాన
గొప్ప ఆనందము కల

వచ్చి సంసారములో పడుచున్నాడుకదా? సుషుప్తుడు ముక్తుడే అని శంకించినచో, తిరిగి రాకూడదు. తిరిగి వచ్చుచున్నందున సుషుప్తి ముక్తి కాదని తెలియుచున్నది. సత్సంపత్తి, మహానందము అనునవి ముక్తి యనుకొనుటకు అవకాశ మిచ్చుచున్నవి. కనుక, సుషుప్తి ముక్తియే యగునా? కాదా? అను సంశయ మేర్పడవచ్చును. అట్లు కాక, తిరిగివచ్చువాడు వేరొకడే కాని, సుషుప్తి చెందినవాడు కాడు అని భావింపగల్గినచో, సుషుప్తి ముక్తియే కావచ్చును. కాని, తిరిగి వచ్చువాడు వేరు ఐనచో – సుషుప్తి చెందిన వాని అనుభవములను స్మరించి చెప్పుట సాధ్యము కాదుగదా! అందువలన, ఇపుడు సుషుప్తి చెందినవాడే తిరిగి వచ్చుచున్నాడా? లేక, మరియొకడు తిరిగి వచ్చుచున్నాడా? అను విషయమును అవగాహనము చేసికొనజాలక, సుషుప్తి విషయమున సందేహ మేర్పడవచ్చును. ఆ సంశయమును తొలగించుటకు ఈ యధికరణము ఉద్దేశింపబడినది. అందువలన, ఈ యధికరణమునకు శేషభూతమై, తద్ద్వారా ప్రకృతోపయోగి యగుచున్నది. సుషుప్తి పరీక్షా ప్రకరణము ఏర్పడినందున, సుషుప్తికి ముక్తి వైలక్షణ్యము కూడ జిజ్ఞాసితమైనందున చెప్పవలసివచ్చినది. ఇట్లు జిజ్ఞాస ఏర్పడి, తరువాతి మూర్ఛా దశా నిరూపణమును అడ్డుకొనినది. ఈ జిజ్ఞాసితమై స్మరణకు వచ్చిన యంశము ఉపేక్షించవలసినది కానందున, ఈ యధికరణమున చెప్పబడుచున్నది. కనుక, పూర్వాధికరణమునకు పిమ్మట ఈ యధికరణ మేర్పడుటకు ప్రసంగము సంగతి యనుకొనవచ్చును.

సుషుప్తి చెందిన వానికంటెను తిరిగి వచ్చువాడు వేరు కావలయును అను పూర్వపక్షము సుషుప్తి చెందినవానికి – "ఏషో ఽస్య పరమ ఆనందః." అని, ముక్తుని ఆనందమువంటి ఆనందమును చెప్పు బృహదారణ్యకోపనిషత్తు లోని ఒక వాక్యమును బట్టి ఏర్పడుచున్నది. పరమాత్మ

యందలి ఉనికిని బట్టియే ఆ యానందమును చెప్పుకొనవలెగాని, సుషుప్తునిది ముక్తానందము కాదని సమాధానము. సుషుప్తి నుండి లేచుకొనినవానిని ఇంతకు మున్ను సుషుప్తి చెందినవానితో అభేదము చెప్పుటకు చాల కారణములున్నవి. సుషుప్తికి పూర్వము ఆ జీవు డొనరించిన పుణ్య పాప రూప మగు కర్మ మరల అతడే అనుభవింపవలె గదా! అందువలన, సుషుప్తి చెందిన వాడే మేల్కాంచి వచ్చినవాడు, 'అపుడు పరుండినవా డను ఓహో! ఇపుడు లేచినాను' అని, ఈ లేచినవాడు అనుకొనుట కలదు కదా! ఈ ప్రత్యభిజ్ఞయు సుషుప్తుడే ఈ ప్రబుద్ధుడు అని తెలుపుచున్నది.

ఇట్లే కొన్ని ఉపనిషద్వాక్యములు కూడ కలవు.

"త ఇహ వ్యాఘ్రో వా సింహో వా .. .... యధ్య ద్భవంతి తదా భవంతి."

అని ఛాందోగ్య వాక్యము, సుషుప్తి నుండి మేల్కాంచినవాడు పూర్వ మే స్థూల శరీరము గలవాడుగా నుండెనో, తిరిగి అతడే - అనగా, అట్టి శరీరము గలవాడుగనే ఉండును' అని ఈ వాక్యము చెప్పుచున్నది. సుషుప్తుడే ముక్తుడైనచో, ముక్తిని గురించి చేయవలసిన ఉపాయములను విధించు శాస్త్రవాక్యములు నిరర్థకములు కావలసి యుండును గదా! ఈ సుషుప్తి చెందినవాడు సర్వోపాధి వినిర్ముక్తు డనుటకును ప్రమాణములు లేవు. అందువలన, సుషుప్తి ముక్తి కాదు. సుషుప్తి నుంచి తిరిగి వచ్చినవాడు సుషుప్తుని కంటెను వేరు కాడు. సుషుప్తియు జాగర స్వప్నముల వంటి ఒక సాంసారిక దశయే. దీని నుండియు పునరావృత్తి యున్నది అని తెలిసికొనినందున, సుషుప్తి యందును వైరాగ్యము కలుగుటకు అవకాశ మున్నది. ఇట్లు ఈ యధికరణము పూర్వాధికరణ శేషభూత మనబడుచున్నది. పరంపరయా? అనగా - పూర్వాధికరణ ద్వారా, భగవ ద్వ్యతిరిక్త విషయ వైరాగ్య జనన రూప ప్రకృత కార్యోపయోగి యగుచున్నది.

ప్రసంగ వశమున స్మృతమై, అనుపేక్షణీయమైనందున నిరూపించ బడినది.

## 4. ముగ్ధాధికరణము

వైరాగ్య పాదములో పంచాగ్ని విద్యా విచార సందర్భమున, జాగర దశయు మరణ దశయు వివరింపబడినది. ఈ ఉభయ లింగ పాదమున ఇంతవరకు మూడధికరణములలో స్వప్న దశయు, సుషుప్తి దశయు సమీక్షింపబడినవి. ఈ దశ లన్నియు హేయము లను బుద్ధి గలిగి, పరమాత్మ వ్యతిరిక్త విషయ వైరాగ్యము కలుగవచ్చు ననుట ప్రకృతోపయోగము. ఐనచో - ఈ నాలుగు దశలే కాక, లోకములో - మూర్ఛ యను మరి యొక దశయు కానవచ్చు చున్నది. అదియు ఇచ్చట స్మరణకు రాక మానదు గదా! అదియు - హేయమై, వైరాగ్యకారియే కనుక, పూర్వాధికరణముతో, ఈ యధికరణమునకు కార్యైక్యమే సంగతి యనవచ్చును. ఇట్లు లోకమున మూర్ఛావస్థ కానవచ్చును. కాని, ఉపనిషత్తులలో ఈ దశను గురించిన ప్రస్తావనయే లేదు. అందువలన, ఈ మూర్ఛావస్థ ఉపనిషత్తులలో పేర్కొనబడిన నాలుగు దశలలో నేదేని యొక దానిలో చేరునా? లేక, ఇది వేరుగా గల మరియొక దశయా? అని సందేహ మేర్పడును.

మూర్ఛా దశలో జ్ఞాన మేమియు ఉండదుగదా! కనుక, జాగర స్వప్న దశలలో నిది చేరు ప్రసక్తియే లేదు. కాని, సుషుప్తి దశ యందో, మరణ దశయందో అంతర్భవించవచ్చు నని పూర్వపక్ష మేర్పడును. ఉపనిషత్తులలో ప్రత్యేకముగ చెప్పబడనందున, వేరు కాదు. ఇక మూర్ఛకు పిమ్మట జీవించగలిగినచో, సుషుప్తి యనవలసి యున్నది.

జీవించనిచో - మరణ మనవలె నని పూర్వపక్షి యొక్క ఆశయము. కాని, సిద్ధాంతమున సూత్రకారులు దీనిని ఇట్లు అవ్యవస్థితముగా పేర్కొనవలసిన యవసరము లే దని వక్కాణింతురు. అనగా - ఇది జాగర స్వప్న దశల కంటెను భిన్నమైనట్లు, సుషుప్తి మరణ దశల కంటెను విలక్షణమై యున్నది. ఏల నన, బాగుగా అలసినపుడు కదా సుషుప్తి యేర్పడును! కనుక, మూర్ఛ ఏదియో బలిష్ఠ మగు దెబ్బ తాకినపుడు కలుగును. ఇట్లే, మరణ దశలో - ముఖాను లందు ఏదియో యొకవిధ మగు వికార మేర్పడును. వేడి ఉండదు. ఉచ్ఛ్వాస నిశ్వాసములును ఉండవు. వణకుటయు ఉండదు. మూర్ఛలో వేడి యుండును. వణకుట, ఉచ్ఛ్వాస నిశ్వాసాదులు ఉండును. కనుక, మూర్ఛ - నాలుగు అవస్థల కంటెను భిన్నమైన ఒక అవస్థ యని తెలియ నగును.

ఐనచో - ఉపనిషత్తులు ప్రత్యేకముగ పేర్కొనకపోవుటకు కూడ కారణ ముండవలె గదా! ఆ కారణ మేమనగా - ఇది మరణ పూర్వభావి దశా విశేష మగుటయే. అర్థ మరణ దశ కనుక, దీనిని ప్రత్యేకముగ చెప్పక, మరణ దశ యందే అంతర్భవింపజేయవచ్చు నను భావమును మనము గ్రహింపవచ్చును. రాగాదులు మనస్సులో లయించుట మరణ దశ యందు వలెనే ఏర్పడును. ప్రాణ వాయువు మాత్రము జీవునియందు చేరక, వెలుపలి వాయువు లోను సంబంధించ కుండును. ఇదియే మూర్ఛావస్థ. మరణమున సూక్ష్మ ప్రాణము తోను దేహ సంబంధము విడిపోవును. మూర్ఛలో విడిపోదు. తరు వాత మరణము కలుగకపోవుటకు - ప్రబల మగు ప్రతిబంధక మేదియో యుండును. కనుక, మూర్ఛాసమనంతరమే మరణము జరుగ లే దని తలంపవలెను. వస్తుతః మరణమున కెయ్యది ఫలమో, మూర్ఛకు కూడ అదియే ఫల మనవలెను. ఈ విధముగా నాలు గవస్థల కంటె

భిన్నమైనచో, మరణ పూర్వభావి దశా విశేషముగా పేర్కొనుటకు వీ లున్నందున, మూర్ఛ అనునది ప్రత్యేకముగ ఉపనిషత్తులలో పేర్కొనబడలే దని భావింపవచ్చును. కాని, పూర్తిగా మరణ మను టకు వీలు లేనందున, సూత్రకారులు దీనిని 'అర్ధసంపత్తి' యని వ్యవ హరించిరి. రామానుజులు మనస్సుతో, మనస్సు ప్రాణముతో చేరి యున్న దశ యిది, ఇక, ప్రాణము కూడ జీవునిలో చేరి పైకి వెళ్ళి నచో, మరణ మగును. మనస్సునకు ప్రాణ సంపత్తి ఉపనిషత్తు లలో పేర్కొనబడుచునే యున్నది కదా! అందువలన, ఈ మూర్ఛా దశ మరణ పూర్వభావి దశ యని ఉపనిషత్తులు పేర్కొనినవి అని భావింపవచ్చును. ఇప్పటికి జీవుని హేయ దశ లన్నియు చెప్పబడినవి.

## ౫. ఉభయలింగాధికరణము

తృతీయాధ్యాయములో మొదటి నుండి సార్థపాదమునను సంబం ధించిన పది అధికరణములు జీవుని జనన మరణ జాగర స్వప్న సుషుప్తి మూర్ఛా దశా విశేషముల వివరించినవి. ఈ వివరణము నకు ముఖ్య తాత్పర్యము జీవునకు తన ఈ సాంసారిక స్థితి యందు వైరాగ్యమును కలిగించుటయే. అందువలన, ఈ అధికరణములు వైరాగ్య పేటికగా అమర్చబడినవి అని గమనింపవచ్చును. భగవ దుపాసనకు ఈ సాంసారిక స్థితి యందలి వైరాగ్యము చాల సహకరింప బడగలదు. హేయ మగు సంసారము నందు వైరాగ్యము వలెనే ప్రాప్య మగు భగవంతునియం దభిరుచి వృద్ధి యగుటకు ఆయన యొక్క గుణ చింతన మవసరము. ప్రథమాధ్యాయములో విషయ వాక్య ములుగా నుదహరించిన పలువాక్యములు భగవంతుని బహు గుణము లను ప్రపంచించినవి. ఈ ద్వితీయ పాదములో ఇంతవరకును మరి కొన్ని అధికరణముల యందును పరమాత్మ గుణములు ప్రతిపాదింపబడు చున్నవి ఇట్లు ఉపాస్య వస్తువు యొక్క గుణములను పునఃపున రను

సంధానము చేసికొనుటయే అభ్యాస మని వ్యవహరింతురు. తద్గుణాను సంధానరూప మగు అభ్యాస మిప్పుడు అత్యంతోపయోగి కదా !

అందువలన, వైరాగ్య పేటికానంతరము భగవంతుని సకల కల్యాణ గుణాకరత్వ మను మరియొక పేటిక మొదలగుచున్నది. రెండు పేటికలలోని విషయములు కూడ ప్రకృత ఉపాసనా రూప మగు ఒకే కార్యమున సహకరించునవి కనుక, ఈ రెండు పేటికలకు ఏక కార్యకారిత్వ మనునది సంగతి. ఇట్లే, జీవునకు ఆ యా దశలలో హేయము లగు కొన్ని దోషములు వివరించబడినవి గదా ! ఐనచో - జీవుని విడువక, జీవునితోబాటు పరమాత్మయు ఆ యా దశ లన్నిటి యందును వెంటనే ఉండును కదా ! ఐనపుడు, జీవునకువలె పర మాత్మకు కూడ ఈ హేయ దోష సంబంధము ఉండియే తీరునగ - అను ఆశంకతో - పరమాత్మోపాసన ప్రతిబంధింపబడవచ్చును. దోషములు గలవానికి ఉపాసన చేయుటకు ఎవరును నమ్మతించరు గదా ! అందువలన, ఈ ఆక్షేపమును తొలగించి, బ్రహ్మోపాసనను సుగమ మొనరించుటకు పరమాత్మ నిర్దోషిత్వముతో పాటు, గుణాకరత్వమును చెప్పు అధికరణ మారంభింపబడుచున్నది.

పరమాత్మ నిర్దోషిత్వ నిరూపణమే ఈ యధికరణము యొక్క విషయము. పరమాత్మకు దోషము లంట వని ప్రథమాధికరణములో ప్రసంగ వశమున ఒకటి రెండు స్థలములలో నిరూపించబడినది. ఐనచో అచట పరమాత్మ కర్మవశ్యుడు కాడు కదా ! కర్మ లున్నచో తదనుగుణమైన దోష సంబంధముకూడ లే దని నిరూపింపబడినది. ప్రకృతమున దోష సంబంధము గల జీవునియం దుంటున్నందున, బ్రహ్మకు కూడ దోష సంబంధ ముండు నని భావించినచో, తన్నిర్ణయా ర్థము అధికరణ మారంభింపబడినది. జీవుని దోషములు వారియందు

గల పరమాత్మకు కూడ ఉండునా ? లేదా ? అనునది ఇచట సందేహము. జీవుని దోషములు పరమాత్మ కంటుకొనగలవు అని పూర్వపక్షము. కర్మలు కూడ దేహసంబంధమును కలిగించి, దాని ద్వారానే కదా జీవునియందు ఇచ్ఛా ద్వేషాది దోషముల కలుగజేయుచుండును ! సర్వేశ్వరుడు కర్మవశ్యుడై కాక, స్వేచ్ఛతోనే ఆ యా స్థానములయందుండునుగాక ! ఐనచో మాత్ర మేమి ? నిర్బంధముచేతనైనను, బుద్ధి పూర్వకముగానైనను బురదలో పడినవానికి బురద అంటునే కదా ! సర్వేశ్వరుడు పృథివి యందును, జలమందును, చీము నందును, నెత్తురు నందును ఉండును. సర్వవ్యాపి యైనందున స్వేచ్ఛతో నున్నను, ఆ యా వస్తు దోషములు స్వామికి అంట వనుటకు వీలు లేదు. ఇట్లు చేతనాచేతనములయం దుండు పరమాత్మకు చేతనాచేతన గత దోష సంబంధము కలిగితీరు నని పూర్వపక్ష సారాంశము.

దీనికి సమాధానముగా బాదరాయణ భగవానుడు –

" న స్థానతోఽపి పరస్య ఉభయలింగం సర్వత్ర హి."

అను సూత్రముతో నొక అధికరణము నారంభించినాడు. ఆ యా స్థాన సంబంధమును బట్టియు పరమాత్మకు దోష గంధమును శంకింప రాదు. ఏ మనగా – శ్రుతులలో కాని, స్మృతులలో గాని అంతటను పరమాత్మ రెండు చిహ్నములు గలవాడుగనే కదా ఉపదేశించబడు చున్నాడు ! ఆ రెండు చిహ్నము లెవ్వి ? అనగా – ఒకటి :– ఎట్టి దోషములును అంటక నుండుట. రెండవది :– అపరిమిత కల్యాణ గుణ గణములు కలిగి యుండుట అనునవి.

" అపహత పాప్మా విజరో విమృత్యుః "

అను ఛాందోగ్య శ్రుతియు –

" సమస్త కల్యాణ గుణాత్మకో உసౌ .. .... ... ...
సమస్త హేయ గుణ రహితం విష్ణ్వాఖ్యం పరమం పదమ్"

అను విష్ణుపురాణము కూడ సర్వేశ్వరుని అఖిల హేయ ప్రత్యనీకత్వమును, అనంత కల్యాణ గుణాకరత్వమును కూడ కలిసి చెప్పుచున్నవి కదా! ఐనచో - జీవుడు కూడ వస్తుతః దోష రహితుడే యైనను, శరీర సంబంధము ద్వారా దోష విశిష్టుడైనట్లు, పరమాత్మయు కావచ్చునేమో! అని శంకించరాదు ఏమనగా - సర్వేశ్వరుడు అన్నిటిలో నుండుననని చెప్పునట్టి ప్రతి వాక్యమునందును -

"స త ఆత్మా, అంతర్యా మ్యమృతః."

ఆ అంతర్యామికి దోషము లంటవు అని గదా వివరింపబడుచున్నది!

వస్తువు తన స్వభావము వలన దోషముల నంటించును కదా! బురదలో పడినవానికి బురద అంటినట్లు అని పూర్వపక్షి ఒక మాట పలికెను. కాని, వస్తు వేదియు సహజముగా దుఃఖమును కలిగించునదిగనో, సుఖమును కలిగించునదిగనో ఉండదు. జీవుని కర్మానుగుణముగనే వస్తువులు సుఖ దుఃఖాదులను కలిగించుచుండును.

"త దేవ ప్రీతయే భూత్వా పున ర్దుఃఖాయ జాయతే."

కనుక, ఏ వస్తువు కూడ నియతముగా సుఖ రూప మని కాని, దుఃఖ రూప మని కాని చెప్పరాదు. బురదలో పడినను కుమ్మరి పురుగునకు బురద అంటదు కదా! తామరాకునకు తడియే అంటదు. మరొక్క మాట. ముండకోపనిషత్తులోని "ద్వా సుపర్ణా .... అభిచాకశీతి" అను మంత్రమును గ్రహింతము. అందులో - జీవుడు కర్మ ఫలము ననుభవించుచుండు ననియు, సర్వేశ్వరుడు అనుభవింపడు, అత్యంత దీప్తికలవాడై యుండును - అనియు చెప్పబడినది. జీవ శరీరకుడుగా పరమాత్మ అంతటను ఉండును నిజమే. ఐనచో - అంత మాత్రముచేత

శరీరము వలన జీవునకు సుఖదుఃఖాది సంబంధము కలిగినట్లు పరమాత్మకు కూడ కలుగునని భావింపరాదు – అని ఈ శ్రుతి వలన మనము గ్రహింపవచ్చును. అందువలన, చేతనాచేతనములకు నామ రూపముల నేర్పరచుట కొరకు లోపల నియామకుడుగా నున్న స్వామికి శరీర సిద్ధికిని యిట్టి దోషసంబంధమును శంకించు నవకాశము లేదు. ఆయన కీ శరీరము ఉండియు, సుఖ దుఃఖాది వికారముల కలిగించునది కానందున, లేని దానితో సమానమే అని గ్రహించవచ్చును.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అను వాక్యము పరమాత్మ సత్య స్వరూపుడు, ప్రకాశ స్వరూపుడు అని చెప్పుచున్నట్లే, "అపహత పాప్మా సత్యసంకల్పః" అను వాక్యము – 'పరమాత్మ దోష రహితుడు, కల్యాణ గుణాకరుడు' అనియు చెప్పబడుచున్నది గదా! గుణములు కలవాడుగా నంగీకరించతగును. జ్ఞాన స్వరూపుడని చెప్పిన వాక్యము గుణాకరుడను అంశమును నిషేధించలేదు కదా! నిషేధించబడకుండుటే గాక, శ్రుతి స్మృతు లనేకములు సర్వేశ్వరుని ఉభయ లింగత్వమును ప్రతిపాదించుచున్నవి. కనుక, నిర్గుణముగా కొన్ని స్థలములలో పేర్కొనబడినను, అది ఇంతటి విస్తృతముగా ప్రతిపాదింపు కల్యాణ గుణ నిషేధపరము కాదని, సత్త్వ రజస్తమో రూప హేతు గుణ నిషేధ పర మనియే గ్రహించవలసి యుండును. ఆ యా స్థానములలో నున్నను, దోషము లంటవు కనుకనే నీటిలోని, అద్దములోని సూర్యుని అచ్చటచట ఉపమానముగా పేర్కొనబడుచుండును అని యందురు సూత్రకారులు. నీటిలోని సూర్యునకు నీటి దోషము లంటనట్లు, ఘటాదుల లోని ఆకాశమునకు ఘటాది దోషము లంటనట్లు, పృథివ్యాదులయందుండు పరమాత్మకు దోషము లంట వని తాత్పర్యము. జలాదులలో వస్తుతః ఆ యా స్థానములలో నున్నను, ఆకాశమునకు వలెనే పరమాత్మకు కూడ

వాని వాని శోషము లంట వని, ఆ యా దృష్టాంతముల నిచ్చు శ్రుతి వాక్యముల సమంజసమైన సమన్వయము.

ఐనచో - బృహదారణ్యకములో నొక చోట - మూర్తా మూర్త స్వరూపము లగు స్థూల సూక్ష్మ జడ పదార్థములు బ్రహ్మకు ప్రకారములుగా చెప్పి - "నేతి నేతి" యని, బ్రహ్మయందు ఎట్టి విశేషము కూడ ఉండ దని నిషేధించబడియున్నది కదా ! ఐనప్పుడు - బ్రహ్మయందు కల్యాణ గుణ రూప విశేషములు కూడ ఉండుటకు వీలులేదు అని శంకించుకొని, సూత్రకారులు ఆ నిషేధ వాక్యమునకు, తనయం దెట్టి విశేషములు లేవని చెప్పటలో తాత్పర్యము కాదని తెలుపుచున్నారు.

" ప్రకృతై తావ త్త్వం హి ప్రతిషేధతి తతో ఉబ్రవీతి చ భూయః "

అను సూత్రములో - కొన్ని విశేషములను పరమాత్మకు చెప్పి, "నేతి నేతి" అని యనుచున్నా రనగా - చెప్పినవారిని నిషేధించుచున్నా రని కాదు. మ రేమనగా - నిషేధించిన తరువాత కూడ మరి కొన్ని విశేషములను ఈ శ్రుతి చెప్పుచున్నది. విశేషములను నిషేధించుటయందే తాత్పర్య మని తలంచిన పక్షమున, మరి కొన్ని విశేషములను చెప్పుట కూడ అనుపపన్నము, అసమంజసము అగును కదా ! అందువలన, "నేతి నేతి" అను వాక్యము పరమాత్మ యొక్క విశేషములను నిషేధించుటలేదు. మ రేమనగా - ఇంత మాత్రమే అనుకొనకూడ దని ఏతావత్త్వమును నిషేధించు చున్నది.

జీవులు తమ తమ శరీరములలో తమకు తాము స్వయం ప్రకాశ స్వరూపు లగుటచేత, ప్రత్యక్ష ప్రమాణముచే తెలిసికొనబడుదురు. ఇతర శరీరము లందును జీవు లున్నా రని చేష్టాదులను బట్టి ఊహించ

అను శ్రుతి వాక్యము చెప్పుచున్నది. అందువలన, పరమాత్మ అనంత కల్యాణ గుణాకరత్వము, నిఖిల హేయ ప్రత్యనీకత్వము అనెడు రెండు చిహ్నములు కలిగియే యుండు నని అంగీకరించుట శ్రుతి సమ్మతము

ఇట్లు ఈ ఉభయ లింగాధికరణము - పరమాత్మ దోష రహితు డనియు, సకల కల్యాణ గుణాకరు డనియు నిర్ణయించును. అందువలన, పరమాత్మ యొక్క ఉపాసనయం దభిరుచి కలుగవచ్చును. ఈ అధికరణము పదునైదు సూత్రములలో నిబంధించబడినది. మధ్యలో - పరమాత్మ విశేష నిషేధమును చెప్పు అధికరణముగా కొన్ని సూత్రములను ఏరి, ఇతరులు అధికరణ భేదము చేసిరి. కాని -

"అతో ఽనన్తేన తథా హి లింగమ్"

ను ఈ చివరి సూత్రము - పరమాత్మ యొక్క ఉభయ లింగ త్వమును సమర్థించుచున్నందున, ఇంతవరకును గల పదునైదు సూత్రములును అవాంతరాశంకా సమాధానముల జేయుచు, ఒకే అర్థ మును ఉభయలింగత్వ రూపమును ప్రతిపాదించుటను బట్టి, భగవద్రా మానుజులు అధికరణ భేద పక్షము నాశ్రయించక, ఏకాధికరణముగా ప్రతిపాదించియున్నా రని తెలియ దగును.

## 6. అహికుండలాధికరణము

పూర్వాధికరణములో భగవంతునకు - సమస్త దోష రహి తత్వము, నిఖిల కల్యాణ గుణాకరత్వము అను రెండు చిహ్నములు ప్రతిపాదింపబడినవి. ఆ సందర్భమున - 'బ్రహ్మ యందు ఎట్టి విశేష ములును లేవు' అని భాసింపజేయునట్టి "నేతి - నేతి" అను వాక్యార్థ ము కూడ సమీక్షింపవలసివచ్చినది.

"ద్వేవావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ"

అనుచు బృహదారణ్యకము - బ్రహ్మకు కొన్ని విశేషములు ప్రతిపాదించి, "నేతి నేతి" యని నిషేధించుచున్నది గదా! అని ఇచట ఒక ఆక్షేప మేర్పడగా, అది విశేషముల నిషేధించుట కాదు, ఏతావత్త్వము ఇంతమాత్రమే అను అంశము నిషేధించబడుచున్న దని సమాధానము చెప్పబడినది. ఈ సందర్భమున, బ్రహ్మకు మూర్తము, అమూర్తము అను రెండు రూపము లున్న వని చెప్పు బృహదారణ్యకోపనిష ద్వాక్యము ఉల్లేఖించబడినది కదా! ఆ వాక్యము వలన ఈ మూర్తామూర్త మంతయు బ్రహ్మ యొక్క రూప మనవలె నని శిష్య జిజ్ఞాస ఏర్పడవచ్చును. కనుక, ఆ వాక్యము యొక్క అర్థమును విమర్శింపవలసివచ్చినది. ఈ మూర్తామూర్తములు బ్రహ్మస్వరూపము నందే చేరినచో - అప్పుడు అచేతనము లగు ఈ మూర్తామూర్తముల దోషములు బ్రహ్మకు అంటుకొనియే ఉండును కదా! అందువలన, పై యధికరణములో నిర్ణయించిన నిర్దోషిత్వము అనుపపన్నము కాగలదు. స్వరూపములో చేరక, ప్రత్యేకముగనే మూర్తామూర్తము లుండు నని నిర్ణయింపబడినచో - నిర్దోషిత్వము ఉపపన్నము కాగలదు ఇట్లు ఈ యధికరణమునకు పై అధికరణముతో ఏక కార్యకారిత్వ మను సంగతి స్పష్ట మగుచున్నది.

మరి యొక మాట:- 'మూర్త' అనగా ఆకాశము కలిగియున్న పృథివి, జలము, తేజస్సు, వాయువు అను పదార్థములు. 'అమూర్తము' అనగా - ఆకాశము. ఇట్లు ఇచట శ్రుతి - మూర్తామూర్త శబ్దములతో పంచభూతములను పేర్కొనుచున్నది. పై యధికరణము యొక్క అర్థమును విచారించు సందర్భమున స్మృత మైన శ్రుతి వాక్యము కదా "ద్వే వావ బ్రహ్మణో రూపే" ఇత్యాదివాక్యము! ఐనచో - ఈ వాక్యార్థమును విచారించు సూత్రములతో వేరు అధికరణము నేల రూపొందించవలెను? అని తలంపరాదు. "అతోఽనంతేన

తద్రాహీ లింగం" అను సూత్రము పై అధికరణము యొక్క అర్థ విచారమును ఉపసంహరించున ట్లున్నది కనుక, ఆ యధికరణమును అంతటితో ముగించుట యుక్తము. ఇక కేవల మీ మూర్తామూర్తములు బ్రహ్మకు ఎట్టి రూపములు ? అను జిజ్ఞాస సూత్రమే కాదు. దీనితో మొత్తము అచిత్ ప్రపంచము పరమాత్మ యొక్క స్వరూప మగుటలోని రీతి యేమి ? అనియే జిజ్ఞాస కలుగవచ్చును. కనుక, మొత్తము అచిత్ ప్రపంచము పరమాత్మ స్వరూప మగు విధాన మేమి ? అను జిజ్ఞాస పైననే ఈ యధికరణ మేర్పడిన దని దీనిలో జరిగిన విచారమును బట్టి నిర్ణయించవచ్చును. కనుక, ఈ యధికరణమున కంటెను భిన్నము కావలసివచ్చినది.

ఇపుడు విచారహేతు వగు సంశయ స్వరూప మి ట్లున్నది . - ఈ అచేతన వస్తువులు బ్రహ్మస్వరూపము లగుట అహికుండల న్యాయమును బట్టియా ? జీవుల వలె ఇవియు విశేషణము లగుచు న్నందున, అంశాంశి భావమును బట్టియా ? అని. వీనిలోని మొదటి రెండు పక్షములు పూర్వపక్షికి వచ్చినవి. చివరిది సిద్ధాంతికి ఇష్టమైనది. ఈ యధికరణములో నిర్ణయించబడు విశేషణత్వమును గ్రహించియే ప్రకృత్యధికరణాదులలో చేతనాచేతన విశిష్టమైనదిగా బ్రహ్మతత్త్వమును పేర్కొనబడిన దని తెలియ వగును.

పూర్వపక్షి అహికుండల న్యాయమును బట్టియే అచేతనము బ్రహ్మస్వరూప మగుట యని భావించవలె ననును. ఏ మనగా - బ్రహ్మకు, అచేతనమునకు తాదాత్మ్యము చెప్పబడుచున్నది. భేదము కూడ చెప్పబడుచున్నది కదా ! ఇవి రెండును సమన్వయము కావలె నన్న, అహికుండల న్యాయమును బట్టియే అచేతనము బ్రహ్మ

స్వరూప మనవలసియుండుట. 'అహి' యనగా - పాము. 'కుండల మనగా - గుండ్రముగా చుట్టుకొనియుండు స్థితి. పాము ఒకప్పుడు ఋజువుగను, చక్కగను ఉండగలదు. మరి యొకప్పుడు - చుట్టుకొని గుండ్రముగను ఉండగలదు. ఈ ఋజుభావము గల పాముకంటెను కుండల భావము వేరుగనే యుండును గదా! వాస్తవమున, పాము కంటెను కుండల భావ మనునది వేరు కాదు కదా! ఇట్లే, అచేతనము కూడ బ్రహ్మ స్వరూప మని అంగీకరించినచో - తాదాత్మ్యము, భేదము కూడ సమన్వయము కావచ్చును కనుక, అచేతనము బ్రహ్మ యొక్క ఒకానొక విధ మగు స్వరూప సంస్థానమే అని పూర్వపక్షము.

ఐనచో - ప్రభా ప్రభావంతముల వలె కూడ చెప్పవచ్చు ననును పూర్వపక్షి. బ్రహ్మ స్వరూపమే అచేతనమైనచో, బ్రహ్మ కంటెను భిన్న మని చెప్పు శ్రుతి వాక్యములకు బాధ కలుగవచ్చును. బ్రహ్మకు పరిణామము లేదని చెప్పు శ్రుతి వాక్యములకు బాధ కలుగవచ్చును. అందువలన, దీపము వేరు, దీప ప్రభ వేరు. ఐనను రెండును తేజస్స్వ జాతికి చెందిన వగుటచే, జాత్యైక్యమును బట్టి, అభేద శ్రుతి వాక్యములు సమన్వయము కావచ్చును. వ్యక్తి భేదమును బట్టి, భేద శ్రుతులును సమన్వయము కావచ్చును. అందువలన, ప్రభా ప్రభావంతుల వలెనే అచిత్ బ్రహ్మలను భావించి, అచేతనము బ్రహ్మస్వరూప మని చెప్పవచ్చు ననియు పూర్వపక్షి మతమే. ఈ మతము సిద్ధాంతమునకు సన్నిహితముగా గన్పడవచ్చును. కాని, వ్యత్యాస మున్నది. ఏ మనగా, 'బ్రహ్మత్వము' అనునది - అచేతన మునకు కూడ పూర్వపక్షి అంగీకరించుచున్నాడు. అది సిద్ధాంత మునకు బహు దూరగ స్థిత మగు విషయము కదా!

మొదటి మతములో - బ్రహ్మ, అచిత్ ఒకటి యైనచో - భేదశ్రుతులు, అపరిణామిత్వబోధక శ్రుతులు సమన్వయము కావు.

అందువలన, మొదటి మతము తప్పు. రెండవ మతములో ఈశ్వరుడు, చేతనములు, అచేతనములు వీని అన్నిటి యందును బ్రహ్మత్వము సమాన మని అంగీకరింపవలసివచ్చును. దీనితో - ఈ మువ్వురకు స్వరూప భేదమును చెప్పు శ్రుతి స్మృతి ప్రభృతులు విరోధించును. "బ్రహ్మవి దాప్నోతి పరం" అనగా - బ్రహ్మను తెలిసికొనినవాడు - ఉత్కృష్ట స్థానమును పొందునని యర్థము. ఐనచో - ఇచట 'బ్రహ్మ' యనగా ఎవరు ? అతనిని తెలిసికొనినవా డెవడు ? ఇట్లు శ్రుతి స్మృతి వాక్యము లనేకములు విరోధించును కనుక, రెండవ పూర్వపక్షి మతము కూడ అనుపపన్నమే. ఐనచో సిద్ధాంత మే మనగా - పూర్వము అంశాధికరణమున - 'జీవులు పరమాత్మకు విశేషణ స్వరూపములు' అని నిర్ణయించినట్లు, అచేతనములు గూడ పరమాత్మకు విశేషణ స్వరూపములు అనియే అంగీకరింపవలెను. విశిష్ట వస్తువు యొక్క ఏకాదేశ స్వరూపములైనందున, అచేతనములకు బ్రహ్మ భేదము సమన్వయము కావచ్చును. విశేషణములస్వరూప స్వభావములు, విశేష్య స్వరూప స్వభావములు పరస్పర భిన్నములు కనుక, భేద వ్యవహారము సమన్వయము కావచ్చును. బ్రహ్మకు నిర్దోషత్వము కూడ కదలించుటకు వీలు లేనిదిగా నుండవచ్చును. అందువలన అంశాంశి భావ రూపముగనే అచేతనములు చేతనముల వలె పరమాత్మ విశేషములు అనవలె నని సిద్ధాంతము. "నాస్య జరయ ఏతత్ జీర్యతి" మొదలగు వాక్యము లనేకములు పరమాత్మకు అచేతన ధర్మములను నిషేధించుచున్నవి కదా ! అందువలన, విశేష్య విశేషణ రూపముగ అంశాంశి భావమే అచిత్ బ్రహ్మలకు చెప్ప నగును. ఇపుడు సూక్ష్మ చేతనాచేతన విశిష్ట బ్రహ్మ కారణము. స్థూల చేతనాచేతన విశిష్ట బ్రహ్మ కార్యము అని చెప్పినందున, కార్య కారణములకు అభేదము సిద్ధించును. ఏక విజ్ఞానముతో సకల విజ్ఞాన ప్రజ్ఞయు సమన్వయించును. పరబ్రహ్మకు విశేషణముల దోషము లంటవలసిన యవస

రము లేదు కనుక, నిర్దోషిత్వము కూడ స్థిరపడును. ఇట్లు నిర్దోషిత్వ సమర్థన మొనరించుచు, ఈ యధికరణము ప్రకృతోపయోగి యైనది.

## 7. పరాధికరణము

చేతనాచేతనములు స్వామికి విశేషణములు. విశేషణముల దోషములు విశేష్యమైన వ్యక్తికి అంటవలసిన యవసరము లేదు. కాని, ఈ దోష రహితుడు, గుణ గణ విశిష్టుడు నగు సర్వేశ్వరుని కంటెను మరియొక గొప్పవాడున్నచో — ఈ సగుణ పరబ్రహ్మయు ఆతని యధీనుడే అని గదా ఏర్పడును! అప్పుడు పరాధీను డనుట వలన అనేక దోషముల కాస్పదుడు కావలసి యుండును. మన మింతవరకు చెప్పికొనిన పరమాత్మ — అట్లే, మరియొక్కని కంటెను తాను తక్కువ వాడైనను — ఇతడు మనకు ప్రాప్యుడును కాజాలడు, భోగ్యుడును కాజాలడు. ఇట్లు గుణములలో కూడ అపకర్ష మేర్పడును. ఐనచో — ఇతని కంటెను గొప్పవా డున్నాడని యెట్లు తెలియుచున్నది? అనగా — "ఏష సేతు ర్విధరణః" అని, ఈ పరమాత్మను సేతు వని చెప్పుచున్నది ఉపనిషత్తు. సేతు వనగా — ఈవలి గట్టువారిని ఆవలి గట్టుకు పొందించునది కదా! అనగా — ఆవలి గట్టున ఈ ప్రాపక మగు సేతు రూప పరమాత్మ కంటెను పరమైన మరియొక వస్తువు కలదు అని భావించుట యనగా — పూర్వపు టధికరణములో ప్రస్తుతమైన ఉపనిషత్తు — "న హ్యేతస్మా దితి నే త్యన్య త్పర మస్తి" అని, ఇతని కంటెను మరియొక ఉత్కృష్ట తత్త్వమే లే దని చెప్పుచున్నది. ఈ సంశయమును కలిగించు "ఏష సేతు ర్విధరణః" మొదలగు వాక్యములు ఈ యధికరణమునకు విషయము. ఈ వాక్యముల అర్థ నిర్ణయము ద్వారా — పరమాత్మ యొక్క నిర్దోషిత్వ సగుణత్వములు సమర్థింపబడుచున్నవి. అట్లగుటవలన పై అధికరణముతో దీనికిని ఏకకార్యకారిత్వమే సంగతి.

ఈ యధికరణములో ఏడు సూత్రము లున్నవి. వీనిలో - మొంటి సూత్రము పూర్వపక్షమును ప్రతిపాదించును.

"పరమతః సేతూన్మాన సంబంధ భేద వ్యపదేశేభ్యః."

అనునది ఆ సూత్రము. ఈ పరమాత్మను - "అథ య ఆత్మా స సేతు ర్విధృతిః" అని ఛాందోగ్యము సేతువుగా చెప్పెయున్నది. సేతు వనగా - ఆవలి గట్టును చేర్చునది కదా! "ఏతం సేతుం తీర్త్వా" అని, దీనిని దాటి అనియు ఉపనిషత్తు చెప్పుచున్నది కదా! ఇందువలన, దీని కంటెను మనము చేరవలసిన పరమ పదము వే రొకటి కల దని స్పష్ట మగుచున్న దని పూర్వపక్షము. ఇట్లే, ఛాందోగ్యము షోడశ కల బ్రహ్మవిద్యలో బ్రహ్మ నాలుగు పాదములు, పదునారు కళలు కల దిగా చెప్పబడినది. ఇట్లు చెప్పుట అనగా - పరిమితిని చెప్పుట కదా! ఉన్మాన మనగా - 'ఇంత' యను పరిమితి. ఇట్లు ఈ పరమాత్మ - పరిమితి కలవా డైనచో, అపరిమిత స్వరూపుడగు మరి యొక గొప్ప పరమాత్మ యున్నట్లు స్పష్ట మగుచున్నది కదా! అనును పూర్వపక్షి. శ్వేతాశ్వతరములో - "అమృతస్య పరం సేతుం" అని, ముండకములో - "అమృత స్యైష సేతుః" ఈ పరమాత్మ అమృతమును చేర్చు సేతు వని పేర్కొనబడుచున్నది. ఇట్లు ఈ పర మాత్మ అమృతమును చేర్చు సేతు వని పేర్కొనబడుచున్నది. ఇట్లు ఈ పరమాత్మకును, ఇతని కంటె గొప్ప దైన పరమాత్మకును ప్రాప్య ప్రాపక భావ రూప సంబంధము కూడ చెప్పబడుచున్నందున, ప్రత్యేకముగ మరి యొక పరబ్రహ్మ కల డని తెలియుచున్న దని పూర్వపక్షి అభిప్రాయపడుచున్నాడు. ఇంతే కాదు - ముండకములో - "పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అనియు, తైత్తిరీయ నారాయణములో - "పరాత్పరో య న్మహాత్ మహాంతమ్" అనియు శ్వేతాశ్వతరములో - "అతో య దుత్తరతరం" అనియు పరమాత్మ కంటెను ఉత్కృష్ట తత్త్వ మున్నట్లు ప్రతిపాదింపబడి

యున్నది. అందువలన, ఈ సగుణ నిర్దోష బ్రహ్మ కంటెను పరబ్రహ్మ ప్రత్యేకముగా గల దని పూర్వపక్ష సారము.

దీనికి శ్రీ భాష్యకారులు సూత్రానుసారముగా నిట్లు సమాధాన మిచ్చియున్నారు .- సేతు వనగా - చేతనాచేతనములను తన యందు ఒకదానితో నొకటి కలియకుండ, కట్టుకొనియున్నవా డని యర్థము. "ఏషాం లోకానా మసంభేదాయ" అని ఉపనిషత్తు - ఈ లోకము లన్నియు ఒకదానితో నొకటి కలియకుండ ఉండుటకు పరమాత్మ సేతువుగా నున్నా డని చెప్పుచున్నది. సేతువును తరించినా డనగా - దాటుట కాదు. చేరుటయే. పెద్దలను సేవించు కొని, తరించినా డనగా - చేరవలసిన చోటుకు చేరినా డనియే కదా అర్థము ! అందువలన, హేతువుగా చెప్పినంతమాత్రమున ఈ పరమాత్మ మరి యొక గొప్ప తత్త్వము కల దనుకొనుట సమంజసము కాదు. ఇక ఈ పరమాత్మకు నాలుగు పాదములు, పదునారు కళలు కల వనుకొనుట - మన బుద్ధికి అందుబాటులో నుండి, ఉపాసించుటకు అవకాశమును కల్పించుటకే తప్ప - 'బ్రహ్మ ఇంతే' అని చెప్పుటలో తాత్పర్యము కాదు. పురుష సూక్తము నందును - 'పాదో ఒస్య విశ్వా భూతాని" అని ఒక పరిమితి చెప్పబడినది. ఐనచో - ఆతనినే జగత్కారణముగా కూడ చెప్పినది. "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అని, జగత్కారణ మపరిమిత మని కదా చెప్పబడుచున్నది ! కనుక, ఈ పరిమితిని చెప్పుట - కేవలము మన బుద్ధికి పట్టి యిచ్చుటకే గనుక, ఈ పరమాత్మ కంటె మరి యొక పరతత్త్వ మున్న దని తలంపరాదు.

పరిమితియే లేని పరబ్రహ్మను ఉపాసన కొరకైనను పరిమితిని ఎట్లు చెప్పగల దని తలంపరాదు. పరిమితి లేకున్నను, ఆకాశమును ఘటాకాశ మనియు, మహాకాశ మనియు ఆ యా స్థానములను బట్టి

చెప్పుకొనుచున్నట్లు, పరబ్రహ్మను కూడ చెప్పుకొనవచ్చును. ఇక ఈ పరమాత్మ - అమృతత్త్వమునకు సేతువని చెప్పినందునను మరి యొక తత్త్వము సిద్ధింపదు. ఏ మనగా - ఈ పరమాత్మయే అమృతము. తనకు తానే కదా ప్రాపకముగా నున్నాడు పరమాత్మ! "నాయ మాత్మా ...... వివృణుతే తనూం స్వాం" అను ముండక మంత్రములో పరమాత్మ ఏ యితర సాధనముల వలన చిక్క డనియు, కేవలము తన ప్రాప్తికి తాను మాత్రమే సాధన మనియును గదా చెప్పబడియున్నాడు! కనుక, ప్రాప్య ప్రాపక భావ సంబంధ మును పురస్కరించుకొనియుకాని, పరమాత్మ కంటెను ప్రత్యేక ముగా మరి యొక తత్త్వము కల దని భావించుటకు అవకాశము లేదు.

ఇక - "పరాత్పరం పురుషం" ఇత్యాదుల వలన, పరు డగు ఈ సగుణ బ్రహ్మ కంటెను మరి యొక పర తత్త్వ మున్న దని స్పష్ట ముగా అచట నిషేధింపబడుచున్నది కదా! "న హ్యేతస్మా దితి నేతదన్యత్ పర మస్తి" ఇంతే కాదని చెప్పబడిన ఈ పరబ్రహ్మ కంటెను వేరైన మరి యొక పరతత్త్వము లేదు అని కదా ఉపనిషత్తు నిషేధించుచున్నది! "సత స్యేశే కశ్చన" అని తైత్తిరీయ నారాయ ణము - జగత్కారణ ఈ పరమాత్మను శాసించగల మరి యొక పర తత్త్వము లేదని స్పష్టముగా చెప్పుచున్నది కదా!

ఇక - "తతో యదుత్తర తరం" వాని కంటెను ఉత్కృష్ట మైనది' అను చోట - అర్థమును చక్కగా పరిశీలింపవలసి యున్నది. పైన - వేదాహమేతం .... నాన్యః పంథా అయనాయ విద్యతే" అని పరమ పురుషుని చేరుటకు ఆతని ఉపాసనము కంటె మరి యొక మార్గము లే దని చెప్పబడినది. "యస్మాత్పరం నా పర మస్తి .... పూర్ణం పురుషేణ సర్వం" అని, పురుషుని కంటెను పరుడు లే డని

వివరించబడినది. ఈ పురుష తత్త్వమే ఉత్తరతరము = అనగా, ఉత్కృష్టము. తతః = అందువలన, "య ఏత ద్విదు రమృతా స్తే భవంతి" ఎవ రీ పురుష తత్త్వము నుపాసింతురో వారే అమృతత్వమును చెందుదురు అని తాత్పర్యము. ఇక - "పరాత్పరం పురుషం" అనుటయ ఎట్లు తెలిసికొనవలె? ముండకమున - "అక్షరాత్ పరతః పరః" అవ్యాకృత తత్త్వము కంటెను మరి యొక పరతత్త్వము ప్రసక్తి ఎచటను కన్పట్టదు. మరి యొక మాట :- ఈ పరమాత్మయే అంతటః వ్యాపించియున్నా డని - "తే నేదం పూర్ణం పురుషేణ సర్వం "యచ్చ కించ జగ త్యస్మిన్ . . . . నారాయణః స్థితః." ఇత్యాది శ్రుతి వాక్యములు చెప్పుచున్నవి. కనుక, పరమాత్మ కంటెను అనగ అఖిల హేయ ప్రత్యనీక కల్యాణైక తాన పరమాత్మ కంటెను ఈ తత్త్వము మరి యొకటి లే దని స్పష్టముగా తెలియుచున్న బాదరాయణ భగవానుడే పరాధికరణములో నిర్ణయించియున్నా శ్రీభాష్యకారుల ఉపదేశము.

## 8. ఫలాధికరణము

ఈ ఉభయ లింగ పాదములో చివరిది ఫలాధికరణమ దీనిలో - నాలుగు సూత్రము లున్నవి. సిద్ధాంత సూత్రములో యధికరణ మారంభింపబడినది. ఐహిక ఆముష్మికాది సకల ఫ ప్రదత్వము పరమాత్మకే కల దని ఈ యధికరణము నిర్ణయించుచున్న పరమాత్మ యొక్క ఉపాసనను చెప్పి ఈ అధ్యాయమున పరమా తాను మాత్రమే దోషము లంటనివా డని గాక, ఇతర దోష నివ కత్వ రూప మగు విశేషము కలవా డనియు చెప్పవలసిన యవ మున్నది. ఇట్లే జీవులకు స్వస్వరూపావిర్భావము కలిగించ కూడ పరమాత్మ యొక్క విశేషము. ఈ రెండు విశేషము

కూడ ప్రాప్య మగు పరమాత్మ యందు రుచిని కలిగించుటకు, తద్ద్వారా ఉపాసనకును ఉపయోగపడునవి కనుక, తప్పక చెప్పవలసిన యవసర మున్నది. ఇట్లు ఈ యధికరణము కూడ పరమాత్మ కల్యాణ గుణాకరత్వమును ప్రకాశింపజేయుచున్నందున, పూర్వాధికరణముతో కార్యైక్య మనెడు సంగతి కలిగి యున్నది. మరి యొక మాట :- పై యధికరణములో - 'పరమాత్మ సేతువు' అనగా - తనను చేర్చు ఉపాయము తానే అని తెలిసినది. కాని, ఉపాసనము కదా పరమాత్మను చేరుటకు ఉపాయముగా పేర్కొనబడుచున్నది ! అని మన కొక ఆశంక ఏర్పడును. ఈ ఆశంకను తొలగించుటకు ఈ అధికరణ మిచ్చట ఆరంభింపబడుచున్నది. ఇట్లు ఈ యధికరణములో నిర్ణయించబడు అర్థము - 'పరమాత్మయే ఉపాయము' అనునది. పూర్వాధికరణమున చెప్పిన సేతుత్వ సమర్థనకు ఉపయోగపడుచున్నందున, ఈ రెం డధికరణములకు ప్రయోజ్య ప్రయోజక భావ రూప సంగతి కల దనియు చెప్పవచ్చును.

పరమాత్మను చేరుట యనగా - మోక్షము. మోక్ష రూప ఫలము పరమాత్మ వలననే కలుగు నని పై యధికరణమున ప్రాసంగికముగా ప్రతిపాదించబడినది. ఉపాసన వల్లనే మోక్ష మని పలుచోట్ల పేర్కొనబడుచున్నది. కనుక, మోక్ష రూప ఫలము పరమాత్మ వల్లనా ? లేక - ఉపాసన వల్లనా ? అను సంశయ మేర్పడును. ఐనచో - ఒక మోక్ష రూప ఫలమును మాత్రమే గాక, సర్వ ఫలములను సర్వేశ్వరుడే ఇచ్చును గనుక, మోక్ష మనెడి విశేష ఫలమును గురించియే గాక, ఫల సామాన్యమును గురించియు మనకు తెలుపవలసిన యవసర మున్నది కదా ! అందువలన, మోక్ష ఫలముతో కలిపి సామాన్యముగా సర్వ ఫలములకు సాధన మేదియో వివరించు

టకు ఈ యధికరణము ఉపయుక్త మగుచున్నది. కనుక, ఈ యధికరణమునకు ఫలప్రదత్వము విషయము. ఆ ఫలప్రదత్వము అను ఉపాసనకా ? పరమాత్మకా ? అనగా - పరమాత్మయే స ఫలప్రదుడా ? లేక - ఆ యా ఫలములకు అతిరిక్త మధన లున్నవా ? అను సంశయ మేర్పడును.

ఇచట సిద్ధాంతముతో అధికరణ మారంభింపబడుచున్న "ఫలమత ఉపపత్తేః" అనునది మొదటి సిద్ధాంత సూత్రము. సర్వేశ్వరుని వల్లనే సర్వ ఫలములు సిద్ధించు నని అంగీకరించవలెను. ఏమనగా - సర్వేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వ శక్తులు గలవాడు. యాగ దాన హోమాదులచే గాని, ఉపాసనచే గాని ఆ సర్వేశ్వరుడే అరాధింపబడుచున్నాడు. ఆతడే ఐహిక ఆముష్మిక ఫలముల నన్నింటి ఈయగలవాడు, అపవర్గమును కూడ ఈయజాలినవాడు. కనుక ఫలప్రదత్వము సర్వేశ్వరునకే ఉపపన్నము. యాగ హోమ క్రియ లన్నియు, క్షణికములే కనుక, అచేతనములు కనుక. ఫలప్రదత్వము ఆయనకు కుదురదు. "స వా ఏష మహా నజ ఆత్మా అన్నాదో వసు దానః" అని, బృహదారణ్యకము లోని వాక్యము - పరమాత్మ అన్నము నిచ్చువా డనియు, ఐశ్వర్యము నొసంగువా డనియు చెప్పు చున్నది కదా ! "ఏష హ్యే వానందయాతి" అని, తైత్తిరీయము కూడ సర్వేశ్వరుడే అపవర్గప్రదు డని చెప్పుచున్నది. ఇట్లు భోగాపవర్గ రూప సకల ఫలప్రదత్వము పరమాత్మకే కల దని ఉపనిషత్తులు ఉద్ఘోషించుచున్నవి.

ఐనచో - పూర్వమీమాంసా ప్రణేత యగు మహర్షి జైమిని మాత్రము - యాగ దాన హోమ ఉపాసనాది రూప ధర్మమే ఫలప్రద మని ప్రవచించుచున్నాడు. ఈ జైమిని మతమే ప్రకృతాధికరణమున పూర్వపక్షముగా గ్రహింపబడినది. ధర్మమునకే ఫలప్ర

త్వమునకు ఉపపన్నము – అని జైమిని మతము. కృష్యాది క్రియ సాక్షాత్తుగ గాని పరంపరగ గాని సస్యాది ఫలమును సాధించియిచ్చును గదా ! అట్లే, యాగాది క్రియయు అపూర్వము ద్వారా, స్వర్గాది ఫలమును కలుగ జేయగలదు, "యజేత స్వర్గ కామః" అని వేద వాక్యము. యాగము స్వర్గ సాధన మని చెప్పుచున్నది – సాక్షాత్తుగా సదురనందున, అపూర్వమును, కల్పింతిము. వేద బోధిత స్వర్గ సాధనత్వ మిపుడు అపూర్వ ద్వారా యాగాదులకు కుదురవచ్చును. నుక, ఫలప్రదత్వము యాగాది రూప ధర్మమునకే ఉపపన్న మని జైమిని పూర్వపక్ష సారము.

బాదరాయణ భగవానుడు మాత్రము పరమపురుషుడే ఫల పదు డని సిద్ధాంత మొనరించుచున్నాడు. ఆ యా యాగాది బోధక వాక్యములలో త త్ఫల హేతువులుగా దేవతలనే కదా నిర్దేశించుటను చూచుచున్నాము ! ఉదాహరణకు – "వాయ వ్యగ్నిం శ్వేత మాల భేత భూతి కామః" ఐశ్వర్యము కోరినవాడు – ఒక వాయు దేవ తాక మగు యాగమును చేయవలె నని వేదము చెప్పినది. తరువాత, వాయువు చాల వేగము గల దేవత యనియు, ఆ వాయుదేవుడే యాగము చేసినవానికి ఐశ్వర్యాను లీయుగల డనియు వేదము చెప్పు చున్నది. "వాయుర్వై క్షేపిష్ఠా దేవతా .... స ఏ వైనం భూతిం గమ యతి" అని. కనుక, చేతను లగు వాయ్వాది దేవతలకు ఫల ప్రద త్వము స్పష్టముగా చెప్పబడుచున్నందున, వేదములో లేని 'అపూర్వ' మను దానిని మనము కల్పించుకొని, తద్ద్వారా యాగాదులకు ఫలప్ర దత్వము చెప్పుట ఉచితము కాదు. ఇక ఈ వాయ్వాది దేవతలును – తాము స్వయముగా ఫలప్రదానము చేయువారు కారు. వీ రందరును పరమ పురుషునకు శరీరభూతులు. అంతర్యామి బ్రాహ్మణము, సుబా లోపనిష త్తు ఈ విషయమును స్పష్టముగా పేర్కొనుచున్నవి. "యస్య వాయు శ్శరీరం, య స్యాగ్ని శ్శరీరం" ఇత్యాదికముగా

తైత్తిరీయము విశ్వభర్తను చెప్పి, అతడే అగ్ని వాయు సూర్య చంద్ర శరీరకు డని చెప్పుచున్నది. "త దేవాగ్ని స్త ద్వాయు స్తత్సూర్య స్తదు చంద్రమాః" అని.

భగవద్గీత యందును ఏడవ అధ్యాయములో – నా శరీరరూపు లగు దేవతలను శ్రద్ధాభక్తులతో సేవించినవారికి, నే నిచ్చిన ఫలితము లనే వారి ద్వారా చెందించుచుంటి నని శ్రీకృష్ణభగవానుడు చెప్పి యున్నాడు. "యో యో యాం యాం తనుం .... మ యైవ విహి తాన్ హి తాన్" అని, 'అన్ని యజ్ఞములచేత నేనే ఆరాధింపబడు వాడను, అన్ని యజ్ఞములకు నేనే ఫలము నిచ్చువాడను' అనియు – భగవద్గీతలో భగవానుడు చెప్పుచున్నాడు. "అహం హి సర్వ యజ్ఞానాం భోక్తా చ ప్రభు రేవ చ" అని. లోకములో కృషి వలన సంపా దించిన ధాన్యాదులను భృత్యులద్వారా రాజుగారికి అర్పించి, రాజు నర్చింతురు, గౌరవింతురు దానితో ప్రీతుడైన రాజే కదా వారు వారు చేసిన మర్యాద కనుకూల్యముగా ప్రసన్నుడై, వారి వారికి ఫలముల నందించును ! అట్లే – వేదాంతములు కూడ, శ్రీమన్నారా యణుని గొప్పతనమును చెప్పి, యాగాదులచేత ఆతనిని ఆరాధించు పద్ధతిని చెప్పి, స్తుతి నమస్కార ధ్యానాదులు ఆయనకు ప్రీతి కరము లనియు చెప్పి, ఇట్లు ప్రీణితుడైన పరమ పురుషుడే భోగాప వర్గరూప చతుర్విధ పురుషార్థములను కూడ అనుగ్రహింపగల డని చెప్పుచున్నవి. కనుక, లోక రీతి ననుసరించి చూచినను, శాస్త్ర దృష్టిననుసరించి చూచినను – సర్వేశ్వరుడు, సర్వజ్ఞుడు, సర్వ శక్తిమంతుడు, సకల కల్యాణ గుణ సాగరుడు, సర్వాత్మ త్వరు డగు శ్రియఃపతి – శ్రీమన్నారాయణుడే సర్వ ఫలప్రదత్వ రూపము, సర్వాతిశాయి, అనన్య సామాన్యము అగు మహా గుణ విశేషముకలవా డని నిస్సంశయముగా పేర్కొనవలసి యున్న దని, ఈ అధికర ణము యొక్క సిద్ధాంత సారము.

# గోపుర సందేశము

'విద్యా భూషణ - కవితా విశారద'

## శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు

శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులు

*

( బద్ధ చేతనుల నుద్ధరించుటకు భగవదాజ్ఞాబద్ధులై, దక్షిణ భారతము నందలి భూతపురిలో - 11 వ శతాబ్దమున ఆదిశేషాంశతో నవతరించిన శ్రీ భగవ ద్రామానుజ యతిసార్వభౌములు - తమకు అష్టాక్షరీ మహా మంత్రోప దేశము చేసిన గోష్ఠిపూర్ణుల యానతిని పాటింపక, ఆచార్యులవారి ఆజ్ఞను అతి క్రమించుటచే సంభవించు నరకము ననుభవించుటకు సైతము సిద్ధమై, ఒకనాడు గోష్ఠిపుర క్షేత్రము నందలి శ్రీ లక్ష్మీ నరసింహస్వామి వారి దేవాలయ గోపుర మధిరోహించి, సకల చేతన సముద్ధరణార్థమై యెలుగెత్తి, ఉచ్చైస్స్వరముతో తరణోపాయమును ప్రబోధించుచు, అష్టాక్షరీ మహామంత్ర - మంత్రార్థములను విపులముగా, తేట తెల్లముగ వెల్లడించిరి. ఆ నాటి ఆ దివ్య ప్రబోధము - 'గోపుర సందేశ' మను పేర జగ ద్విఖ్యాతి గాంచినది. అట్టి దివ్య సందేశ సారాంశమే ఈ పద్య రచనలోని పరమార్థము. - రచయిత)

### 1. ప్రబోధము

జనులారా ! సతతమ్ము మీరలు మహా సంసార వారాశిలో
మునుగన్ వాటిలు తీవ్ర బాధలకునై మూర్ఛిల్లి, కర్తవ్యమున్
మనమం దించుక చింత సేయక, దరిన్ భావింపఁగాలేక, యా
తనతో క్రుంగి కృశింప నేల ? ఇఁక మీదన్ జాగృతిన్ గాంచుడీ !

ఎన్నో జన్మల పూర్వపుణ్య ఫలమో ' ఈనాఁడు మేలౌ జనిన్
గన్నా రీ యిలలోన, కావున - అహంకారాది నిశ్రేణికిన్
సున్నా జుట్టి, హృదంతరాళమును సంశోధించి, కర్తవ్యమున్
గ్రన్నన్ గన్గొని, జన్మ సార్థకము కాఁగన్ మీరు యత్నింపుఁడీ !

మానవ జీవిత మ్మొప్పుడౌ మాయున చోట, భవమ్ము సంద్రమై
కానగ నౌట, తన్మకర కచ్ఛపముల్ వలెనై సతీ సుతుల్
కానఁగ రాగ, అస్థిరముగా వసుధాస్థలి భోగ భాగ్యముల్
కానఁగవచ్చుచుండ, ఇఁక గాంచఁగనౌ కడతేరు మార్గమున్.

### 2. భగవంతుఁడు సర్వరక్షకుఁడు

జగమునఁ గల చేతనులకు
భగవంతుఁడె రక్షకుండు - ప్రాపు నతండే
తగు నా కరుణానిధి పద
యుగమును శరణింపఁ గల్గు నుత్తమ ఫలముల్

### 3. భగవంతుఁడు ప్రణవ స్వరూపుఁడు

అరయఁగ వేదజాలముల యన్నిటియందు అకార వాచ్యుడై
బరగుచు నున్నవాడు భగవానుడు - అతండె సమస్త సృష్టికిన్
పరమ నిదానమై, పతిత పావనుఁడై, పరమాత్ముడై నిరం
తరము వెలుంగుచుండు ; పరతత్త్వముగా వచియింతు రాతనిన్

### 4 దేవతలు భగవంతునకు అవయవ భూతులు

అఖిల దేవతలా పరమాత్మ కెపుడు
అంగభూతులుగా నుందు రనియె శ్రుతులు
ఆత్మ లన్నియు నాతని యంశ గల్గి
దాస భావాన పరతంత్రతను చరించు

### 5 భక్తి ప్రపత్తులే ముక్తిసాధనములు

బద్ధచేతను లచ్యుత పదము చేర
శాస్త్రములు జూపె బహువిధ సాధనములు;
వానిలో నెల్ల సులభమై వరలు భక్తి,
భక్తికంటెను మేలు ప్రపత్తినిష్ఠ.

### 6. ప్రపత్తి పలము

సర్వధర్మ పరిత్యాగ సాధువృత్తి
న న్నొకండనె శరణంబు గన్నవాఁడు
పాపుఁ డేనియు నా దయ బడసి, ముక్తి
నందగలఁ డంచు భగవానుఁ డనియె గాదె !

### 7. తిరుమంత్రము

అనయం బష్టాక్షరి నెద
మననము సేయంగవలయు – మంత్రం బిదియే
మునుముందు 'ఓం నమో' యని
యనవలె, 'నారాయణాయ' యని యటుమీదన్.

### 8 తిరుమంత్ర ఫలము

ఆరయ వేదసార మిది – అందఱు నీ తిరుమంత్ర రాజమున్
వారక సంస్మరించిన – భవంబు తరింపగవచ్చు, హెచ్చు చే
కూరును శాంతిసౌఖ్యములు, కోరిక లన్ని ఫలించితీరు, -ఈ
ధారుణియం దశేషశుభదం బిది – వేఱుగ దెల్ప నేటికిన్ ?

### 9. ఆచార్య (గురు) వరణము

జగతి సర్వంబునకు సదాచార్యవరుఁడె
అమితమైనట్టి యజ్ఞాన తిమిర చయము

శార్ఙ్గదోలియు - శేముషీ ప్రథను కూర్ప
గలఁడు గావున, అతని గనఁగవలయు.

10. పంచసంస్కార సంపత్తి

గురుని కరుణకు పాత్రుఁడై ధరణియందు
పంచసంస్కార సంపత్తి బడయువాఁడు
పాప రహితుఁడునై శ్రియఃపతికటాక్ష
మున, మహార్థంబు లన్నిటిన్ గనఁగ గలఁడు.

11. భగవత్కైంకర్యము

భగవత్కైంకర్యబే
జగమున జీవునకు మోక్ష సాధన మనుచున్
నిగమంబులు వాకొనుటను
తగు నది సల్పంగ యోగ దార్ఢ్యము వలనన్

12 హరికథా శ్రవణము - భాగవత సత్సంగము యోగ సంప్రాప్తి

నియమ నిష్ఠలు గల్గియు - నిశ్చలముగ
పేను లారంగ హరికథల్ వినుటవలన,
భాగవతులైన వారల పజ్జఁ జేరఁ
గల్గు యోగంబు - శ్రేయంబుఁ గల్గు దాన

13 యోగ ఫలము - భగవత్సాయుజ్యము

ఇదియే ముక్తికి మార్గము
పదిలముగా విధుల నెల్ల పాటింప భువిన్
ముదమునను - శాంతినిఁ గని, హరి
పదమునుఁ జేరుదురు పరమ భక్తులు తుదకున్

# సందేశ విశేషములు - వేదశాస్త్ర ప్రమాణములు

**1. ప్రబోధము :-**

౧. శ్లో॥ జంతూనాం నరజన్మ దుర్లభ మతః పుంస్త్వం తతో విప్రతా
తస్మా ద్వైదిక కర్మ మార్గ పరతా విద్వత్త మస్మాత్పరమ్.... ॥

- (శతశ్లోకి)

జంతువులలో నరజన్మ దుర్లభమైనది. అందుననూ - పురుషుడై పుట్టుట మరింత కష్టము. బ్రాహ్మణు డగుట ఇంకనూ అసాధ్యము. బ్రాహ్మణుడైననూ - వైదిక ధర్మమార్గ పరత గలుగుటయు, దానిపైన విద్వాంసు డగుటయూ మరింత కష్టమైనవి.

౨. శ్లో॥ ఆయు ర్వర్షశతం నృణాం పరిమితం రాత్రౌ త దర్ధం గతం
త స్యార్ధస్య పరస్య చార్ధ మపరం బాలత్వ వృద్ధత్వయోః
శేషం వ్యాధి వియోగ దుఃఖ సహితం సేవాదిభి ర్నీయతే
జీవే వారి తరంగ చంచలతరే సౌఖ్యం కుతః ప్రాణినామ్ ?

-(భర్తృహరి సుభాషితము - వైరాగ్య శతకము:49)

నరుల పరమాయుర్దాయము నూరు సంవత్సరములు. అందులో - సగ భాగము రాత్రులు నిద్రాదులలోనే గడచిపోవు చున్నది. మిగిలిన సగములోనూ మరల సగ భాగము బాల్య వార్ధక్యము లలో వ్యర్థముగా పోవుచున్నది. ఇక శేషించిన పాద భాగమున కూడ కొంత రోగాది బాధలతో, కొంత బంధు మిత్ర వియోగ భారమునను, మరికొంత పరదాస్య కష్టములందునను గడచిపోవును. నీటిమీాద

కెరటముల వలె క్షణ భంగురములైన జీవితములలో ప్రాణులకు సు
ఖమెక్క డున్నది ?

3. శ్లో॥ భవజలధిగతానాం ద్వంద్వవాతాహతానాం
సుత దుహితృ కళత్ర త్రాణ భారార్దితానామ్
విషమ విషయతోయే మజ్జతా మప్లవానాం
భవతు శరణ మేకో విష్ణుపోతో నరాణామ్॥

-( కులశేఖరాళ్వారులు - ముకుందమా

సంసార సముద్రమును పొందినట్టి మానవులు - ద్వంద్వము ల వాయువులచే కొట్టబడుదురు. కుమారుళ్ళు, కుమార్తెలు, భార్యల మనుమలు మొదలగు దేహ బంధువుల నందరిని పోషించుట యను భారము కలిగి యుందురు ఈ సముద్రము అనేక విధము ల విషయములే జలముగా గలిగి యుండును. అందుచే, ఈ సముద్రము మునిగినవానికి - ఈ పైన చెప్పిన బాధల నన్నిటిని తొలగించి, తన దరిజేర్చు నావ యొకటి లభ్యము కానిచో బ్రతుకుట కష్టము గను! అట్టివానికి సర్వ రక్షకు డగు విష్ణువే రక్షకు డగుగాక ! విష్ణు వొక్క అనుగ్రహము కలిగిననే చేతనుడు సంసారము నుండి తరించి ఆనందధామ మగు పరమ పదమును పొందగలడు. లేనిచో - భయం కరమైన సంసార జలధిలో మునిగియే యుండును.

2 భగవంతుడు సర్వరక్షకుడు :-

1 శ్లో॥ జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః
భగవ చ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః
పరమబ్రహ్మభూతస్య వాసుదేవస్య నాన్యగః ॥

-(విష్ణు పురాణము 6 5-79-80)

జ్ఞానము, శక్తి, బలము, ఐశ్వర్యము, వీర్యము, తేజము అను ఆరు గుణములు పరిపూర్ణముగా గలిగి, హేయ గుణములు లేనివాడు భగవానుడు. అట్టి భగవానుడు - పరబ్రహ్మ యగు వాసుదేవుడే.

౮. కం. రక్షకులు లేనివారల రక్షించెద ననుచు చక్రి రాజై యుండన్
రక్షింపు మనుచు నొక నరు నక్షము ప్రార్థింప నేల యాత్మజ్ఞులకున్ ? ॥

- (శ్రీ మదాంధ్ర భాగవతము : 2-22)

**3. భగవంతుడు ప్రణవ స్వరూపుడు :-**

౧. 'అ' ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధానమ్ ॥ - (ఉపనిషత్తు)
భగవంతుడైన నారాయణునకు 'అ' అని మొట్టమొదటి పేరు.

౨. "అక్షరాణాం అకారోఽస్మి" - (భగవద్గీత : 10 - 33.)
అక్షరములలో నేను అకారవాచ్యుడనై యున్నాను.

౩. శ్లో॥ అకారే ణోచ్యతే విష్ణుః సర్వలోకైక నాయకః
ఉకారేణోచ్యతే లక్ష్మీః మకారో జీవవాచకః ॥

—( బ్రహ్మ సంహిత )

'అ' కారముచే సర్వలోకనాయకుడైన విష్ణువు, 'ఉ'కారముచే లక్ష్మీదేవియు చెప్పబడుచున్నారు. 'మ'కారము - ఆ పరమాత్మకు దాసభూతుడైన జీవుని నిర్దేశించును.

౪. శ్లో॥ అకారార్థో విష్ణుః - జగ దుదయ రక్షా ప్రళయకృత్
మకారార్థో జీవః - త దుపకరణం వైష్ణవ మిదమ్
ఉకారో ఽనన్యార్హం నియమయతి సంబంధ మనయోః
త్రయీసార స్త్ర్యాత్మా ప్రణవ ఇమ మర్థం సమదిశత్ ॥

- (శ్రీ పరాశర భట్టరు - అష్టశ్లోకి : 1 శ్లో)

అకార ఉకార మకారములు మూడును కలిసి ఓంకార మైనది. అకారము జగ దుత్పత్తి స్థితి లయములకు కారణభూతు డగు విష్ణువును తెలియజేయును. మకారము - 'మన జ్ఞానే' అను ధాతువు వలన బుట్టి, విష్ణు సంబంధ మైనది. ఉకారము జీవ పరమాత్మలకు సంబంధమును గల్గించును. మూడు అక్షరములు గల ప్రణవము - ఋ గ్యజు స్సామము లను మూడు వేదములకు సారభూతమైనది.

౩. శ్లో॥ ఓంకార స్సకలా వేదాః ఓంకార స్సకలా స్స్వరాః
ఓంకార స్సర్వ మే వైతత్ జగత్ స్థావర జంగమమ్ ॥

— (విష్ణుధర్మోత్తరము)

సర్వ వేదములు, సర్వ స్వరములు ఓంకారము నుండి ఆవిర్భవించినవి. అంత యేల ! స్థావర జంగమాత్మకమైన ఈ జగత్తు అంతయు ఓంకారమునుండియే ఉద్భవించినది.

**4. దేవతలు భగవంతునకు అవయవభూతులు :-**

౧. "స ఆత్మా. అంగా న్యన్యా దేవతాః." — (తైత్తి - శీక్షావల్లి : 5- 1)
ఆ పరమాత్మకు ఇతర దేవతలు అవయవ భూతులు.

౨. "మహా భాగ్యాత్ దేవతాయా ఏక ఏవ ఆత్మా బహుధా స్తూయతే.
ఏకస్య ఆత్మనః అన్యే దేవాః ప్రత్యంగాని భవంతి."
— (యాస్క నిరుక్తము - దైవత కాండ ; 7 అధ్యా - 8-4-7-9.)

భగవంతు డొక్కడే. అత డనేక విధములుగా స్తుతింపబడుచున్నాడు. అట్టి పరమాత్మకు ఇతర దేవతలు ప్రత్యంగము లగుచున్నారు.

5. భక్తి ప్రపత్తులే ముక్తి సాధనములు :-

౧. "సర్వేషు ముక్తి మార్గేషు భక్తి రేవ విశిష్యతే." — (నారదుడు)

ముక్తి మార్గము లన్నింటిలో - భక్తి మార్గమే విశిష్టమైనది.

౨. శ్లో॥ భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప ;
— (భగవద్గీత : 11.45)

అర్జునా ! అనన్యమైన భక్తి చేతనే ఈ విధముగా తెలిసి కొనుటకు, చూచుటకు, ప్రవేశించుటకు నేను వశ మగుచున్నాను.

౩. శ్లో॥ త మేవ శరణం గచ్ఛ సర్వభావేన భారత !
తత్ప్రసాదా త్పరాం శాంతిం స్థానం ప్రాప్స్యసి శాశ్వతమ్ ॥
— (భగవద్గీత ; 18.62)

భారతా ! నీవు సంపూర్ణముగా ఆ పరమాత్మను శరణు పొందుము. ఆయన యనుగ్రహమువలన - పరమ శాంతిని, శాశ్వతమైన పరమపదమును పొందగలవు.

6. ప్రపత్తి ఫలము :-

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥
— (భగవద్గీత : 18-66)

వర్ణాశ్రమాది సర్వ ధర్మములను విడచి, న న్నొకనినే శరణు పొందుము. నేను నిన్ను సర్వ పాపములనుండి విముక్తుని జేయుదును' అని శ్రీకృష్ణ భగవానుడు అర్జునునకు అభయ మిచ్చెను.

7. తిరుమంత్రము :-

౧. "ఓ మి త్యగ్రే వ్యాహరేత్. నమ ఇతి పశ్చాత్. నారాయణాయే త్యుప రిష్టాత్ ఓమిత్యేకాక్షరమ్. నమ ఇతి ద్వే అక్షరే. నారాయణాయేతి పంచాక్షరాణి. యోహవై నారాయణస్యాష్టాక్షరం పదమ్."

— (నారాయణోపనిషత్తు - తృతీయ ఖండము)

'ఓం' అని ముందుగా పలుకవలెను. తరువాత - 'నమః' అనవలెను. అటు పిమ్మట - 'నారాయణాయ' అని ఉచ్చరింపవలెను. 'ఓం' అనునది ఒక అక్షరము. 'నమః' అనునవి రెండక్షరములు. 'నారాయణాయ' అనునవి అయిదక్షరములు. ఈ యక్షరము లన్నియు కలిసి - 'నారాయణాష్టాక్షరి' యగును.

౨. శ్లో॥ యథా సర్వేషు వేదేషు నాస్తి నారాయణా త్పరః
తథా సర్వేషు మంత్రేషు నాస్తి చాష్టాక్షరా త్పరః ॥

— (వృద్ధహారీత సంహిత

సర్వ వేదములందును నారాయణునకంటె పరుడు లేనట్లే సర్వ మంత్రములందును అష్టాక్షరీ మహా మంత్రము కంటెను మించిన వే రేదియు లేదు.

8. తిరుమంత్ర ఫలము :-

౧. "ఓం నమో నారాయణాయేతి మంత్రోపాసకః. వైకుంఠభవనం గమిష్యతి.

— (నారాయణోపనిషత్తు - చతుర్థ ఖండము

అష్టాక్షరీ మంత్రము నుపాసించువాడు పరమ పదమునకు బోవును

౨. కం॥ అష్టాక్షరీ జపం బురు
శిష్టత గావించు పుణ్యశీలురకు - మనో
భీష్టార్థ ఫలము లన్నియు
ముష్టిగ్రాహ్యంబు లగుచు ముందుగ నిలుచున్ ॥

( సుందరేశ్వర విలాసము-చెయ్యూరు చెంగల్వరాయ క

9. ఆచార్య (గురు) వరణము -

౧ "తద్విజ్ఞానార్థం స గురుమేవాభిగచ్ఛేత్. సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం. తస్మై స విద్వా నుపసన్నాయ, సమ్యక్ ప్రశాంత చిత్తాయ, శమాన్వితాయ యేనాక్షరం పురుషం వేద సత్యం ప్రోవాచ తాం తత్త్వతో బ్రహ్మ విద్యామ్ " — (శ్రుతి)

ముముక్షువు బ్రహ్మజ్ఞానమును పొందుటకై - శ్రోత్రియుడును, బ్రహ్మనిష్ఠా గరిష్ఠుడు నగు గురువును ఆశ్రయింపవలెను. బ్రహ్మవిద్యను తెలిసికొనగోరు ప్రశాంత చిత్తు డగు అట్టి శిష్యునకు - అక్షరుడైన పురుషు డగు పరమాత్మను గురించి గురువు వాస్తవమును వచింప వలెను.

౨ శ్లో॥ ఆచార్యో వేద సంపన్నో విష్ణుభక్తో విమత్సరః
మంత్రజ్ఞో మంత్రభక్త శ్చ సదా మంత్రాశ్రయ శ్శుచి॥
సత్సంప్రదాయ సంయుక్తో బ్రహ్మవిద్యా విశారదః
బ్రాహ్మణో వీతరాగ శ్చ క్రోధ లోభ వివర్జితః
ఏవ మాది గుణై ర్యుక్తః ఆచార్య స్స ఉదాహృతః."

— (పారమోత్తరము)

ఆచార్యు డగువాడు - వేదవేత్తయై, విష్ణుభక్తుడై, మాత్సర్య రహితుడై, మంత్రార్థజ్ఞానముగలవాడై, మంత్రముకందు విశ్వాసము గలవాడై, మంత్రానుష్ఠానపరుడై, సత్సంప్రదాయము గలవాడై, బ్రహ్మవిద్యా విశారదుడై, బ్రాహ్మణుడై, వీతరాగుడై, క్రోధ - లోభ వివర్జితుడై యుండవలెను. అట్టి మహనీయుని మాత్రమే ఆచార్యుడుగా (గురువుగా) పరిగణింపదగును.

౮. "వదిలప్ప టాదాత్మ్యంబు గలుగంగ
నిహపరత్వంబుల త్రోవ నడుగ నేల ?" — (అన్నమాచార్యులు)

౯. "గురుముఖంబున వలన శుద్ధబుద్ధిని తన్మూర్తి
నొలిగి కొనిన ప్రపత్తి స్వీకరణముండు
స్తుతులు వినుతి సేయ శుభరూప సహితుడై
వెడని పరమునకును చేరు వగును."

— (మత్స్య పురాణము - హరిభట్టు)

10. పంచ సంస్కారములు :-

శ్లో ॥ తాపః పుండ్ర స్తథా నామ మంత్రో యాగ శ్చ పంచమః
అమీ తే పంచ సంస్కారాః పారమైకాంతి హేతవః ॥

— (విష్ణుతిలక సంహిత)

శంఖ చక్ర ధారణము, ఊర్ధ్వపుండ్ర నామ ధారణము, మంత్రానుష్ఠానము, భగవ దారాధనము అనునవి పంచ సంస్కారములు. ఇవి విష్ణుభక్తుని లక్షణములు.

11. భగవత్కైంకర్యము :-

౧. శ్లో ॥ సర్వ కర్మా ణ్యపి సదా కుర్వాణో మద్వ్యపాశ్రయః
మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్. ॥

— (భగవద్గీత . 18 - 56)

కర్మము లన్నిటిని ఎల్ల కాలము నన్నే ఆశ్రయించి చేయువాడు నా యనుగ్రహము వలన, నశ్య మగు పదమును (అనగా - ప్రాప్య మైన నన్ను సంపూర్ణముగా పొందును' అని కృష్ణభగవానుని వక్కాణ

౨ శ్లో మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి సత్యంతే ప్రతిజానే ప్రియోఽసి మే ॥

— (భగవద్గీత 18.68)

నీవు నా యందు మనస్సు నుంచుము. నాకు భక్తుడవు కమ్ము. నన్ను పూజింపుము. నాకు నమస్కరింపుము. దానివలన నన్నే పొంద గలవు. నీవు నా కత్యంతము ఇష్టుడ వగుట వలన, నీకీ సత్యమును ప్రతిజ్ఞా పూర్వకముగా చెప్పుచున్నాను' అని, శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు ఉపదేశించెను.

**12 హరికథా శ్రవణము - భాగవత సత్సంగము – యోగ సంప్రాప్తి :-**

౧. శ్లో॥ శ్రవణం సర్వ కర్మేభ్యో పరం మన్యే తపోధన ।
వైకుంఠస్థో యతః కృష్ణః శ్రవణాత్ యస్య లభ్యతే ॥

— (శ్రీమద్భాగవత మాహాత్మ్యములో నారదుడు)

తపోధనా ! భగవంతుని కల్యాణ గుణములను శ్రవణము చేయుట - అన్ని ధర్మములకంటెను శ్రేష్ఠమైనదిగా నేను తలంచు చున్నాను. ఏల నన, అట్టి కల్యాణగుణములను వినుటవలన వైకుంఠము నందలి భగవానుని పొందవచ్చును.

౨ శ్లో॥ మచ్చిత్తా మద్గత ప్రాణా బోధయంతః పరస్పరమ్
కథయంత శ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

— (భగవద్గీత : 10-9)

నాకు మనస్సును, ప్రాణమును సమర్పించినవారు - పరస్పరము బోధించు కొనుచు, ఎల్లప్పుడు నా కథలను కీర్తించుచు, సాధనావస్థ యందు సుఖమును, సాధ్యావస్థయందు ఆనందమును **అనుభవించు** చున్నారు' అని కృష్ణభగవానుడు ఆనతిచ్చియున్నాడు.

౩. "జ్ఞానము జ్ఞేయము జ్ఞానగమ్యమును
పూని తెలియుటే యోగము
పొరలి జగ మనే బుద్ధి మాయపై నునిచి పరగిన
ఇంద్రియముల గెలచినదె పరమ యోగము

.... (అన్నమాచార్యులు)

**13. యోగ ఫలము - భగవత్సాయుజ్యము --**

౧. గీ॥ యోగ ధర్మంబు కంటెను నుత్తమంబు
గలుగనేరదు - ధర్మ మొక్కటియు నపున
రాగమం బగు పదమున కరయ నిదియ
మేటి నిచ్చెన సంయమికోటి కెల్ల ॥

— (ఆంధ్ర మహా భారతము - అనుశాసనిక పర్వము)

౨. గీ॥ యోగ సరణి మీద బుద్ధి రోసినగాని
పాదుకొనదు హృదయ పంకజంబు
స్వాంత వనరుహంబు చాంచల్య ముడిగిన
యపుడె యోగి సిద్ధి యగును భువిని ॥

— (హరిభట్టు - మత్స్య పురాణము)



# నారాయణ అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యము

' న్యాయ వేదాంత విద్వాన్ '
శ్రీమాన్ తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు

⌘

## శబ్దబ్రహ్మము - పరబ్రహ్మము

"ద్వే బ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మపరం చ తత్
శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి."

బ్రహ్మకు రెండు రూపములు. ఒకటి శబ్దబ్రహ్మము. రెండవద పరబ్రహ్మము. శబ్దబ్రహ్మ యందలి నిష్ఠయే పరబ్రహ్మను పొందుటక సాధనము. అట్టి శబ్దబ్రహ్మయే మంత్ర మనబడును.

## మంత్రసిద్ధి సాధనము

కోరికను సఫల పరచ గల ప్రాకృత - అప్రాకృత శక్తుల 'దేవతలు' అని వ్యవహరించుచుందుము.

ప్రతి మంత్రమునకు మంత్రానుష్ఠాన దేవతయు, తద్బీజాక్షర ధిష్ఠాన దేవతలు ఉందురు. అట్టి దేవతలకు సంబంధించిన బీజాక్షరము సంపుటీకరణము - సమ్మేళనము ద్వారా (మంత్రముల ద్వారా) మ ఆత్మ శక్తిని పురశ్చరణము (నిర్ణీత జప - తర్పణ - హోమ పుష్పాంజలి - బ్రాహ్మణ భోజనము లను శాంతి) ద్వారా ...ఆ య దేవతలను మన కనుకూలించునటుల, మనల ననుగ్రహించునటు మన యభీష్టముల నెరవేర్చునటుల జేసికొనుటనే మంత్రసిద్ధి యందుర

లౌకికములైన శబ్దములకు కూడ ఫలసిద్ధి కలుగుటలో భేదము ఇట్టి లక్షరముల యొక్కయు, శబ్దములకు యొక్కయు సంపుటీకరణమే కదా కారణము! 52 అక్షరములు అందరికిని సమానమే. కాని, వానిని ఒక రకముగా సంపుటీకరణము చేసినచో, మంచి ఫలము కలుగును. మరొక రకముగ సంపుటీకరణము చేసినచో ఆ అక్షరములే విరుద్ధ ఫలమును కలిగించును. ఉదాహరణకు - 'సాక్షరాః' అనినచో విద్వాంసుల కర్థ మగును. దానినే తల్లక్రిందులుగ - 'రాక్షసాః' అనినచో, విరుద్ధమైన దుర్మార్గుల కర్థ మగును కదా!

కొంత మందికి కొన్ని కొన్ని మంత్రములు (క్షుద్ర దేవతలకు సంబంధించిన క్షుద్ర మంత్రములు) ఎంత జపము చేసినను సిద్ధించను సరి కదా - కొంత మందికి అది విపరీతమై బెడిసి కొట్టును. అనగా విపరీతమైన, అపత్కారమైన విధముగా ఫలించును. అందుచే, మంత్రోపాసకుడు మొదటనే అర్వణ చక్రము ద్వారా తన కే మంత్రము విరుద్ధమైనదో, ఏ మంత్రము అనుకూలమైనదో, ఫలించునో-లేదో, తెలిసికొనవలసి యున్నది. ఆ మంత్రాధిష్ఠాన దేవతా శక్తులకును, తన ఆధ్యాత్మిక శక్తులకును పరస్పర సంబంధము జన్మాంతర మైనట్టిదియో, ఈ జన్మమున కలిగినట్టిదియో, లేక - ఉపదేశకుల ప్రభావము వలన కలలో కలిగినట్టివియో యున్ననే గాని మంత్రసిద్ధి కలుగదు. కాని, మహా మంత్రములకు ఈ నియమము ఉండ లేదు. అనగా - అర్వణ సంబంధము లేకుండగనే అందరికి అనుకూలించి ఫలించగల్గును. కాని, వానికి గూడ కొన్ని ప్రధాన నియమములను అవలంబింపవలసి యున్నది.

"మంత్రే తద్దేవతాయాం చ, తథా మంత్రప్రదే గురౌ
త్రిషు భక్తి స్సదా కార్యా, సా హి ప్రథమ సాధనమ్."

మంత్రమునందును, మంత్రాధిష్ఠాన దేవతయందును, మంత్రోపదేశికులైన గురువునందును శ్రద్ధా భక్తి విశ్వాసము లుండవలెను. ఈ శ్రద్ధా - భక్తి - విశ్వాస రూపమైన ప్రేమ ఎవరికి, వేనియందు ఎంతగ ఏవిధముగ ఎపుడు ఎచ్చట ఉండునో, వారలకు - అంతగ ఆ విధముగ, ఆ యా కాలములందు, అ యా ప్రదేశములందు, ఆ యా మంత్రములు ఫలించును, సిద్ధి కలుగును. ఇది మంత్ర సిద్ధికి ప్రథమ సాధనము.

## మంత్రముల సంఖ్య

భగవత్కటాక్షమునకు కారణభూతములై, భగవంతుని స్వరూప - రూప - గుణ - విభవ - ఐశ్వర్య - చేష్టా - శక్తులను ప్రకటితము చేయునట్టి, బీజాక్షరములతో గూడుకొన్నట్టి మంత్రములు భగవన్మంత్రము లనబడును. ఇట్టి భగవన్మంత్రములు అసంఖ్యేయములు, అనూహ్యములు. భగవంతుని గుణములు, శక్తులు, చేష్టలు, అవతారములవలె, తత్ప్రతిపాదకములైన భగవన్మంత్రములును అసంఖ్యేయములు.

"యతో వాచో నివర్తన్తే అప్రాప్య మనసా సహ."

— (తైత్తిరీయోపనిషత్తు)

భగవంతుని గురించి వేద పురుషుడే వాక్కుతో చెప్పజాలడయ్యెను. మనస్సులో ఊహించజాలడయ్యెను. అందుచే, వేద వాక్కులు - మనస్సుతో సహా ఆ భగవద్వర్ణనము నుండి విరమించుకొనవలసి వచ్చెను. కనుకనే శ్రీ రంగరాజ స్తవములో -

"ఆస్తాం తే గుణరాశివత్ గుణపరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా ...."

ఓ శ్రీరంగ నాయకా ! నీ కల్యాణ గుణములు అనంతము లైనవి. అటులనే ఆ కల్యాణ గుణములను ప్రకాశింపజేయునట్టి నీ యవతార విశేషముల సంఖ్య కూడ అనంతమైనది' అని, భట్టరు వారు అభివర్ణించిరి.

శ్రీరామాయణంలయోధ్యాకాండలో 2 - వ సర్గ 25 వ శ్లోకమున :-

"బహవో నృపః కల్యాణ గుణాః పుత్రస్య సన్తి తే."

ఓ దశరథ మహారాజా ! నీ కుమారుడైన శ్రీ రామునకు అసంఖ్యేయములైన కల్యాణ గుణములు గలవు' అని ప్రజలు వర్ణించిరి తన యవతారములు అనంఖ్యేయము లని భగవానుడే స్వయముగా తెలిపియున్నాడు.

భగవద్గీత -

"బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున ।"

తన యవతారములు అసంఖ్యేయము లని భగవానుడే స్వయం ముగా తెలిపియున్నాడు.

భగవన్నిర్హేతుక కటాక్షముచే పరావర తత్త్వ యాథాత్మ మును కరతలామలకముగ తెలిసికొనిన భక్తిరూపాపన్న జ్ఞాన సంపన్న లగు నమ్మాళ్వారులు కూడ -

"ఎణ్ణిల్ తొల్ పుగళ్ వానవ రశనే."

— (తిరువాయిమొళి · 3 – 3 –

సర్వేశ్వరుడు అసంఖ్యేయములైన అనాది యగు గుణము కలవాడు, నిత్యసూరులకు నిర్వాహకుడు' అని సాయించిరి. మరియు

"ఎన్నినయోనియుమాయ్ పిఱన్దాయ్ ఇమైయార్ తవైదా "

— (తిరువిరుత్తము :

నీవు నిత్యసూరి నిర్వాహకుడవు. మమ్ముల నుద్ధరించు చిమి త్తమై, అసంఖ్యేయములైన అవతారము లెన్నింటినో ఎత్తితివిగదా !' అని భగవంతుని అవతార విశేషములను బహు భంగుల ప్రస్తుతించి యున్నారు.

## మంత్ర తారతమ్యము

ఇట్టి అసంఖ్యేయములైన భగవ న్మంత్రములు - వాని వాని స్వరూప స్వభావముల ననుసరించి రెండు తరగతులుగా విభజింప బడినవి. (1) వ్యాపక మంత్రములు. (2) అవ్యాపక మంత్రములు. భగవంతుడు సర్వవ్యాపకుడు కావున, ఆయన స్వరూప స్వభావములు సర్వవ్యాపకములే. ఇట్టి భగవంతుని సర్వ వ్యాపకమైన స్వరూప స్వభావములను ప్రతిపాదించు మంత్రములు వ్యాపకమంత్రము లన బడును. ఇవి అపరిమిత శక్తి సంపన్నములు. భగవంతుడు అప్పు డప్పుడు ఏవియో కొన్ని ప్రయోజనముల నుద్దేశించి ఆ యా ప్రయోజన నిర్వ హణమునకు వలయు కల్యాణ గుణములతో మాత్రము అవతారములు ధరించి, తన గుణ చేష్టితములను ప్రదర్శించుచు, తన శక్తిని ఆవిష్క రించుచుండును. ఇట్టి పరిమితమైన భగవత్స్వరూప స్వభావములను ప్రతిపాదించు మంత్రములు అవ్యాపక మంత్రము లనబడును. ఇవి పరిమిత శక్తివంతము లు. ఇట్టి పరిమిత శక్తి గల మంత్రముల కంటెను, అపరిమిత శక్తి గల మంత్రములు శ్రేష్ఠములు గదా ! రామ, కృష్ణ, నరసింహ, హయగ్రీవ, గోపాల ఇత్యాది మంత్రము లన్నియు అవ్యాపక మంత్ర వర్గములోనివి.

## వ్యాపక మంత్రములు

"తస్య యజు రేవ శిరః." — (శ్రుతి)

అన్ని వేదములలో శిరోభూషణమైనది యజుర్వేదము. అంద
తైత్తిరీయారణ్య మను అరణ్యమున నారాయణానువాక మను
వృక్షమునకు పుష్పము వంటి మంత్రపుష్పమున పరిమళ భాగ ము
నారాయణ గాయత్రి కలదు.

"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి
తన్నో విష్ణుః ప్రచోదయాత్."

అనునదియే ఆ గాయత్రి. ఈ నారాయణ గాయత్రిలో మూ
మంత్రములు కూర్చబడి యున్నవి. ఒకటి - నారాయణాష్టాక్ష
రెండవది - వాసుదేవ ద్వాదశాక్షరి. మూడవది - విష్ణు షడక్ష

ఈ మూడు మంత్రములును వ్యాపక మంత్రము లనబడును
ఇందలి నారాయణ మంత్రమునే అష్టాక్షరి యనియు, మూలమం
మనియు, తిరుమంత్ర మనియు వ్యవహరింతురు.

ఈ వ్యాపక మంత్రములలోగూడ తర తమ భేదములు కల
ఇందు విష్ణు షడక్షరీ మంత్రము భగవంతుని వ్యాప్తిని మాత్ర
ప్రాప్తిగా చెప్పుచున్నది. కాని, వ్యాప్యములైన పదార్థముల
అంతర్యామిగా నుండి వ్యాపించురీతి - వ్యాపించియుండుటకు ష
నగు పశ్వాధారత్వమును, భగవంతుని కల్యాణ గుణములను చెప్ప
లేదు. మరియు - ఈ విష్ణు శబ్దమునకు దేవతాంతరపరముగా అర్థ
చెప్పుట కవకాశ ముండుటచే, అశిష్టులు ఈ మంత్రమును దేవతాంత
పరముగ ఉపయోగించుకొనుచున్నారు.

ఇక ద్వాదశాక్షరీ మంత్రము - వ్యాపించురీతి అంతర్యామి
నును తెలుపుచున్నను, వ్యాపించబడు పదార్థములను తెలుపు

లేదు. అందులకై అర్థబలముచే సిద్ధించు 'సర్వ' శబ్దమును చేర్చు కున్నను, భగవంతుని గుణములను తెలుపు శబ్దము లేనందున, ఈ లోపమును తీర్చుటకై భగవచ్ఛబ్దమును కూడ చేర్చుకొనవలసి యున్నది. ఇంతియగాక, వ్యాప్తికి ఫలమగు భగవదాధారత్వమును చెప్పుటలేదు. మరియు - ఈ వాసుదేవ శబ్దము కూడ అశిష్టులచే దేవతాంతర పరముగ అర్థము కల్పించి ఉపయోగింపబడుచున్నది. కావున, ఆ రెండు మంత్రములును గొప్పవే యైనను - అశిష్ట పరిగ్రహము, అపూర్తి యను దోషములు కలవి.

## అష్టాక్షరీ మంత్ర వైభవము

1) ఇక అష్టాక్షరి యన్ననో - వీని వలె గాక, వ్యాపింపబడు ఉభయ విభూతులను, అంతర్యామిత్వ మనెడు వ్యాపించు రీతిని, వ్యాప్తికి ఫలమైన సర్వజగదాధారత్వమును, ఉపాయోపేయత్వమును, వ్యాపకుడైన భగవంతుని స్వరూపమును తెలుపు జ్ఞానానందాముల త్వాదులను, స్వరూపము నెఱింగిన పిమ్మట నెఱుంగ దగు జ్ఞాన శక్తి, వాత్సల్య స్వామిత్వాది కల్యాణ గుణములను కంఠ రవముతో స్పష్టముగా చెప్పుచుండుటచేతను -

2) విష్ణు గాయత్రిలో ప్రాధాన్యమును సూచించుచు, ప్రథమ మందు పఠింపబడుటచేతను -

3) కేవలము శ్రియఃపతి పరముగనే తప్ప, మరి యే దేవతా పరముగను ఇది ఎవ్వరిచేతను సమన్వయింపజాలనిది అగుటచేతను -

(4) వైదికము లగు ద్వైతాద్వైత విశిష్టాద్వైత మతావలంబు లందరిచేతను ఇది ముముక్షువులకు అత్యావశ్యకమైన మంత్రరాజముగ అనుష్ఠింపబడుటచేతను –

(5) నాలుగు వర్ణములకును, నాలుగు ఆశ్రమములకును – వయోభేదము, లింగభేదము లేక, ఉపదేశమును ౦నుటకు అవకాశము గల దగుటచేతను –

6) ఈ మంత్రముచే దెలుపబడు శ్రియఃపతి కంటె ఈ మంత్రమే ప్రతిభావంతమైన దగుటచేతను –

7) 'నారాయణ' యని ఒకనికి పేరు పెట్టుకొని పిలచిన గాని, పరిహసించుటకు వాడిన గాని, ఊత పదముగ వాడిన గాని, దీనిచే నొకనిని అవమానపరచుటకు వాడిన గాని, ఏ విధముగ దీని నను సంధించినను – సమస్త పాపములను నశింపజేయు నని భాగవత – విష్ణు పురాణాది ప్రబంధముల యందు ప్రతిపాదింపబడుటచేతను –

"కులందరుం కెల్వాం తం దిడుం అడియార్ పడు తుయరాయిన వెల్లాం
నలందరుం శెయ్యుం నీళ్ విశుంబరుళుం అరుళొడు పెరునిల మళిక్కుమ్
నలందరుం మత్తుం తందిడుం పెత్తతాయినుమాయ్ ఇనం శెయ్యుం
నలందరుం శొల్లైనాన్ కండుకొండేన్ నారాయణావెన్నుం నామమ్."

— (పెరియ తిరుమొళి : 1 - 1 - 9.)

8) నారాయణాష్టాక్షరీ మంత్రము మంచి కులము నిచ్చును. సిరి సంపత్తుల నిచ్చును. భగవ ద్దాసుల సమస్త దుఃఖములను సమూలముగ నశింపజేయును. పరమాకాశ రూపమైన పరమ పదము నిచ్చును. పరమ దయతో భగవ దంతరంగ కైంకర్య స్థానమును ప్రసాదించును. తమనే గాక, తమ ఆశ్రితులను గూడ రక్షింపజేయ గల శక్తి నిచ్చును. మనకు తెలియని శ్రేయస్సుల నెన్నింటినో సమ

కూర్చును. కన్నతల్లియై, స్వస్వరూప జ్ఞానావిర్భావమును కలిగించును. ఇట్టి ఆనందమును కటాక్షించు 'నారాయణ' అను భగవన్నామాత్మక మగు మంత్రమును నేను తెలిసికొంటిని' అని తిరుమంగై యాళ్వారులు అనుసంధించినటుల, ఈ నారాయణాష్టాక్షరీ మంత్రము సమస్తమును ప్రసాదించున దగుట చేతను –

> "ఓమి త్యగ్రే వ్యాహరేత్ । నమ ఇతి పశ్చాత్ ।
> నారాయణాయే త్యుపరిష్టాత్ । ఓమి త్యేకాక్షరం ।
> నమ ఇతి ద్వే అక్షరే । నారాయ యేతి పంచాక్షరాణి ।
> ఏత ద్వై నారాయణస్యాష్టాక్షరం పదమ్ ॥"
>
> – (అధర్వశిరోపనిషత్తు)

(9) మొదట ప్రణవమును, పిమ్మట 'నమః' పదమును, అటు పిమ్మట 'నారాయణాయ' అనుపదమును పలుకవలెను. ప్రణవము ఒక అక్షరము, నమః పదము రెండు అక్షరములు, నారాయణాయ పదము అయిదక్షరములు. ఇటుల మొత్తము ఈ మంత్రము ఎనిమిది అక్షరములు గలది. దీనికి సర్వవేద సారమును సర్వ వేద సంగ్రహమును, సర్వ వేదాద్యంతోచ్చారితమును అయిన ప్రణవము అంగియై, శిరోభూతమై, సాంతమై యుండుటచేతను –

(10) ఈ మంత్రమున ప్రణవమే ప్రధానమైన భాగము. ఇదియే మంత్రసారము. మిగిలిన భాగములు దీని వివరణ రూపములై యున్నందున, ఇది ఇతర నిరపేక్షమైన సిద్ధి మంత్రమై యుండుట చేతను –

> "ఐహ లౌకిక మైశ్వర్యం స్వర్గాద్యం పార లౌకికమ్
> కైవల్యం భగవన్తం చ మంత్రోఽయం సాధయిష్యతి."

(11) పశువులు - పుత్రులు, పాడి - పంట, ధనము - ధాన్యము భార్య - బిడ్డలు, ఆయువు - ఆరోగ్యము, సిరి - సంపత్తు ఇత్యాది ఐహికమైగాని, పారలౌకికమైగాని ఉండునట్టి సమస్తైశ్వర్యములను ఆత్మప్రాప్తి రూపమైన కైవల్యమును, పరమ పురుషార్థమైన భగవల్లాభమును కావలె నని కోరినవారికి జపహోమాదుల ద్వారా తానే స్వయముగా సాధనమై నిలచి, ఆ యా పురుషార్థములను సమకూర్చు దగుటచేతను -

12) కర్మిష్ఠులు తనను జప హోమాదుల ద్వారా సహాయము వలన దీసికొన్నచో, ఆ యా కర్మలకు విరుద్ధము లగు పాపము లన్నింటిని నశింపజేసి, వానిని నిర్విఘ్నముగ - సులభముగ నిర్వహింపజేసి, వాని వాని ఫలితములను సమకూర్చునట్టి దగుటచేతను -

13) జ్ఞానయోగావలంబులు తనను సహాయముగ దీసికొన్నచో జ్ఞాన సిద్ధి ఆటంక భూతము లగు పాపములను నివర్తింపజేసి, తత్తత్ మును సమగ్రముగ సమకూర్చున దగుటచేతను -

14) భక్తియోగ నిష్ఠులు తనను సహాయముగ గొనినచో భక్తియోగము ఫలించుటకు విఘ్నకరములైన పాపముల నన్నింటి నశింపజేసి, ఆ భక్తిని వృద్ధి పరచి, తత్ఫలమును సుష్ఠుగ సమకూర్చునట్టి దగుటచేతను -

(15) సుశకము, స్వరూపానురూపము అగునట్టి ప్రపత్తి యోగ నిష్ఠులు తనను స్వీకరించినచో - వారలకు స్వస్వరూప జ్ఞానము, అతి విశదముగ అర్థానుసంధానము ద్వారా కాలక్షేపమున హేతువై,

"ఎన క్కెన్డుం తేనుం పాలుం అముదమాయ తిరుమాల్ తిరునామమ్ "

– ( పెరియ తిరుమొళి : 6-10-6· )

ఆ శ్రియఃపతి యొక్క అష్టాక్షరరూప మగు తిరునామమే నా కెప్పటికిని భాగ్యము' అని తిరుమంగై యాళ్వారులు సాయించినటుల, స్వయం భాగ్యమై, కాలక్షేప కారణమై యుండున దగుటచేతను –

16) హారీత స్మృతి యందు చెప్పబడినటుల – సమస్త వేద ములు, ఇతిహాసములు , పురాణములు, వేద వేదాంగ పారంగతు లైన మహాత్ములు, మును లును సారాంశము గ తెలుపునట్టి అర్థపంచక మనబడు (1) పొందబడునట్టి పరమాత్మను గురించిన జ్ఞానము, (2) పొందినట్టి జీవుని గురించిన జ్ఞానము, (3) పరమాత్మను పొందు టకు సాధనమును గురించిన జ్ఞానము, (4) తత్ప్రాప్తికై ఫలమును గూర్చిన జ్ఞానము, (5) అందులకు విరోధులైన వానిని గురించిన జ్ఞానము అను ఈ యైదు జ్ఞానములను సులభముగా తెలుపున దగుటచేతను –

17) ఇది తనను అనుసంధించువారలకు ఆ జన్మమునందే భగవ త్ప్రపత్త్యాపత్తి రూప జన్మాంతరమును కలిగించున దగుటచేతను –

"య త్రాక్షర సంసిద్ధో మహాభాగో మహీయతే
న తత్ర సంచరిష్యంతి వ్యాధి దుర్భిక్ష తస్కరాః."

18) అష్టాక్షరీ మంత్రము సిద్ధిమాత్రముచే – వ్యాధులు గాని, ఆధ్యాత్మిక – ఆధిదైవిక – ఆధిభౌతిక బాధలు గాని, కరువు కాటక ములు గాని, అతివృష్టి – అనావృష్టులు గాని ఏమియు ఉండజాలవు' అని తెలుపబడియుండుటచేతను

10) మహాసిద్ధమంత్ర మగుటచే, సిద్ధారి చక్రాదులు గాని, అగ్న్యాణాదులు గాని, చూడ నవసరము లేక, అందరకు అధికారికమై యుండుట యను మాహాత్మ్యము కలిగిన మంత్రరాజ మగుట చేతను -

20) మహా మంత్రమునకు ముఖ్య లక్షణమైన శబ్దశక్తి, అర్థశక్తి, విశేషశక్తి అను మూడు శక్తులను సంపూర్ణముగా కలిగి యుండిన దగుటచేతను -

21) ప్రాకృతిక బంధముల నన్నింటిని పూర్తిగా నశింపజేసి, పునరావృత్తి రహితమైన నిత్య నిరతిశయ నిరవచ్ఛిన్న ఆనంద రూప మైన భగవద్భాగవత కైంకర్యరూప శుద్ధ మోక్షమును ప్రసాదించు మంత్ర మగుటచేతను -

22) మంత్ర మగుటచే, సాధన రూపమైన దగుట - స్మరింప బడు పరమాత్మ అత్యంత ప్రియతము డగుటచే, తానును అత్యంత ప్రియతమమై సాధ్యరూప మగుట, సహజముగనే భోగ్యమైన దగుట మొదలగు వైలక్షణ్యములు గల దగుటచేతను -

23) మంత్రము లన్నింటి కంటెను ఈ యష్టాక్షరీ మంత్ర మొక్కటియే సర్వశ్రేష్ఠమైనదై, దీనికి మించిన ప్రభావము కలది గాని, దీనిని మించిన శక్తిమంతమైనది గాని, దీనికి మించిన వైభవము కలది గాని, ఉత్తారకమైనది గాని వేరొకటి లేకుండుట చేతను -

24) ఇంత గొప్పది గనుకనే ఇది వేదములు, ఋషులు, ఆళ్వారులు, ఆచార్యులు మొదలగు వారిచే మిక్కిలి ఆదరింపబడుచుండుట చేతను

ఈ యష్టాక్షరీ మంత్రమే అందరికిని ఉపదేశార్హమైనది, అందరకును ఆచరింపదగినది, అన్ని యాపత్తులను పోగొట్టునది, విశ్వ

కల్యాణమును సమకూర్చునది. తరించ నెంచువారి కీ మంత్రమును మించినది వే రొకటి లేనే లేను. ఇది ముమ్మాటికిని సత్యము.

## అష్టాక్షరీ మంత్ర వైశిష్ట్యము

పరమ కారుణికుడై న పరమాత్మ - ఇట్టి సుహత్తర మంత్ర రాజమును భూలోకమున ప్రవర్తింపజేయుగోరినవాడై, ధర్మప్రజాపతి - మూర్తి దేవి అను వారలకు భారత దేశములో, ఉత్తర ప్రాంత మండలి హిమవత్పర్వతమున గల బదరికాశ్రమములో - శిష్యాచార్య రూపమున నర నారాయణులై యవతరించి, ఈ మంత్రమును ఈ భూలోకమున ప్రకాశింపజేసెను.

శ్రియఃపతి లోకములో శిష్యాచార్యానుష్ఠానములను తెలుపుట్కై, తానే నారాయణ ఋషి రూపమున గురువుగను, తానే నరుని రూపమున శిష్యుడుగను అవతరించి, ఈ మంత్రమును ఉపదేశ రూపమున వెల్లడి పరచెను. పురశ్చరణ సిద్ధులకై ఈ చేతనులు ప్రయత్నించి శ్రయాసపడ నవసరము లేకయే - ఆయనయే ఈనాటి వరకు స్థావర రూపమున నుండి, నారాయణాష్టాక్షరిని జపించుచున్నాడు. ఇట్టి అనాది సిద్ధమైన - పరమ పవిత్రమైనది అష్టాక్షరీ మంత్ర రాజము.

## ముగింపు

కల్ప కల్పాంతరముల నుండియు పర్వత రూపముతో - మనకై నారాయణాష్టాక్షరీ మంత్రమును, తన్మంత్రాధిష్ఠానభూతుడు -

మంత్రవాచ్యుడు - మంత్రాచార్యుడు - మంత్రార్థానుష్ఠాతయు నారాయణుడే స్వయముగా జపించుచు, తచ్ఛక్తిని మనకు ప్రసాదిం చుండుటచే, ఈ మంత్రమును విధ్యుక్తముగ, గురూపదేశము పొందిన భక్త ప్రపన్నులు దీని సిద్ధిని స్వయముగా పొందగలరు. భగవద్భక్తియే ఈ భక్త ప్రపన్నులకు పిత్రార్జితమై సంక్రమిం చున్నది. కనుకనే ఈ మంత్రము యోగ్యు లగు గురువుల వద్ద పర్యాయము ఉపదేశమును పొందిన చాలు నని పెద్దలు శాసించిరి



# పురుషకారము

'కవి కోకిల - విద్వత్కవి - కావ్య కళానిధి'

**శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు**

❋

శ్రీ రామానుజ మౌనిచంద్రుడు, దయా సింధుండు, సద్బంధుడున్
శ్రీరంగేశ పదారవిందయుగళీ చింతామృతాస్వాదనో
దారుండై ప్రియశిష్య సంఘము నితాంత ప్రీతి సేవింపగా
శ్రీరంగమ్మున నిత్య వాసముగ వేంచేసెన్ జగద్వంద్యుడై

ముంగిటి పెన్నిధి, కొంగుం
బంగారము, పెరటికల్ప పాదప మగు శ్రీ
రంగని సేవించు సదా
సంగతి యతిరాజు భక్తి సంభావితుడై.

మాయాప్రమేయ విధేయ చేతన గణో
ద్ధారక శేషావతారమూర్తి
కాంతా శిరోమణి కాంతిమతీ గర్భ
కమనీయ శుక్తిముక్తాఫలమ్ము
కాశ్మీర శారదా కలిత శ్రీభాష్యకా
రాభిద వర బిరుదాంచితుండు
ద్రావిడవేద దివ్య ప్రబంధార్థ ప్ర
చార సమాహిత ధీరవరుడు

గురువు నాజ్ఞ మీఱి తిరుమంత్రరాజము
విశ్వజనుల కెల్ల వెల్లడించి
వాసిగను పరమ కృపానిధి రామాను
జార్యవర్యు లోక మభినుతించు.

మేలిమి బంగారు మిసిమి వన్నెల తోడ
మిసమిసలాడు నెమ్మేను వెలయ
పగడంబు డంబుతో జగడంబు గావించు
మోవిపై చిరునవ్వు మొలక వెలుంగ
విన్నాణ మొలికించు కన్నుదామరలలో
కరుణా మరందము గడలుకొనగ
శారద చంద్రికా చ్ఛాయలు మీఱు సుం
దరము లౌ ఊర్ధ్వపుండ్రములు దనర

విమల కాషాయ పరిధాన వేష మొసగ
విష్ణుమత సముత్కృతిని తెల్పెడు ననంగ
దండిగా వెలుగొందు త్రిదండ మొప్ప
అలరుచుండు శ్రీరామానుజార్యమూర్తి

దురిత భరిత సంసార సాగర నిమగ్న
చేతనుల నుద్ధరించి రక్షించు కొఱకు
వెలయ రామానుజార్యులు విష్ణుమతము
నుర్వి వ్యాపింప జేయగా నుద్యమించె.

అవలీలన్ నవ లీలగాం, పొలుపుగా ఆసేతు శీతాచలం
బవనిన్ పర్యటనం బొనర్చుచు విశిష్టాద్వైత సిద్ధాంత వై
భవమున్ సర్వ దిగంతరాళములలో వ్యాపింపగా జేసి ధీ
గ నరేణ్య స్తుతిపాత్రుడై వెలిగె శ్రీరామానుజార్యుం డొగిన్

అల శ్రీకూర్మమ్మును, మం
గళగిరి మొదలైన పుణ్యకలిత క్షేత్ర
మ్ముల విష్ణుమతము స్థితి సం
ధిల నిలుపుచు – ఉడయవరులు తిరుమల జేరన్.

శ్రీ వరాహుని జేరి దర్శించి, కొలిచి
పిదప వేంకటేశ్వరుని కోవెలకు నేగి
పరమభక్తి ద్వైవార ముమ్మాఱు ప్రదక్షి
ణించి యతిపతి – స్వామి సన్నిధిని జేరె.

భువన మోహన సుందరమూర్తి యైన
వేంకటాచల విభుని సేవించి, తనువు
పులకరింపగ, కన్నుల మోద బాష్ప
జలము జాల్కొన నీ రీతి సన్నుతించె.

వైకుంఠ మందిరాలోకనోత్సవమును
మలచు నీ దర్శన విలసనమ్ము
పునుగు, జవ్వాది, కర్పూరమ్ము, కస్తూరి
వాసించు నీ తీర్థ వైభవమ్ము
కమ్మని నేతితో కల్పింపబడి, గుమ
గుమ లాడు నీ ప్రసాద మహిమమ్ము
తులసీ ప్రసూన మంజుల భవ త్పాదాబ్జ
దీపిత మగు శఠకోప గరిమ

ప్రస్తుతింపగ వశమె యెవ్వారికైన
తలప కలియుగ ప్రత్యక్ష దైవ మీవు
శ్రీనివాస! దయావాస! చిద్విలాస!
పంకజాప్త ప్రకాశ! శ్రీ వేంకటేశ!

నీ కల్యాణ గుణామృతానుభవమున్, నీ నామ సుధ్యానమున్
నీ కారుణ్య కటాక్ష వీక్షణములున్, నీ దివ్య సందర్శన
శ్రీ కైవల్యపద ప్రదమ్ములు ధరిత్రిన్ మానవ శ్రేణికిన్
వ్యాకోచాంబుజనేత్ర! శేషగిరివాసా! వేంకటేశ ప్రభూ!

ఎంత చూచినను గానీ తన్వి తీరదు
    నీ మూర్తి సౌందర్య మే మనందు?
ఎంత వర్ణించిన తృప్తి చేకూరదు
    నీ మహా వైభవ మే మనందు?
ఎంత పాడిన రుచియే తగ్గబోదు నీ
    నామ మాధుర్యము నే మనందు!
ఎంత శోధించిన అంతమే కనరాదు
    నీ మహిమోన్నతి నే మనందు?

ఎంత మునిగిన గాని రవ్వంత యేని
లోతు కనరాదు, కొలతకు లోనుకాదు
స్వామి! నీ దయా గాంభీర్య మే మనందు?
పంకజాప్త ప్రకాశ! శ్రీ వేంకటేశ

రత్నసానువులతో రంజిల్లు హేమాద్రి
    డంబు మించిన కిరీటంబు వరల
చంద్ర సూర్య యుగంబు చందాన పొందుగా
    కాంతిల్లు శంఖ చక్రములు మెఱయ
గురు శుక్ర నక్షత్ర గరిమను హసించు
    నాణెంపు వజ్ర కుండలము లొప్ప
తొలి సంజ పసిడి నిగ్గులను సిగ్గిల జేయు
    జలతారు పట్టు దువ్వలువ వెలయ

మేలుగా కన్నులకు మిఱుమిట్లు గొలిపి
దివ్య తేజో విరాజిత నవ్య మగు మ
అలరు నీ రూపు దర్శించి పులకరింతు
పంకజాప్త ప్రకాశ ! శ్రీ వేంకటేశ !

ఈ విధమున వేంకటేశుని సేవించి
వినుతి చేసి, ధన్యతను భజించి
నిండు మదిని ఏడుకొండలు దిగి వచ్చి
భాష్యకారులు తిరుపతికి చేర.

మంగాపురమున అలమే
ల్మంగను సేవించి, మోద మానసమున ను
ప్పొంగుచు రామానుజముని
పుంగవు డేతెంచె మఱల మొగి తిరుపతికిన్

పుడమి పులకింపగా శ్రీ
ఉడయవరులు వెడలు వీథి నోసరిలి జనం
బడుగడుగున కేల్మోడుపు
ముడుపులు చెల్లింత్రు భక్తి పొంపిరివోవన్

ఈ విధి యతిపతి ఆ యా
దైవత మూర్తులను నేత్ర తర్పణము సం
సేవించి వచ్చి మఠమున
వే విధముల బోధ సేయు వేదార్థములన్

ముని రామానుజులు సుధా
ఘనోక్తి దివ్య ప్రబంధ కాలక్షేపం
బొనరించుచున్ కతిపయ
దినములు నివసించె దిగువ తిరుపతిలోనన్.

నమ్మాళ్వారువారు సంధానించు 'తిరువాయి
    మొళి' మహార్థమ్ముల బోధించి
తిరుమంగయాళ్వారు తెలిపినట్టి 'పెరియ
    తిరుమొళి' విషయముల్ పరిగణించి
పెరియాళ్వారు చెప్పిన సరాళపు 'తిరు
    ప్పల్లాండు' విభవమ్ము పరిఢవించి
ఆండాళు తల్లి సమాలాపించిన 'తిరు
    ప్పావు' మాధుర్యమ్ము ప్రస్తవించి

ఇతరులైన ఆళ్వార్లు సాయించినట్టి
అతుల దివ్య ప్రబంధముల నవధరించి
యతికులేంద్రుడు రామానుజార్యమౌళి
ప్రవచనము సేయు పరమ భాగవత గోష్ఠి.

అ గురువర్యుం డట ద్రవి
డాగమ తత మహిత పరహితార్థంబులు వా
గంభీరత దెలుపుచు
భాగవతోత్తముల గోష్ఠి బరగుచునుండన్.

నిండు మనసున్న 'తొండూరు కొండ' యనెడు
గొల్ల వెలది ప్రతిదినము కొల్లలుగను
పాలు, పెరుగు లమ్ముచును జీవనము గడపు,
వేలుపులను, పెద్దలను సేవించుచుండు.

తిరుపతి పురమున నిరతము
పెరుగును, పాలును, నవకపు వెన్నయు వేడ్కన్
సరస మగు వెలకు నమ్ముచు
తిరుగును ఆ గొల్ల వెలది తేకువతోడన్.

చిక్కనగు పాలు, మీఁగడ జిడ్డు గలుగు
పెరుగు, వెన్నయు ఆ గొల్లచెలది మిన్న
బత్తి తళుకొత్త భాగవతోత్తములకు
నిత్య మర్పించు మోదము నెరయుచుండ.

ప్రతిదినము గోపభామిని
యతిరాజు వచించు పారమార్థిక సూక్తుల్
శ్రుతిపేయముగా వినుచున్
మతి మోక్షేచ్ఛా మహానమాదృతి నొందెన్.

బాగుగ భగవత్సేవయు
భాగవతోత్తముల సేవ పచరించుట న
ద్యోగమ్మను యతిరాజుల
వాగమృతము గ్రోలి గొల్లపడతుక మురిసెన్.

అసదృశమ్మైన పూర్వపుణ్యమ్ము కతన
తెరలి గోపవనిత గుండె పొరలలోన
బీజముగ, సాజముగను, అవ్యాజముగను
నాటుకొన్న మోక్షేచ్ఛ ఈనాడు అంకు
రించి, చిగురించి పూచి, పరిమళించె.

ఒకనాడు భాష్యకారులు
ప్రకటిత వాత్సల్య రేఖ భాసిల్లగ గో
పికతో ని ట్లనియెను ఓ
కపితో మృదుమధుర వాక్య విన్యాసమునన్.

నీ నయ వినయమ్ములు, మఱి
నీ నిర్మల భక్తిభావనిష్ఠా గరిమల్
మానసమున కెంతేనియు
ఆనందము గూర్చెనమ్మ ! ఆభీర సతీ !

నీ మదిలో గల కోరిక
ఏమో యెఱిగించితేని యేమఱకను నీ
కామితమును దీర్చెదము నీ
క్షేమా తము పలదు సంశయింపగ తల్లీ !

అనటయు శ్రీ రామానుజ
మునిమాళికి భక్తి వినయములతో గోపాం
గన ప్రమొక్కుచు తద్గురువరు
వినుతించెను మదిని కోర్కె వినిపించె నిటుల్.

శ్రీ రామానుజ! కేశవార్య తనయా! శేషాంశసంభూత! సం
సారోద్ధారక! కష్టవారక! లసత్ సౌలభ్య సౌశీల్య సం
భోగా! భారతదేశ పూజ్యచరితా! మాన్యాగ్రణీ! దీన మం
దారా! సూరి చకోర కార్తికీకచంద్రా! భాష్యకారప్రభూ!

యతిరాజా! మార్తాండ
ప్రతితేజా! చేతనోద్ధరణ కార్యసమా
దృతనైజా! శ్రితజన దై
వతభూజా! మీ పదములు భావింతు మదిన్.

భవ్యమార్గ విహీన పాషండ వితమ ప
ర్వత ఖండనోద్దండ వజ్రదండ!
దుర్వార చార్వాక దుర్గర్వ గహన, ద
హన మహాభీల దావాగ్ని కీల!
శుద్ధభావ విరుద్ధ బౌద్ధమత ధ్వాంత
సందోహ వారణ చండకిరణ!
పండితమ్మన్య వితండ వాదస్ఫార
దాగణ భావ కుఠారధార!

సంగతాజ్ఞాన శైవ భుజంగ గర్వ
భంగ చణ విహంగాధీశ ! మంగళాంగ !
సరస దరహాస ! శ్రీరంగపుర నివాస !
రవి సదృశతేజ ! శ్రీ యతిరాజరాజ !
కరుణాభరణా ! తత సం
సరణాంబుధి తరణ ! కలుషచయ సంహరణా !
తరుణాంబుజ నిభములు మీ
చరణంబులు మాకు దిక్కు జయ యతిరాజా !

మీ కైంకర్యమె మాకు జీవనము స్వామీ ! మీ కృపాలోకన
ప్రాకట్యమ్మె సదాశ్రితావనము దేవా ! మీదు నామ స్మృతి
ప్రాకామ్యమ్మె నితాంత పావనమునై భాసిల్లు రామానుజా
ర్యా ! కల్యాణ గుణాంబురాశీ ! యతిరాజా ! భాష్యకారప్రభూ !

మాయను లోనుగా బ్రతుకు మానవకోటిని ఉద్ధరించి ని
శ్రేయసమౌ పదంబునకు జేర్పగ దీక్ష వహించు మించుగా
వేయి ముఖాలతో విమల విష్ణు మతంబును వజ్రలేపన
ప్రాయముగా, అజేయముగ వ్యాప్తి నొనర్చిన దేశికాగ్రణీ !

వెడగు సంసారపు మడుగు నింకించు మీ
యడుగులు కన్నుల కద్దుకొందు
గోము చూపించుచు సోముని బోలు మీ
మోము సొంపును మనంబున స్మరింతు
చిలువ లాచరించుచు చెలువారు మీ కావి
వలువ వన్నెకు నమస్సులు పొనర్తు
వేంద్రమ్మె మాకుగా తీండ్రించు మీయూర్ధ్వ
పుండ్రసౌభాగ్య విస్ఫూర్తి దలతు

కెంజిగురు మోవిపై తులకించు మీదు
మొలక నవ్వులు తలపులో నిలుపుకొందు
దివ్య సౌందర్య ధుర్యమై తేజరిల్లు
మీ స్వరూపము సేవింతు మేల్మి బత్తి
భాగవత చిత్తచోర ! శ్రీ భాష్యకార !

ఉదయవరులు మమ్ము నొడయులై పాలించ
భాష్యకారు లొసగు పరమ పదము
ఎల్ల శ్రితుల మేరు వెంబెరుమానారు
లక్ష్మణార్యు లుభయ లక్షణుండు.

కారుణి శాస్త్రగణ్య ! కలికల్మష దీనశరణ్య ! ఘోర సం
సార పయోధిలో మునిగి చాలగ నేను తపించి పోయితిన్
నారక వహ్ని కీలములు నన్ను దహించక యుండ మోక్ష ల
క్ష్మీ రచితానుభూతి కలిమిన్ కలిగించుము దాసురాలికిన్.

లీలా నిత్యవిభూతి నాయకులు మీరే యంచు భావించియున్
వాలాయంబుగ మీ పదాబ్జ యుగళిన్ బ్రాపించితిన్ గొల్ల యి
ల్లాలిన్, స్వంతయు తెల్వి లేని రయొక మహాత్మన్ భవత్ సత్కృపా
శ్రీ లాభంబు ఘటించి మోక్ష పదవీ ప్రీతిన్ ప్రసాదింపుమా !

భక్తియున్, ప్రపత్తి, పరమపదాకాంక్ష
మమ్మరింప, వినయ మిమ్ముకొనగ
విన్నవించు గొల్ల వెలదిని గనుగొని
భాష్యకారగురుడు పలికె నిట్లు,

ఎలమి ఘటిల్లె గోపసుదతీ ! తిరమైన ముముక్షు నీ మదిన్
కలుగుట, మోక్ష మిచ్చు అధికారము వేంకటశైల భర్తకున్
కలదు సుమీ ! యథార్థముగ, కావున నీ విపుడేగి, వేంకటా
చలమున శ్రీనివాసు పదసన్నిధిలోన ప్రపత్తి సేయుమా !

అరమర లేని భక్తి వయివార నతించెదు నీ కటాక్ష్యమున్
పరమపదం బొసంగు మని పత్ర మొకండును వ్రాసి యిత్తు శ్రీ
హరి పదపద్మ మందున సమర్పణ చేయుము భక్తురాల! ఆ
వరదుడు నీ మనోరథము వారక దీర్చును గోపభామినీ!

భక్తి సంపన్నురా లగు వ్రజ వనితకు
శ్రేయముగ మోక్షమును కృప సేయు మనుచు
భాష్యకార దేశికమణి పత్ర మొకటి
వ్రాసి యిచ్చెను వేంకటేశ్వరుని పేర.

శ్రీ వేంకటాచలాధీ
శా! వాసవ ముఖ్య దేవతార్చితచరణా!
పావన నామ! రమేశా!
నా విన్నప మాలకింపు నతజన భరణా!

కల్ల కపటము తెలియని గొల్లపడతి
భక్తురాలు సంసార విరక్తురాలు
పరమపద కాంక్షతోడ నీ పత్రము గొని
వచ్చె మీ సన్నిధికి - చూపవలయు కరుణ.

నీ మహిమ భజించుచు, నీ
నామమ్ము స్మరించుచును, అనారతమును ని
శ్నే మది నమ్మిన గోపిక
కామితమును దీర్పవలయు కరుణావార్ధీ!

అని వ్రాసి లేఖ గోపాం
గన కిచ్చిన నామె భాష్యకార గురులకున్
వినయమున మ్రొక్కి పత్రము
గొని వేగమె చేరె నేడుకొండల పైకిన్

ఉడయవరులు కూరిమిమీర నొసగినట్టి
పత్రమును దివ్య సందేశ భాషితమును
వేంకటేశు సన్నిధి సమర్పించి, భక్తి
తీవరింప గోపిక వినుతించె నిట్లు.

స్వామీ! వేంకట శైలనాథ! కరుణా పారీణ! పద్మేశ! సు
త్రామానంద త్రిదశార్చితా! వరద! శ్రీ రామానుజార్య ప్రసా
దామోదాంకిత పత్రికన్ గొని, త్వదీయాభ్యర్ణమున్ జేరి నీ
నామ ధ్యానమె ప్రాణమై నిలచితిన్, నన్నున్ కటాక్షింపవే!

భక్త జనులకు ఆనంద భాగ్య మొసగు
యుగ యుగముల అక్షయ కళాజ్యోతి నీవు
తరతరమ్ముల నిక్షేప ధనము నీవు
వేంకటేశ్వర! వైభవోపేతనిలయ!

స్థిరధృతి విశ్వదేశికుడు శ్రీ యతిరాజు లొసంగు పత్రమున్
పఠియించి కృపాసుధార్ద్రకలనా పరిపూర్ణ కటాక్ష వీక్షతో
కరసి ముముక్షుతాకలితనై చనుదెంచిన దాసురాలికిన్
పరమపదం బొసంగ వలె ప్రాభవ బంధుర! వేంకటేశ్వరా!

అను వ్రజాంగన ప్రార్థన మాలకించి
ఉడయవరుల విన్నపమున కుత్సహించి,
కృప దలిర్పగ శ్రీ వేంకటేశ్వరుండు
పూనుకొని భక్తురాలికి మోక్ష మీయ.

ఏడుకొండలవాడు ఈరేడు జగము
లేలువాడైన శ్రీ వేంకటేశ్వరుండు
భక్తవరదుండు, ఆశ్రిత వత్సలుండు
పరమపద మిచ్చె నా గొల్ల పడతి కపుడు.

భక్తురాలు గోపసతికి పరమపదము
వేంకటేశునిచేత నిప్పించి మిగుల
పురుషకారం బొనర్చిన పూజ్యులైన
ఉడయవరుల దయాగుణ ముగ్గడింతు.

రామానుజార్య దివ్యా
జ్ఞా మహిమము సర్వకాల సర్వ దిశల ను
ద్దామపరాక్రమకలితం
బై మహి వర్ధిల్లుగాత! భాసుర మగుచున్!



# శ్రీమద్రామానుజులు - ఆస్తిక తత్త్వము

'కళాప్రపూర్ణ - భారత రత్న'

డాక్టర్ : సర్వేపల్లి రాధాకృష్ణన్, ఎం. ఏ ; యల్. టి.



## ఆరంభ వాక్యము

తత్త్వ శాస్త్రములకు మూలములు మానవుని జీవితావస ములయందే గలవు. మానవుని జన్మ సహజము అగు మూల కాంక్ష లను తృప్తి పరచక, ఋతములో నిగూఢ తత్త్వమును వ్యక్తీకరింపని వే దతత్త్వమును జనాంగీకారము నందఁజాలదు. మన దుర్దశా దుఃఖమ యగు - ఉపశాంతి చేకూర్పఁజాలని తత్త్వశాస్త్రజ్ఞుల భావ కల్ప నలు - కేవల శేముషీ వినోదము లగునే కాని, నిశ్చయ విజ్ఞాన హేతువులు కాజాలవు. నిశ్చలము, నిర్వికారము నగు శంకరాచార్యుల నిర్గు ణబ్రహ్మము - ఎట్టి కర్తృత్వ ప్రభావములు లేనిదగుటచే, మన కౌదాస్య భావము నుదయింపఁజేయును. దానిని గూర్చి చూపరులు చేయు ప్రశంసను నెఱుంగజాలని టాజ్ మహల్ వలె, శంకరాచార్యుల నిర్గు ణబ్రహ్మము, తదారాధకుల భయ రాగములకు ఉదాసీనత వహిం చును. మత లక్ష్యమే తత్త్వ లక్ష్యమనియు, దేవు నెఱుంగు సత్యము నెఱుఁగుట యని తలచువారికి - శంకరాచార్యుల భావము ఒక పాండిత్య బలముతోఁ గూడిన తప్పునకు పూర్ణోదాహరణము వ లె గోచరించును. అది సహజ మానవ ప్రకృతి విరుద్ధమగుటయే గా క యితర బుద్ధికిఁ గూడ అశ్లీల తోఁచును. ప్రపంచ మొక మిథ్యా దృశ్యము, పరమేశ్వరుఁడు స్వీయ అతిశయ కాంతిచే అంధీభూతుఁడై నిర్గుణ బ్రహ్మము దౌర్బల్య అజ్ఞాన దూషితులగు మానవులు - లే వ్యాపార విహారముల నుండి మొఱ పెట్టినపుడు, మనసుఁ దెలిం

తాపునుండి కృపాభయహస్తము చూపట్టి రక్షించు నను ప్రత్యక్షాను భవ విషయము విడిచిపెట్టఁబడినది. భక్తులు తమ కాలములలో భగవానునితోఁ బొందు సజీవ సాన్నిధ్యమునకు ఉచిత స్థానమును శంకరాచార్యులు వక్కాణింతురు. వ్యక్తిగతములైన లక్ష్యముల నిర్గుణా నియమావళికి వశ మొనర్చుటచే, సత్య శివ సౌందర్యములు వ్యక్తులతో సంబంధము లేని రూప రహిత నియమములు గా వని ద్వైతారాధకుఁడు వాదించును. వ్యక్తి వినా అనుభవ ముండు ననుట స్వవ్యాఘాత వచనము. సత్యము, పరిపూర్ణత్వము, సౌందర్యమును ఒక ఆదిపురుషుని హృదయములో సమగ్ర సిద్ధిని గాంచె నని సూచించును. భగవంతుఁడే పరమార్థ మగు సత్యము, పరమ ప్రయోజనమునై యున్నాఁడు. భగవంతుని హృదయ కుహరములయందు ప్రధానముగా నున్నది కేవల సత్య సంశుద్ధియు - లేక, సౌందర్యానుభూతియుఁ గాక, ప్రాణికోటి కొఱకు నిత్యము ప్రసరించుచుండు పరిపూర్ణ ప్రేమామృతమై యున్నది. పరిచ్ఛిన్న జగత్ప్రయోజన మే మనఁగా - అందలి జీవకోటికి భగవంతుఁడు తనతో సారూప్యము గాంచుటకు అవకాశముగాఁ గల్పించి యున్నాఁడు. దేవుని దృష్టిలో జీవులకు కేవల జీవత్వముచేతనే విలువ యున్నది. కేవలము జీవులార్జించిన ప్రజ్ఞా ధర్మ పరిణతిచేతనే గాదు - జీవులను గల్పించి, వాని సదృశత్వ మొనర్చు ఒకే దేవుఁడు వానిని సృజించి యుండ చేను

రామానుజాచార్యులు ఈశ్వర ప్రపంచ సంబంధముపై తమ దృష్టిని కేంద్రీకరించి, ఈశ్వరుని అస్తిత్వము యదార్థ మనియు, అతఁడు స్వతంత్రుఁ డనియు, జీవుని అస్తిత్వమును సత్యమే కాని, వాని అస్తిత్వము పరిపూర్ణముగా ఈశ్వరాధీనమై యున్న దనియు వాదించును. జగత్తునకు మూలాధారమై, ఒక తత్త్వ మున్నదనియు, అది మిథ్య కాదనియు ఆ రామానుజులు వచింతురు. ముక్త జీవులు

తమ ప్రత్యేక వ్యక్తిత్వములతో అవిచ్ఛిన్నముగా నుండు నని
వక్కాణింతురు. జడ జగత్తును, జీవులును తమ ప్రత్యేక
అస్తిత్వమును గలిగి యున్నను, అం దేదియు బ్రహ్మ స్వరూ
గాదు. ఏ లన, బ్రహ్మ మెట్టి లోపము లేని నిత్య పరిపూర్ణుడు;
త్పదార్థము జడము; జీవులు అవిద్యా దుఃఖ దూషితులు. కాని,
కన్నింటికి ఏకత్వ మున్నది, జడ జగత్తును, జీవులును దేవుని శరీర
దేవుని దేహముగానే వాని కునికి గల దే లన, దేవుడే వానికి ఆత్మ
యజమానియు నగును. బ్రహ్మమునకు వేరుగా వానికి అస్తిత్వ
లేదు. జీవాత్మయు, జడ జగత్తును ఈశ్వర భిన్నములే కాని, ఈశ్వ
హీనములై, ఈశ్వర సేవార్థము కాక, వానికి వే రే ప్రయోజనము
లేదు. కావున, రామానుజుల సిద్ధాంతము అద్వైతమే కాని,
విశేషముతోఁ గూడి యున్నది. ఏకమైన పరమాత్మ అనేకత
నంగీకరించును, అది జీవ జగత్తుతోఁ గలిసి యుండును. అందుచే
విశిష్టాద్వైత మైనది.

## ఆగమములు

క్రమముగా భారతవర్షములోని స్వదేశ వాసులు – ఆర
విజ్ఞాన ప్రభావ సంపర్కము కలిగిన కొలఁదియు హిందూమ
మిక్కిలి వైశాల్యమును పొందినది, ఉన్నత సంస్కృతి గల
జాతియు, వెనుకఁబడియున్న ఆటవిక జన వర్గములును వైదిక
మత విధానమును, దేవాలయ అర్చన విధానమును, బహిరంగ ఉ
పద్ధతులును పెంపొందించుటకు తోడ్పడినవి. క్రొత్త జాతులు
చేరుచుండిన కొలఁదియు, క్రొత్త శాఖ లేర్పడ నారంభించినవి.
శాఖకు విశిష్టములై, తిలక – దీక్షా – గురు మంత్ర శాస్త్రప్రవ

1. ఈ లోకములోని సర్వమును – జీవులుగాని, జడపదార్థములుగాని పరమ
దేహరూపములే ; అందుచేతనే పరమాత్మ – నిరుపాధిక శరీరుఁ డని చెప్ప
ఈ కారణముచేతనే బ్రహ్మవిషయముగా గల శాస్త్రము శారీరక శాస్త్ర మని కొ
వలెను.

వెలసినవి. అతి ప్రాచీనదశయందే వైష్ణవ శైవ శాక్తేయములు వరుసగా పాంచరాత్ర సంహిత, శైవాగమము, తంత్రము అను ప్రత్యేక మత గ్రంథములతో పెంపొందినవి.

ఆగమములు సామాన్యముగా - జ్ఞాన భాగము, యోగ భాగము, క్రియా భాగము, చర్యా భాగము - అని నాలుగు భాగము లుగా విభజింపఁబడినవి. క్రియా భాగ మనఁగా - ఆలయ నిర్మాణ విగ్రహ ప్రతిష్ఠా విధానము; చర్యాభాగ మనఁగా - అర్చన కాండ.[2] ప్రతిమారాధనము నందు విశ్వాసము గల మతములకు సంబంధించున ఆగమము లనిరి. ఏలన, అవి ఆలయ నిర్మాణ ప్రతిష్ఠాదులను గూర్చి మిక్కిలి విపులముగా నియమములను, సూత్రములను వర్ణించినవి.

## రామానుజ జీవితము

రామానుజులు సర్వసంగ పరిత్యాగము గావించి, యత్యాశ్రమ మును స్వీకరింప, జను లందఱు మెచ్చి, వారిని యతిరాజు లని నుతించిరి రామానుజులు శ్రీరంగమున స్థిర నివాసులై, తిరువాయిమొ గూడార్థముల నభ్యసించిరి. బోధాయన వృత్తిని కంఠస్థముగా నేర్చి గిన శిష్యు లగు కూరత్తాళ్వారుల సాయమున, రామానుజులు వేదాం సారమును, వేదార్థ సంగ్రహమును, వేదాంత దీపమును, బ్రహ్మ సూత్ర - గీతాభాష్యములను రచించిరి. వైష్ణవ పండితు లెల్ల రామానుజ బ్రహ్మసూత్రార్థ వివరణము నంగీకరించిరి. అది వైష్ణవులకు శ్రీభాష్య మయ్యెను. దక్షిణాపథ మెల్లడ సంచారః చేసి, రామానుజులు అనేక శిథిల దేవాలయములను పునర్నిర్మాణః చేసి, అసంఖ్యాకులను వైష్ణవులుగా మార్చిరి. మహాజ్ఞాన సంపన్ను

2. పద్మ సంహిత · 1-2-8 : 2-1-3 , 3-1-6 : 4-1-1.

తమ యుగమునకు ప్రవర్తులై, తమకు లభించిన సంప్రదాయసిద్ధ మగు ప్రాచీన విజ్ఞానమును తమ జీవితములో పున రనుభూతికిఁ దెచ్చిరి. రామానుజులకు పహావాసను నొసగిన భక్తులు, జ్ఞానులు నిత్య ధ్యాన వైరాగ్యములతో తమ జీవితములను గడపిరి. ఆళ్వారుల గీతములు వారి హృదయములలో పరమేశ్వరుఁడు నిండారి, పొంగి పొరలించిన మహత్తర ఆవేశ భక్తి పూరితములు. ఏ లన, వారికి భగవాను డనఁగా - జగత్కర్తయే కాదు; సన్నిహిత మిత్రుఁడు, మార్గదర్శియు నైనాఁడు. జన్మసహజమై, భక్తిభావము రామానుజులకు పరమేశ్వరుని ఒక వ్యక్తిగా ప్రదర్శించినది. శంకర రామానుజు లిరువురును వేదాంత మహాప్రవక్తలే. వారి చిత్తములలో సమాన సమస్య లుదయించినవి. వారి కాధారము లగు మూల గ్రంథములును సమానములే. వారి వివరణ పద్ధతులు ఇంచు మించుగా సమాన ప్రపాదనలపై ననే సాగినవి; కాని, ఫలితములు మాత్రము విస్పష్ట భిన్నత్వమును సూచించినవి. వారు చేసిన నిర్ణయములు, పరమా సంగ్రహణములో వారి భిన్నము లగు మార్గములను ప్రదర్శించినవి. రామానుజులు సహజ మతానుభూతిని గట్టిగా నమ్మి, సృష్టి రచన వలనను, అవతార ప్రశస్తి వలనను, సాక్షాత్కారము వలన, మానవునకు గోచరించు పరమేశ్వరుని వ్యక్తీకరించు నిగూఢ మగు అనుపాన భక్తి మార్గమును ప్రకటించిరి. బ్రహ్మసూత్రముల యందును ఉపనిషత్తుల యందును అవ్యక్త నిగూఢత్వము నందియున్న భావము ఆ రామానుజులు ఆళ్వారుల యొక్కయు, ఆచార్యుల యొక్కయు సాంగత్యముచే బహిర్గతముగా నొనరింపగలిగిరి. వా రెన్నఁడును తా మె స్వతంత్ర మగు తత్త్వము నుపదేశించుచున్నట్లు భావించలేదు. సా కాలికమైన బ్రహ్మజ్ఞానమునే వారు ప్రకటించుచున్నట్లు విశ్వసించి

## చరిత్ర - సారస్వతము

ఇతిహాసారంభయుగము నుండి యించు మించుగా వైష్ణవోద్యమము అవిచ్ఛిన్నముగా ప్రబలిన చరిత్ర మున్నది. ఋగ్వేదము నందు విష్ణువు పరమపద నివాసి యైన ఆదిత్య దేవతగా భావింపఁబడెను.[3] వరుణ దేవతా భావము బలవత్తర మగు ఏకేశ్వర వాద లక్షణ లక్షితమై యున్నది. వేదము లందు మనకు శుభాశీర్వచన ప్రదాత యగు భగదేవతా భావ మున్నది. ఈ భగ శబ్దమునకు శ్రేయశ్శక్తి యను భావము పెంపొంది, క్రమముగా - అట్టి శక్తి గలవాఁడే భగవానుఁ డని తలపఁబడెను, భగవ దారాధనతోఁ గూడిన మతమే భాగవత మతము. భాగవత మతమును గూర్చి మహా భారతము స్మరించినది. భాగవత మతమే వైష్ణవ మతమై, భగవానునే విష్ణువుగా గ్రహించెను. మహా భారతములోఁ జెప్పఁబడిన పాంచరాత్ర మతమున వైష్ణవ మత లక్షణము లన్నియు నున్నవి. విష్ణు పురాణము నందు విష్ణువు దేవదేవత్వము అప్రతిమానము. భాగవత పురాణము కృష్ణునే ప్రధానముగా వర్ణించిన భగవత మతమునే ప్రకటించినది. ఇందలి భక్తి మహదావేశ పూరితము, జీవేశ్వర సంబంధము నాయకీ నాయక సంబంధముగా ప్రదర్శింపఁబడెను. దక్షిణాపథమునకు భాగవత మతము క్రీ: ప్రథమ శకారంభమునకు పూర్వ మెపుడో వచ్చియుండె నని నానాఘాట్ శాసనము వలన స్పష్ట మగుచున్నది. కలియుగమందు నారాయణారాధకుల సంఖ్య, దక్షిణములో అధికముగా నుండు నని భాగవతము చెప్పుచున్నది.[4] ప్రామాణ్యసిద్ధిని గాంచిన ద్వాదశాళ్వారుల

3. "విష్ణోః పరమం పదమ్"

4. శ్రీమద్భాగవతము . 11-5-38, 40.

గీతములు - 'నాలాయిర దివ్య ప్రబంధ' మనుః నామముతోఁ బిల బడెను. ఈ యాళ్వారులలో - ఒక స్త్రీ, పెక్కురు శూద్రులు, భూపాలుఁడును గలరు. వీరి యనంతరము సగుణారాధనము వలన ఈ రానుగ్రహము లభించు నను విశ్వాసమునకు తాత్త్వికాధారమ నిర్మించు ఆచార్యులు బయలుదేరిరి. రామానుజ పూర్వాచ పరంపరలో ముఖ్యులు - నాథమునులు, యామునాచార్యు (ఆళవందారులు). నాథమునులు - ఆళ్వారుల యుపదేశ వాక్య నొక పద్ధతిలోనికిఁ దెచ్చిరి. 'న్యాయ తత్త్వము'ను, 'యోగ స్యము'ను ఈ నాథమునులే రచించిరి. వేదార్థమునే వైష్ణవాగమమ ప్రతిపాదించు నని సమర్థింప, యామునాచార్యులు మిక్కిలి ప్ర

6. ఈ గ్రంథము 4,000 పాశురములు, (పద్యములు) గలది. నాలుగు భాగములుగ జింపబడెను. మొదటిది - ముదలాయిరము ఇందు - పెరియాళ్వారులు, ఆం మున్నగువారి సూక్తు లున్నవి రెండవది - తిరుమంగైయాళ్వారుల పెరియ తిరు మూడవది - సుప్రసిద్ధమైన నమ్మాళ్వారుల తిరువాయిమొళి, నాల్గవది - ఇయ మొదటిదానివలెనే అనేకు లగు ఆళ్వారుల సూక్తి సంచయము. నమ్మాళ్వారుల వాయిమొళిని తమిళ వేదసార మని చెప్పుచుందురు. - 'వేదం తమిళ శె మారన్' అని నమ్మాళ్వారులకు ప్రసిద్ధి కలదు. అదియునుఁగాక -

"ద్వారే కలియుగే ప్రాప్తే నాస్తికైః కలుషీకృతే
విష్ణో రంశాంశ సంభూతో వేద వేదార్థ తత్త్వవిత్
స్తోత్రం వేదమయం కర్తుం ద్రావిడ్యా పీచభాషయా
జనిష్యతి సతాం శ్రేష్ఠో లోకానాం హితకామ్యయా."

— (భవిష్య పురాణ

తిరువాయిమొళినిగూర్చి నాథముని లిట్లు చెప్పిరి :-

"సహస్రశాఖోపనిష త్సమాగమం, నమా మ్యహం ద్రావిడవేదసాగరమ్."

తిరువాయి మొళియందలి ప్రధానవిషయము — అర్థపంచకము

1) పరమాత్మ 2) జీవాత్మ 3) ఈ రెంటి సంబంధము 4) అనిష్ట నాశ
5) ఇష్ట సిద్ధి.

పడిరి. వారి ముఖ్య రచన లివి .- (1) ఆగమ ప్రామాణ్యము (2) మహాపురుష నిర్ణయము (3) సిద్ధి త్రయము (4) గీతార్థ సంగ్రహము (5) చతుశ్శ్లోకి (6) స్తోత్ర రత్నము. వైష్ణవుల మత సారస్వతమును ఉభయ వేదాంత నామమునఁ బిలుతురు. ఏ లన, అందు సంస్కృత ప్రస్థాన త్రయము, తమిళ నాలాయిర దివ్య ప్రబంధము కూడ నున్నవి. ఆళ్వారుల గీతములు - శ్రుతి స్మృతి వాక్య సారమునే ప్రకటించు నని చిర సంప్రదాయ విశ్వాస మున్నది. శంకరుల నిరంకుశమైన అద్వైత వాదము వలన, రామానుజులు తిరిగి వేదోక్తమైన యేకేశ్వర మతమును పునః ప్రకటనమును చేయవలసి వచ్చినది. బోధాయనవృత్తి యందలి భావములనే తాము విస్తరింపఁ జేసితి మనియు, టంక, ద్రమిడ, గుహదేవ, కపర్ది, భారుచులు తమతో సమాన భావములు గలవా రనియుఁ జెప్పినారు. రామానుజు లుగ్గడించిన యేకేశ్వర వాదము యొక్క పురాతనత్వమును శంకరు లంగీకరించును. అందుచే, రామానుజ మతమునకు పూర్వ మూలములుగా ఏకేశ్వర ప్రతిపాదకము లగు ఉపనిషత్తులు - నారాయణీయ ప్రకరణములతోఁ గూడిన మహాభారత భాగములు, భగవద్గీత, విష్ణు పురాణము, వైష్ణవాగమములు, ఆళ్వారులయు - ఆచార్యులయు వచనములు అని చెప్పవచ్చును. ఉపనిషద్గీతా బ్రహ్మసూత్రార్థములతో - వైష్ణవ భక్తుల భావములకు సమన్వయమును గూర్చునవే రామానుజుల ముఖ్య రచనలు. వారి స్వతంత్ర ప్రతిభకు ఎంత స్థాన మున్నదో నిర్ణయించి చెప్పుట సులభము కాదు. కాని, వారిచే రచింపఁబడిన శ్రీభాష్యము - బ్రహ్మసూత్రములతో ఏకేశ్వర తత్త్వమునకు ఆధారములను గనుగొను యత్నము లన్నిటిలో - వారి యత్నమే విశేషగుణ సంపూర్ణత్వములలో నిరుపమానమై ప్రకాశించుచున్నది. రామానుజుల భక్తి - తత్పూర్వుల కంటెను, అనంతర కాలికుల కంటెను అధికముగా -

శాస్త్రీయకము, నియమ బద్ధము నైనది. వేదవిధి కర్మవిధానముల నిరసించుటకు వా రుద్యమింపలేదు, పౌరాణిక గాథలకు ప్రాముఖ్యము వా రీయలేను. భక్తి వలన మోక్షము లభించునని ప్రకటించి, అదియే ప్రస్థానత్రయ ప్రధాన సందేశ మని నిరూపించుటకే వారు ప్రయత్నించిరి. రామానుజ భాష్యమునకు సుదర్శన భట్టరువారి శ్రుతప్రకాశికయే గణ్యమైన టీకయై యున్నది.

ఇంచు మించుగా 13 – వ శతాబ్దముననే దక్షిణోత్తరము లగు తెంగల, వడగల శాఖలకు భేదములు ప్రబలెను. తెంగల శాఖకు తమిళ ప్రబంధమే మతగ్రంథ మని నమ్మి, సంస్కృతగ్రంథముల యెడ ఔదాసీన్యము చూపెను. వడగల శాఖకు రెండును సమాన ప్రమాణములే. తెంగలులు దోషభోగ్య మను సిద్ధాంతము నంగీకరించిరి. అనఁగా, భగవానుఁడు పాపము ననుభవించును. ఏలన, దాని వలన, ఆతనియనుగ్రహము చూపుట కెక్కుడవకాశ మున్నది. వడగలు తమిళము కంటె అధికముగా సంస్కృతము నుపయోగించి, లక్ష్మీ భావమునకు శాక్తేయ మతాంశములను కొన్నిటిని స్వీకరించిరి.[6]

పిళ్ళలోకాచార్యులు తెంగల శాఖకు ముఖ్య ప్రతినిధులు. ఈశ్వరానుగ్రహము అమోఘమైన దనియు, దానిని కేవలము భక్తి చేతనే గాక ; ప్రపత్తి చేఁ గూడ సాధింపవలె ననియు వారు బోధించిరి. గురువునకు సంపూర్ణ ఆత్మ సమర్పణమే చేయువలె నని యీ శాఖ వారి మతము. ఇది రామానుజులు చెప్పిన వివేక సహిత గురు

---

6. విష్ణుపత్ని యగు లక్ష్మియు విష్ణువు వలెనే జన్మ రహిత మైన దనియు, విష్ణువుతో సమముగా కృప జూపు ననియు, ఆమెను అర్చింపవలె ననియు వడగలవారు తలంతురు. ఆమెకు జన్మ మున్న దనియు, దైవకృప కామె సాధనశక్తి యనియు తెంగలవారు తలంతురు ఈ యంశములను శ్రీమాన్ గోవిందాచార్యులవారు రచించిన 'అష్టాదశ భేదములు' అను గ్రంథమునుండి గ్రహింపవచ్చును.

శుశ్రూషా పద్ధతి కాదు. రహస్యము లనఁబడు అష్టాదశ రహస్య గ్రంథములను లోకాచార్యులు రచించిరి. అర్థపంచక, తత్త్వత్రయ ములు అందు ముఖ్యములు. తెంగల శాఖలో మణవాళ మహామునులు ప్రధాన ఆచార్యులు.

రామానుజుల అనుయాయులలో అగ్రగణ్యు లగు వేదాంత దేశికులు (క్రీ.శ. 1268 - 1369) వడగల శాఖా స్థాపకులు. కాంచీ పురము జన్మస్థాన మయ్యును - అధిక జీవిత కాలమును వారు శ్రీరంగమున గడపిరి. వా రనేక విషయముల గూర్చి విపుల రచనలు చేసిరి. కాని, వారి ముఖ్య గ్రంథములు చారిచే తమిళ భాషలో రచింపఁబడిన పరమత భంగ, రహస్యత్రయ సారములై యున్నవి. వారి పాంచరాత్ర రక్ష, సచ్చరిత్ర రక్ష — పాంచరాత్ర శాఖా నియ మములను వివరించును. శ్రీ భాష్యమునకు తత్త్వ టీకను, గీతాభాష్య తాత్పర్య చంద్రికను వారు రచించిరి. పూర్వోత్తర తత్త్వ మీమాం సలు ఒకే తత్త్వ భాగము లనియు, దైవ యాజమాన్యమున గాక, కర్మ ఫలము నీయఁజాల దనియు వారు వాదించి, 'సేశ్వర మీమాంస' యను గ్రంథమును రచించిరి. వా రింకను రచించిన న్యాయసిద్ధాంజనము, తత్త్వ ముక్తా కలాపము, త ద్వ్యాఖ్య యగు సర్వార్థ సిద్ధియు ఉక్త యుక్త రచనములు. వారి ఖండన గ్రంథము 'శత దూషణి' అద్వైత మును నిరసించినది. దానికి భాష్య మొకటి - 'చండ మారుతొ' మను నది - పై దానితో సమానమైన ఖండన గ్రంథమే. శ్రీనివాసాచార్య కృత 'యతీంద్ర మత దీపిక' - పదునేడవ శతాబ్దములో ప్రధాన గ్రంథము. శైవ మతావలంబి యయ్యు - అప్పయ్య దీక్షితులు పెక్కు వైష్ణవ గ్రంథములకు వ్యాఖ్యలు వ్రాసెను. రామానుజ మతమును సమర్థించుటకై, రంగరామానుజులు (18 - శతాబ్దము

ఉపనిషత్తులకు భాష్యములు వ్రాసిరి. రామానుజుల ప్రభావ మనంతర హిందూమత చరిత్రమందు నేటికిని దృశ్యమాన మగుచున్నది. మధ్వ - వల్లభ - చైతన్య - రామానంద - కబీరు - నానక్ నడపిన యుద్యమములంగూ వారేను, సంస్కార మత మగు బ్రహ్మసమాజమును రామానుజ ప్రోక్త మగు ఏకేశ్వర తత్త్వమున కెంతయు ఋణపడి యున్నారు.

## జ్ఞాన ప్రమాణములు

రామానుజులు ప్రత్యక్ష, అనుమాన శబ్ద ప్రమాణముల సంగ్రహించి, తర్కనవానియెడ ఉదాసీనత వహించిరి. వారి యనుచరులు ఒకటి రెండు అధికముగాం జేర్చిరి. భేదము వలన వ్యక్తీకరింపం బడినదే ప్రత్యక్ష విషయము. దాని కొక రూపమును నిర్ణయించు జాతి లక్షణము గలదు.[7]

ప్రత్యక్షమున సవికల్పక నిర్వికల్పక భేద మున్న దని రామానుజు లంగీకరింతురు. నిర్వికల్పక ప్రత్యక్ష మనంగా - కేవల భేద రహిత విషయ గ్రహణమును గాదు; గుణములతో అన్యోన్య సంబంధము లేని సగుణ విషయ గ్రహణమును గాదు. అది నిర్గుణ విషయ గ్రహణము కా దేలన, గుణ భిన్నత్వ లక్షణ విరహిత వస్తుదర్శనము దుస్సాధ్యము. వై లక్షణ్యమే చిత్త ముఖ్యలక్షణ మగుటచే, కొన్ని

7. వస్తు బాహ్య లక్షణములు ప్రత్యక్ష విషయములు. మన మొక ధ్వని వినినప్పుడు - శ్రోత్రేంద్రియవృత్తి బహిర్గత మగును. వాయువు ఇంద్రియ విషయము గంధశూన్య మయ్యు - రూపస్పర్శలకు విషయము.

విశిష్ట లక్షణములు లేనిదే వస్తువును మనము తెలియఁజాలము. ఒక విశిష్ట లక్షణ సహిత వస్తు గ్రహణమే జ్ఞాన లక్షణమై యున్నది.[8] ఏలన, సవికల్పక ప్రత్యక్ష మందును నిర్వికల్పక ప్రత్యక్షమందుఁ జూడఁబడినలక్షణములనే తిరిగి స్మరించి, గుర్తింతుము రెంటికి భేద మేమనఁగా, నిర్వికల్పక ప్రత్యక్షమందు ఒక వస్తువును మొదటిసారియే చూచి, దాని జాతి లక్షణమును గ్రహింతుము. కాని, ఆ జాతికిఁ జెందిన సర్వవస్తు లక్షణము ఇదే యని తెలిసికొనఁజాలము[9]. అట్టి వస్తువునే రెండవ దానినో, మూఁడవదానినో మనము చూచుట తటస్థించినపుడు - అది ఆ జాతి వస్తువుల కన్నిటికి గల సామాన్య ధర్మ మని గుర్తింతుము.

వ్యక్తులే యథార్థములు. వాని యందు జాతిత్వ లక్షణ మను నది ఒకటి లేదు. అంశా సంస్థాన విషయములో సాదృశ్య మున్నది. సాదృశ్యమును బట్టియే వస్తు భావమును కల్పించుకొందుము. సాదృశ్యమే సమాన పదప్రయోగమున కాధారము[10]. భేదము తాను వివరించు విషయ సంబంధి కా దని వేదాంత దేశికుల వాదము. అందుచే, ప్రత్యక్షము మనకు విషయ జ్ఞానమును, తద్భేదమునుఁగూడ ఈయఁ గలదు.[11] ఇవి అన్యోన్యాశ్రయములు కావు. రెంటికి ఏకత్వమును మనము కూర్ప యత్నించినపుడు - అవి పరస్పరము ఆధారభూతములుగాఁ దోచును. కాని, దీని నంతను మన మి ట్లెంతగా గ్రహిం

8. "సవిశేష విషయత్వాత్ సర్వప్రమాణానామ్" - (శ్రీభాష్యము ' 1-1-1)

9. తత్త్వముక్తా కలాపము : 4, 32. 10. ఉదా : జైవ భావములో

11. సర్వార్థ సిద్ధి : 5-14.

చినని, ఏవియ సంబంధము లేని భేద మెట్లుండ గలదో దురవగాహమై యున్నది.[12]

యోగదృష్టి స్వతంత్ర జ్ఞాన ప్రమాణము కా దని రామానుజాచార్యులు తలపోసిరి. ప్రతీంద్రియమును ఒక విశిష్ట వస్తు వర్గమే చూచుటకు నిర్మింపబడినది ; ఎంత యభ్యాస బల మున్నను - అది ఉపతేంద్రియముల మూలముననే పని చేసనచో, ఆ యింద్రియ దృష్టి. యింద్రియాతీతమైన దైనచో, అది యనుభవ దూర మగుటచే - ప్రమాణము కాజాలదు.

స్మృతి ప్రమాణ మంగీకరింపబడి, ప్రత్యేక స్థాన మీయబడినది. అది ప్రత్యక్షములో చేరదు. ఏ లన, స్మృతి జ్ఞానములో ప్రత్యక్ష మిమిడియే యున్నది. కావున్నచో, ప్రత్యక్షపూర్వక మగుటచే, అనుమానమును ప్రత్యక్షము క్రిందకే రావలెను.

ఒక సామాన్య నియమము వలన లభించు జ్ఞానము అనుమానము. నిజమున కొక్క విషయమే సామాన్య నియమమును సూచింప వగును. అనేక విషయములు మన సందేహము దొలగించును. తర్కము వలనను, భావాత్మకు ఆ భావాత్మకోదాహరణముల వలనను, మనము అప్రస్తుత విషయములను పరిహరించి, సామాన్య ధర్మ స్థాపనము చేయుదుము.[13] తర్క— వాక్యమునకు మూ డంగము

12. ఈ భావము ప్రత్యక్ష విషయముగాం జెప్పబడెను ఏ లన, ఒక వస్తువు లే దన్నచో, ఇంకొకచోట నున్న దని భావము. అనుపలబ్ధి మూలమున చిత్త మున కెల్లప్పుడు తనకు సంబంధించు విషయము లుండ నవసరము లేదని తెలియ గలదు. .... (శ్రీభాష్యము : 1-1-1.)

13. సర్వార్థ సిద్ధి : 4-47

లున్నవి. న్యాయ పంచాంగ వాక్యములలో మొదటి మూడును గావి, చివరి మూడును గాని స్వీకరించబడినవి. పోల్చుట స్మృత్యను మానములపై ఆధారపడుటచే, స్వతంత్ర ప్రమాణము గాదు. అర్థాపత్తియు, సంభవమును అనుమాన గర్భితములే.

రామానుజులు శ్రుతి ప్రమాణము నంగీకరించిరి. సర్వ సృష్టికి ఆధారభూత మగు పరమార్థము - ఏ యితర ప్రమాణములకును గ్రాహ్యము కాని దగుటచే, శాస్త్రైకవేద్యము.[14] బ్రహ్మము ప్రత్యక్ష విషయము గాదు.[15] మన యనుభవములోని సామాన్య సూత్రములు బ్రహ్మముయొక్క యాథార్థ్యమును స్థాపించుటగాని, నిరసించుటగాని చేయజాలవు.[16] మన బుద్ధి సూచించు బ్రహ్మాస్తిత్వము మన ప్రజ్ఞా సీమకు అతీతమై యున్నది. ఇంద్రియాతీత విషయ జ్ఞానమునకు శ్రుతియే సాధనము. తర్కము శ్రుత్యర్థ సమర్థనమునకే పనికివచ్చును.[17] వేదములు శాశ్వతములైనవి. ప్రతి సృష్ట్యారంభమునను ఈశ్వరుడు వాని నుచ్చరించుచుండును. స్మృతేతిహాసములు వేదార్థప్రతిపాదకములే కావున, ప్రామాణికములే.

14. శ్రీభాష్యము · 1-2-1 15. శ్రీభాష్యము : 1-1-3
16. శ్రీభాష్యము : 1-2-23 17. శ్రీభాష్యము 2-1-12

అన్యమతశాఖావాద విమర్శనమునందు యామునాచార్యుల స్వచ్ఛ మగు హేతువాదమునే యుపయోగింతురు. తమ ప్రతికక్షి వాదమును తిరస్కరించి, యిట్లు నుడువుదురు.

" ఆస్తికులం ఈ ఉపదేశములో నమ్మక ముండవచ్చును. మనము నమ్మకము లేనివార మగుటచే, వాదము సహేతుకముగా నున్ననే తృప్తి నిచ్చును "

— (సిద్ధిత్రయము)

భగవానుఁ డగు వాసుదేవుఁడే కర్త యగుటచే, పాంచరాత్రాగమములును ప్రామాణికములే.[18] యథార్థమైనచో - ఐతిహ్యము - లేక, సంప్రదాయమును ఆగమ జ్ఞాన తుల్యమైన దగును.[19]

విజ్ఞానము స్వయముగా పరమార్థ సాక్షాత్కారము నొసఁగ జాల దని రామానుజుల నిశ్చయము. వేదములుకూడ మనకు పరోక్ష జ్ఞానమునే యిచ్చును. శ్రుతివాక్యార్థ జ్ఞానముకంటె విలక్షణమైన దింకను ఏదియో కావలసి యున్నది. తర్క జ్ఞానము గాక, సాక్షాత్కారము భక్తిసంభరితమైన ధ్యానము వలన లభించును.[20] చేతనాచేతన యుక్తమైన యేక బ్రహ్మ సాక్షాత్కారము వామదేవాదులకు సిద్ధించెను.[21] ఈ మహోన్నత మగు దివ్య జ్ఞానము ఆత్మ యొక్క విజ్ఞానేతర లక్షణ బలముచే సాధ్య మగును. పరమార్థ స్వభావము నెఱుగుటకు మనస్సున కితర శక్తు లున్నవి. సత్య సాక్షాత్కార సిద్ధికి వలయు ఒక మహా సంకల్పములో ఈ శక్తు లన్నియు కేంద్రీకృతము లగును. అప్పుడు మనస్సు మహోచ్చ సీమలో పనిచేయఁగలదు. అట్టి మహోచ్చ స్థాయిలో మనస్సునకు తార్కిక శక్తియు, ఊహా శక్తియు గూడ నుండును. దోష తర్కావేశములకు అవకాశము లేకపోలేదు. కాని, మనస్సుయొక్క నీచ స్థాయిలో రస భావములు సమన్వయ శూన్యములై యుండును. కాని, క్రమముగా భావము లెట్లు నియమబద్ధము లగుచుండునో, అట్లే - రసములు సుశిక్షితములై, హేతుబద్ధము లగును, అంత ర్దృష్టికి గోచరించు విషయము ప్రత్యక్షము కాదు కావున, దానిని పరోక్ష జ్ఞాన మనిరి.

---

18. తత్త్వముక్తా కలాపము : 4, 121
19. అది అసత్యమైనచో, ఆగమ మాభాస యగును.
20. శ్రీభాష్యము : 3-2-23 21. శ్రీభాష్యము : 3-2-24

"ని, దాని స్వచ్ఛత్వ సామీప్యత్వములను బట్టి ప్రత్యక్షమున్న కది సిపోవునది కాదు.[22] నిత్య దైవతార్చన ప్రార్థనాదికముల వలన వానుగ్రహము కలిగి, జ్ఞానము లభించునని మనము ముందుం జూడం ము. ఇది భక్త్యనుభూతి, లేక - యీశ్వర సాక్షాత్కార సిద్ధి. నాత్మ, పరమాత్మాలింగనములో విలీన మగును.

సర్వ విజ్ఞానము యథార్థరూపమే[23] యైనచో, మన జ్ఞానము 'న్ని వేళలలో అయథార్థ మేల యగుచున్నది? అన్నచ దృష్టికి గోచ ుచు వస్తువు అయథార్థము కాదు. ఏ లన, పంచీకరణ సిద్ధాంతము ననరించి, ప్రకృతిలోం గల సర్వ వస్తువులును పంచభూతాంశము నో యొక నిష్పత్తిలో మేళవించిన సంయుక్త ద్రవ్యములే. దానిని 'రజిత' మనియు, ఇంకొక దానిని 'శుక్తి' యనియు కొనుటకు కారణము - రెంటిలో త ద్వస్తు లక్షణము అతిశయమై ఒందుటే. ముత్తెపు చిప్పలు వెండి శలాకల వలె నుండుటను మనము చియుంటిమి. అందుచే, వెండి లక్షణములు కొన్ని ముత్తెపు ప్పలోం గల వని ప్రత్యక్ష ప్రమాణమే చూపును." కొన్ని విష ములలో సమానత్వము వస్తు సాదృశ్యమును సూచించును. దేణువులయందును నీరు గలదు. పచ్చ కామెరలు గలవాని కంటికి ఖము పచ్చగాం గాన్పించును. కంటి పచ్చదనము నేత్రేంద్రియ ా ప్రసారముతో శంఖమును గప్పి, అందలి ధావళ్యము నాచ్ఛా చును. ఈ వాద మెంత అశాస్త్రీయముగాం గన్పట్టినను, సర్వజ్ఞాన ను యథార్థ సంబంధి యను విశ్వాసమును విడిచిపెట్టుటకు రామా ులకు ఇష్టము లే దని విశద మగును. స్వప్నములందుంగూడ జీవుల

2. శ్రీభాష్యము : 3-4-26

"సర్వం విజ్ఞానజాతం యథార్థమ్."

(శ్రీభాష్యము : 1-1-1)

పుణ్యపాపముల ననుసరించియే, సుఖదుఃఖానుభవమునకై యీశ్వరుఁడు వస్తు రూపములను గల్పించును.[24] జీవుల పుణ్యపాప ఫలిత రూపముగా ఈ జగత్తును సృజించి, కొన్నిటిని కొలది మందికి మాత్రమే గోచరించి, కొలఁది కాలమే యుండులాగునఁగూడ సృజించును. ఈ భేదమువలననే, వస్తువుల ఉచ్చత్వ నీచత్వ భేద కారణమైనది.[25] కొన్ని జ్ఞాన విషయములు అసత్యములు, కొన్ని సత్యములు - అని చెప్పుట యుక్తము.

రామానుజులు విపర్యయాస్తిత్వమును నిరాకరింపఁజూచిరి వారు జ్ఞానమంతయు సత్యసంబంధియే యందురు. కాని, అన్ని రకముల జ్ఞానమును సంపూర్ణ సత్య సంబంధి యని చెప్పరు. మన జ్ఞానము సామాన్యముగా అపరిపూర్ణము, పాక్షికమునై యున్నది. మనము ముత్తెపుచిప్పను వెండి యని భ్రమించినపుడు, మనము దానిలోని కొన్ని లక్షణములనే చూచి, కొన్నింటిని విడిచిపెట్టితిమి. పచ్చని శంఖమును జూచుటలో - దాని ధావళ్యమును విడిచిపెట్టితిమి స్వప్నానుభవములలో విషయములు స్వప్నగత వ్యక్తికే సంబంధించినవికాని, ఇతరులకు సంబంధింప వను విషయమును మనము మఱచిపోవుదుము. నిజమైన జ్ఞానమను దానిలోఁగూడ వ్యవహార ప్రయోజనములకు అవసరము లగు అంశములను మనము గమనింపము నిజమైన జ్ఞానమును, కాని జ్ఞానమును, రెండును పరిచ్ఛిన్నములే యయ్యును, నిజమైనది మన యాశముల కనుగుణము లగు అంశములను గ్రహించి, కార్యసిద్ధి నిచ్చును. నిజము కానిది - ఆ పని చేయఁజాలదు. నిజమైన స్థానము జీవితోపయోగి. ఎండమావులలో దోషమే మనఁగా - అందు జలాంశము లేకపోలేదు. అంద

24. శ్రీభాష్యము ; 3-2-5,6. 25. శ్రీభాష్యము · 1 1.1

నీరు మన దాహమును దీర్చునంత లేదు. నిజమైన జ్ఞానము యథార్థ వస్తు సంబంధము వ్యవహారానుగుణమునై యుండును.[26]

అన్ని రకములైన జ్ఞానమును యథార్థ లక్షణములను కొన్నిటిని తెలుపును. కాని, యథార్థ వస్తువును సమగ్రముగా గ్రహింపనిదే, అది పరిచ్ఛిన్న జ్ఞాన మనియే చెప్పవలెను మన జ్ఞానము సర్వతోముఖ సంపూర్ణత నందువఱకు - దోషావకాశము తొలఁగదు అనఁగా - జ్ఞానాభిలాషికి సర్వ లోపములు పోవలెను. ఆశయ ముండును గాని, సంసార మగ్నుల కది సాధ్యము కాదు.

జ్ఞానము స్వభావము చేతనే అవిలంఘ్యమైన దని రామానుజుల భావము. ఈ లక్షణము ననుసరించియే నిర్వికల్పక జ్ఞానము ఎల్లప్పుడు మన నిర్ణయములను ఉత్తరోత్తర పరిపూర్ణతకు తోడ్కొని పోవును. జ్ఞాన మత్యున్నతమైనపుడు - అనఁగా, తన గమ్య స్థానమును జేరి నపుఁడు, సముచిత వ్యాపారములతోఁ గూడిన భిన్నాంశముల సమన్వ యము గాంచిన యేకైకానుభూతి సిద్ధించును. అట్టి పరిపూర్ణాను భూతిలో - ప్రత్యంశము సముచితస్థాన వృత్తిని గలిగి, పరిచ్ఛిన్న మయ్యు - విశిష్ట వ్యక్తిత్వమును గలిగియుండును. జీవాత్మను మోక్ష సిద్ధితో పూర్ణ జ్ఞాన ప్రాప్తియుఁ గలుగును.

## కారణము - ద్రవ్యము

రామానుజులు సత్కార్య వాద సిద్ధాంతము నంగీకరింతురు. ప్రతి కార్యమున కొక పూర్వ స్థిత మైన ఉపాదాన కారణ ముండును. కారణ ధర్మ మనఁగా - అవస్థాంతరత్వము.[27] నూలుపోగులే వస్త్ర

26. యతీంద్ర మత దీపిక
27. "అవస్థాంతరాపత్తి రేవ హి కార్యతా."
— (రామానుజ గీతా భాష్యము : 13 – 2)

ములకు కారణములు. ఏ లన. నూలుపోగులను పడుగు పేకగా నేయుటే వస్త్ర మగును.[28] వస్తువుయొక్క భావాభావములు భిన్న దశలు. ఆ భావము తాత్కాలికము, నిత్యము కాదు.

గుణములు కలదే ద్రవ్యము. ద్రవ్యమాధారము. దానిపై ఆధారపడున దనఁగా – ఆధేయ ద్రవ్యము. వస్తువులు ద్రవ్యములు. గుణ సంబంధములు అద్రవ్యములు. దీపపు కుందె ద్రవ్యము. దీపమున ద్రవ్యమే. కాని, దీపము గుణము కూడనై యున్నది. వృద్ధి క్షీణతలు గలదగుటచే బుద్ధియు ఒక ద్రవ్యమే. బుద్ధి ఆత్మకొక గుణమునై యున్నది.[29] సృష్టి యంతయు దేవుని విశేషణ మగుటచే, ఈశ్వరుని దృష్టిలో అద్రవ్య మగును. ద్రవ్యములే ఉపాదాన కారణములు కాఁగలవు. అద్రవ్యము లట్టివి కావు[30] ప్రకృతి, కాలము, శుద్ధసత్త్వము, ధర్మభూత జ్ఞానము, జీవాత్మ, ఈశ్వరుఁడు ద్రవ్యములు.[31] మొదటి మూఁడును జడములు. జీవేశ్వరులు అజడములు. జ్ఞానమునకు రెండు లక్షణములు గలవు. జడ ద్రవ్యములవలెఁ గాక, జ్ఞానము స్వయం వ్యక్తీకరణమును జేసికొనును, బాహ్యవస్తువులను వ్యక్తీకరించును. జ్ఞాన మెప్పుడును స్వప్రయోజనపరముగాక, ఆత్మపర మైనది. ఆత్మకది నిరుపమాన మగు సహకార లక్షణము. అందుచే, దానిని ధర్మభూత జ్ఞాన మందురు. ఏదే నొక విషయ సాంగత్యమునందిన యొక యింద్రియ మూలమున నుదయించు జ్ఞానము వలన ఆత్మవిషయమును తెలిసికొనును. విషయీ విషయములు భిన్నము లని తలపఁబడి, జ్ఞానము వానికి సంబంధము కూర్చునని నిశ్చయింపఁబడినది.

28 శ్రీభాష్యము : 2–1 - 19, 20; 2.1-16.

29 తత్త్వముక్తా కలాపము : 4,7

30. తత్త్వముక్తా కలాపము ; 5,2

31. తత్త్వముక్తా కలాపము : 1-6

శబ్దముయొక్క పంచ లక్షణములు, ఒత్తిడి, రూప, రస, గంధములు, మిశ్రమ లక్షణము, భారము, సంఖ్య, ఔష్ణత్వము, వ్యక్తిత్వము, కలయిక, భేదము, ఇచ్ఛా ద్వేషములు, సంతోష క్లేశములు, సంకల్ప బుద్ధులు అద్రవ్యములు.

## ఆత్మ - జ్ఞానము

నిజమైన వస్తువు అభేద బ్రహ్మమే యగుటచే, విషయీ విషయ భేదము తాత్కాలికమే కాని, నిజము కాదని శంకరుల విశ్వాసము. రామానుజులు ఈ భావమును నిరసించి, జ్ఞాన లక్షణము ననుసరించియే - నిత్యముగా నొక వ్యక్తియు, తద్భిన్నములైన విషయములు నున్నవని వాదింతురు. భేద దర్శనమే జ్ఞాన లక్షణము. అభేద వస్తు దర్శనము నిచ్చు ప్రమాణ మేమియు లేదు. అట్టి దున్నచో, బ్రహ్మము విషయమై, అనిత్య వస్తు వర్గమునఁ జేరవలసి వచ్చును. శుద్ధజ్ఞానము సత్యమైనచో - దానికి కొన్ని లక్షణము లుండవలెను. అసత్యమైనచో - అది గగన కుసుమము వంటి దగును.[33] జ్ఞానమునకు నిత్యత్వము, స్వయంప్రకాశత్వము మున్నగు విశేషణములను శంకరులును చెప్పినారు. జ్ఞానము స్వయం ప్రకాశమే, మఱియు - అది వేద్యము కూడనై యున్నది. తెలియఁబడుటచే, ప్రతి విషయము జడద్రవ్యము కానక్కరలేదు.

---

32 "న చ నిర్విషయం కాచిత్ సంవిదస్తి"

33. "సంవిత్ సిద్ధ్యతి వా నవా? సిద్ధ్యతి చేత్ స ధర్మతా స్యాత్, న చేత్ తుచ్ఛతా గగన కుసుమాదివత్."

— (శ్రీభాష్యము. 1-1-1.)

జ్ఞాన మపరిచ్ఛిన్న మైనచో, జ్ఞాన విషయములును అట్టి
కావలెను. కాని, అట్లు జరుగుటలేదు. సుషుప్త్యవస్థలలో, ని
షయిక జ్ఞాన ముండునని యనుకొనుట పొరపాటు. "గాఢ నిద్రా
నుండి మేల్కాంచిన వ్యక్తి, స్వభావముచే అన్నిటికి వ్యతిరేకమై అ
నమునకు సాక్షి యైన శుద్ధ జ్ఞాన స్వరూపముగానే ఆ యవస్థ
మున్నా" నని తనకుఁ దాను జెప్పుకొనుటలేదు. 'నేను సుఖము
నిద్రించితి ననియే తలంచును. దీనివలన, నిద్రయందుఁగూడ ఆత్మ
లేక, 'నేను' అను నతఁడు తెలిసికొను ద్రష్ట యనియు, 'సుఖమ
నెఱుఁగు ననియు స్పష్టమగుచున్నది. అప్పటి ద్రష్ట దేనిని నెఱుఁ
కున్నాఁ డనఁగా, ద్రష్ట యుండె ననియు, విషయములు లేవనియు
తెలియుచున్నది'.[34] విషయ సంబంధము లేని జ్ఞాన ముండఁజాలదు
సుషుప్త్యవస్థలో అది పనిచేయ దేలన, అప్పుడు విషయములు లేవు
సుషుప్త్యవస్థలలో ఆత్మ - స్వయం జ్ఞానముతో నిర్విషయక జ్ఞానము
గలిగి యుండును. జీవాత్మ యనఁగా - అహంభావమే కాని, శుద్ధ జ్ఞా
స్వరూపము కాదు. సుషుప్తిలో అహంకార మదృశ్య మయ్యును
అజ్ఞాన సాక్షిమాత్రముగా జీవుఁ డుండు నని చెప్పుట వలన, శంకర
లును దీని నంగీకరించినట్లే. ఏది తెలియుటకు శక్తి లేనిదో, అ
సాక్షియు కాఁజాలదు. శుద్ధజ్ఞానము సాక్షి కాఁజాలదు, సాక్షి
యనఁగా - ద్రష్ట. ఈ ద్రష్ట సుషుప్తిలో నుండును. అది
యిప్పుడు తమస్సుచే ఆవృతమై యుండుటచే, దానిని మన మెఱుఁ
గము. సుషుప్తిలో అది లేక యున్నచో, మేల్కాంచిన వెనుక, సుఖ
నిద్రానుభవ జ్ఞాపకము సాధ్యము కాదు. నిత్యమగు ఈ ద్రష్ట
లేనిదే, స్మృతి సాధ్యము కాదు. నిన్న జరిగిన దానిని నేఁడు మనము
గుర్తింపలేకుందుము. జ్ఞానము, నిత్య ద్రష్టయు ఒకటే యన్నను,

34. శ్రీభాష్యము : 1-1-1 ; 2-3-31.

స్మృతి కర్థము చెప్పుట కష్ట మగును. అందుచే, ఒక తెలియు జ్ఞాని యున్నాఁ డనియు, ఆతఁడు వివిధ కాలములలో ఒకఁడే యనియు, కేవల జ్ఞానమే కాదనియు చున్నది[35] జీవాత్మ స్వయం ప్రకాశత్వము గల జ్ఞానము కాదు. దాని నెఱుఁగువాఁడు - 'నేను జ్ఞానమును'[36] అని మన మెన్నడును చెప్పలేము, 'నే నెఱుఁగుదును' అని చెప్పుదుము.[37] ద్రష్ట వలననే జ్ఞానమునకు స్వయంప్రకాశక శీలము లభించినది. జ్ఞానాస్తిత్వము, తత్స్వయంప్రకాశకత్వమును జీవాత్మవలననే వచ్చినది.[38] ఈ విధముగా స్థాపింపఁబడిన విషయము - 'విషయ వర్గము లోనిదే యని వాదించుట - తన తల్లి గొడ్రాలని చెప్పుట వంటిదే.' ప్రకృతి యొక్క అచేతన కార్యమైన అహంకారమునకు జ్ఞాతృత్వమును, జ్ఞానమును గూడ ఆపాదింపఁజాలము. జ్ఞానసార రూపమైన ఆత్మకు జ్ఞాన లక్షణమును గలదు.[39] అది జ్ఞాతయే కాని, కేవల జ్యోతి కాదు.[40] జ్ఞాతృత్వమునకు పరివర్తన శీల ముండవలె నని

---

35. "ప్రతిసంధానం హి పూర్వ పరకాల స్థాయినం అనుభవితారం ఉపస్థాపయతి, నానుభూతిమాత్రమ్ "

— (శ్రీభాష్యము : 1-1-1.)

36. "అనుభూతి రహమ్"        37. "అనుభవా మ్యహమ్"

38. శ్రీభాష్యము ; 1-1-1 ; 2-3-15.

39. చిద్రూప — చైతన్య గుణక,        40. "జ్ఞాతైవ న ప్రకాశమాత్రమ్."

మఱియు -

బృ. అ. ఉ. 4-3-14 ; 4-5-15 ; ఛాం. ఉ : 8-12-3,4 :

ప్రశ్న . ఉ : 4-9 ; 6 - 5 ; తై : ఉ : 2 - 4.

తెలుప నవసరము లేదు. జ్ఞాత యనఁగా, జ్ఞానమున కాధారమైనదే. ఎఱుక గల యాత్మ నిత్యము గావున, జ్ఞానమును నిత్యమైనదే. కా యీ నిత్యజ్ఞాన మెల్లప్పుడును ప్రకాశింపదు. జ్ఞానము స్వయము అపరిచ్ఛిన్నమయ్యు, వృద్ధి క్షీణతలు పొందఁగలదు. కర్మవశమున వి భావపరిణాముల కనుగుణముగా సంకోచము నంది, భిన్నేంద్రియము మూలమున భిన్నరూపము లొందుచుండును. ఈ యింద్రియ సంబంధములచే, దానికి ఉదయాస్తమయము లున్నవని తలఁపబడును జీవితావస్థలలో సర్వ కాలముల యందు అది పని చేయుచున్నన అది యెన్నఁడు లేని స్థితి యుండదు. ఈ యవస్థానుగుణ పరివర్త లక్షణము అప్రధానమైన దగుటచే, ఆత్మ నిర్వికారమైన దని చెప్పబడును. జ్ఞాన మెప్పుడును విషయము కాఁజాల దను భావమున రామానుజు లంగీకరింపరు. అన్య వస్తువులను ప్రకాశింపజేయునపుడ అది విషయము కాదు కాని, తఱచుగా అది విషయ మగుచుండును, కాఁగలదు. మనుష్యుల ముఖవైఖరిఁ జూచి, వారి రాగ ద్వేష భావములను గనిపెట్టఁగలుగుట వలనను, లేక - ఒక వ్యక్తి - తన గతానుభవమును నేఁటి జ్ఞాన విషయముగా పరిశీలింపఁ గలుగుట వలనను, ఒకని జ్ఞాన మింకొకని జ్ఞాన విషయ మగుచున్న దని మనకు నిత్యానుభవమే. జ్ఞానము జ్ఞాన విషయ మగుట వలన, తన స్వభావమును కోల్పోవదు. జ్ఞానము స్వవిదిత మని మనము చెప్పరాదు. తన యస్తిత్వమునకు తానే ఆధారమై కాని, తాను ప్రకాశింపఁజేయు విషయములను తన మూలముననే చేయుటచే నైననేమి - ఈ క్షణములో అది ప్రకాశింపఁజేయు స్వభావమును కలిగియుండుటే జ్ఞాన ప్రధాన లక్షణ మని రామాను తలంచిరి. జడపదార్థములు ఆవిష్కృతి నొందినపుడవి స్వయంవ్యక్తము లగుట లేదు. ఆత్మ యితర లక్షణములైన

41. శ్రీభాష్యము : 1.1-1.

అణువాదిత్వము, నిత్యత్వాదికము, గతానుభవ జ్ఞానము మున్నగునవి వానివలననే వ్యక్తము లగుటలేదు. కాని, వానికి భిన్న మగు జ్ఞాన వృత్తి వలననే వ్యక్తీకరింపఁబడుచున్నది.

## ఈశ్వరుఁడు

యథార్థ వస్తువు అద్వైతిక స్వరూపము కాదని రామానుజుల జ్ఞాన సిద్ధాంతమువలన నేర్పడును. అది సవికల్పకమైన పరిపూర్ణత కలదియై, సభేదకత్వ స్వరూపమును కలిగి యున్నది. పరమాత్మ యొక టున్న దని రామానుజులు నిశ్సంశయముగా అంగీకరింతురు. భిన్నములు, అనేకములు నగు వస్తువులకు పరస్పర సంబంధ ప్రవృత్తికి అవకాశ ముండవలె నన్నచో, బ్రహ్మాండములోని నానాంశముల ననుసంధించు సర్వసామాన్య మగు నొక పారమార్థిక నియమ ముండవలెను. తర్కమే కాక, మతానుభూతియు, పరిచ్ఛిన్న వస్తువు సత్యమనియు, పరమాత్మ ఒక వ్యక్తి యనియు అంగీకరింపఁగోరును. దేవునితో వ్యక్తి సంబంధమే మనకు వేరైన యీశ్వరునితో నేస్తమును గూర్చును. మన స్వార్థరహిత భక్తికిఁ గాని, ఓర్పుతో ననుభవించు దుఃఖమునకుఁగాని యే వికారమును జూపక, నిర్వికార నిరీక్షణము చేయు నిర్గుణ బ్రహ్మము భక్తిమార్గమునకు సరిపడు దైవ స్వరూపము గాదు. శంకరుని వాదము శూన్యతను సూచించు ననియు, దాని నాతఁడు విచిత్ర భావ నైపుణ్యముచే ఆచ్ఛాదింప యత్నించె ననియు రామానుజు లూహింతురు. శంకరుల నిర్గుణ బ్రహ్మ మొక శూన్య స్వరూపము, అది సర్వతోముఖ సౌందర్యరాశి యగు నొక యశ్వము వంటిది. దానికి ప్రాణము లేని లోప మొకటే యున్నది. అట్టి నిర్గుణ బ్రహ్మము - ప్రత్యక్ష, అనుమాన, శ్రుతి ప్రమాణములకు లేనికిని

లోఁబడదు.[42] జ్ఞానప్రమాణము లన్నియు పరిచ్ఛిన్నము లగుటచే అపరిచ్ఛిన్న మగు బ్రహ్మము నెట్లు తెలుపఁగలవు? శ్రుతులే మిథ్యయైనచో, శ్రుతిప్రోక్త మగు బ్రహ్మమును అట్టిదే కావలెను. పా మార్థిక సత్యస్వరూప మగు భగవానునియందు - గుణము, మి భేదము అన్యవస్తువునుండి విలీనమై, యేకత్వమును బొందినవి. అప చ్ఛిన్నతలోనే పరిచ్ఛిన్నత యున్నది. బ్రహ్మము స్వగత భేదము గలి చిదచిద్విశిష్ట సంపూర్ణ స్వరూపమై యున్నది[43] సచ్చిదానంద లక్ష ములు బ్రహ్మమున కొక వ్యక్తిత్వమును, శీలమును గల్పించున బ్రహ్మ యొక్క జ్ఞానము ప్రత్యక్షమైనది. అది యింద్రియములపై ఆధారపడదు.[44] భగవానుఁడు సర్వజ్ఞుఁ డగుటచే, అన్నిటిని ప్రత్య క్షముగాఁ జూచును. బ్రహ్మము పరిపూర్ణ వ్యక్తి. జీవు లపరిపూ వ్యక్తులు. వ్యక్తిత్వమున కర్థము నియతోద్దేశముల నొక క్రమ విధ నము ననుసరించి సాధించు సామర్థ్యముండుట. భగవంతుఁడు పరిపూ వ్యక్తి. కారణ మాతనిలో అనితరాధార మగు పూర్ణానుభవసి యున్నది. వ్యక్తిత్వమున కవసరము లగు భేదాంశము లాతని యం యున్నవి.[45] జ్ఞానము, శక్తి, కరుణ జీవుని ముఖ్య లక్షణములు. కరు వశుఁడై ఆతఁడు లోకమును సృజించి, నియమములను స్థాపించి మోక్షార్థు లందఱకు సాయపడుచుండును.[46] ఆతని ప్రతి లక్షణము ఇతర లక్షణములకు వేరయ్యును, అన్నియు ఒకే వ్యక్తికిఁ జెందుటచే

42 శ్రీభాష్యము : 1 1-1.

43. శ్రీ భాష్యము : 1-1-2. మఱియు - సర్వదర్శన సంగ్రహము : 4.

44. శ్రీభాష్యము : 1-2-19.

45. రహస్యత్రయ సారము : 23

46. రామానుజ భాష్యము : 2 - 1 - 15.

ఆతని యేకత్వమునకు భంగహేతువులు గావు. దేవునికి తన గుణ సంబంధము - సనాతనము, స్వాభావికము నైనది.[47] జీవ జడ పదార్థములు దేవుని గుణము లనియే చెప్పఁబడును. కాని, పై గుణములు ఆతని యాత్మ లక్షణములు. తన గుణములకే కాక, తనపై ఆధారపడు విషయములకును ఈశ్వరుఁడే ఆశ్రయము. ఈశ్వరున కొక ప్రత్యేక దైవ రూప మున్నది. అది ప్రకృతిజము కాదు; కర్మజమును గాదు.'[48] దేహ మనగా - పంచభూత పరికల్పితమే కాదు, కేవల ప్రాణముచే పోషింపఁబడునదే కాదు. అది యింద్రియములకు స్థానమే కాదు. సుఖదుఃఖానుభవ కారణమే కాదు. చిత్స్వరూప మగు ఆత్మ దేనిని స్వీకరించి, స్వాధీన మొనర్చుకొని, తన ప్రయోజనముల కొఱకు నుపయోగించుకొనునో, యేది ఆత్మకు వశమైన సాధనమో - అదియే దేహ మని రామానుజుల నిర్వచనము.[49] సశరీరి యయ్యును - ఈశ్వరుఁడు దుఃఖము ననుభవింపఁడు. ఏలన, దుఃఖములకు కారణము కర్మ కాని, దేహధారిత్వము గాదు.[50] ఈశ్వరుఁడు కర్మాధిపతి; స్వయముగా కర్మఫలమీయఁజాలఁడు. అచేతనము, క్షణికము నగు కర్మ, భావికాలమునకు సంబంధించిన ఫలితము నీయఁజాలదు.[51] పరమేశ్వరుఁడే ఇహపరములం దెట్టి భోగానుభవముల నెవరు పొందవలెనో నిర్ణయించును. అనేక రూపములను గలిగి యున్నను, బ్రహ్మమునకు రూపము లేదనియు చెప్పవచ్చును.[52] ఏలన, 'జీవాత్మ దేహమునం దుండి, తదనుగుణము లగు సుఖ దుఃఖముల ననుభవించుచున్నది. బ్రహ్మమునకు సుఖ దుఃఖానుభవము లేదు గావున, బ్రహ్మము రూప రహిత మని చెప్పవలెను.[53]

---

47. రహస్యత్రయ సారము : 3
48. శ్రీభాష్యము : 1-2-1.
49. శ్రీ భాష్యము : 2-1-9.
50. శ్రీభాష్యము : 1-1-21.
51. శ్రీ భాష్యము : 3-2-37.
52. "బ్రహ్మరూప రహిత తుల్య మేవ"
53. శ్రీభాష్యము : 3-2-14.

జడ పదార్థ పరివర్తనములు గాని, జీవుల సుఖ దుఃఖముల గాని, బ్రహ్మమున కంటవు. దోష మంతయు పూర్వకర్మ ఫలితమే అనగా, సంసార పరిభ్రమణమే దానికి కారణము. దేవుని కండ శాధ్యత లేదు. అనంతము లగు ఊర్ధ్వ లోకములకు అవ్వల ఆతఁడ దివ్యకాంతిమయ స్థానమున నుండును. అచట ఎట్టి తమో రేఖయ ఉండఁజాలదు.[54] ఉట్టి జీవితము ముక్త జీవులకే లభించును. దేవు డట్టి జీవిత మగుటలో వింతలేదు.[55]

రామానుజుల భావములో దేవుఁ డనగా, సోపాన క్రమోన్న నంది, ఆత్మజ్ఞానములో పరిపూర్ణత గాంచిన వ్యక్తులలో ఉత్తమ వ్యక్తి యని గాని, లేక - పరిచ్ఛిన్న జగత్తునకు అందరాని నిర్గు బ్రహ్మమూర్తి యని కాని కాదు. లోకములోని చేతనాచేతన పదా సంతతి యీశ్వరునితోఁ గలసి యున్నను, అవి తమ అస్తిత్వ పోషకత్వములను ఈశ్వరు నుండియే పొందినవి. దేవుఁ డెంత నిజమో నానాత్వముతోఁ గూడిన జగత్తును తత్సమముగానే నిజమ కాని, జగత్తునకు ఆధారము ఈశ్వరుడు; దాని కారణవ కాదు. దేవుఁడు జగ దంతర్వర్తియైన యాధార మనియుఁ జెప రాదు. అట్లు చెప్పుటవలన, ఈశ్వరుఁడు అనేకములో అనేక యున్నాఁ డనియు, అనేక వస్తుజాతము ఏకత్వ స్వరూప మగు ఈశ్వ నందు లీనమై యున్న దనియుఁ జెప్పవలసివచ్చును. రామానుజుల ఈశ్వరుఁడు జగదంతర్వర్తియు, అతీతుఁడు గూడ నైన యాధారమ దేవుఁ డొక వ్యక్తియే కాని, ఆతఁ డనేక జీవసముదాయమూర్తి య భావింపరాదు. అనఁగా - ఆతఁడు మానవులుగాని, తద్విషయము గాని రూపొందిన మూర్తి యని భ్రమింపరాదు. బ్రహ్మాండక్రమా గతుడై, ఈశ్వరుఁడు దాని కాధారమును, ఆశ్రయమునై, ప్రశం

54. శ్రీభాష్యము : 1-1-21. 55. శ్రీభాష్యము : 3.3_27.

గాలమున దానినిఁ తిరిగి స్వీకరించును.[56] సృష్టి లయములు కాలగతము
౽ైన తాటస్థ్యములు గావు, జగత్తున కాధార మీశ్వరుఁ డని
ంూఢ తార్కిక సాక్ష్యములు. బ్రహ్మ మొక్కఁడే అకారణుఁడు ;
ెక్కిన వన్నియు సకారణములు.[57] పరిచ్ఛిన్న ప్రపంచమునకు ఆతఁడు
ాధ్యుఁ డయ్యు, దాని లోపము లాతని నంటవు. పరమేశ్వరుఁడు
ష్ణువే యని, ఆతనికి ఉత్తమ గుణము లన్నియు రామానుజు లారో
ించిరి. బ్రహ్మము, శివుఁడును విష్ణువే.[58]

రామానుజులు తమ పరమార్థ తత్త్వమును శ్రుతి ప్రమాణము
ఁచే సమర్థింతురు బ్రహ్మము సకల కల్యాణ పరిపూర్ణుఁ డని వేదము
ఎుగ్గడించును.

"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ."

అని ఉపనిషత్తు చెప్పుచున్నది. ఈ విశేషణము లన్నియు ఒకే పర మాత్మకుఁ జెపదును. బ్రహ్మము నిర్వికార పరిపూర్ణ మనియు, ఆతని విచ్ఛక్తి యెన్నఁడును సన్నగిల్ల దనియు, ముక్తజీవుల జ్ఞానము కొంత కాలము సంకుచితమై యుండె ననియుఁ జెప్పఁబడెను. బ్రహ్మ మనం తము, ఏ లన, దానికి దేశ కాల ద్రవ్యోపాధి పరిమితు లెవ్వియు లేవు. మఱియు, స్వభావముచే ఇతర వస్తువు లన్నిటికి విలక్షణమైనది. అనంతత్వము బ్రహ్మముయొక్క గుణ స్వభావములకు విశేషణము, జీవులు నిత్యములు అని చెప్పఁబడెనేకాని, ఈ లక్షణములు లేవు. ఆతఁడు మొదట ఒక్కఁడే; ఏ లన, అప్పు డింకొకఁడు లేఁడు.

---

56. శ్రీభాష్యము . 1-1-1. ఉదా ॥ తిరువాయి మొళి : 10-5-3.
రామానుజుల తత్త్వమును విశిష్టాద్వైత మనుటకు కారణము - రెండు విశిష్టవస్తువుల అద్వైత సిద్ధిని గాంచినవి.

57. శ్రీభాష్యము 2 - 31. 58. ఉదా : తిరువాయిమొళి : 10-10-1.

బ్రహ్మమున కెట్టి గుణములును జెప్పని శ్రుతు లున్న వని రామా
లంగీకరింతురు కాని, పరిచ్ఛి గుణ రాహిత్యమే దాని కర్థ మని
తురు. బ్రహ్మస్వరూపము జ్ఞానాతీతము, అనగా - పరిచ్ఛిన్న
జ్ఞ్యక్తి కందని అనంత కల్యాణ గుణములు ఆతని కున్న వని
భావింతురు. నానాత్వమును నిషేధించు శ్రుతివాక్యములకు
బ్రహ్మమునకు వేరైన వస్తువులు లే వని యర్థము చెప్పుదురు.
మాత్మ సర్వాత్మ స్వరూపము తానై యున్నది. సిద్ధి గాంచిన వ్య
'అన్య మెద్దియుఁ జూడఁడు, వినఁడు, తెలియఁడు' అని ఉపనిష
ఘోషించును. భక్తుఁడు దివ్యానందమయమైన బ్రహ్మానుభూతి
నప్పుడు, సర్వవస్తులును - బ్రహ్మస్వరూపమునందును, బ్రహ్మవి
యందును ఏకమై యున్న కారణముచే, బ్రహ్మము వేరుగా -
జూఁ డని రామానుజులు అర్థము చెప్పినారు.

వైష్ణవ దైవతత్త్వమునకు ఆధారములు - వేద, ఆగమ, ఃః
ణములు, నాలాయిర దివ్యప్రబంధము. వేదములు బ్రహ్మముయె
న్వస్వరూపమును, అంతర్యామిత్వమును జెప్పును పాంచరాత్ర
శాస్త్రములు - వ్యూహ సిద్ధాంతము నంగీకరించును, రామకృ
అవతార పూజను పురాణములు చెప్పును దక్షిణ భారత దేవా
ములలోని దైవ విగ్రహముల నుద్దేశించి చెప్పిన భక్తి స్తోత్రః
నాలాయిర దివ్యప్రబంధ వాక్యములు. విష్ణువైన బ్రహ్మము యొః
స్వరూపము పంచాత్మకము. విగ్రహాదికము అర్చారూపములు. వి
ములు అవతారములు. వాసుదేవ, సంకర్షణ, ప్రద్యుమ్న, అని
రూపములు చతుర్వ్యూహములు. వాసుదేవుని సూక్ష్మ రూ
అంతర్యామిత్వము. శుద్ధసత్త్వ దేహముతో వైకుంఠమున నివసిఁ
నారాయణుఁడే పరస్వరూప మని కొన్నివేళలఁ జెప్పఁబడెను.[59]

59. "పరబ్రహ్మ పరవాసుదేవశబ్దానాం వాచ్యో నారాయణః"

— (యతీంద్ర మత దీపి

వానుడు తన యనంత పరిపూర్ణతలే తన విభూతిరూపములకు అతీతుడు. దేవుని పరిపూర్ణ వ్యక్తిత్వములో సృష్టి లీలారూపములు అంశారూపములే. దేవుని స్వరూపము వేరుగా నున్నది. ఆ రూపములో భక్తులకు బంధుత్వాకాశే మున్నది. వైకుంఠములోని ఆతడు లక్ష్మీసమేతుడై, శేషశయనమున నుండును. లక్ష్మి యనగా విష్ణువుయొక్క సృజనశక్తి స్వరూపము. కాని, అర్వాచీన వైష్ణవ మతములో ఆమె జగజ్జననియై, కొన్ని సమయములలో దుర్బల దీనజన సంరక్షణమునకై భర్తను ప్రోత్సహించునదిగా వర్ణింపబడెను. ఆమె పరమేశ్వరునితో నిత్యైక్య మందిన శక్తి. ఆయన ధర్మమూర్తియైనచో - లక్ష్మి దాక్షిణ్యమూర్తి. రెండును ఈశ్వరునిలో ఏకత్వము నందినవి. విష్ణుశక్తియైన లక్ష్మికి రెండు రూపము లున్నవి. ఒకటి క్రియా రూపము, రెండవది - భూతి రూపము. క్రియారూప మనగా - నిగ్రహించు నడుపు శక్తి. భూతిరూప మనగా పరిణామ నియతి. ఈ రెండును చైతన్య జడాత్మకములై, జగత్తునకు మూలోపాదానకారకత్వ సామర్థ్యమును విష్ణువున కిచ్చును. పరమేశ్వరునకు ఆరు పరిపూర్ణ గుణము లున్నవి. జ్ఞానము, శక్తి, బలము, అధిపత్యము, వీర్యము, ప్రకాశము.[60] ఉత్తమ దైవమూర్తి యగు వాసుదేవుడు ఈ షడ్గుణ పరిపూర్ణుడు. వ్యూహ చతుష్టయములో మిగిలిన మూడును రెండు లక్షణములనే కలిగి యుండును. భక్తుల కొఱకు కారుణ్యము వహించి, ఈ వ్యూహములోని వివిధ రూపములను ఈశ్వరుడు ధరించు నని రామానుజులు చెప్పినారు. వ్యూహములోని మిగిలిన ముగ్గురును సంకర్షణుడు జీవాధిపతియు, ప్రద్యుమ్నుడు మానసాధిపతియు, అనిరుద్ధుడు అహంకారాధిపతియునై యున్నారు.[61] విష్ణువుయొక్క అవతారములే విభవ రూపములు. రామానుజులు తమ గీతాభాష్యారంభమున నిట్లు వ్రాసిరి

60. విష్ణు పురాణము - 6-5-79. 61. శ్రీభాష్యము : 2-2-40.

"పరమేశ్వరుఁ డనంత కారుణ్య వశుఁడై, తన మూల సమాజ దైవ సంపదకు ఎట్టి లోపమును గలుగకుండ అనేక రూపములు ధరించి అనేక పర్యాయము లవతరించెను. ... భూ భారమును దొలగించుట కొఱకే కాక, ప్రాకృత పురుషులమైన మనకుఁగూడ అనుగ్రహము చూపుటకును, అల్పాధిక భేదము లేకుండ, అందఱకు నయనోత్సవ మొనర్చి, దివ్యానందము గూర్చుటకును, అద్భుత కృత్యముల నెన్నిటినో జేయుటకును ఆతఁ డవతరించెను."

రామానుజులఁ దేవుఁడు నిర్గుణుఁడై, ఊర్ధ్వమున నెచట నుండియో నిర్లిప్తుఁడై, మనల నుపేక్షించువాఁడు గాఁడు. ఆఁతడు మనలో గలిసి, మన సుఖ దుఃఖములలో భాగస్వామియై, మన సత్కర్మానుష్ఠానమునకు తోడ్పడి, జగత్సంరక్షణ కార్యభారమును వహించును. అవతారము లనఁగా - పరమేశ్వరుఁడు అప్రాకృత స్థితినుండి ప్రాకృత క్రమములోనికి వచ్చుటయే. ఈ యవతారములు - ముఖ్యం కారణ భేదములచే ద్వివిధములు. విష్ణువు స్వయముగా ప్రకృతిలో జోక్యము కలుగజేసికొన్నపుడు అది ముఖ్యావతారము, గౌణములు ఆవేశావతారములు. ప్రజలు ముఖ్యావతారములను ముక్తికొఱకును ఆవేశావతారములను ఐశ్వర్య బలాదుల కొఱకును అర్చింతురు. భగవంతుఁడు - శాస్త్రోక్తముగా ప్రతిష్ఠింపబడిన విగ్రహములలో నుండును. విగ్రహములలో తాను ప్రవేశించి యుండుటకు ఈశ్వరుఁ డెంత బాధపడుట కంగీకరించునో, అర్థపంచక గ్రంథము వర్ణించినది.[62]

62. సర్వజ్ఞుఁ డయ్యు౯ - అజ్ఞాని వలెను, ఆత్మ యయ్యును - అనాత్మ వలెను, సర్వాధిపతి యయ్యు - మానవుల వశమైనట్లును, సర్వశక్తి సమన్వితుఁ డయ్యు - అశక్తుని వలెను, ఆప్తకాముఁ డయ్యు - కోరిక లున్నవానివలెను, సర్వరక్షకుఁ డయ్యు - దీనుని వలెను, యజమాని యయ్యు - సేవకుని వలెను, అగోచరుఁ డయ్యు - గోచరుని వలెను, అగ్రాహ్యుఁ డయ్యు - గ్రాహ్యునివలెను జూపట్టును.

ఈశ్వరుఁడు అంతర్యామియై, సర్వ జీవులలో నుండి, స్వర్గ నరకవ లకు వానితో పయనించును. నీలమేఘ మధ్యమున మెఱపు తీగ వ పరమేశ్వరుఁడు మానవునిలో నుండును.[63] అంతర్యామి యగు దేవుఁ శ్రేష్ఠతముఁడు.[64]

## జీవాత్మ

రామానుజుల పరబ్రహ్మ తత్త్వము విశిష్టమైనది. జీవులు తవ సర్వస్వమును ఆ పరబ్రహ్మము నుండియే గాంచినను, స్వేచ్ఛా క్రియా లక్షణములను సహజముగా గల్గియుండుటచే, అవి పృథక్ వ్యక్తు లనఁదగును. అద్వితీయ మగు పరబ్రహ్మ యొక్క భ్రమ రూపములే వ్యక్తు లను వారి వాదమును రామానుజులు కఠినముగ నిరసించిరి. పరబ్రహ్మాంశమైనను, జీవాత్మ - యథార్థము, అనన్యము నిత్యము, బుద్ధిజ్ఞాన సహితము, నిరవయవము, నిర్వికారము, అగో రము, అణుస్వరూపము నైనది[65] అది దేహేంద్రియ ప్రాణ బుద్ధ లకు వేఱైనది. అది - జ్ఞాత, కర్తయు, భోక్తయునై యున్నది మానవునిలో అది స్థూల దేహమునకును, ప్రాణమునకును, పంచ కర్మేంద్రియములకును, మనస్సునకును అంటి యున్నది. ప్రాణమున ఇంద్రియముల వలె ఉపకరణ మాత్రమే.[66] అంతరంగావస్థలను ఇంద్రియ సాహాయ్యమున బాహ్య విషయ జ్ఞానమును మనస్సు ఆత్మ కందించును. మనస్సునకు మూఁడు వృత్తు లున్నవి. అధ్యవసాయము,

---

63. "నీల తోయద మధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా "

— (వేదార్థ సంగ్రహము)

64. ఉదా : పూర్వ పూర్వోదితోపాప్తి విశేషా క్షీణ కల్మషః

ఉత్తరోత్తర మూర్తీనాం ఉపా స్త్యధికృతో భవేత్."

— (పాంచరాత్ర రహస్యము)

చూ : సర్వదర్శన సంగ్రహము.

65. శ్రీభాష్యము : 2-2-19,32 ; 2-3- 18. 66. శ్రీభాష్యము : 2-4-10.

అనఁగా - నిశ్చయము, అభిమానము, చింత.[67] అణురూప మ
జీవాత్మ హృత్పద్మమం దుండును. సుషుప్తికాలమున అది హృదయ
మందును పరమాత్మ సంపర్కము గలిగియుండును.[68] నిద్ర జీవావిచ్ఛి
న్నతకు భంగము కాదు. ఏలన, అవిచ్ఛిన్న వ్యాపారము, స్మృతి
శ్రుతి వాక్యములు, ధర్మోపదేశములు దీనిని సమర్థించుచున్నవి.[69]
దీప కళిక చిన్నదయ్యు, తన కాంతిచే వ్యాప్తి - సంకోచములు గలి
అనేక వస్తువులను ప్రకాశింపఁజేయురీతినే, జీవ మణు ప్రమా
మయ్యు, వ్యాప్తి - సంకోచ శక్తులచే, దేహములో అన్ని స్థలము
లోని సుఖదుఃఖములను గ్రహించును.[70] దేశ కాలములలో సుదూ
వస్తువులను అది గ్రహింపఁగలదు. జీవుల జ్ఞానము వలెనే నిత్యము
స్వయం పోషకము, సర్వ వ్యాప్తము, యుక్తము నైనది. కాని
పూర్వకర్మాది దోషములచే అది తాత్కాలికముగా సంకుచి
మైనది.[71] సుఖదుఃఖ పరిభాగమువలన జీవులు అనేకము లని స్పష్టము
మోక్షసిద్ధి వఱకు జీవులు ప్రకృతి బద్ధములు. అశ్వికునకు అశ్వము
వలె జీవునకు ప్రకృతి వాహనము వంటిది.[72] దేహబంధము నశ్వ
మగు ఈ మట్టిపాత్రతో సంబంధము జీవుని ఈశ్వర బాంధవ్యముని
గుర్తింపకుండఁ జేయును. జన్మ మరణాదు లున్నను - జీవాత్మ
ముఖ్య లక్షణములలో మా ర్పుండదు. చేతన ప్రపంచములో అనే

67. ఈ వృత్తుల ననుసరించి, దానికే బుద్ధి, అహంకారము, చిత్తము అందురు.

68. శ్రీభాష్యము 3-7-9. 69. శ్రీభాష్యము : 3-2-7.

70. శ్రీభాష్యము : 2-3-24,26.

71. "ఈశ్వర స్యేవ జీవానా మపి, నిత్యజ్ఞానం, స్వతశ్చ సర్వవిషయం ప్రమాత్మకం తత్తు కర్మాది దోషవశాత్ సంకుచిత విషయమ్."

– (వేదాంతదేశికుల సేశ్వర మీమాంస

72. శ్రీభాష్యము 2-1-15

పర్యాయములు పుట్టి పోవుచుండును , కాని, తన సహజ లక్షణమును కోల్పోవదు. ప్రళయ కాలమునందు జీవుల విశిష్ట రూపములు పోవును గాని, జీవులు అవినాశములై యుండును. వానికి పూర్వ జన్మల కర్మ ఫలము పోదు. అందుచే, పున స్సృష్టికాలమున వాని కర్మల ననుసరించి, అవి తిరిగి సంసారములోనికి నెట్టబడును. దేహ సంబంధ ముండుట వలనను, లేకుండుట వలనను కలుగు జ్ఞానవృద్ధి క్షీణతలే జన్మ మరణములు. మోక్షము వచ్చు వఱకు జీవులకు దేహ సంబంధము తప్పదు. ప్రళయ వేళ మాత్రము నామ రూప భేదము లేకయుటకు అవకాశము లేని సూక్ష్మ దేహము లుండును.[73] జీవునకు పూర్వజన్మ జ్ఞాన ముండదు. ఏ లన, స్మరణ శక్తి - ఈ దేహమునకు మాత్రమే సంబంధించినది.

కర్మప్రవృత్తికి జీవాత్మ స్వప్రయత్న మొక్కటే చాలదు గాని, జీవాత్మాంతర్గతమైన పరమాత్మయొక్క అస్థిత్వముచే జీవుని స్వేచ్ఛా ప్రవృత్తికి ఆటంకము కాదు. కాని, పరమాత్మ సహకారమవసరము.[74] తన భావి దశా నిర్మాణమునకు జీవుని స్వతంత్రత నుగ్గడించినను, సత్పురుషుండు ప్రకృతి నియమము లతిక్రమింపంగలం డని ఘోషించినను, కర్మతోడను, జడపదార్థములోడను ఎట్టి సంబంధము లేక, సంపూర్ణ స్వతంత్ర ధర్మమూర్తి ఈశ్వరుం డొక్కండే యని రామానుజులు పలికిరి.[75] పరమేశ్వరుని శేషి యందురు. జీవేశ్వర సంబంధము శేషి శేష భావము. శేషిత్వ మనంగా - జీవుని విషయములో ఈశ్వరునికిం గల సమగ్ర శక్తి.

మానవ స్వాతంత్ర్యము - పరమేశ్వర ప్రభుత్వతమును గూర్చిన సమస్యలకు రామానుజుల తత్త్వములలో అధిక ప్రాముఖ్య మీయం

73. శ్రీభాష్యము . 3 2-5.

74. శ్రీభాష్యము : 2-3-41. 75. శ్రీభాష్యము . 1-1-21.

బడెను. ఏలన, రామానుజులు రెంటిని సమర్థింపఁ బూనిరి. జీవాత్మలు తమ ప్రవృత్తికి పూర్తిగా దేవునిపై ఆధారపడును. మంచి చెడ్డలను ఈశ్వరుఁడే నిర్ణయించి, జీవులకు దేహము లిచ్చి, వాని నుపయోగించు సామర్థ్య మిచ్చెను. కాని, జీవుల బంధ మోక్షములకు పరమేశ్వరుఁడే కారణము. అయినను, లోకములో నున్న అనంత దుఃఖ యాతనలకు ఈశ్వరుఁడు బాధ్యుఁడు కాఁడు. మంచి చెడ్డల వివేకము గల మానవుఁడే దానికి బాధ్యుఁడు. మానవుని యిచ్ఛ - దేవుని పరిపూర్ణతకు లోపముగాఁ జూపట్టును. స్వతంత్రేచ్ఛ గల జీవులు - దేవుని సంకల్పమునకు వ్యతిరేకముగా ప్రవర్తించును. కర్మసూత్రమున కనుగుణముగా తాను వర్తింపవలసివచ్చుటచే, దేవుఁడు పరిపూర్ణుఁడు కాఁజాలఁడు. మానవుల కర్మ లన్నిటికి మూలములో ఈశ్వరుఁడే కారణమని రామానుజు లీ సమస్యనుండి తప్పించుకొనిరి. ఇది దోషము కాదు. ఏలన, ఈశ్వరుఁడు కొన్ని నియమముల ననుసరించి ప్రవర్తించును. ఇది ఆతని స్వభావము. ఈశ్వరుఁడు తన నియమ సహితములైన విశృంఖల భావముల ననుసరించి, జీవిచే సదసత్కర్మలు చేయించుటలేదు. కర్మసూత్రము ననుసరించి వర్తించుటచే, తన నియతి స్వభావమును జూపుచున్నాఁడు. కర్మసూత్రము ఈశ్వరాధీనము గానిదైనచో, ఈశ్వరుని పరిపూర్ణతకు లోటు వచ్చును. కర్మసూత్రమును విసర్జింపనిదే ఈశ్వరుని స్వాతంత్ర్యమును కాపాడలే మని చెప్పు విమర్శకుఁడు - హిందువులకు ఈశ్వరుని గూర్చిన భావ మెట్టిదో యెఱుఁగఁడు. కర్మసూత్రము ఈశ్వరుని ఇచ్ఛారూపమే. కర్మాధ్యక్షుఁడై, కర్మ పద్ధతిని ఈశ్వరుఁడే స్థాపించినాఁడు. కర్మ నియతి ఈశ్వర స్వభావ రూపమే యగుటచే, ధర్మకరులను బహూకరించి, దుర్మార్గులను ఆతఁడే శిక్షించుచున్నాఁడని చెప్పవచ్చును.[76] కర్మసూత్రము దేవునిపై ఆధారపడక, స్వతంత్రమైనది కాదని నిరూపించు నిమిత్తమే,

76. శ్రీభాష్యము : 2-2-3 ; 3-2-4.

కర్మసూత్రమును భగ్న మొనర్చు సామర్థ్య మాతని కున్నను, ఆతఁ డట్లు చేయుట కిచ్ఛగింపఁ డని కొన్నివేళలఁ జెప్పబడెను.[77] తన ధార్మికేచ్ఛా స్వరూప మగు కర్మ శాసనమును లోకమున ప్రవర్తింపఁజేయు వ్రతనిష్ఠుఁడై, తనకు తొలఁగింప సాధ్య మైనను, అధర్మ ముండుట కంగీకరించెను. మానవుని ప్రవృత్తికి చోదక మగు ఇచ్ఛా యత్నములను అంతర్యామి యగు ఈశ్వరుఁ డంగీకరించును. స్వనియమోల్లంఘనముచే, ప్రపంచ క్రమములో కల్లోలము కలిగించుటకు ఆత డిచ్ఛగింపడు. ఈశ్వరుఁడు అంతర్యామి యయ్యు, అనవసర వ్యాపారములలోనికిఁ బోఁడు.

జీవులు త్రివిధములు. నిత్యజీవులు ప్రకృతికర్మ విరహితులై, వైకుంఠమున ఆనంద మనుభవించుచుందురు. ముక్త జీవులు భక్తి కర్మ జ్ఞానములచే బంధ విచ్ఛేదము చేసికొనినవారు. బద్ధజీవులు

---

77 పిళ్ళలోకాచార్యు లిట్లు చెప్పిరి .-

స్వభావ నిత్యత్వములకు తనపై ఆధారపడిన జీవుల కన్నిటికి కర్మనాశన మేక కాలమందే గావించి ముక్తి నీయగల సామర్థ్య మీశ్వరున కున్నను, శాస్త్రవిధిరూప మగు కర్మసూత్రమునకు జీవులను బద్ధుల నొనర్చుటకు గారణ మాతని వినోద కాంక్షయే.

-(తత్త్వత్రయము : 108 పుట)

ఈశ్వరుడు ప్రథమ కారణము, కర్మ ద్వితీయము, "పరమేశ్వరుడు స్వమాహాత్మ్యను గుణలీలాప్రవృత్తియందు నిశ్చితుండై, కర్మను ధర్మాధర్మముల నేర్పరచి, తత్కర్మలోఁ బాల్గొనుట జీవులకు దేహేంద్రియాదు లిచ్చి, వారిని నియమించు శక్తి నొసఁగి, అంతర్యామియై, వానిలో ప్రవేశించి యుండెను... ఈశ్వర దత్తము లైన ఇట్టి శక్తులను గాంచి, జీవులు స్వేచ్ఛగా -- పుణ్యాపుణ్య కర్మలు చేయ మొదలిడెను. సత్కార్మాన్వితుఁడైనవాఁడు తన శాసనానుగుణముగా వర్తించుచున్నాడని ఈశ్వరుఁడు వారికి ధర్మపరాయణత్వమును, ఐశ్వర్య, సుఖ, మోక్షములను ఇచ్చి, తన శాసనములకు విరుద్ధముగా నడుచుకొనువాని కనుగుణ శిక్షదు లొసఁగును.

శ్రీ భాష్యము : 2-3-41 — (శ్రీభాష్యము . 2-2-3)

అవిద్యావశులై, స్వార్థపరులై, సంసార సాగర మగ్ను లగు వారు.[78] జీవాత్మ ఉత్తమ స్థితికి బోవచ్చును. లేదా - అధమ స్థితిలోఁ బడి, దేహాభిమాన మధికమై, బుద్ధి నశించి, కేవలము ఆహార నిద్రాదికము మాత్రమే తెలిసిన పశుత్వము ప్రాపింప నగును.[79] సంసార గతులైన జీవులు నాలుగు విధములు. దేవ మనుష్య పశు స్థావరములు. జీవు లన్నియు భేదము లేని వయ్యును, భిన్న దేహ సంబంధములచే భేదములు చూపట్టును. జీవుల వర్ణ భేదములు గూడ దేహభేదము వలననే తటస్థించుచు. సహజముగా జీవులు దేవతలును గావు, మనుష్యులును గావు, బ్రాహ్మణులును గావు, శూద్రులును గావు. సంసారగత జీవులు భోగ మోక్షాపేక్షచే ద్వివిధములుగా నుండును. మోక్షకాలము వఱకు పూర్వకర్మఫలానుభవమునకై జీవులు జన్మించుచుండవలెను. జీవుఁ డింకొక దేహమును ధరించునపుడు భూత తన్మాత్రలచే ఆవరింపఁబడి యుండును, అదియే జీవప్రాణాధారము.[81] బంధ మున్నంత వఱకు సూక్ష్మ దేహ ముండును.[82] ముక్తులు దేవయానమునను సత్పురుషులు పితృయానమునను బోవుదురు. దుర్మార్గులు చంద్ర లోకమునకుఁ బోక, వెంటనే ఈ లోకమున పుట్టుదురు. జీవులకు ఊర్ధ్వ గతి చూపువారు పరమేశ్వర ప్రతినిధులు.[83] జీవులు దైవప్రకృతిలో భాగస్వాము లైనచో, ఒకప్పుడు శుద్ధ మోక్షములు గల దైవ ప్రకృతియై యుండవలెను. అట్టి దైవ లక్షణములను జీవు లేల కోల్పోయి, కర్మవశము లయ్యెను? కర్మ జీవుల నెట్లు స్వాధీన

78. రహస్యత్రయ సారము : 4
79. శ్రీ భాష్యము : 1-1-4
80. శ్రీ భాష్యము : 3-1-1
81. శ్రీభాష్యము : 3-1-3
82. శ్రీభాష్యము . 1-2 9
83 శ్రీ భాష్యము 4-3 1

మొనర్చుకొనునో - హేతువు గాని, శాస్త్రము గాని మనకుఁ జెప్పఁ జాలదు. ఏ లన, భగవ త్పరిణామ మనాది యైనది.

## జడ పదార్థము

ప్రకృతి, కాలము, శుద్ధ తత్త్వము - మూఁడును అచేతన ద్రవ్య ములు. అవి భోగ్యములు, సవికారములు, మానవ లక్ష్యముల కుదాసీనములు.[84] ప్రకృతి యొక్క అస్తిత్వము - ప్రత్యక్ష, అను మాన విషయము గాదు.[85] శ్రుతిప్రమాణముచే అది అంగీకరింప బడినది. సృష్ట్యారంభవేళ సత్త్వ రజ స్తమో గుణములందు ఉదయించును. ప్రళయ కాలమున పదార్థము మిక్కిలి సూక్ష్మ రూపమున, నామరూప భేదము లేక యుండి, తమస్సు అని పిలువఁ బడును. జడపదార్థము అజమే , దాని రూపములు వచ్చి పోవుచుండును.

సృష్టి కాలమున తమస్సు నుండి మహత్తును, మహత్తు నుండి అహంకారమును, లేక - భూతాదియు నుదయించును. స్వాత్త్వికాహం కారమునుండి యేకాదశేంద్రియములును, తామసాహంకారమునుండి పంచతన్మాత్రలును జనించును. రాజసాహంకారము ఈ రెంటి పరి ణామమున సహకరించును.[86] అహంకారమునుండి సూక్ష్మభూత మగు శబ్దము పచ్చును. తరువాత ఆకాశము వచ్చును. ఆకాశము నుండి సూక్ష్మభూత మగు స్పర్శయు, తరువాత వాయువు, ఇట్లే - యితర భూతములను ఉద్భవించెను. శబ్ద స్పర్శాదులచే క్రమముగా ఆకాశ వాయ్వాదులను గ్రహింతుము. శబ్దము అన్ని భూతములలో

84 సర్వదర్శన సంగ్రహము 4

85. తత్త్వముక్తా కలాపము 1-11

86. సర్వార్థ సిద్ధి . 1-11

నున్నది. స్పర్శ జ్ఞానము మూఁడు విధములు. ఉష్ణ శీత సమశీతోష్ణములు. వేడిమి వలన మార్పుల నొందు పంచవర్ణములు గలవు. ఆకాశమునకు వేరుగా నెట్టి దేశమును విశిష్టాద్వైతు లంగీకరింపరు. సూర్యుఁ డుదయించు వైపు తూర్పనియు, అస్తమించు వైపు పశ్చిమ మనియు గుర్తు పెట్టుకొని, వీని నుండి దూర సామీప్య పరిగణనము చేయుచుందుము.[87] ప్రాణ మనఁగా – ఇంద్రియము లని పొరపడ రాదు. అది వాయువు యొక్క అవస్థా విశేషము.[88] సాంఖ్యుల వలెఁ గాక, ప్రకృతికి ఈశ్వరుఁడే కారకుఁడు, నియంతయు నని విశిష్టాద్వైతులు చెప్పుదురు.[89]

కాలమున కొక ప్రత్యేక స్థానము నిచ్చిరి. అది సర్వాస్తిత్వ రూపము.[90] అది ప్రత్యక్ష విషయము. దిన మాసాది భేదములు కాల సంబంధముపై ఆధారపడునవే.[91]

సత్త్వ రజ స్తమో గుణములు మూఁడును ప్రకృతి కున్నవి. కాని, శుద్ధ సత్త్వమునకు సత్త్వగుణ మొక్కటే యున్నది. అది దేవుని నిత్య విభూతిలోని ద్రవ్య రూపము. అది లోనున్న రూపము నాచ్ఛాదింపదు. ప్రకృతి సాహాయ్యమున ఈశ్వరుఁడు లీలా విభూతిగా నొక విశ్వ శక్తిని ప్రదర్శించును. నిత్య విభూతి రూపమున శుద్ధసత్త్వ సాహాయ్యముచే లోకాతీత శక్తిని గలిగి యుండును.

---

87. తత్త్వముక్తా కలాపము : 1–48 88. తత్త్వముక్తా కలాపము . 1-53,54

89. సర్వార్థ సిద్ధి : 1.16

90. తత్త్వత్రయము ననుసరించి కాలము తత్త్వశూన్యము.

91. ఉపాధి భేదము — (తత్త్వముక్తా కలాపము : 1-69)

ఈ యచేతన ద్రవ్యము లన్నియు ఈశ్వరేచ్ఛానుగుణములై వర్తించును.[92] అవి తమంతట తాము మంచివియును గావు, చెడ్డవియును గావు. జీవుల కర్మల ననుసరించి సుఖ దుఃఖముల నిచ్చును. "వస్తువు లిచ్చు ఫలితములు వాని స్వభావముపైననే ఆధారపడి యున్నయెడల, సర్వ వస్తువులు సర్వకాలములందు అందరకు సుఖమునో, దుఃఖమునో యిచ్చుచుండవలెను కాని, అట్లు జరుగుట లేదు." "స్వతంత్ర మగు పరబ్రహ్మమునకు ఈ ద్రవ్య సంబంధము లీలా వినోదము అతఁడు వానిని తన స్వాధీనములో నుంచుకొని, పెక్కు రీతుల నడుపుచుండును"[93] అవిద్యా కర్మబంధము నుండి విముక్తుఁడైన వానికి లోకము ఆనందమయమై తోఁచును. జీవ జడ పదార్థములు రెండును దేవుని శరీరము - లేక, విశేషణములే గాని, దేవుఁడు జీవులతో ప్రత్యక్షముగను, జడ పదార్థములతో పరోక్షముగను సంబంధము కలిగి యుండును. అచేతనములు చేతనముల వశమై యుండును జడ పదార్థము అధికముగాను, పూర్ణముగాను ఆధారపడును. జీవులకు కొంత స్వేచ్ఛ యున్నది. జీవులు ఈశ్వర సాన్నిధ్యము నొంది, జనన మరణాదుల నతిక్రమింపవచ్చును

## సృష్టి

ప్రతి కార్యమునకొక యుపాదాన కారణ మున్న దనియు, జగత్కార్యము బంధ రహిత మగు జీవాస్తిత్వమును సూక్ష్మపదార్థము యొక్క అస్తిత్వమును సూచించు ననియు రామానుజులు తలంచిరి చేతనాచేతనములు ఈశ్వర ప్రకారము లయ్యు, వానికి అనాదిగా గల పృథక్ వ్యక్తిత్వము బ్రహ్మములో నెన్నఁడును గలిసిపోదు. వా

92 శ్రీభాష్యము 2-2-2

93 శ్రీభాష్యము 3-2-1

కొక విధమైన ద్వితీయ మగు అసిత్వ స్థాన మున్నది. అందుచే అది తదనుగుణముగాఁ బెంపొందును వానికి కొన్ని దశలలో మారుచుండు రెండవస్థ లున్నవి. మొదటిది – నామ రూప భేద రహితమై, మనకుఁ దెలియు గుణములు లేనిదై యుండు అవ్యక్తావస్థ. ఇందు బుద్ధి సంకుచితమై యుండును. బ్రహ్మ కారణావస్థలో నుండు ప్రళయ దశ యిదే. ఈశ్వరేచ్ఛచే సృష్టి మొదలగునప్పుడు సూక్ష్మ పదార్థము స్థూలమై, పూర్వజన్మ కర్మఫలానుగుణము లగు దేహ సంబంధము జీవులకుఁ గలిగి, బుద్ధి వికసించును చేతనాచేతనములతో ఈ విధముగా గోచరించు బ్రహ్మము కార్యావస్థలో నున్నాఁ డని చెప్పనగును సృష్టి లయములు ఒకే బ్రహ్మపదార్థము యొక్క భిన్నావస్థలు మాత్రమే.[94] జీవ జడ పదార్థములు కార్య కారణావస్థా ద్వయమును గలిగి యుండును. కారణావస్థలో జీవులు దేహ రహితులై, ప్రకృతిసామ్యస్థితి నొంది యుండును. కాని, సృష్టి కాలముఁ పూర్వకర్మ వశమున జీవులు గుణసామ్యస్థితిని చలింపఁజేయఁగా, ఈశ్వరేచ్ఛచే ప్రకృతి – కర్మఫలితములను నిర్మించును. పూర్వము తా మొనర్చిన కర్మల ఫలితముల ననుభవించు అవకాశము జీవులకు గల్పించుకొఱకే సృష్టి చేయఁబడును ఈ దృష్టితోఁ జూచినచో ఈశ్వరుని సృష్టికార్యము పూర్తిగా స్వతంత్రమైనది కాఁజాలదు పాంచరాత్రము ననుసరించి, సృష్టి రెండు విధములు. శుద్ధ సృష్టి స్థూల సృష్టి మొదటిది సృష్టియే కాను, అది ఈశ్వరుని నిత్య మగు అంతశ్శక్తి వ్యక్తీకరణము. జ్ఞాన ఐశ్వర్య శక్తి బల వీర్య తేస్సులు అందు ప్రకటితములు. ఇవి లక్ష్మీసమేతుఁ డగు వాసుదేవు లక్షణములు. వ్యూహములు, విభవములు శుద్ధసృష్టిలోనివే. శు

94. రామానుజ గీతాభాష్యము 13 - 2, 9, 7.

సత్త్వ పరికల్పిత మగు వైకుంఠము శుద్ధసృష్టిలోనిదే.[95] స్థూలసృష్టి గుణత్రయాన్విత మగు ప్రకృతి వలన ఇది వఱకుఁ జెప్పఁబడిన క్రమములో జరుగును.[96] ఈశ్వరుని ఈ సృష్టికార్య మొక లీల.[97] లీలా భావములో నిష్కామత్వము, స్వేచ్ఛ, ఆనందము ఇమిడి యున్నవి. ఈభావము ననుసరించియే రామానుజులు ఈశ్వరునకు సంపూర్ణ స్వాతంత్ర్య మున్న దని వాదించును. ప్రకృతియు - జీవులును ఈశ్వరుని క్రీడావస్తువులు. అవి యెన్నఁడును వాని యిచ్ఛకు వ్యతిరేకములు కాఁజాలవు. తన స్వేచ్ఛా విలాసము కొఱకు ఈశ్వరుఁడు ఈ నాటక ప్రదర్శనమును జేయును.[98]

సృష్టి ఈశ్వరుని విశేషణ మని రామానుజులు చెప్పుదురు. అనఁగా, పరబ్రహ్మము విశేషణ రహితముగా నుండజాల దన్నమాట. విశేషణము పరబ్రహ్మ కవసరము. దీనికి వ్యతిరేకముగా కొన్ని శ్రుతివాక్యము లుండుటచే, రామానుజులు దీని నంగీకరింపరైరి. "ఈ జీవులు నాయందు లేరు"[99] అను వాక్యమునకు వ్యాఖ్య వ్రాయుచు

95. శ్రీభాష్యము . 2-1. 34, 35
96. వంగీయశాఖ వైష్ణవశాఖ దీని నంగీకరించును గాని, లక్ష్మీ విష్ణు స్థానమున, రాధా కృష్ణులను నిలుపును.
97 పాంచరాత్ర సంహిత ననుసరించి, రెంటికి మధ్యమ వర్గమునకుఁ జెందిన సృష్టినిఁ గూడఁ జెప్పును,
98 "క్రీడం హరే రిదం సర్వమ్.
మఱియు -
"హరే విహరసి క్రీడా కందుకై రివ జంతుభిః."
మఱియు -
"లోకవత్తు లీలా కైవల్యమ్" సూత్రము
99. "స్వ సంకల్ప కృతమ్"
— (శ్రీ రామానుజ గీతాభాష్యము : 9 - 4.)

రామానుజు లిట్లు చెప్పిరి :- "నా యిచ్ఛచే సర్వజీవులకు ఆధా
నేనే. కాని, వానివలన నా కెట్టి సహకారము అవసరము లేదు.
స్థితి జీవు లెప్పుడును ఏక విధమున తోడ్పడ నవసరము లేదు."

"పత్రమును గాని, పుష్పమును గాని భక్తితో నిచ్చిన
సంతసింతును" అను గీతా వాక్యమును వివరించుచు రామాను
వ్రాసినారు :- "నాకు స్వభావముగు నిరవధికము, అవ్యయము
ఆనందము ననుభవించుచున్నను, భక్తు లిచ్చిన దానిని నాకు దుసా
మగు వస్తువు లభించినదానినిగా స్వీకరించి యనుభవింతును." [101]
భక్తులు గానివారి కష్టసుఖములతో ఆతనికి సంబంధము లేదు.

మాయా సిద్ధాంతమును, జగన్మిథ్యాత్వమును రామాను
తీవ్రముగా ప్రతిఘటింతురు. లోకములోని భేదములకు మానవుని
చ్ఛిన్న మానసమే కారణమైనచో, ఈశ్వరునికి భేదము లుండరా
కాని, ఈశ్వరుండే లోకమును సృజించి, భిన్న జీవులకు వాని కర్మ
తముల నేర్పాటు చేసె నని శ్రుతి చెప్పుటవలన, ఈశ్వరునకు
భేదములతో సంబంధ మున్న దని తెలియుచున్నది. మరు మరి
వలె జీవ నానాత్వము అసత్య మనుటకు వీలు లేదు. ఏ లన,
చికపై ఆధారపడి మనము చేయు యత్నము వ్యర్థ మగుచున
జగత్తుపై ఆధారపడి మనము చేయు కార్యము అట్లగుట
మఱియు, ప్రత్యక్షము మనకుం జూపు ప్రపంచ వాస్తవికత,
వాక్యముచే తొలగింపం బడుచున్న దనుటయు సహేతుకము కా
ఏ లన, శ్రుతి కంగము, ప్రత్యక్ష రంగము భిన్నములు. అంత

---

100. భగవద్గీత : 9-4.

101. "మత్ స్థితా స్తై ర్న కశ్చి దుపకారః."

— (శ్రీ రామానుజ గీతాభాష్యము : 9 -

ఒక దాని నొకటి యవి నిర్మూలింపఁజాలవు.[102] జ్ఞాన మంతయు వస్తువులను ఆవిష్కరించును.[103] నిత్యముగా నుండవు గావున, వస్తుప్రతీతే వనుట విచిత్ర వాదము. వ్యతిరేక వస్తువులకును, భిన్న వస్తువులకును భేదము తెలియని వాద మిది. భేదము అభావ సూచకము గాదు. రెండు జ్ఞానక్రియలు పరస్పర విరుద్ధము లైనచో, అప్పుడు రెండును యథార్థములు గావు. "కాని, ఘటపటాదులు అన్యోన్య విరుద్ధములు గావు. ఏ లన, అవి దేశ కాలములలో భిన్నములై యున్నవి. ఏ దేశమందు, ఏ కాలమున, ఒక వస్తు వున్న జ్ఞానముగు, ఆ దేశమందు ఆ కాలముననే వస్తువు యొక్క అభావ జ్ఞానమును గల్గినచో, అవి పరస్పర విరుద్ధములు. కాని, దేశ కాలములు భిన్నము లైనచో, ఇట్టి వైరుధ్యములేను."[104] రజ్జు సర్పభ్రాంతి దృష్టాంతములో అభావ జ్ఞానము ఒకే దేశ కాలములో సంభవించుచున్నది. అంగుచే, వైరుధ్య మున్నది. కాని, మన మిప్పుడు చూచిన ఒక వస్తువు - ఇంకొక కాలమున, ఇంకొక దేశములో లేకున్నచో, ఆ వస్తువు అసత్య మను నిర్ణయముచేయుట సాహస మగును. శంకర రామానుజు లిర్వురును ఏకత్వమునే సమర్థింతురు. నిజ మగు ఏకత్వము భేద సహిత మనియు, అభావ విరుద్ధ సహితము కాదనియు రామానుజులు

---

102. ఆకాశ వాయ్వాది భూత - పదార్థగ్రాహి ప్రత్యక్షమ్. శాస్త్రం తు ప్రత్యక్ష శ్యాద్య పరిచ్ఛేద్య సర్వాంతరాత్మత్వ సత్యత్వా ద్యనంత విశేషణ విశిష్ట బ్రహ్మస్వరూప .... విషయమ్, ఇతి శాస్త్ర ప్రత్యక్షయో ర్న విరోధః "

- (వేదార్థ సంగ్రహము : 87 పుట.)

103. అర్థప్రకాశా.

104 "దేశాంతర కాలాంతర సంబంధితయానుభూతవస్తు అన్యదేశకాలయో రభావప్రతిపత్తౌ న విరోధః."

— (శ్రీభాష్యము · 1-1-1.

భావింతురు. అద్వైతము యొక్క అవిద్యా సిద్ధాంతమునకు అనేక
పములను రామానుజులు చూపిరి.

## ధర్మ - మత జీవితము

ద్వీపవాసులు తాము సాగర మధ్యమున నుంటి మని యె
నట్లే, దేహగతులైన జీవులు సంసారమున జీవించుచున్నవి. త
దేవుని ప్రకారము లని (అంశముల మని; యెఱుఁగక, ప్ర
సంభూతుల మని నమ్ముదురు. పూర్వజన్మ సంస్కారవశమున జీ
దేహ బంధములలోఁ దగుల్కొని యుండుటచే, దాని యంతర్గ
బాహ్యాంధకారముచే ఆచ్ఛాదింపఁబడును ప్రకృతిపరికల్పిత -
చ్ఛాదనమే తన నిజ మగు ఆత్మస్వరూప మనియు, క్షణిక మ
సంతోషమే నిత్యానంద మనియు జీవుఁడు నమ్మి, దేవునకు
మొగము పెట్టుచున్నాఁడు. దేహమును గల్పించు అవిద్యా కి
జీవాత్మకు పతన హేతువగును. పరిశుద్ధమైన ఆత్మకు జడపదార్థ
ర్కమే నీచస్థితిని గూర్చినది. ఈ పాపమువలన, ఆత్మాభ్యున్నతి
రోధము కల్గుటయే కాక, దైవ ద్రోహము కూడ నైనది.
రుఁడే సర్వాత్మస్వరూపి యను విద్యచే, అవిద్యానివృత్తి కావ
జీవుఁడు స్వతంత్ర ప్రవృత్తి సామర్థ్యమును రామానుజు లంగీకరిం
బాధ్యత విషయములో ప్రతి వ్యక్తియు ఈశ్వరునకు అన్యుఁడే
ఈశ్వరుఁడు ఆధార మని తెలియనిచో, జీవిని కర్మయంత్ర ము
శిక్షించి, వాని దుర్వర్తనములను స్మృతికిఁ దెచ్చి, సత్యము
గుటకు సాయపడును. అంతర్వర్తియై యున్న ఈశ్వర ప్రేర
మున జీవాత్మ తన దోషమును గుర్తించి, దైవ సాహాయ్యము స
చును. పాపమునకు బాధ్యత మానవునిదే యని రామానుజ
ముద్ఘాటించును. యామునాచార్యులు తా నొక సహస్ర పాపఘు

వర్ణించుకొని, దైవ కటాక్షము నర్థించును. వైష్ణవ మతము శ్రమాన్వితమగు తపో విధానములను ప్రోత్సహించదు.

ఆస్తికులగు రామానుజులు జ్ఞాన, కర్మలచేఁగాక, భక్తి ప్రసాదములచే మోక్షము సాధ్యమని భావింతురు. శాస్త్రముల ననుసరించి జ్ఞాన మనఁగా - ధ్యానమును, నిధిధ్యాసమునై యున్నది.[105] ఈశ్వరుఁడు మన కంతరాత్మ యనియు, మన మీశ్వరునిలో అంశములమనియు చెప్పు సత్యముపై దృష్టిని కేంద్రీకరించుటచే భక్తి జనించును. దుష్కర్మ వినాశమైనఁగాని ఈ జ్ఞాన ముదయింపదు. సత్కర్మ వలన పూర్వకర్మ క్షయ మగును. శాస్త్రచోదిత కర్మలను స్వార్థముతోఁ జేసినచో, ప్రయోజనము లేదు. కర్మఫలితము క్షణికము. జ్ఞానము అక్షయమైనది. కాని. ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయు కర్మ - మోక్ష సిద్ధికి సాయ్య మగును.[106] నిష్కామ కర్మవలన సత్త్వగుణము పెంపొంది, సత్యము స్ఫురించును. జ్ఞానకర్మలు భక్తి సాధనములు. భక్తి-స్వార్థపరత్వమును మూలములోనికిఁ బెరికివైచి, సంకల్పమునకు నూతన బలమును, బుద్ధికి క్రొత్త చూపును ఆత్మకు సన్య శాంతిని చేకూర్చు శక్తి గలది.

నికృష్టోపాసనము మొదలిడి, ఈశ్వర సాక్షాత్కారము వఱకు సర్వవిధ ఆరాధనములు భక్తియే యను అర్థము వ్యాప్తిలో నున్నది. ఋగ్వేద కాలము నుండి[107] నేటి వఱకు ఈదేశమున భక్తికి పరిణామ

105. శ్రీభాష్యము - 3-4-26.

106. " తదర్పితాఖిలాచారవతా"

— (నారద భక్తిసూత్రములు ; 19 వ సూత్రము)

107 "సుఖాపేక్షతో, నా భావము లన్నియు ఉత్కంఠతతో ఇంద్రుని స్తుతించుచున్నవి. ఉదగు యువగవరు నాతని పదుపులు కౌగలించుకొనుచున్నవి, నా కోరిక రీతెప్పు నని నా భావము లాతని నాలింగనము చేసికొనును, హే యింద్రా ! నా చిత్తము నీయందె లగ్నమై, తిరిగి రాకున్నది నా వాంఛాసిద్ధికి నిన్నే ప్రార్థింతును."

- (ఋగ్వేదము 10-43-1)

చరిత్ర కలదు. రామానుజుల ననుసరించి భక్తి యనఁగా – ప్రశాంత ధ్యానమూలమున ఈశ్వర సాన్నిధ్యమునుగాంచుటే. భక్త్యంగములను వారు విపులముగా వివరించిరి. ఆహార వివేచనము, ఈశ్వరుని యందు అనన్య కాంక్ష – లేక, విమోకము. అభ్యాసము, పరోప కారమైన క్రియ,[108] సర్వజీవ క్షేమకాంక్ష – లేక, కల్యాణము, సత్యము, ఆర్జవము, దయ, అహింస, దానము, అనవసాదము, లేక – నిరాశా రహిత మగు నిత్య సంతుష్టి[109] మున్నగునవి. కావున, భక్తి యనఁగా – ఉద్రేకము కాదు.[110] ఇచ్ఛా బుద్ధి శిక్షణము,[111] ఈశ్వరుని గూర్చిన జ్ఞానము, ఈశ్వరేచ్ఛానశ మగు సంకల్పమును[112] భక్తిలోనివి. మనస్సును, హృదయమును సంపూర్ణముగా ఈశ్వరుని కర్పించుటే భక్తి. ఇది సాక్షాత్కార సిద్ధితో సమాప్త మగును.[113]

భక్తియు, మోక్షమును అవినాభావ సంబంధము గలవి. భక్తి యొక్క ప్రతి ఘట్టమందును, మనకు క్రమాభివృద్ధి కల్గుచున్నది. భక్తి

---

108 స్వాధ్యాయము, ఈశ్వరారాధనము, పితృదేవతలకు సేవ, మానవ జాతికి, పశు జాతి నిర్వహింపవలసిన విధులుగా విభాగింపఁబడెను

109. సర్వదర్శన సంగ్రహము : 4

110. "స్వాప్నేశ్వరుఁడు" – అనురక్తి యనఁగా – జ్ఞాన సహిత మగు భక్తి యని చెప్ప బడినది, అంధప్రేమ భక్తి కాదు.

111. "జ్ఞానకర్మానుగృహీతం భక్తియోగమ్."

— (శ్రీ రామానుజ గీతాభాష్యము

"ధీప్రతిరూపా భక్తిః."

– (తత్త్వముక్తాకలాపమ

112. రామానుజులు వేదార్థ సంగ్రహములో – సాధన భక్తి, పరాభక్తి యని భక్తిభేదం తెల్పిరి. వాఙ్మనోదేహ నిగ్రహము, విధికర్మాచరణము, స్వాధ్యాయము, నిస్స త్త్వము మున్నగునవి మొదటివానిలోఁ జేరును.

113. శ్రీ భాష్యము . 1-1-1.

యొక్క పరిణామమే మోక్షము. అదియే సాధనము లన్నింటికంటె శ్రేష్ఠతరమైనది. ఏలన, భక్తి - ఫలరూప మగు సాధనము. జీవాత్మ భక్తివలన క్రమముగా తన కీశ్వరునితోడి సంబంధమును అధికముగా గుర్తించి, తుదకు తనకు పరమాత్మ యగు ఈశ్వరునికి సంపూర్ణార్పణము చేసికొనును. తరువాత ఇక స్వాభిమానము, స్వార్థ పరత్వము ఉండవు. ఏలన, అహంకారము స్థానమున ఈశ్వరుఁడు ప్రవేశించినాఁడు. జీవిత మంతయు దీనితో మార్పు నొందును. నమ్మాళ్వారులు చెప్పినారు :- "నన్ను నీలోఁ గల్పుకొను మహత్తరమైన నీ వరప్రసాదమునకు నేను కృతజ్ఞుఁడనై, నా యాత్మను నీకు సమర్పించినాను" [114] మన రక్తములోని ప్రతిబిందువును, హృదయ మందలి ప్రతి స్పందమును, బుద్ధి యందలి ప్రతి భావమును దేవునికి సమర్పింపఁబడును. 'నేను కాదు - అంతయు నీవే' అనునది ఈ యవస్థ. వైధీభక్తి, ముఖ్యభక్తి యని - భక్తి రెండు విధములు. మొదటిది - ప్రార్థనలు మున్నగునవి ఇవి ఆత్మపురోభివృద్ధికిగాని, తరింపఁజేయఁజాలవు. మనము పరమాత్మ నర్చింపవలెను. భక్తి చరమ సోపానములలో ఏ రూపమును నిలువఁజాలదు.[115]

---

114. తిరువాయి మొళి : 2-3-4.

115. రామానుజు లోక గురుప్రోక్త శ్లోకము నిట్లు ఉదాహరించినారు :-

> "ఆబ్రహ్మ స్తంబ పర్యంతా జగదంత ర్వ్యవస్థితాః
> ప్రాణినః కర్మజనిత సంసార వశవర్తినః
> యత స్తతో న తే ధ్యానే ధ్యానినా ముపకారకాః
> అవిద్యాంతర్గతా స్సర్వే తే హి సంసారగోచరాః."

బ్రహ్మ మొదలు తృణ పర్యంతము సర్వవస్తువులు కర్మజ మగు సంసార పాశ బద్ధములు. అవిద్యాంతర్గతములైన లక్షణము నార్జించుట (2) సంసార సంగతములైన ఆ వస్తువులు ధ్యానమున కుపకరించు విషయములు కాఁజాలవు.

ఈశ్వరునకు పరిపూర్ణ సమర్పణము ప్రపత్తి.[116] భాగవతుల ననుసరించి, ప్రపత్తియే మిక్కిలి నిశ్చయమైన మోక్షసాధనము. పండితులకు, పామరులకు, అధికులకు, అల్పులకు, అందఱకును ఇది సులభసాధ్యమైనది. జ్ఞాన కర్మలపై ఆధారపడు భక్తి - కష్టసాధ్య మగుటచే, అగ్రజాతిత్రయమునకే చెప్పఁబడినది. కాని, ఎవఁడైనను గురూపదేశము నంది, ఈశ్వరుని భుజస్కంధములపై తన భారము నిడి సుఖింపవచ్చును. ఆళ్వారుల సంప్రదాయమును అధికముగా ఆదరించిన తెంగలై శాఖ ననుసరించి, మోక్షమునకు ప్రపత్తి యేకైక మార్గ మనియు, యత్నాంతర మేమియు అవసరము లేదనియుఁ జెప్పఁబడెను. ఈశ్వరుని సంపూర్ణార్పణ మొనర్చినవానిని అతఁడే రక్షించును. వడగలై శాఖ - మోక్షమునకు ప్రపత్తి యొకమార్గమే కాని, ఒకే మార్గము కాదని చెప్పును. ఈ శాఖ ననుసరించి, మోక్షసిద్ధికి మానవ ప్రయత్న మవసర మని చెప్పును. కర్మ జ్ఞాన భక్తి ప్రపత్తులను సాధించిన వ్యక్తికి ఈశ్వర కృప లభించును. ఈ శాఖ చెప్పునది మర్కట కిశోర న్యాయము. మర్కట కిశోరము ప్రయత్నపూర్వకముగా తల్లి నంటి పట్టుకొని యుండవలెను. రెండవ శాఖ చెప్పునది మార్జాల కిశోర న్యాయము. ఇచట తల్లి - తన కిశోరమును నోట గఱచుకొని పోవును. ఈ శాఖ ననుసరించి, మానవ ప్రయత్నములో ఏమియు లేదు. దైవ కటాక్షమే మోక్షార్హు లగువారి నేర్చి రక్షించును. ఈశ్వరుఁడు - ఏ దేని ఒక ముహూర్తమున జీవాత్మను ఆవేశించి స్వీకరించును తిరిగి

116. రామానుజ గీతాభాష్యము 7 - 14 లకు వ్రాసిన ఉపోద్ఘాత వాక్యములు. ప్రపత్తి అంగములని చెప్పఁబడినవి. (1) అనుకూల్య సంకల్పము (2) ప్రతికూల రక్షణ విసర్జనము (3) ఈశ్వరుఁడు తన్ను తప్పక రక్షించు నను విశ్వాసము (4) రక్షణకై మొర (5) కార్పణ్యము (6) ఆత్మ సమర్పణము, మొదటి యైదును అవపదానికి సాధనములు, ఆత్మ సమర్పణమే ప్రపత్తి

ప్రయత్న మక్కరలేదు. ఆత్మ సమర్పణము నిత్యము జరుగుచుండ వలె నని రెండవ శాఖ చెప్పును.

## మోక్షము

రామానుజుల ననుసరించి మోక్ష మనఁగా - జీవాత్మ అదృశ్య మగుట కాదు. దానిని బంధించు పాశములనుండి విముక్తి నందుటే. జీవాత్మ అదృశ్యమైనచో - సత్యాత్మ నాశనమే యగును.[117] ఒక ద్రవ్యము వేరొక ద్రవ్యముగా మారదు.[118] మానవుఁ డెంత యున్నత స్థితి గాంచినను, ఆతని నెల్లప్పు డర్చించి, ప్రేమించి, భూషింపవలయును. ఈశ్వర శక్తి - ప్రేమ రూపమై, యెదుట నుండఁ గలదు. మనకుఁ గలవానిలో మతానుభూతియే ఉత్తమానుభూతి యని ప్రకటించు రామానుజులు తదను భూతిలో - 'తాను తాని దున్న' దని పలికెను. ముక్తజీవికి సారూప్యమేగాని, సాయుజ్యము లేదు.[119] ముక్తజీవి దివ్య జ్ఞానము కలిగి, ఈశ్వరుని నిత్య సాక్షాత్కారము నొందుచుండును.[120] మతే కోరికయు ఆ జీవికి లేని కారణమున,

117. శ్రీ భాష్యము : 1-1-1 118. విష్ణు పురాణము : 2-14-27.

119 "బ్రహ్మణో భావః న తు స్వరూపైక్యమ్."

– (శ్రీభాష్యము : 1-1-1)

121 "పరిపూర్ణ పరబ్రహ్మానుభవమ్" ఉదా : సర్వదేశ, సర్వకాల, సర్వావస్థైగళిలుమ్ సర్వేశ్వనై అనంత మంగళాన విగ్రహ గుణవిభూతి చేష్టితం గళిల ఒన్నుం కురయామల్, నిరతి.యు భోగ్యమాగ, విషయీకరిత్తు కొండిరిక్కుమ్."

— (రహస్యత్రయ సారము : 22.)

తిరిగి సంసారము లోనికి రాదు.[121] మోక్షమునక
అహంభావము కాని, వ్యక్తిత్వము కాదు. జీవి సహజ
నిత్య ముక్తిరై యున్నను, సంసార దశలో అవిద్యా
మైనది. మోక్షావస్థ యనఁగా – సహజములైన చిదానం
వ్యక్తీకరణము. ముక్తజీవిని 'స్వరాట్టు' అనిరి. కారః
బంధ విముక్తియే.[122] రామానుజుల ననుసరించి జీవన
కర్మ నిశ్శేషమై, దేహపతనమైన వెనుక, ముక్తుఁడు
సాన్నిధ్యమును గాంచును. మోక్షావస్థలో జీవు లన్నిటి
ముండును. అచట దేవతా మనుష్య పశు వృక్ష భే
సంసారమందే ఈ భేదముల కర్థము గలదు. జడ పదా
వలననే జీవికి విశిష్ట వ్యక్తిత్వ మేర్పడును. అసహజ మగ
త్వము స్థిరమైనది గాదని తెలియుచున్నది. ఈ వ్యక్తి
మగుట వలన, జీవాత్మ బ్రహ్మ లక్షణములను గాంచి,
గాంచును. దానికి వే రే నూతన లక్షణమును రాదు.1

ముక్తావస్థలో జీవులకు రెండు తప్ప, బ్రహ్మలక్షః
లభించును. జీవులు అణుప్రమాణము గలవై యుండుః
రుఁడు సర్వవ్యాపి. అణుప్రమాణము గలవాఁ డయ
పొందిన జీవాత్మ – పరమేశ్వరునిచే సృజింపఁబడిన ః
లతో, వివిధ దేహములలో ప్రవేశించఁగలదు.[125]
చేయు పని ఈశ్వరునికే గలదు. ముక్తాత్మకు అంద

121. శ్రీభాష్యము : 4-4 22. 122. శ్రుతప్రకాశిక . 1

123. .... "కర్మరూప జ్ఞానమూలం వ స్వరూపత్వతః."

— (శ్రీభాష్య

124 శ్రీభాష్యము : 4-4-1. 125. శ్రీభాష్యము . 4.

వైకుంఠమున నున్న జీవులు ఒకే రూపమును గల్గియుందురు. వారి రూపములు విశుద్ధ సత్త్వ పరికల్పితములు. ఈ సత్త్వ పదార్థ సాహాయ్యముచే, ముక్తజీవులు తమ భావములకు, ఆశయములకు రూపము నిత్తురు. ఈ నాటకము ముగియు నని చెప్పుటకు వీలైనచో, అప్పుడు ముక్తజీవి - పరిపూర్ణత నందియు, పరబ్రహ్మకు విశేషణము గానే యుండును. పరబ్రహ్మ యేక మయ్యు, తన అంతర్యామిత్వము వలన, అనేక జీవైక్యరూపము గలదైనను, తన యేకాత్మత్వమునకు భంగము రాకుండ నుండును. ఈ ముక్తజీవ సంఘములో ఏ యొక జీవియు స్వార్థపరత లేక, విశ్వాభ్యుదయము కొఱకే పనిచేయును.

విశిష్టాద్వైత తత్త్వము ననుసరించి, ముక్తజీవులలో రెండు జాతులు గలవు. ఇహలోకములో ఈశ్వరసేవ చేయు అలవాటు గలవారు అచట చేరుదురు. రెండవ తెగవారు కేవలులు. వీరు - నిరతము ఆత్మధ్యానముచే కృతార్థులైనవా రగుటచే, వేరితో గలియక యుందురు.

---

డాక్టర్ · సర్వేపల్లి రాధాకృష్ణ పండితుల ఆంగ్ల మూలమునకు
శ్రీ బులుసు వేంకటేశ్వరులు గారి ఆంధ్రానువాద మిది



# శ్రీ రామానుజ స్తవము

'కవి రత్న - కవి శేఖర'

## శ్రీమాన్ గుదిమెళ్ళ రామానుజాచార్యులు

✻

జయ పాషండ మహీజ దావ దహనా! చార్వాక శైలాశనీ!
జయ బౌద్ధాంధ్య నిరాస వాసర మణీ! జైనేభ కంఠీరవా!
జయ మాయామతవాది భోగి గరుడా! శ్రౌతాంత చూడామణీ!
జయ శ్రీరంగ జయధ్వజా! ముని బిడౌజా! స్వామి రామానుజా!

పాషండ ద్రుమషండ దావ దహన ప్రఖ్యాతి నార్జించి, శ్రీ
రమా నాయక రంగరాజ పద పద్మోపాంత దాసుండవై,
కాషాయాంబర ధారివై, త్రిజగతీ కల్యాణ సంధాయివై
శేషాం శాప్తి జగద్గురుండ వగు నిన్ సేవింతు రామానుజా!

శ్రీవైకుంఠమునందు శౌరి కరుణాసింధుండు కానన్ గలిన్
జీవుల్ దుఃఖము జెందుచుండ గని, లోఁ జింతించి, త చ్ఛాంతికై
నీ వా నాడు త్రిపా ద్విభూతిపదవీ నిశ్రేణికా మార్గమున్
దేవా! చూపితి వంట నీ మహిమ నెంతే నెంతు రామానుజా!

అవతారంబును దాల్చి భూతపురిలో నాసూరవారింటఁ గే
శవ సూనుం డనఁ దంజమాంబసతితో సంసారమం దుండి యా
దవు 'గప్యాస' పదార్థ మందలి వివాదంబందు నిర్జించి కాం
చవె! శ్రీ యామున కుంచితాంగుళి రహస్యార్థంబు రామానుజా!

వరదాజ్ఞన్ మధురాంతకంబున, మహా ప్రాజ్ఞుండు పూర్ణార్యుఁ డా
దర మేపారఁగఁ దప్త ముద్రఁ దిరుమంత్రం బీయ, ధన్యుండవై
గురుతా వీరిక నెక్కి దాశరథినిన్ గూరేశునిన్ యాదవున్
గరుణన్ శిష్యులుగాగ నేలితి నమస్కారంబు రామానుజా !

శ్రీరంగాలయ పాలనంబుఁ గొని, గోష్ఠీపూర్ణ మంత్రార్థమున్
ధారాళంబుగ లోకు లందఱు వినన్ ద్యాగంబు గావించి, దు
ర్వార ప్రజ్ఞుఁడు యజ్ఞమూర్తి యెదురై వాదింప నోడించి, పెం
పారన్ వాని కొసంగినావుగద చక్రాంకంబు రామానుజా !

శ్రీ శేషాచల మేగి, రామచరిత శ్రీమద్రహస్యార్థముల్
శ్రీశైలేశ కృపా కటాక్ష కలనన్ సేవించి, 'శ్రీభాష్యమున్'
దేశ ఖ్యాతిగ దెల్పి, 'సంగ్రహ' మనన్, దీపంబు' నా 'సారమున్'
ధీ శక్తిన్ రచియించినాఁడవు శ్రుతుల్ దీపింప రామానుజా !

ఆపై దిగ్విజయంబు సేయఁగ విశిష్టాద్వైత సిద్ధాంతమున్
స్థాపింపన్ బహు దేశముల్ గని, ధనుర్దాసున్ గటాక్షించి, ఢి
ల్లీ పృథ్వీపతి పుత్రికారతికళాలీలాత్మ సంప త్సుతున్
మా పుత్రా యని పిల్చినట్టి నిను సన్మానింతు రామానుజా !

మీ కాషాయము - మీ త్రిదండమును-మీ స్మేరాంకురాస్యంబు-మీ
శ్రీశాంఘ్రి సరోజ దాస్యమును - మీ శ్రీభాష్య వైదుష్యమున్ -
మీ కల్యాణ గుణ ప్రభావమును స్వామీ ! లక్ష్మణాచార్య ! యిం
దాకల్పాంతము నిత్య మంగళము నిత్యశ్రీగ వర్ధిల్లుతన్ !



# ఆంధ్రులు - విశిష్టాద్వైతము

'సాహిత్యవిద్యాప్రవీణ'
డాక్టర్ : తట్టా విజయ రాఘవాచార్యులు, ఎం ఎ., పి హెచ్.డి

×

## అవతారిక

శ్రీమ దఖండ భూమండలములో సకల శ్రేయములకు ఆక మగు జంబూ ద్వీపమున, పురాణ ప్రశస్తమగు భరత వర్షమున భర ఖండమున జన్మించుట ఎంతయో సుకృతము. క్రిమి - కీట - పశ యోనులలో జన్మించక, శ్లాఘింపదగిన ఉత్తమమైన మనుష్య దేవ మున జన్మించుట సుకృత ఫలము. "దుర్లభో మానుషో దేహః 'మనుష్య జన్మ దుర్లభ' మని ఆర్యోక్తి.

భరత ఖండమునందు భగవన్నామ స్మరణమును మించి పవిత్ర కార్యము లేదు. అట్టి సంస్కృతికి పట్టుగొమ్మయగు పవి నదీ తీర ప్రాంతము ఆంధ్రదేశము. ఇతర రాష్ట్ర - దేశ - ఖండ ద్వీపములలోని యెల్లరి మనోభిప్రాయములను సహృదయముగా స్వీ రించునది ఆంధ్ర దేశము. అందువలననే ఇతర మతములు సులభ ముగా ఆంధ్ర దేశమున అడుగిడినవి. ఏ యొక్కరి మానసికాభిప్రా యములను గూడ త్రోసి పుచ్చక, స్వీకరించి, పరిశీలించి, పవిత్రముగ మంత్రించి, ఆచరించినా రాంధ్రు లనుటలో అణుమాత్రమేని సంది యము లేదు.

## ఉపక్రమము

పూర్వజన్మ సుకృత ఫలముచే లభించిన మానవుడు నయితేము సర్వదా పొందగోరునది అవాఙ్మానసగోచర మయిన అప్రమే

యానంద సందోహము. అది ప్రత్యక్ష అనుమానాది ప్రమాణము లకు సిద్ధించునది కాదు. అనుభవైకవేద్య మయినదాని నెరుగుటను తెలియజేయునది ఆమ్నాయ మొక్కటే.

"ప్రత్య క్షేణానుమిత్యా వా యత్తూపాయేన బుధ్యతే
య త్తం విద న్తి వేదేన తస్మా ద్వేదస్య వేదతా'

అని ప్రాజ్ఞుల వక్కణ.

త త్త్వ - హిత - పురుషార్థములను తెలియజేసి, సన్మార్గ దర్శకులుగా ప్రసిద్ధి బడసిన ఆళ్వారు లను భక్తాగ్రేసరుల భావైక్యమే విశిష్టైక్యము. జీవునకు, దేవునకు గల విడదీయ వీలు లేని సంబంధము నెరుకపరచుటయేగాక, జీవుడు దేవుని కోరు తీరును, విడకున్న వేరుగ నుండి తీర్చు తీరును తెలియజేసినది విశిష్టైక్యము. ఆ విశిష్టైక్యమే ఈ జగమున విశిష్టాద్వైత మని సుప్రసిద్ధము. ఆ విశిష్టాద్వైతము వేదవిదగ్రేసరులైన వాల్మీకి - పరాశర - ద్వైపాయన - యాజ్ఞవల్క్య మునిగణ ప్రణీతములైన స్మృతీతిహాస పురాణ ప్రమాణములచే ప్రతిపాదితమైనది. ద్రమిడాచార్య, గుహదేవ, కపర్ది, భారుచి, భర్తృమిత్ర, భర్తృప్రపంచ, నాథముని, యామునమునుల ద్వారా పరంపరాగతమైనది. ఆ విశిష్టాద్వైతమును మనసా - వాచా - కర్మణా ఆచరించి తరించినారు ఆంధ్రులు. ఆంధ్రులచే విశిష్టాద్వైతము వ్యాప్తి చెందిన దనుటలో పరిశీలింప తగినవి - వారిచే విరచితము లైన సంస్కృత స్వతంత్ర గ్రంథములు, వ్యాఖ్యానములు, ఆంధ్ర భాషానువాద గ్రంథములు, శోధ ప్రబంధములు, పత్రికలు, ఆశ్రమాదులు మొదలగునవి.

## పూర్వ ఆంధ్ర దేశము

నేటి ఆంధ్ర ప్రదేశ్ లోని కడప, కర్నూలు, అనంతపురము జిల్లాలు, కర్ణాటకలోని బళ్ళారి, రాయచూరు, గుల్బర్గా జిల్లాలు,

తమిళనాడు లోని చెంగల్పట్టు, నార్త్ ఆర్కాడు జిల్లాలలో 'వ్యాధులు' అనబడు ఒక వర్గమునకు జెందిన మహా పరాక్రమ వంతులు ఉండెడివారు. వీరు – మన దేశములోని ఆదిమ వాసులలో ఒకరు. వీరి పరాక్రమమును గూర్చి హాలుని 'గాథా సప్త శతి' లో బాగుగా వర్ణింపబడినది. శాతవాహన, గుప్త, చాళుక్య, విజయనగరాది రాజుల సైన్యములలో వీరు ముఖ్య స్థానము వహించి, వారికి విజయము చేకూర్చిరి. ప్రతి రాజ్యమందును వీరు సైనికులుగా, సేనా నాయకులుగా ఉండెడివారు. చాళుక్య, విజయనగర రాజ్యము లలో ముఖ్యముగా కృష్ణదేవరాయుల వద్ద వీరు సేనాధిపతులుగా, అంగ రక్షకులుగా, దుర్గాధిపతులుగా నుండెడివారు. 'బోయ' అని తెలుగులోను, 'బేడర్' అని తమిళ – కన్నడములలోను వీరిని వ్యవహ రింతురు. అయినను – వీరి అందరి భాషయు ఆంధ్రమే. అదియే ఇచట ముఖ్యాంశము. రాయుల యనంతరము వీరు స్వతంత్ర రాజ్య ములను స్థాపించిరి. అవి కాలక్రమమున కాలగర్భములో కలిసి పోయెను. అట్టి రాజ్యములలో ఒకటి సురపురము.

## సురపురం విద్వాంసులు

కృష్ణా – భీమ నదుల మధ్య నల్ల రేగడి నేలలో నెలకొన్నది సురపురము. 18 – వ శతాబ్దములో దాని పాలకుడు – రాఘవ పాము నాయకుడు. ఈతని మాతృభాష తెలుగు. అయినను, ఇతడు సంస్కృత భాషాభిమాని, సంస్కృతభాషా పోషకుడు, వైష్ణవ శిఖాగ్రణి. ఆతని ఆస్థానములోని మహా విద్వాంసులు – బుక్క పట్టణం వేంకటాచార్యులు, అణ్ణయాచార్యులు, శ్రీనివాసాచార్యులు. వీరికి – 'సురపురము సోదరులు' అని ప్రసిద్ధి. వీరి తండ్రి – శ్రీనివాస తాతాచార్యులు. సురపురము సోదరులు – ఆంధ్ర, సంస్కృత, కన్నడ, మహారాష్ట్ర, ఫారసీ భాషలలో పండితులేగాక, ముఖ్యముగా – విశి ష్టాద్వైత సిద్ధాంత ప్రచారకులుగా, బహు గ్రంథకర్తలుగా ప్రశస్తి గాంచినవారు.

## వేంకటాచార్యులు

సురపురము వేంకటాచార్యులవారు - అద్వైత విద్యా విచారము, ఆనంద తారతమ్య ఖండనము, బ్రహ్మసూత్ర భాష్యస్థ పూర్వపక్ష సంగ్రహ కారికా, ప్రపంచ మిథ్యానుమాన ఖండనము, సిద్ధాంత రత్నావళీ, సిద్ధాంత వైజయన్తి అను గ్రంథములను రచించిరి.

అద్వైత మతానుసారముగా గల వాక్యములను విచారించు నవరణ చేయుచు వ్రాసిన గ్రంథము 'అద్వైత విద్యా విచారము.'

ద్వైత సిద్ధాంతమును ఖండించుచు వ్రాసిన గ్రంథము 'ఆనంద తారతమ్య ఖండనము.'

శ్రీమద్రామానుజుల శ్రీభాష్యమునందలి పూర్వ పక్షముల నొకటిగా చేర్చి, వానిని కారికలుగా వ్రాసిన గ్రంథము - 'బ్రహ్మ సూత్రభాష్యస్థ పూర్వపక్ష సంగ్రహ కారిక.'

'జగత్తు మిథ్య' యను అద్వైత వాదమును నిరాకరించుచు వ్రాసిన గ్రంథము - 'ప్రపంచ మిథ్యాత్వ ఖండనము.'

విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రతిపాదించుచు నాల్గు భాగములుగా వ్రాసిన గ్రంథము - 'సిద్ధాంత రత్నావళి.'

విశిష్టాద్వైతమునందు చెప్పబడిన సిద్ధాంతములను ప్రమాణములతో ప్రతిపాదించి, నిరూపించుచు వ్రాసినది - 'సిద్ధాంత వైజయంతి.'

## అణ్ణయాచార్యులు

'ఆచార్య వింశతి', 'నృసింహ వింశతి' యను గ్రంథములను అణ్ణయాచార్యులు వ్రాసిరి.

## శ్రీనివాసాచార్యులు

‘అభినవ నిగమాంత దేశికులు’ అని ప్రసిద్ధిగాంచిన సురపురము శ్రీనివాసాచార్యులు - బహు గ్రంథకర్తలు. వీరు కౌండిన్యస గోత్రులు. తత్త్వ మార్తాండము, జిజ్ఞాసా దర్పణము, ణత్వ దర్పణము, నయ ద్యుమణి దీపికా, న్యాయ మణి కళికా, ప్రతితంత్ర దర్పణము, షష్ఠ్యర్థ దర్పణము, సిద్ధాంత చింతామణి అనునవియే గాక, అరుణాధికరణ సరణి వివరిణీ, జ్ఞానరత్న ప్రకాశికా, పుచ్ఛ బ్రహ్మ వాద నిరాసః, విరోధ వరూథినీ, ప్రమాథినీ, దత్తరత్నప్రదీపికా, నీతి శతకమ్, సుభాషితాని, ప్రణవ దర్పణమ్ మొదలగునవి వీరి కృతులు.

శ్రీభాష్యముయొక్క సమీక్షాత్మక మయిన అధ్యయనము - ‘తత్త్వ మార్తాండము’ ఇందు - వ్యాసతీర్థులు మున్నగు ద్వైతా ద్వైతులచే శ్రీభాష్యముపై ఆరోపింపబడిన ఆక్షేపణలు ఖండింపబడినవి.

శ్రీ భాష్యమునందలి ప్రథమసూత్ర వ్యాఖ్యానము ననుసరించి ‘జిజ్ఞాసా’ అను పదమునకు పునాదివలె వ్రాయబడినది - ‘జిజ్ఞాసా దర్పణము.’

నారాయణుని పరత్వమును ప్రతిపాదించుచు వ్రాయబడినది - ‘ణత్వ దర్పణము.’

ద్వైతులచే చెప్పబడు ఓంకారార్థమును సవరించుచు వ్రాసిన గ్రంథము - ‘న్యాయ మణి కళికా’ లేక ‘ఓంకార వాదార్థము.’

1-1-27 న్యాయసూత్ర మందలి నాల్గు సిద్ధాంతములను విశిష్టాద్వైత పరముగా సమీక్షణము చేయుచు వ్రాయబడినది - 'ప్రతితంత్ర దర్పణము.'

ప్రథమ బ్రహ్మసూత్ర మయిన 'అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా' అను చోట - 'బ్రహ్మణః జిజ్ఞాసా = బ్రహ్మ జిజ్ఞాసా' అను విగ్రహ వాక్యమునందు - షష్ఠీ సమాసమును గూర్చి విచారించుచు వ్రాసినది 'సిద్ధాంత చింతామణి.'

## కిరీటం వేంకటాచార్యులు

అణ్ణయాచార్యులవారి కుమారులు ముప్వురు. (1) శ్రీనివాసాచార్యులు (2) వేంకటాచార్యులు (3) బుచ్చి వేంగటాచార్యులు అని. వీరిలో - వేంకటాచార్యులుగారికి - కిరీటం వేంకటాచార్యులు గారు, అయ్యగారు అను నామాంతరములు సుప్రసిద్ధములు. ఆజానుబాహులయిన వేంకటాచార్యులవారు - 'విశిష్టాద్వైత' మనబడు కిరీటమును ధరించి, ఆసేతు శీతాచల పర్యంతము పర్యటించి, వివిధ దార్శనికులను వాదములలో నోడించి, హరిసర్వోత్తమత్వమును స్థాపించిరి. వీరు గ్రంథ రచన కంటెను, వాక్యార్థములకు ఎక్కువ ప్రాధాన్యమిచ్చిరి. రెండవ బాజీరావు కాలములో వీరు - పూనా నగరమునకు వెళ్ళిరి. బాజీరావుగారి ఆస్థానములోని మహా విద్వాంసులు పురుషోత్తమశాస్త్రిగారు. ఏకాత్ములయిన ఆ శాస్త్రిగారికి అహంకారము మెండు. కిరీటం వేంకటాచార్యులుగారు వచ్చినపుడు, రెండవ బాజీరావు లేచి స్వాగత మిచ్చె నట. కాని, పురుషోత్తమశాస్త్రిగారు లేవలే దట. అందువలన వారిని అధిక్షేపించుచు వేంకటాచార్యుల వారు -

"ఆఖండలి స్సహస్రాక్షః విరూపాక్ష స్త్రిలోచనః
అన్యే ద్విలోచనా స్సర్వే, కో౽భవా నేకలోచనః"

అని ప్రశ్నించిరట! ఈ వేంకటాచార్యులవారు పంజాబులో అంతటను పర్యటించి, వాక్యార్థములు చేసినట్లు ప్రసిద్ధి. కిరీటం వేంకటాచార్యులుగారు సంస్కృతములోను, తెలుగులోను కవులు. తెలుగులో వీరు రచించిన 'అచలాత్మజా పరిణయ' మను గ్రంథ మొకటి కన్పట్టుచున్నది. సంస్కృతములో - (1) అలంకార కౌస్తుభమ్ (2) కృష్ణ భావ శతకమ్ (3) గజసూత్ర వాక్యార్థః (4) ప్రామాణ్యవాద ఖండనమ్ (5) శృంగార తరంగిణీ (6) గదాధరీయ ఖండనమ్ (7) హయగ్రీవ దండకమ్ (8) యతిరాజ దండకమ్ (9) దశావతార స్తోత్రమ్ (10) లక్ష్మీ దండకమ్ మొదలగునవి ముఖ్యమైనవి.

## బుచ్చి వేంకటాచార్యులు

కిరీటం వేంకటాచార్యులుగారి తమ్ముని పేరు గూడ వేంకటాచార్యులే యగుటచేత, వారిని 'బుచ్చి వేంకటాచార్యు' అని వ్యవహరించెడివారు. వారి కృతులు - 1) వేదాంత కారికావళి 2) ఇంద్రాష్టోత్తర శతనామ స్తోత్రమ్ 3) విష్ణు స్తుతి మున్నగునవి. మహావిద్వాంసు లగు అణ్ణయాచార్య, శ్రీనివాసాచార్యులవారి సమాధి బృందావనములు - గుల్బర్గా జిల్లా, సురపురం పట్టణం శివారులో 'సిద్దన అగిసి' అను చోట నేటికిని కలవు. సురపురం పట్టణములో గోపాలస్వామి పుష్కరిణి గట్టున - కిరీటం వేంకటాచార్యులవారి స్థల మున్నది. ఆంధ్రులకు ప్రతిష్ఠ నార్జించి యిచ్చిన ఆ మహనీయుల స్మారకములను రక్షించుట - ఆంధ్రుల కర్తవ్యమై యున్నది.

## సింహాచలం కృష్ణమాచార్యులు

విశిష్టాద్వైత సిద్ధాంతమును ఆచరణలో స్పష్టము [illegible], ఆంధ్ర భాషలో కీర్తనలను, పద్యములను, నాటకములను [illegible] రచించినారు. అట్టి [illegible] - సింహాచలము నందలి కృష్ణమాచార్యులవారొకరు - వీరు గొప్ప సంగీత విద్వాంసులు. సంకీర్తనంలో పరమాత్మను సేవించుట వీరి పద్ధతి. వీరు - సింహాచలము [illegible] వరాహ నరసింహస్వామివారిని గూర్చి - 'సింహగిరి వచనములు' అను గ్రంథమును రచించి ప్రసిద్ధి గాంచినారు.

## తాళ్ళపాక అన్నమాచార్యులు

మధుర భక్తిని ప్రస్ఫుటింప జేయుచు, ముప్పదిరెండు వేల కీర్తనలను పద కవితతో సాహిత్య - సంగీతములను కూర్చి వ్రాసిన శ్రీవైష్ణవ మహా భక్త కుటుంబమునకు జెందిన మహానీయుడు తాళ్ళపాక అన్నమాచార్యులు. ఈతని కవితయందంతటను విశిష్టాద్వైతమే స్పష్టమగును. శ్రీ వేంకటేశ్వరుని తండ్రిగా, తల్లిగా, తాను పసిబిడ్డగా, దాసునిగా, ప్రియురాలుగా - బహు విధములుగా భక్తి తన్మయత్వమును తెలియజేయుచు పాడినాడు, ఆడినాడు, ఏడ్చినాడు, నవ్వినాడు, మురిసినాడు, సిగ్గు నొందినాడు. అన్నమయ్య సృష్టిలో అందరును ఒక్కటే. అందరికిని శ్రీ వేంకటేశ్వరుడొక్కడే [illegible]

## అన్నమయ్య అనుయాయులు

అన్నమాచార్యుని భార్య యయిన 'తిమ్మక్క' - విష్ణుపరత్వమును వ్యక్తము జేయుచు, 'సుభద్రా కల్యాణము'ను రచించినది.

అన్నమాచార్యుని తనయుడగు పెద తిరుమలాచార్యులు కూడ, శ్రీ వేంకటేశ్వర స్వామిని సంకీర్తనలతోను, దండకములతోను, వచనములతోను, గీతములతోను ముంచెత్తినాడు. తైల ధారను బోలిన భక్తి తన్మయత్వమే అది.

అన్నమాచార్యుని మనుమడైన వేంకటాచార్యులు - శ్రీ వేంకటేశ్వరుని పాద రేణువు ముక్తిదాయక మని వర్ణించుచు - 'శ్రీపాదరేణు మాహాత్మ్యము'ను రచించినాడు.

తాళ్ళపాక పెద తిరుమలాచార్యుని పుత్రుడయిన చిన తిరుమలాచార్యుడు - తండ్రి తాతల వలె విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవర్తకుడై, 'శ్రీ రామానుజ సిద్ధాంత స్థాపనాచార్యుడు' అను బిరుదును సంపాదించెను. బహుభాషా వేత్తయగు ఈతడు రచించిన 'అష్టభాషా దండకము' అత్యంతము ప్రసిద్ధ మైనది.

చిన తిరుమలాచార్యుని తమ్ముడయిన చిన్నన్న - పరమయోగి విలాసము, అష్ట మహిషీ కల్యాణము అను గ్రంథములను రచించెను. వైష్ణవ మతాభిమానియైన చిన్నన్న - హరి వంశము కంఠెను పెంచి, 'ఉషా కల్యాణము'ను వ్రాసినాడు. ఈతడు రచించిన 'పరమయోగి విలాసము' - ఈతనికి విశిష్టాద్వైతమునందు గల ప్రత్యయమునకు ప్రబల ప్రమాణము.

## శ్రీకృష్ణదేవరాయలు

ఆంధ్ర ప్రదేశ మంతటిని ఏకచ్ఛత్రాధిపత్యముగ పాలించి, కవి-పండిత భాషా పోషకుడయిన శ్రీకృష్ణదేవరాయలు - విశిష్టాద్వైత సిద్ధాంతప్రవర్తకుడై, 'ఆముక్త మాల్యద' ను రచించినాడు. దీని మూలాధారము - ద్రావిడ గ్రంథ మయిన 'గురుపరంపర ప్రభావము.'

## తెనాలి రామకృష్ణుడు

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమునందు గల ఆంధ్ర కవు లగు అష్ట దిగ్గజములలో - తెనాలి రామకృష్ణుని కావ్యము 'శ్రీ పాండు రంగ మాహాత్మ్యము. విష్ణు లీలలు, విష్ణు ప్రభావము ఇందు విశేష ముగ వర్ణింపబడినవి. తొలుత రామలింగ డయిన యితడు - శ్రీకృష్ణ దేవరాయల గురు వగు తాతాచార్యులవారిని ఆశ్రయించి, వారి వద్ద వైష్ణవమును స్వీకరించి వైష్ణవుడై, పిదప - రామకృష్ణు డైనాడు.

## వెన్నెలకంటి సూరన

విష్ణు భక్తుడు, వైష్ణవ మతాభిమాని యయిన వెన్నెలకంటి సూరన - 'విష్ణు పురాణము'ను ఆంధ్రీకరించినాడు.

## కావూరి యల్లయ

బ్రహ్మాండ పురాణము నందలి 'అర్థ పంచక వివరణము'ను ఆంధ్రానువాదము చేసినాడు వైష్ణవ హృదయు డగు కావూరి యల్లయ.

## ముడుంబ నరసింహాచార్యులు

1842 - 1927 మధ్యకాలములో - విజయనగర వాసు లగు ముడుంబ నరసింహాచార్యులుగారు యామునాచార్యులవారి 'సిద్ధి త్రయ ము'నకు, 'ఆగమ ప్రామాణ్యము'నకు వ్యాఖ్యానములు వ్రాసిరి.

## గోవర్ధనం రంగాచార్యులు

క్రీ. శ. 1900 సంవత్సరములో-గోవర్ధనం రంగాచార్యులుగారు పిళ్ళలోకాచార్యులవారి 'తత్త్వ త్రయము' అను మణిప్రవాళ గ్రంథ

మునకు, తిరువాయిమొళి వ్యాఖ్యయైన 'భగవ ద్విషయము'నకు - సంస్కృతానువాదము చేసిరి. ఇవి ప్రస్తుతము - తంజావూరు, అడయారు గ్రంథాలయములలో అముద్రితములుగా నున్నవి. ఇవి వెలుగును చూడవలసి యున్నవి.

## నల్లాను చక్రవర్తుల తిరువేంకటాచార్యులు

కృష్ణా తీర ప్రాంత మయిన జగ్గయ్యపేట నివాసులగు నల్లాను చక్రవర్తుల వేంకటాచార్యులు గారు 1924 లో -'ఊర్ధ్వపుండ్ర విజయధ్వజము' అను సంప్రదాయ గ్రంథమును వ్రాసిరి.

## కుమార తాతాచార్యులు

1912 లో - కుమార తాతాచార్యులవారిచే 'భారద్వాజ సంహిత'కు - 'తిలక' అను వ్యాఖ్య వ్రాయబడినది. వాత్స్య వరదా వరదాచార్యులవారి 'పరమార్థ శ్లోక ద్వయము'నకు - 'పరమార్థ ప్రకాశమ్' అను వ్యాఖ్యాన గ్రంథము వ్రాయబడి, దానికి అనువాదముకూడ చేయబడినది.

## పరవస్తు గోవిందాచార్యులు

1890 - 1982 మధ్యకాలమున - 'దేవాడ' అగ్రహార వాసులగు శ్రీమత్పరవస్తు గోవిందాచార్య స్వామివారు - బహు గ్రంథములను ప్రకటించిరి. సంప్రదాయక గ్రంథము లనేకములకు వ్యాఖ్యలు వ్రాసిరి. ఆంధ్రానువాదము చేసిరి విజయనగరం మహారాజ సంస్కృత కళాశాలలో సుమారు 30 సంవత్సరములు శాస్త్రబోధకులుగా నుండిరి. 'శ్రీవైష్ణవ పత్రిక'కు ముఖ్య సభ్యులుగా నుండిరి. శ్రీవైష్ణవ ధర్మ ప్రచారక సభలలో ఉపన్యాసకులుగాను, అధ్యక్షులుగాను వ్యవహ

ంచిరి. వింజమూరి శేషావతారంగారు, తిరుమల వేంకట నరసింహాచార్యులుగారు - ప్రతి సంవత్సరము శరన్నవరాత్రములలో జరుపుచుండెడి శ్రీమదుభయవేదాంత ప్రచార సభలలో వీరు ముఖ్యులుగా నుండెడివారు. వీరిని ప్రశంసించుచు నెన్నో శుభాభినందనములు ఒనిపించెడివి.

వీరు (1) సారార్థ చతుష్టయము (2) లక్ష్మీసమారాధన సంగ్రహము (3) శరణాగతిగద్యకు సుదర్శనసూరి వ్రాసిన వ్యాఖ్యకు 'సభా' అను వ్యాఖ్యానమును, (4) సుదర్శనసూరి సంధ్యావందన భాష్యమునకు వ్యాఖ్యను వ్రాసిరి. ఆంధ్ర టీకా తాత్పర్యములతో (5) పూర్వదినచర్య (6) యతిరాజ వింశతి (7) ఉత్తరదినచర్య (8) నిత్యానుసంధేయ శ్లోకములు (9) ప్రార్థనా పంచకము (10) పరాంకుశాష్టకము (11) చతుశ్శ్లోకి (12) స్తోత్ర రత్నము (13) శ్రీ స్తవము (14) శ్రీ వైకుంఠ స్తవము (15) అతిమానుష స్తవము (16) సుందరబాహు స్తవము (17) శ్రీగుణరత్నకోశము (18) శ్రీ రంగరాజ స్తవము (19) ముకుందమాల (20) జితంతా స్తోత్రము (21) అష్టశ్లోకి అను స్తోత్ర గ్రంథములను ప్రతిపద టీకా తాత్పర్యములతో 'శ్రీ వైష్ణవ స్తోత్ర మాల' అను పేర ప్రకాశింపజేసిరి.

శ్రీరంగము, శ్రీ పెరుంబూదూరు వంటి దక్షిణదేశ పుణ్యక్షేత్రము లందు - ఎందరో పండితులచే వీరు సన్మానింపబడినారు. వీరి మధురోపన్యాసములకు పరవశులై, ఎందరో భక్తులు, భాగవతోత్తములు - శ్రీ వైష్ణవ భజన మండలులు స్థాపించిరి. అట్టివారిలో - శ్రీరామదాసు మున్నంగివారు ముఖ్యులు.

## కందాడై శేషాచార్యులు

విశిష్టాద్వైతమునకు మూలభూతము లయిన ద్రావిడ - సంస్కృత భాషలలో గల గ్రంథముల నెన్నింటినో ఆంధ్రీకరించి, కందాడై

శేషాచార్యులుగారు - తమ వేదాంత ముద్రణాయమున ముద్రింౘ
ప్రకాశింపజేసిరి.

భగవద్రామానుజాచార్యులవారి శ్రీభాష్యమును ఆంధ్రీకరింౘ
రెండు భాగములుగా 1922 లో ముద్రించి, ప్రకటించిరి.

ఆ సమయమున - వానమామలై శ్రీరామానుజ జీయరు స్వా
వారిచేతను, మైసూరు పరకాల మఠాధిపతులైన శ్రీ అహోబ
రామానుజ జీయరుస్వామివారిచేతను, మైసూరు మహారాజ సంస్థా
ఆస్థాన పండితు లయిన లక్ష్మీపురం శ్రీనివాసాచార్యులవారిచేతన
వాధూల దేశిక - కోయిల్ కందాడై అప్పన్ ప్రణతార్తిహా
చార్యులవారిచేతను ఉత్తమ యోగ్యతా పత్రము లందిన చ
శాస్త్రులు శేషాచార్యులుగారు.

పిళ్ళలోకాచార్యులవారి శ్రీవచనభూషణమునకు, వరవ
మునుల వ్యాఖ్యకు, ఆంధ్రానువాదము చేసి, విపులమైన పీఠికతో
ప్రచురించిరి. అట్లే -

వేదాంత రహస్యత్రయ సారము, అంజలి వైభవము, రహస
రత్నావళీ హృదయము, తత్త్వ రత్నావళీ, రహస్య సందేశము
రహస్య నవనీతము, తత్త్వ మాతృక, సంప్రదాయ పరిశుద్ధి, తత్
పదవీ, ప్రధాన శతకము, ఉపకార సంగ్రహము, ఆధ్యాత్మ చింత
తత్త్వ సందేశము మొదలగు గ్రంథములకు ఆంధ్ర భాషలో టీ
తాత్పర్యములు వ్రాసి, ముద్రించి ప్రకాశింపజేసిరి.

1939 లో - 'సంప్రదాయ అకారాది - ద్రవిడాంధ్ర నిఘ
ంటువు' అను నిఘంటువును రచించి ప్రచురించి, ఉభయ వేదా
జిజ్ఞాసువులకు, పరిశోధకులకు మహోపకారము గావించిరి,

యామునాచార్యులవారి 'కాంతా స్తోత్రము'ను ఆంధ్రీకరించి, టీకా - తాత్పర్య - పీఠికా సంహితముగ ప్రచురించిరి. కులశేఖరాళ్వారుల 'ముకుంద మాల' పద్యసహితముగ టీకా తాత్పర్యములను కూర్చి ప్రచురించిరి. శ్రీ రామానుజులవారి 'ఎనుబది రెండు వార్తలు', మణవాళ మహామునుల 'యతిరాజు వింశతి', యామునాచార్యులవారి 'స్తోత్ర రత్నము', వేదాంతదేశికుల 'రహస్యత్రయ సారము', పూర్వాచార్యుల 'వార్తామంజరి', పిన్బళకియ పెరుమాళ్ జియ్యరువారి 'వార్తా మాల', ఎరుంబియప్పాగారి 'విలక్షణ మోక్షాధికార నిర్ణయము', అళగియ మణవాళప్పెరుమాళ్ నాయనార్ వారి 'ఆచార్య హృదయము', పిళ్ళ లోకాచార్యులవారి 'తత్త్వ త్రయము', 'తిరుమంత్రార్థము' మొదలగు గ్రంథములకు ఆంధ్రభాషలో ప్రతిపదార్థ - తాత్పర్య - విశేష వివరణలు వ్రాసి, స్వకీయ వేదాంత ముద్రాక్షరశాలలో ముద్రించి ప్రకటించిరి.

'కావ్య రత్న - వేదాంత రత్న - వేదాంత తీర్థ - వేదాంత వాచస్పతి' బిరుదాలంకృతు లగు కందాడై శేషాచార్యులవారి గ్రంథములు కొన్ని ప్రస్తుత కాలమున కొందరు పండితులవద్దను, కొన్ని గ్రంథాలయము లందును, కొన్ని పరిశోధనా సంస్థలలో మాత్రమే కానవచ్చుచున్నవి.

## శిరిశినహాళ్ కృష్ణమాచార్యులు

కరీంనగర్ జిల్లా - 'కోరుట్ల' వాసులైన శిరిశినహాళ్ కృష్ణమాచార్యులవారు విశిష్టాద్వైత వేదాంత పరమైన ద్రవిడ, సంస్కృత గ్రంథములకు ఆంధ్రానువాదములను, స్వతంత్రముగ సంస్కృత గ్రంథములను వ్రాసిరి. కొన్ని ముద్రితము లయినవి. కొన్ని వెలుగు చూడవలసి యున్నవి.

పిళ్ళలోకాచార్యులవారి 'తత్త్వ శేఖరము'నకు ఆంధ్రాను వాదము చేయగా, దానిని త్రిదండి - శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామువారిచే ముద్రింపబడినది.

భగవద్రామానుజాచార్యుల వారి శ్రీ భాష్యమునకు - చతుస్సూత్రి వరకు మూలోపయుక్త మయిన శ్రుతప్రకాశికా విషయములే కాక, ఇతర పండితుల విశేషములనుకూడ చేర్చి, సంస్కృతమున 'శ్రీభాష్యామృత లహరి' అను శ్రీభాష్య వ్యాఖ్యను వ్రాసిరి ఇది వెలుగు చూడవలసి యున్నది.

శ్రీమద్రామానుజుల 'వేదాంత దీపము'నకు ఆంధ్రానువాదము చేసిరి. అధికరణములను విభజించి, ప్రత్యధికరణ పాద సంగతులను తెలుపుచు, సూత్రములకు ప్రతిపదార్థము వ్రాయుచు అనువాదము చేయబడినది. ఇదియు ముద్రణకు ఎదురు చూచుచున్నది.

వాత్స్య వరద గురువులు శ్రీభాష్యమందలి సందేహములను విడదీసి, శ్రుతిసమన్వయము చేసి, శ్లోక రూపముగా వ్రాసిన గ్రంథము 'తత్త్వ సారము'. ఇది విపుల తాత్పర్యముతో ఆంధ్రానువాదము చేయబడినది.

శ్రీరంగ రామానుజుల 'విషయ వాక్య దీపిక'కు ప్రతిపదార్థముతో ఆంధ్రానువాదము చేసి, 'శ్రుతి దీపిక' యను పేరుతో వ్రాసిరి. ఇదియును అముద్రితమే.

1932 లో నిర్మల అంబయ్య సిద్ధాంతిచే చేయబడిన రుద్రయాగములో - భగవద్గీతకు శివపరముగా భాష్యము వ్రాసిన ఆరాధ్యుల నాగలింగ శాస్త్రి - పండిత సభలో, భగవద్గీత శివ పరత్వమును బోధించు నని చేసిన ఉపన్యాసమునకు నిరసనగా - ఆయన చెప్పిన

యుక్తులే కాక, సంభావితములైన, శివపరత్వ బోధకము లయిన యుక్తులకు సహితము సమాధాన మొసగుచు - శ్రుతి స్మృతీతిహాస వాక్య సమన్వయముతో వ్రాసిన గ్రంథము 'గీతా తత్త్వ మీమాంస' ఇదియు అముద్రితమే.

తిరుమల, విజయవాడ సభలలో నుపన్యసించుటకై, సంస్కృతములో వ్రాసిన గ్రంథము - 'శ్రీభాష్యోపన్యాసములు.' ఈ గ్రంథమునకు ఆంధ్రానువాదముకూడ కలదు.

అర్చిరాది మార్గ వర్ణనము, పరమ పురుష వైకుంఠ వర్ణనము చేయుచు, అలంకార - వ్యాకరణ విషయములనుకూడ చర్చించి, సంస్కృత భాషలో వ్రాసినది - 'మన స్సందేశ కావ్యము' ముద్రితము.

శ్రీశైలపూర్ణుల ప్రశ్నలకు పిళ్ళలోకాచార్యులవారు సమాధాన మిచ్చుచున్నట్లు - అనుష్టుప్ వృత్తములలో, సులభ శైలిలో సంగ్రహముగా వ్రాసిన సంస్కృత గ్రంథము - 'తిరుమంత్రార్థము.' ఇది అముద్రితము.

కంచి గరుడోత్సవము నధికరించి శ్రీరంగనాథాచార్యులు సంస్కృతములో వ్రాసిన భాణమునకు ఆంధ్రానువాదము - 'శృంగార పంచబాణ విజయము.'

'అర్చిరాది మార్గము' అను ఛందోరూప గ్రంథము ముద్రితమైనది.

శ్రీ శఠకోపులు మొదలు, త్రిదండి - శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారి చరిత్ర వరకు - ఆరు సర్గలతో - కావ్య రూపమున వ్రాయబడినది 'గురువంశ మహాకావ్యము',

ఇది ముద్రితము. మేలుకోట (తిరునారాయణ పురము) వర్ణన మొదలు భగవద్రామానుజులు ఢిల్లీ యాత్ర చేసి, సంపత్కుమారులను తీసికొనివచ్చు కథను కావ్య రూపముగా నాల్గు సర్గలతో వ్రాసినది – 'సంపత్కుమార సంభవము.'

శ్రీ నంబూలాద్రి నరసింహస్వామి మాఘపూర్ణిమ రథోత్సవము నధికరించి, భాణ లక్షణములతో వ్రాసిన రూపకము – 'మనో విజయ భాణము.'

పూర్వాచార్యులు ప్రసాదించిన స్తోత్ర రత్నము, ముకుంద మాల, యతిరాజ వింశతి, శ్రీరంగరాజ స్తవము అను స్తోత్రములే గాక, పంచ స్తవాదులకును తేట గీతములతో ఆంధ్ర పద్యముల వ్రాసి, నాల్గు భాగములుగా – 'స్తుతి గీతములు' అను పేర ప్రకటించిరి.

అష్టాదశ వర్ణనలతో – మహాకావ్య లక్షణములతో – ఐదు ఆశ్వాసముల మహా కావ్యముగా – 'రామానుజ చరితము' అను పేర నొక ఆంధ్ర పద్య కావ్యమును రచించి ప్రచురించిరి.

## త్రిదండి – శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి

తూర్పుగోదావరి జిల్లా – 'అర్తమూరు' గ్రామమున జన్మించిన చిలకమర్తి శ్రీమన్నారాయణాచార్యులుగారు – బదరికాశ్రమమున తపస్సు చేసి, వానమామలై జీయరుస్వామి వారివద్ద యత్యాశ్రమమును స్వీకరించి, శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామి'గా వ్యవహరింపబడినారు.

'శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత ప్రచారక సంఘము'ను స్థాపించి, ఆసేతు శీతాచల పర్యంతము విశిష్టాద్వైత మత ప్రచారము గావించినారు.

అనేక క్రతువులు చేయించి, లోక శాంతికి, సంరక్షణకు హేతు వయినారు.

భారత దేశమున బహు పుణ్య క్షేత్రములలో - తీర్థములలో - పల్లెలలో - పట్టణములలో 108 పారాయణములతో గూడిన శ్రీరామ మహా క్రతువులను నిర్వహించి, ఆ యా స్థలములలో రామ స్థాపము లను నిర్మింపజేసినారు.

తిరుమలలో - శ్రీరంగములో, శ్రీభాష్య - భగవద్విషయ పీఠములను నెలకొల్పినారు.

బహు భాషావేత్తలు, న్యాయ - వేదాంత శాస్త్ర పండితులు, తప స్సంపన్నులు నగు శ్రీ స్వామివారు నిర్వహించిన మహా క్రతువు లనేకములు.

బదరికాశ్రమములో - 'అష్టాక్షరీ కోటిహవన మహాక్రతువు'ను నిర్వహించినారు.

నైమిశారణ్యమున 88 - వ 'స్వాధ్యాయ జ్ఞాన యజ్ఞము'ను చేయించినారు.

శ్రీ వేంకటాచలమున - 'శ్రీలక్ష్మీనారాయణ సహస్ర హోమ కుండ మహాక్రతువు'ను జరిపించినారు.

హైదరాబాదులో - 'శ్రీ భాగవత సప్తాహ యజ్ఞము'ను చేయించినారు

భారత దేశమున సామాన్యులే గాక, మహోన్నత వ్యక్తులు సైతము వీరిని ఆశ్రయించి, శిష్యులై, ధన్యత గాంచినారు.

శ్రీవైష్ణవ పత్రిక, భక్తినివేదన పత్రికలలో - వీరి ఉపదేశము లనేకములు ప్రచురింపబడినవి.

శ్రీ రామానుజ గీతా భాష్యమును ఆంధ్రీకరించి, మూడు భాగ ములుగా ప్రకటించిరి.

## తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు

త్రిదండి - శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికి తోడుగానుండి, శ్రీస్వామివారు సంకల్పించిన సకల కార్యక్రమములలో అన్వయించుచు, ఆ యా మహా కార్యక్రమములు విజయవంతముగా నెరవేరుటకు తగిన పర్యవేక్షణ చేసినవారు గోపాలాచార్యులవారు.

తూర్పుగోదావరిజిల్లాకు జెందిన వీరు - సాహిత్య, న్యాయ, వేదాంతశాస్త్రములందును, ద్రావిడ దివ్య ప్రబంధములందును, ప్రస్థానత్రయము నందును సంపూర్ణమైన పాండిత్యమును సంపాదించిరి.

వీరు శ్రీ విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథములను అనేకము రచించి వెలువరించిరి.

భగవద్విషయమునందు భూరి పరిశ్రమ చేసినవారు వీరు.

వీరివద్ద ఏడుగురు జీయరులు భాష్య - భగవద్విషయములను అధ్యయనము చేసిరి.

భారత దేశమున పలు రాష్ట్రములలో వీరికి శిష్యు లున్నారు

## శ్రీ భాష్యం అప్పలాచార్యులు

సాహిత్య - వ్యాకరణాది శాస్త్రములలో నిష్ణాతులయిన శ్రీ భాష్యం అప్పలాచార్యులవారు - తె. కం. గోపాలాచార్యులవారి వద్ద ఉభయ వేదాంత శిక్షణను పొంది, ఉద్దండ పండితులుగా, ఉభయ వేదాంత శిరోమణులుగా, మధురోపన్యాసకులుగా కీర్తి గాంచి, ఎన్నో ఘన సన్మానములను, బిరుదములను పొందినారు.

వీరి రచనలు :- 1) 'శ్రీ తత్త్వము - భగవత్తత్త్వము' అను స్వీయ ఉపన్యాస సంకలన గ్రంథము ఆంధ్ర భాషలో ముద్రింపబడి ప్రశంసింపబడినది. 2) 'ఆండాళ్ తిరుప్పావు'కు అర్థ వివరణములను స్పష్టముగా ఒకానొక ధనుర్మాస సందర్భమున ఉపన్యసింప, ఆ మధురోపన్యాసమును కొందరు భక్తులు 'రికార్డు' చేసి, ఆ ఉపన్యాసమును గ్రంథరూపమున ముద్రించిరి. 3) సుందర కాండమునకు - 'తత్త్వార్థ రూపోపన్యాసము' అను పేరనొక గ్రంథము ముద్రింపబడినది. కులశేఖరాళ్వారుల 'ముకుందమాల'కు ఆంధ్ర టీకా తాత్పర్య విశేషార్థములను వ్రాసి ప్రకటించిరి. 5) గీతా భాష్యము, 6) వాక్యపదీయము అను గ్రంథములకు ఆంధ్ర వివరణము వ్రాయగా - అవి అకాడమీ వారిచే ప్రకటింపబడినవి.

## వేదాల తిరువేంగళాచార్యులు

వీరు - సాహిత్య, న్యాయ, వేదాంత, వ్యాకరణ శాస్త్రములలో మహా పండితులు. 'విష్ణు తిలకము'నకు ఆంధ్రానువాదము చేసిరి. రస గంగాధరమును, ధ్వన్యాలోకమును, కావ్యాలంకార సూత్రవృత్తిని ఆంధ్రీకరించిరి. 'చతుర్మత తత్త్వ' మను గ్రంథమును రచించి, ఆంధ్ర ప్రదేశ్ అకాడమీచే సమ్మానింపబడిరి. అనేక

సభలలో విశిష్టాద్వైత సిద్ధాంత వైశిష్ట్యమును గురించి ఉపన్యాసము లొసంగిరి. విశిష్టాద్వైత సిద్ధాంత వ్యాసము లనేకములు రచించి, పత్రికలలో ప్రచురించి, ప్రశస్తి గాంచిరి.

## నల్లాన్ చక్రవర్తుల రఘునాథాచార్యులు

సంస్కృత సాహిత్య. వేదాంతములందు నిష్ణాతులు. ముండకోపనిషత్తుకు, కఠోపనిషత్తుకు శ్రీరామానుజ సిద్ధాంతానుసారముగ ఆంధ్ర వివరణమును వ్రాసిరి. శ్రీమ దుభయవేదాంతాచార్య పీఠము వారిచే అవి ప్రకటింపబడినవి. మేల్ కోటలోని విశిష్టాద్వైతకోశ ప్రాజెక్టులో వీరు ముఖ్య సభ్యులు. వీరు జీయరుస్వామి వారి ఆదేశాను సారము పలుమారులు వేదాంత సభలలో - విశిష్టాద్వైత సిద్ధాంత మును గూర్చి ఉపన్యాసము లొసంగి, శ్రోతలచే ప్రశంసల నందుకొనిరి.

## నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచార్యులు

సంగీత సాహిత్యములలో - ఫిడేలు వాదనములో - హరికథా కథనములో సిద్ధ హస్తులు కృష్ణమాచార్యులుగారు. విజయవాడ రేడియో కేంద్రమున 30 సంవత్సరములకు పైన - నిలయ సంగీత విద్వాంసులుగా పదవిని సమర్థతతో నిర్వహించి పేరు గాంచిరి. 1) గోదా త్రింశ న్మాల 2) శరకోప చరిత్రము 3) నారాయణ శతకము మున్నగు గ్రంధములను రచించి ప్రచురించిరి. ఆంధ్రి ముకుందమాలాది గ్రంథము లింకను వెలుగు చూడవలసి యున్నవి. 'ఆలయములు - ఆళ్వారులు' దురోన్మాహ నిర్మూలనము' అను వీరి ఆంధ్ర గ్రంథములు వీరి పాండిత్య ప్రకర్షకు మచ్చుతునుకలు.

## గుదిమెళ్ళ రామానుజాచార్యులు

శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారికి, గోపాలాచార్యులవారికి అత్యంత సన్నిహితులైన వీరు - హయగ్రీవోపాసకులు, ఆశు కవులు, విశిష్టాద్వైత మత ప్రచారకులు, 'భక్తి నివేదన' పత్రికా సహాయ సంపాదకులు, బహు గ్రంథకర్తలు, 'కవిరత్న - కవిశేఖర' ఇత్యాది అనేక బిరుద విభ్రాజితులు, నిరాడంబరులు, నిరహంకారులు, ఆసేతు శీతాచలము పర్యటించి, మత ప్రచారమునకై, తమ జీవితమును ధన్యము గావించుకొనిన చరిత్ర శేషులు.

వీరి రచనలు :- (1) భక్తి యోగము (2) ప్రపత్తి యోగము (3) ద్వయ మంత్రార్థము (4) చరమార్థ దీపిక (5) పల్లాండు వైభవము (6) మధుర సూక్తి (7) ఈడు ముత్తముమ్ (8) బదరీనాథ సుప్రభాతము (9) శ్రీకూర్మనాథ సుప్రభాతము మున్నగునవి.

## కొండూరి తిరుమల లక్ష్మీనరసింహాచార్యులు

విశిష్టాద్వైత గ్రంథములకు ఆంధ్రానువాదము, వివరణము కూర్చి, అనేక గ్రంథములను 'శ్రీ గోదా గ్రంథమాల' యను తమ సంస్థ ద్వారా వెలువరించినారు కె. టి.యల్. నరసింహాచార్యులుగారు.

దేశ మంతయు పర్యటించి, అనేకమంది పండితులతో, ఆచార్యులతో సత్సంబంధము తేర్పరచుకొని, వారిచే కొన్ని వ్యాఖ్యలు వ్రాయించి, తాము కొన్ని వ్యాఖ్యానములు వ్రాసి, సంస్కృత ద్రవిడ భాషలలో గల సంప్రదాయ గ్రంథములకు ఆంధ్రములో వ్యాఖ్యల ద్వారా ప్రాచుర్యమును సంపాదించిరి.

వీరి గ్రంథములు : (1) శఠకోప వాఙ్మధ (2) గోదాదేవి (3) శ్రీ రామానుజ చరిత్ర (4) ద్వాదశ సూరి చరిత్ర (5) వకుళ భూషణ నాయకి (6) దివ్య ప్రబంధ మాధురి (7) దివ్యసూరి కథా నామ (8) శ్రీ రామానుజ కథాసారము మున్నగునవి.

## కొత్త సచ్చిదానందమూర్తి

ఆంధ్ర విశ్వవిద్యాలయమున తత్త్వశాస్త్ర విభాగములో పేరు గాంచిన కొత్త సచ్చిదానందమూర్తిగారు - 'శ్రీ రామానుజ దర్శనము' అను గ్రంథమును వ్రాయగా - దానిని పిడుగురాళ్లలో గల శ్రీ రామతీర్థ సేవాశ్రమ పక్షమున శ్రీ కేశవతీర్థస్వామి వారు ప్రకటించిరి.

'దర్శనములు - మతములు' అను విజ్ఞాన సర్వస్వమునకు ఈ సచ్చిదానంద మూర్తిగారు సంపాదకులుగా వ్యవహరింప, అందలి వైష్ణవ మత సిద్ధాంత శోధ పత్రములను మేడేపల్లి వరాహ నరసింహ స్వామిగారు పర్యవేక్షించిరి. ఈ సంపుటము - ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీవారిద్వారా ప్రచురితమైనది.

## ముడుంబి నరసింహాచార్యులు

ప్రస్తుతము వీరు - మద్రాసు విశ్వవిద్యాలయములో - 'వైష్ణవ వేదాంత' విభాగమున అధ్యక్షులుగా వ్యవహరించుచున్నారు. ఆంధ్ర ఆంగ్ల - సంస్కృత - ద్రావిడ భాషలలో వీరు పండితులు, ఆశు కవులు, మధురోపన్యాసకులు.

'యామునాచార్యులు - వారి గ్రంథములు, ఒక అధ్యయనము' అను విషయముపై వీరు పరిశోధన గావించి, ఆ పరిశోధన గ్రంథము మద్రాసు విశ్వవిద్యాలయమున సమర్పించి, 'డాక్టరేట్' పట్టా

సంపాదించిరి. వీరి యీ పరిశోధన గ్రంథరాజము అత్యుత్తమమైన దిగా నిర్ణయింపబడి, ఇప్పటికి మూడుసార్లు ముద్రింపబడినది.

నరసింహాచార్యులవారు విశిష్టాద్వైతమునుగురించి స్వదేశమందే గాక, ఖండాంతరములందును మహోపన్యాసము లొసంగి, విశేష యశము నార్జించిరి.

మద్రాసునుండి త్రైమాసిక పత్రికగా వచ్చుచున్న 'రామానుజ వాణి'కి వీరు ముఖ్య సలహాదారులుగా వ్యవహరించుచున్నారు.

## ఘనకుభరం వరదాచార్యులు

శ్రీమాన్ వరదాచార్యులవారు బహుభాషా వేత్తలుగా, బహుశాస్త్ర పండితులుగా, బహు గ్రంథ కర్తలుగా, 'ప్రపన్న సుధ' పత్రికా సంపాదకులుగా, ఉభయ వేదాంత విశారదులుగా, శ్రీ రామానుజ కీర్తి కౌముదీ సంపాదకులుగా సుప్రసిద్ధులు.

వీరు - పన్నిద్దరాళ్వారుల భక్తి పరంపరలను, వారి దివ్య ప్రబంధములలోని సంక్షేప విశేషములను బాగుగా ఆకళించుకొని, ఆ యా విశేషములను వివరించుచు - 'ఆళ్వారులు - దివ్య ప్రబంధములు' అను నొక పరిశోధనాత్మక గ్రంథమును రచించిరి. ఈ గ్రంథము ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారిచే ఉత్తమ గ్రంథముగా గుర్తింపబడి, సత్కరింపబడుటేగాక, సంప్రదాయజ్ఞుల, సాహిత్య వేత్తల ప్రశంసా పరంపరలకును పాత్రమై ప్రకాశించినది.

మానవ దర్శనము, గీతోపదేశము, విష్ణులీలా విలాసము భరతమాతృ స్తవము మున్నగు వీరి ముద్రిత గ్రంథములు - పండితుల చేతను, పత్రికల చేతను పలు విధములుగా ప్రశంసింపబడినవి.

వీనిలో - 'భరత మాతృ స్తవము' అను సంస్కృత పద్య లఘు కృతిని 1963 - వ సంవత్సరములో - స్వాతంత్ర్య దినోత్సవ సందర్భమున, నాటి భారత రాష్ట్రపతి యగు డాక్టర్ : సర్వేపల్లి రాధాకృష్ణ పండితులకు శ్రీమాన్ వరదాచార్యులవారు అంకిత మిచ్చుచు -

"శ్రీమన్ రాధాకృష్ణ మహాశయ !
సర్వేపల్లి కులాబ్ధి విధో !
స్వీకురు పండిత ! కృతిరత్న మిదం
రమ్యం భారత రాష్ట్రపతే !"

అని చెప్పిరి.

స్తోత్ర రామాయణము, గీతామృతము, తమిళ సాహిత్యము - సంస్కృతి మున్నగు వీరి గ్రంథములు ముద్రణ భాగ్యమును పొంద వలసి యున్నవి.

విజయవాడ రేడియో కేంద్రము నుండియు, మద్రాసు రేడియో కేంద్రము నుండియు వివిధ విషయములపై వీరి ప్రసంగములు, స్వీయ కవితలు, పురాణ కాలక్షేపములు మున్నగు కార్యక్రమము లనేకములు ప్రసారములై, శ్రోతల ప్రశంసలకు పాత్రములైనవి.

సాహిత్య - ధార్మిక విషయములపై వీరు వ్రాసిన వ్యాసము లనేకములు వివిధ పత్రికలలో ప్రచురింపబడినవి.

అనేక పట్టణములలో, పల్లె సీమలలో వీరు వివిధ విషయములపై మహోపన్యాసము లొసంగి, ప్రజానీకములో నూతనోత్తేజమును గల్గించి, 'ఉపన్యాసక రత్న,' 'మధురోపన్యాసక' మున్నగు బిరుదులను కూడ పొందిరి.

వివిధ సందర్భములలో వీరికి సన్మానము లనేకములు జరిగినవి. 1980 మార్చిలో - వీరి షష్టిపూర్తి సందర్భమున స్థానికు లగు కవి పండితులచేతను, గుంటూరు పురప్రముఖుల చేతను వీరికి చేయబడిన ఘన సన్మానము చిర స్మరణీయమైనది. ఆ నాటి ఆ మహా సభలో - సన్మాన సంఘమువారు 'విద్యా భూషణ' అను బిరుదముతో వీరిని సంభావించిరి.

శ్రీమాన్ వరదాచార్యులవారి సంపాదకత్వమున ప్రస్తుతము, షోడశ కళలతో - శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వముగా వెలువడు చున్న 'శ్రీ రామానుజ కీర్తి కౌముది' - జిజ్ఞాసువులకు, భక్త ప్రప న్నులకు కొంగు బంగారముగా - దేశ విదేశములలో విఖ్యాతి గాంచి నది. ఈ విజ్ఞాన సర్వస్వ వైశిష్ట్యమును తిరుమల తిరుపతి దేవ స్థానము లవారు గుర్తించి, ఈ గ్రంధ ముద్రణమునకు తమ వంతు సహాయ మందించుట - మిగుల హర్షింపదగిన విషయము. ఇట్టి శ్రీ వైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ ప్రకాశ విషయమున శ్రీమాన్ వరదా చార్యులవారు ప్రదర్శించు ప్రజ్ఞా పాటవములు, ప్రతిభా వ్యుత్పత్తులు, దీక్షా దక్షతలు - అపూర్వములు, అనితర సాధ్యములు.

## కిడాంబి శ్రీనివాస రామానుజాచార్యులు

నెల్లూరు - మూలపేటలో గల వేద సంస్కృత కళాశాలకు అధ్యక్షపదవిని చిరకాలము నిర్వహించి, ఇటీవలనే విశ్రాంతి నంది యున్న వీరు - బహుభాషా వేత్తలుగా, బహు గ్రంథకర్తలుగా, విశిష్టాద్వైత సిద్ధాంత విశారదులుగా సుప్రసిద్ధులు. వీరి గ్రంథము లలో - 'బ్రహ్మసూత్రార్థ వివరణము' అనునది అతి ముఖ్యమైనది.

## మరింగంటి శ్రీరంగాచార్యులు

ప్రస్తుతము హైదరాబాదు - సీతారాంబాగులో గల శ్రీ వేంకటేశ్వర వివేక వర్ధినీ సంస్కృత కళాశాలయందు సంస్కృతోపన్యాసకులుగా వ్యవహరించుచున్న వీరు - బహు భాషా వేత్తలుగా బహు శాస్త్రవేత్తలుగా, పండిత ప్రకాండులుగా, ఉభయ వేదాంత శిరోమణులుగా, మధురోపన్యాసకులుగా ప్రసిద్ధి గాంచి యున్నారు. వీరును విశిష్టాద్వైత సిద్ధాంత గ్రంథములను కొన్నింటిని రచించి యున్నట్లు ప్రతీతి యున్నది.

## పత్రికలు - పత్రములు

విశిష్టాద్వైత సిద్ధాంత సంబంధము లగు పత్రికలు (1) శ్రీరామానుజ పత్రిక (2) శ్రీవైష్ణవ పత్రిక (2) కల్యాణి (4) ప్రపన్న సుధ (5) భక్తి నివేదన (6) రామానుజ వాణి (7) వేదాంత దీపిక మున్నగునవి.

తిరుమల తిరుపతి దేవస్థానముల వారి 'సప్తగిరి' పత్రిక యందును, గుంటూరు - శ్రీ రామనామ క్షేత్రము నుండి వెలువడు 'మోక్ష సాధని' పత్రిక యందును, అంగల కుదురు - దాసకుటి నుండి వెలువడు 'భక్తి సంజీవని' పత్రిక యందును, ఆం. ప్ర. - దేవాదాయ ధర్మాదాయముల పక్షమున హైదరాబాదునుండి వెలువడు 'ఆరాధన' పత్రిక యందును విశిష్టాద్వైత విషయక వ్యాసము లపు డపుడు ప్రచురింపబడుచున్నవి.

'ఆం. ప్ర. ఓరియంటల్ కాన్ఫరెన్సు' ఇత్యాది సమావేశములలో - విశిష్టాద్వైత వేదాంత సంబంధము లగు పరిశోధన పత్రములు సమయోచితముగా కొన్ని ప్రకటింపబడుచున్నవి.

## ముగింపు

పైన పేర్కొనబడిన పండితులే గాక, ఇంకను ఆంధ్ర రాష్ట్రము న వైష్ణవ పీఠాధిపతులు, విశిష్టాద్వైత దర్శన విశారదులు, శ్రీ వైష్ణవ సంప్రదాయ గ్రంథకర్తలు నగు వారనేకు లున్నారు. ఇంకను విశిష్టాద్వైత మత గ్రంథము లెన్నియో వెలువడ కున్నవి. వివిధ పత్రికలలో విశిష్టాద్వైత విషయక వ్యాసములనేకములు వెలువడినవి. విశిష్టాద్వైత సంబంధము లగు పరిశోధన వ్యాసములు కొన్ని ముద్రణ భాగ్యమును పొంది యున్నవి.

ఈ రీతిగా ఆంధ్రులు విశిష్టాద్వైత సిద్ధాంత వ్యాప్తికి బహు ముఖములుగా చేసిన కృషి నిరుపమానమైనది. నేటికిని ఆంధ్రదేశము నం దంతటను విశిష్టాద్వైతము విలసిల్లుచునే యున్నది.

"రామానుజార్య దివ్యాజ్ఞా, వర్ధతా మభివర్ధతామ్."



# విష్ణు భక్తులకు సాటి లేరు

"గతి దప్పి జనువారు గారు నా దాసులు
చనిన మే లని విష్ణు నమ్మ తెలిసి
అపరాధ మెవ్వరికైన లేకున్న దా
కానరా దను రమా కరుణ దెలిసి
భగవ త్ప్రపన్నుల పని మీకు లేదని
యముఁడు దూతల తోడ నాడు టెఱిఁగి
ఆళ్వారు లాచార్యులైన మహాత్ములు
హరిదాసులే ఘను లనుట యెఱిఁగి

కొంద ఱయ్యలు వా రందె కొదువ గనుచు
నోర్వ లేకుండు టది యేమొ యో యతీంద్ర!
యసురు లిందున నుందురో యనుచు మిగుల
నానతిత్తురు మా లక్ష్మణార్యు లిపుడు."

నా భక్తులు హద్దులు మీఱి సంచరించువారు కారనియు, ఒకవేళ నా భక్తులలో నెవరేని అపరాధము గావించినను, దానిని పాటించ రాదని శ్రియఃపతి ఆనతిచ్చె నని తెలిసియు, విష్ణుభక్తుల దరి కేగవల దని యముఁడు తన దూతలతోఁ జెప్పియుండె నని తెలిసియు, ఆళ్వారులు, ఆచార్యులు మొదలగు మహాత్ములు - విష్ణు భక్తులే ఘను లని వక్కాణించినట్లు తెలిసియు, కొందఱు ప్రబుద్ధులు - అట్టి విష్ణు భక్తులలో - ఏదియో యొక కొదువఁ జూచి ఓర్వలేకుందురు. అట్టివారు అసురు లని యెఱుఁగ నగును

— (ముముక్షు జన కల్పకము)

# కవి పండిత పరిచయము

## శ్రీమతి విక్రాల శ్రీదేవమ్మ



ఈమె జన్మస్థానము - ప్రకాశము జిల్లాలో సింగరాయకొండకు సమీపమున గల కలికివాయ గ్రామము. జననము - దుందుభి నామ సంవత్సర మార్గశిర శుద్ధ నవమీ సోమవారము. (27-11-1922). జననీ జనకులు - వర్ణకాల రంగరామానుజాచార్యులు, శేషమాంబ గారలు.

'విద్యారణ్య పంచానన', 'విద్యా వాచస్పతి' శ్రీమాన్ విక్రాల రామ చంద్రాచార్యులవారికి ఈయమ రెండవ కోడలు; 'మహా కవి' 'చతుర్విధ కవితా చతురానన' శ్రీమాన్ విక్రాల శేషాచార్యులవారి సతీమణి.

ఈమె - తండ్రిగారి వద్దను, భర్తగారి వద్దను - సంస్కృతాంధ్ర భాషా సాహిత్యములను అధ్యయనము గావించి, ఉభయ భాషలలో పాండిత్యమును సంపాదించుటే గాక, కమ్మని కవితలను రచింపఁగల సమర్థతను సంపాదించిన మహా కవయిత్రి. అనేక మహా సభలలో – సాహిత్య, ధార్మిక విషయములపై మహోపన్యాసము లొసంగి, ఘన సన్మానములను, బిరుదులను పొందిన విదుషీమణి.

రచనలు :— 1. ప్రార్థనా లహరి (స్తోత్ర సంపుటి) 2. వాసన దత్తా పరిణయము (నాలు గాశ్వాసముల చారిత్రక ప్రబంధము) 3. రసిక శరణా గతి (రాజదండన కలుగనున్న తన భక్తుని - శ్రీ ఆంధ్ర నాయకస్వామి కరుణించి రక్షించిన గాథ) 4 శ్రీకృష్ణ విరించీయము (ఆంధ్ర భాగవతములో -

బ్రహ్మకృత శ్రీకృష్ణ - గోవత్సాపహరణ ఘట్టమున శ్రీకృష్ణుడు బ్రహ్మవేష ములో సత్యలోకమున కరిగి, బ్రహ్మను భ్రమింపజేయ, ఆయన పుడమి కేతెంచి కృష్ణుని పాదములపైఁ బడి స్తుతింప, కృష్ణుడు ఆ మాయను పోగొట్టిన కథ.) 5. కౌండిన్య విజయము (ఒక విప్రుని వివాహ సందర్భమున జరిగిన కవి సమ్మేళనము ఇందు కమనీయముగ వర్ణింపబడినది ఇవి యైదును ముద్రితములు.

అముద్రితము లివి - 6. భక్తకవిచక్రవర్తి (పౌరాణిక నాటకము) 7. పౌండరీక చక్రవర్తి 8. వసుంధర 9. సౌజన్యము 10. సావిత్రి 11 సమవర్తి మొదలగునవి. (7 నుండి 11 సంఖ్య వరకు గల యైదును లఘు కావ్యములు.)

ఈమె రచించిన అనేక గద్య పద్య రచనలు - భారతి మొదలగు పత్రికలలో ప్రకటింపఁబడినవి

ఈమెచే రచింపఁబడిన సమస్యా పూరణము లనేకములు - విజయవాడ రేడియో కేంద్రము నుండి ప్రసారములైనవి

ఇపు డీమె కీర్తి శేషురాలు.

## శ్రీమాన్ శ్రీభాష్యం అప్పలాచార్యులు



జననము :- దుందుభి నామ సంవత్సర చైత్ర శుద్ధ పంచమి (6-4-1922). జననీ జనకులు ;- తిరువేంగళమ్మ, శ్రీనివాసాచార్యులు గారలు. విద్యాభ్యాసము : - విజయనగర సంస్కృత కళాశాలలో 'వ్యాకరణవిద్యాప్రవీణ', 'భాషాప్రవీణ', కాశీ హిందూ విశ్వవిద్యాలయమున సంస్కృతములో ఎం. ఏ. ఉభయ

వేదాంత శిక్షణ :- శ్రీమాన్ తె కం. గోపాలాచార్యులవారి వద్ద. ఉద్యోగ ములు :- శ్రీకాకుళము, కాకినాడ, రాజమండ్రి పట్టణములందలి ప్రభుత్వ కళాశాలలలో సంస్కృతోపన్యాసకులు. ఉద్యోగ విరమణానంతరము ప్రస్తుత నివాసము - విశాఖ పట్టణము.

ఉభయ భాషలలో, ఉభయ వేదాంతములలో వీరు ఉద్దండ పండితులు, మహా వక్తలు. దేశమున నాలుగు చెరగులలో - పర్యటించి, సంప్రదాయ బద్ధము లైన వివిధ విషయములపై అనేక మహోపన్యాసము లొసంగి, ఘన సన్మాన ములను, బిరుదములను పొందినచరిత్ర ప్రసిద్ధులు.

రచనలు :- 1. మహాభాష్యము పర్పశాహ్నికము(తెలుగు అనువాదము) 2. వాక్యపదీయము (తెలుగు అనువాదము - తెలుగు అకాడమీ ప్రచురణము) 3. తిరుప్పావై (తెలుగు వివరణము) 4. సుందర కాండము 5. తత్త్వ దీపిక (తెలుగు వివరణము) 6. శ్రీ తత్త్వము-భగవ త్తత్వము (ఉపన్యాస సంకలనము) 7. ఏడుకొండలు - ఏడుకొండలు మున్నగునవి.

## శ్రీమాన్ మరింగంటి శ్రీరంగాచార్యులు



జననీ జనకులు :- నాచ్చి యారమ్మ, అప్పలాచార్య దంప తులు. జన్మ తిథి :- 16 ఫిబ్రవరి 1933. జన్మించిన గ్రామము - : వేములవాడ(పల్లి), కరీంనగర్ జిల్లా. విద్యాభ్యాసము :- వేదాంతవర్ధినీ సంస్కృత కళా శాల - సీతారాంబాగ్, హైదరా బాదు. చదివిన శాస్త్రములు :- 1. వేదాంతము, 2. వ్యాకర ణము, 3. న్యాయము, 4. సాహి

శ్రీ ఉ. వే. శ్రీమాన్ కోయిల్ కందాడై అప్పన్ శఠకోప రామానుజాచార్యస్వామి వారు (సీతారాంబాగు సంస్కృత కళాశాలా సంస్థాపకులు, సుప్రసిద్ధ చతుశ్శాస్త్ర పండితులు.) ఉత్తీర్ణత నొందిన పరీక్షలు :- 1. నవీన తర్క విద్వాన్ (మైసూరు విద్వన్మహాసభ - మైసూరు ప్రభుత్వము) 2. విశిష్టాద్వైత వేదాంత విద్వాన్ (వేద శాస్త్రాగమ విద్వత్ సదస్సు - తిరుమల) 3. సాహిత్య విద్యా ప్రవీణ (ఆంధ్రకళా పరిషత్తు – వాల్తేరు) 4. వ్యాకరణ బి ఓ యల్. 5. సాహిత్య రత్న (ప్రయాగ హిందీ విద్యాలయ) 6. తెలుగు బి ఓ.యల్. 7 ఎం ఏ తెలుగు. 8. ఎం. ఏ. సంస్కృతము 4, 6, 7, 8 సంఖ్యలు గల డిగ్రీలు హైదరాబాదులో గల ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సంబంధించినవి.

సన్మానములు - బిరుదములు :- 1. మైసూరు విద్వన్మహాసభ వీరి నవీన తర్క విద్వాంసులుగా పరిగణించి, మహారాజావారి ద్వారా సన్మానిం జేసినది. 2. వేదశాస్త్రాగమ సదస్సు వీరిని విశిష్టాద్వైత వేదాంత విద్వాంసులుగ పరిగణించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 3. హైదరాబాదులో 1. సుర భారతి 2 సంస్కృత భాషా ప్రచారిణీ సభ - అను సుప్రసిద్ధ సంస్కృ సంస్థలు రెండును వీరిని మహా విద్వాంసులుగా సంభావించి సన్మానించినవి 4 ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము వీరిని గ్రం సంపాదకులుగా భావించి సన్మానించినది. 5. విశిష్టాద్వైత ప్రచారక సంఘమ విజయవాడ శాఖ – వీరిని విశిష్ట మహా విద్వాంసులుగా తలంచి సన్మానించినది 6. నడిగడ్డపాలెమున గల శ్రీమ దుభయవేదాంతాచార్య పీఠము వీరిని మహ విద్వాంసులుగా భావించి, ప్రతి సంవత్సరము సన్మానించుచున్నది. 7. వేము వాడ, సిద్ధిపేట, యాదగిరి, పాలకొల్లు, నరసాపురము, కోరుకొండ, సింహాచలము భద్రాచలము మొదలగు పట్టణములలో గల అనేక దేవస్థానములు వీరిని మహా పన్యాసకులుగా భావించి సన్మానించినవి. 8. విజయవాడ, ఉయ్యూరు, మచి పట్టణము, రాజమంద్రి, గుంటూరు, పాలకొల్లు, పెంటపాడు, విశాఖ పట్టణము విజయ నగరము మొదలగు అనేక పట్టణములకు సంబంధించిన సాహిత ఆధ్యాత్మిక సంస్థ లనేకములు వీరి ఉపన్యాసము లేర్పరచి 'ప్రవచన వాచస్ప 'మధురోపన్యాసక', 'విశద వాక్శిఖామణి' ఇత్యాది బిరుదులతోకూడ వీరి సన్మానించినవి 9. జంట నగరము లందును ఎల్లప్పుడు ఏదియో యొక సం పక్షమున, రామాయణ-భారత-భాగవత-భగవద్గీతాదులకును, ముముక్షుప్ర గీతా భాష్యము, తిరుప్పావై, భగవ ద్విషయము మొదలగువానికిని సంబంధిం

ము జరుగుచుండును. సన్మానము, బిరుద ప్రదానము కూడ
ను. 10. హైదరాబాదులోని జీయర్ ఎడ్యుకేషన్ ట్రస్టు
ప్రతి ఆదివారము వీరి భగవద్విషయ ప్రవచనము – శ్రీశ్రీశ్రీ
మన్నారాయణ రామానుజ చిన్న జీయరుస్వామి వారి నియమనమున
5 11 హైదరాబాదు రేడియో కేంద్రమున సుమారు 35
లనుండి వీరి సంస్కృత కావ్యగానము కాని, సంస్కృత కావ్య
బంధము లగు ప్రసంగములు కాని ప్రసార మగుచున్నవి. 11
లనుండి వీరి సంస్కృత పాఠములు కూడ ప్రసారము చేయబడు
ఇది రేడియోవారి సన్మానము.

:– హైదరాబాదు నగరము నందలి శ్రీ వేంకటేశ్వర వేదాంత
-ృత కళాశాలలో 1952 నుండి వీరు న్యాయశాస్త్రాచార్యులుగా
నము

లు :– 1. భాగవత రత్నములు (సురభారతీ ప్రచురణ)
మకరంద (ఆం. ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగార
3. వివిధ గ్రంథములకు పీఠికలు, కవితా ఖండికలు, వ్యాసములు

కవిశేఖరుల దృష్టిలో

**శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులు**

చార్యులు గుంటూరు

ధ్ధనకుధరాన్వయ! జలనిధి గంభీరచంద్ర! వరద కవీంద్రా!
వితా రస భరితా! ధన్యాసీత్ విష్ణు విషయిణీ భూత్వా.

ను నరసా పురము

ష్య ద్రవిడ ప్రబంధ వచనోపన్యాస సాముద్రిక
శాస్త్ర మహాబ్దగ స్త్వ! వివిధ గ్రంథ ప్రణేత స్తవ

'శ్రీ రామానుజ కీర్తి కౌముదికయా' విద్వద్వర శ్లాఘ్యయా
శ్రీమన్ పత్రికయా 'ప్రపన్న సుధయా' ప్రజ్ఞా జగ ద్వ్యాపృతా.

[illegible] చక్రవర్తుల కృష్ణమాచార్యులు — విజయవాడ

శ్రీమ ద్ద్రావిడ వేదసాగర విశ ద్ద్రోణావతారోదరః
స్వాకారోచిత సిద్ధి బుద్ధి విభవః స్వాదు ప్రసాదాదరః
ప్రాచీనే ష్వధునాతనోఽద్య భవిషు ప్రాచీన భావోద్ధురః
జీయా చ్ఛ్రీ ధనశైలవంశ్య వరదాచార్యో వరాణాం వరః.

[illegible]రుగంటి నీలకంఠశాస్త్రి — గుంటూరు

యో 'రామానుజ కీర్తి కౌముది' మహా గ్రంథం విమర్శాత్మకం
ముద్రాప్య ప్రకటీకరోతి సతతం శ్రీవిష్ణు సేవారతమ్
తం నారాయణ పాదసేవనపరం పాయా త్సదా మాధవః
ప్రజ్ఞానం పురుషాయుషం చ విదధత్ సారోగ్య సంప చ్ఛ్రియమ్.

[illegible]గంటి సీతారామాచార్యులు — గుంటూరు

హారీతాః సకలా శ్చ కావ్యనిరతాః సత్సంగ్రహే ప్రౌఢతా
మాపన్నాః కులగౌరవప్రణయినః తే తే తథాచార్యకాః
తే ష్వేకో వరదార్య ధీమణి రసౌ సర్వాసు విద్యా స్వపి
ప్రస్ఫీతాంబుజ మాధురీ పరిలస ద్భృంగాయిత స్సర్వదా.

[illegible]త్రాల శేషాచార్యులు — కలికివాయ

లక్ష్మీనారాయణ భగవత స్సన్నిధే ర్ధర్మకర్తో
వన్యస్తాఽలం కవన కుశల శ్చాంధ్ర గీర్వాణ వాణ్యోః
య శ్శ్రీ రామానుజ గురుమణేః కీర్తికౌము ద్యభిఖ్య
గ్రంథోద్ధస్య ప్రచుర సుయశా సాధు సంపాదక స్సన్.

**కొమాండూరు రామానుజాచార్యులు** ఉలవపాడ

ఆర్షవిజ్ఞాన సంపన్నః వరదార్య మహాకవిః
రామానుజస్య కృపయా వర్ధతా మభివర్ధతామ్

**పళ్ళె పూర్ణప్రజ్ఞాచార్యులు** గుంటూరు

శ్రీమ త్కాశికులాబ్ధిశీతకిరణుల్, శ్రీ మధ్వ సిద్ధాంత ని
ర్నీమోరుప్రతిభుల్, ప్రభుత్వ సుకవుల్, శ్రీకృష్ణ విద్వద్వరుల్
మా మామల్ కవితా విశారదుగ సంభావించి రన్నన్ నినున్
సామాన్యం బొకొ సేవితార్య ! వరదాచార్యా ! కవిగ్రామణీ !

**కరి నారాయణాచార్యులు** సింహాచలము

భవదీయ ద్రవిడాంధ్ర సంస్కృత వచః ప్రాగల్భ్య సంపత్తియున్
వివిధ గ్రంథ నిబంధన ప్రతిభయున్, విజ్ఞాన సంపత్తియున్,
కవితా ప్రౌఢియు శ్లాఘనీయములు; వక్కాణింప నిక్క మ్మనన్
స్తవమా ! కా దిది, వాస్తవమ్ము - వరదాచార్యా ! ప్రధీ సత్తమా !

**వేముగంటి నరసింహాచార్యులు** సిద్దిపే[ట]

గీర్వాణవాణి వల్కించు మాణిక్యపు వీణ పాటల మేల్మి విధము నెటి
తెలుగు పల్కులరాణి జిలుగు మైపూతల గుమగుమ నెత్తావి గుస్తరిం
ద్రవిడభాషా లతా తన్వి పాదాలలో మువ్వల సవ్వడి నివ్వటించి
హిందీ సరస్వతి మందహాసామృత సార మాధుర్యమ్ము సంతరించి
ఆంగ్ల సారస్వతాంశమ్ము నాకళించి ! నిగ్గు దేలిన నీదు పాండిత్య గరిః
ప్రస్తుతింపంగ శక్యమే భవ్యభావ ! ధీనిధీ ! వరదార్య ! మానితార్య !

**చింతలపాటి నరసింహాదీక్షితశర్మ** కోగంటి పాలెవ

పలికిన పల్కు లబ్జభవు పైదలి యందెల సవ్వడుల్, రమా
కలిత కటాక్ష వీక్షణ విలాస తరంగములై, మరందముల్
చిలుక, నుదాత్త భావ తులసీ దళ మాలికలై గుమల్ గుమల్
వలచుట పూర్వపుణ్య పరిపాక మగున్ కవితా విశారదా !

డాక్టర్ : వానమామలై వరదాచార్యులు చెన్నూరు

వృత్తమ్ములన్ గాంచ జిత్తమ్ము తలలరించి తలల నూపించిమెప్పులను బొందుదు
అర్థ సంపదవారు నమలి పద్మమ్ముల బరికించిన న్నమో భావ మెదవు
భవదర్థ పరసూక్తి నవరత్నముల గాంచ, అమ్ముడువోవు మనమ్ము తాను
కావ్యార్థమణు లలంకార రూపమ్మున తల ధరియింపగా తలపు గగ్లు

ధనకుధర దుగ్ధవారాశి జనన మొంద
అమల శారదా రాకాశశాంక! నీదు
వాక్కు లమృత రసమ్ములై వరద బార
వరద నామమ్ము నిన్నది వలచె నేమొ!

డాక్టర్ : బేతవోలు రామబ్రహ్మము, M A , Ph. D, గుంటూరు

ధనకుధరమ్ము గాన, వరదార్యుడు గావున, లచ్చి వీరికిన్
గనుగొనలందు వెల్గు ననగా దగుగాని, సరస్వతీదయ కం
కణ నినదంబు మాత్రము సుఖంబుగ విన్పడు వీరి యింట - నిం
కను మరి తప్పకుండ వినగా నవుగావుత శ్రీ ఘలంఘలల్ ।

కాసుల గురునాథశర్మ వినుకొండ

భద్రము భక్తిబంధురము పావనమౌ నిజ సంప్రదాయమున్
భద్రము జేసికొన్న ఘన పండితు డీ వరదుండు - వెల్గు సా
ముద్రిక శాస్త్రవేత్త యని, పూజల నందెడు జ్యోతిషుండునౌ
సద్రచనా విశారదుడు - సత్కవికుంజరు డంచు మెచ్చగాన్

డాక్టర్ ' ప్రసాదరాయ కులపతి, M. A., Ph. D గుంటూరు

శ్రీమ ద్వరదాచార్య గ్రామణీ ! సాహిత్య మధుర రాసిక్య ఘృణ !
ధీమాన్య సంప్రదాయ ప్రామాణ్య ! పవిత్ర భావుక సుమణీ !
వైష్ణవ శాస్త్రమ్ములలో నిష్ణాతుడ వీవు - గ్రంథ నిర్మాణములో
జిష్ణుడ వైతివి - శుభ వర్ధిష్ణుడవై యోగ పథ చరిత్రుడ వగుమా !

ప్రతాప వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రి, M. A., చీరాల

నకలాంధ్రోర్వి సెబా సటన్న బహు భాషా చాతురీ శక్తి, వా
ణికి భూషావళి సంతరింప మమనో సీరేజముల్ తావు లీ
ను కవిత్వమ్మును సృష్టి చేయు సుకవీంద్రుల్ మీరు - మీ వాక్కు భా
షకు మే ల్పుత్తడి సొమ్ము గాదె వరదాచార్యా ! కవిగ్రామణీ !

## శ్రీమాన్ తెలికిచర్ల కందాడ గోపాలాచార్యులు



జననము :- శోభకృత్ నామ సంవత్సర పుష్య బహుళ సప్తమి. (1903). జననీ జనకులు :- సీతమ్మ, రంగాచార్యులు గారలు. ముడుంబై శాఖ. జన్మస్థానము :- కోరుకొండ. తూర్పుగోదావరి జిల్లా.

విద్యా వ్యాసంగము :- సంస్కృతములో కావ్య నాటక అలంకారాది సాహిత్య గ్రంథములను, న్యాయ - వేదాంత శాస్త్రములను అధ్యయనము చేసిరి. మఱియు - శ్రీ భాష్యమును, శ్రుతప్రకాశికా వ్యాఖ్యానమును, కొన్ని వేదాంత వాదములను అభ్యసించిరి అష్టాదశ రహస్యములను, ద్రావిడ దివ్య ప్రబంధములలో రెండు ఆయిరములు ప్రతి పదార్థముతోను, భగవద్విషయమును, ఆచార్య హృదయమును సేవించిరి. ఆంగ్లమున ప్రవేశ (స్కూలుఫైనల్) పరీక్షవఱకు అభ్యసించిరి. స్వయం కృషితో హిందీభాష నభ్యసించి, పెద్ద పరీక్షలలో నుత్తీర్ణులైరి.

శ్రీమాన్ గోపాలాచార్యులవారియొద్ద - సప్తర్షులవలె ఏడుగురు జీయరులును, ఆంధ్రప్రదేశవాసు లగు పది మంది విద్యావేత్తలును, అయోధ్య - బృందా

వనము - బదరికాశ్రమము - నేపాలు ప్రాంతములలో ప్రస్తుతము సుప్రసిద్ధ ప్రచారకులుగా నున్నవారు కొందఱును, నల్గురు మహంతులును, కొందరు ఆంధ్ర మహిళా మణులును - భగవ ద్విషయఘును అధ్యయనము చేసియున్నారు శ్రీమాన్ గోపాలాచార్యులవారు శ్రీవైష్ణవ విద్యార్థులకు తమ యింటనే భోజన - వసతి సౌకర్యములను కలుగజేసి, కొంతకాలము ఆధ్యాత్మిక విద్యను గరపిరి.

ఆంధ్ర ప్రదేశమున అనేక స్థలములలో - ఉపన్యాసములద్వారా మత ప్రచారము చేయు వర్ధతిని విశ్వ విద్యాలయములలో ఉద్యోగ యోగ్యత గల పండితులను - అనేకము లగు ఉభయ వేదాంత శిబిరములను ఏర్పాటు చేసి, ఉభయ వేదాంత గ్రంథములను కాలక్షేపముగా అందజేయుటకు ప్రప్రథమున వీరే ఏర్పాటు చేసిరి.

వీరు పది సంవత్సరములు - ప్రతి సంవత్సరము వరుసగా బదరికాశ్రమ మునకు వెళ్ళి, 4 - 5 మాసము లుండి, అష్టాక్షరీ క్షేత్రమును, సత్సంగ సదన మును నిర్మింపజేసి, అచ్చటనే ఉభయ వేదాంత శిక్షణా శిబిరములను నిర్వహిం చిరి శ్రీభాష్య - భగవద్విషయములను కొంతవరకు అచ్చటనే కొంత కొంత బోధించిరి.

సుమారు ఏబది సంవత్సరములనుండి 'భక్తి నివేదన' అను వేదాంత మాసపత్రికకు వీరు సంపాదకులుగా నుండి, శ్రీ పెద్దజీయరు స్వామివారి గావించిన ప్రతి అతిమానుష కార్య కలాపములందును వీరు ప్రధాన పాత్ర వహించి సహకరించిరి.

ఇటీవల వీరు ఒక పుష్కర కాలమునుండి నడిగడ్డపాలెములో - వాసుదా స్రాశ్రమమున నివసించుచు, సంస్కృతవేద - ద్రావిడవేద - ఉభయవేదాంత కాలక్షేపములను స్వయముగా చేయుచు, పాంచరాత్రాగమమును శ్రీవైష్ణవ విద్యార్థులు కొందఱకు గరపించుటయేగాక, పంచదశ కర్మలలో శిక్షణను కూడ ఇప్పించిరి.

వీరు శ్రీవైష్ణవ సంప్రదాయమునకు సంబంధించి సుమారు ఏబది గ్రంథము లను రచించియున్నారు. ఈ వివరములను శ్రీ రామానుజ కీర్తి కౌముది - 9 వ భాగము సందలి 'కవి పండిత పరిచయము'ను చూచి తెలిసికొనవచ్చును.

శ్రీమాన్ వేముగంటి నరసింహాచార్యులు



జననము :- 27-7-1930. జన్మస్థానము - సిద్ధిపేట జననీ జనకులు :- రామక్క, రంగా చార్యులు గారలు. అభ్యసించిన భాషలు :- తెలుగు, సంస్కృతము, హిందీ. అభ్యసించిన విద్యలు :- వ్యాకరణము, తర్కము కొంత వఱకు.

డిగ్రీలు :- బి వో. యల్. (తెలుగు). హోదాలు ;- మెదకుజిల్లా అధికార భాషా సమీక్షా సంఘ సభ్యులు. ఉద్యోగము ;- ప్రభుత్వోన్నత పాఠ శాలలో - ప్రధానాంధ్ర పండితులుగా చిర కాలము పని చేసి, 31-7-1988 తేదీన ఉద్యోగ విరమణ చేసిరి.

సన్మానములు ;- (1) 1-7-70 లో సిద్ధిపేట పురజనులచే సన్మానము. (2) 1980 లో ఆం.ప్ర.ప్రభుత్వము వారిచే ఘన సన్మానము. (3) కోరుట్లలో వానమామలై వరదాచార్యులవారి స్మారక బహుమతి. (4) వనపర్తిలో – ఉమ్మెత్తల సాహితీ పురస్కారము. (5) కడపలో - గడియారం వేంకట శేషశాస్త్రిగారి స్మారక బహుమతి (6) మచిలీపట్టణములో – శ్రీ త్రిపుర సుందరీ ప్రతిష్ఠానమువారి సాహితీ పురస్కారము. ఇంకను అనేక మండలము లలో - వివిధ సందర్భములందు - వివిధ సంస్థలచే సన్మానము.

రచనలు :- (1) ప్రబోధము (2) అమరజీవి బాపూజీ (3) కవితాంజలి (4) నవమాలిక (5) తిక్కన (6) మణి కింకిణి (7) వీరపూజ (8) శ్రీ వేంకటేశ్వర వినుతి (9) శ్రీ వంకటేశోదాహరణము' (10) తెలుగు బాలనీతి (11) బాల గేయాలు (12) శ్రీ గోపాలకృష్ణ సుప్రభాతమ్ (13) కవితా కాహళి (14) ఆంధ్ర విష్ణువు (15) మంజీర నాదాలు (16) జీవన

స్వరాలు (17) కవితా సిందూరం (18) కాంతి వైజయంతి (19) బాసర సరస్వతీ వైభవము (20) వివేక విజయము (21) భక్త రామ (22) వ్యాస కలాపం (23) అక్షర దీపాలు. ఇంకను బాలల కొ ప్రత్యేకముగ కొన్ని గ్రంథములు వ్రాసిరి.

విశేషాంశములు :- వీరి కవితలు కొన్ని - హిందీ, గుజరాతీ భాషలలో అనువదింపబడినవి. కొన్ని పద్యములు - కర్నాటక ప్రభుత్వమువారి తరగతి తెలుగు పుస్తకములో పాఠ్యాంశముగా నున్నవి. ఉస్మానియా విద్యాలయము 'తిక్కన' కావ్యమును, శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలం 'ఆంధ్ర విష్ణువు' కావ్యమును, 'కాంతి వైజయంతి' పద్యకవితా సంపుటిని పరీక్షలకు పాఠ్య గ్రంథములుగా నిర్ణయించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయ వారు - 'వేముగంటి కృతులపై' ఎం. ఫిల్. చేయుటకు అనుమతి నొసం

పలుమారులు ఆకాశవాణినుండి వీరి రచనలు, ప్రసంగములు ప్రసా లైనవి భారతి, ఆంధ్ర పత్రిక, కృష్ణా పత్రిక, ఆంధ్ర ప్రభ, ఆంధ్ర భ ఆంధ్ర జ్యోతి, స్రవంతి, ఆంధ్రప్రదేశ్ మున్నగు వివిధ పత్రికలలో వీరి కవి వ్యాసములు ప్రచురితములు. అనేక గ్రంథములకు వీరు పీఠికలు వ్రాసిరి.

## డాక్టర్ : సర్వేపల్లి రాధాకృష్ణన్



జన్మస్థానము .- మద్రాసుకు వాయవ్య దిశలో - నలువది మైళ్ళ దూరమున గల తిరుత్తణి. జననము :- 5-9-1888. తండ్రి :- వీరాస్వామి

విద్యా వ్యాసంగము :- స్వగ్రామమున ప్రాథమిక పాఠశాలలో విద్యాభ్యాసమును పూర్తి గావించి, అనంతరము రాయవేలూరు అమెరికన్ మిషన్ కాలేజీలో - ఎఫ్. ఏ కోర్సును పూర్తి

చేసి, అటనుండి మద్రాసుకు బోయి, అచటి క్రిస్టియన్ కళాశాలలో - బి. ఏ; ఎం. ఏ డిగ్రీ కోర్సులను చదివి, ఆ రెండు డిగ్రీలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణత నందిరి. ఆ తరుణమున తత్త్వశాస్త్ర పరీక్షకు వెళ్ళినవారిలో కృతార్థులైనవారు రాధాకృష్ణన్ ఒక్కరే యగుటను బట్టి, తత్త్వశాస్త్రమున రాధాకృష్ణన్‌కు గల ప్రజ్ఞా పాటవములు సులభ గ్రాహ్యములు.

మతాభిమానము :- బాల్యమునుండియు రాధాకృష్ణన్ - హిందూ మతాభిమానియై కళాశాల విద్యార్థిదశయందే - భగవద్గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రములు మొదలగు వేదాంత గ్రంథములలోని యంశములను పెద్దలవల్ల వినుచుండెడివారు

పదవులు :- (1) విద్యాభ్యాసము పూర్తియైనంతనే, మద్రాసు ప్రసిడెన్సీ కళాశాలలో - వేదాంత శాఖలో అధ్యాపకులుగా వీరు నియమింపబడిరి. అది అసిస్టెంటు ప్రొఫెసర్ పదవి. యల్. టి. కోర్సులో ఉత్తీర్ణత పొందిన పిమ్మట ఆ ఉద్యోగము వీరికి ఖాయము చేయబడినది. (2) 1916 లో - అనగా - మొదట ఉద్యోగములో చేరిన పది సంవత్సరముల యనంతరము వీరికి ప్రొవియన్షియల్ గ్రేడు నిచ్చి, ప్రొఫెసర్‌గా నియమించిరి. (3) అటు పిమ్మట - మైసూరు విశ్వ విద్యాలయమున రెండు సంవత్సరములు - తత్త్వ శాస్త్రోపన్యాసకులుగా పని చేసిరి. (4) అటు తర్వాత - కలకత్తా విశ్వ విద్యాలయములో - అయిదవ జార్జిచక్రవర్తిచే స్థాపింపబడిన దార్శనిక శాస్త్ర పీఠమున ఆచార్యులుగా వీరు నియుక్తులైరి. (5) 1926 లో - ప్రొఫెసర్ జాన్సన్ ఆహ్వానము నందుకొని, ఆక్సుఫర్డు విశ్వ విద్యాలయమున కొన్ని ఉపన్యాసము లిచ్చుటకు వీరు వెళ్ళిరి. (6) హార్వర్డు విశ్వవిద్యాలయమున జరిగిన అంతర్జాతీయ తత్త్వశాస్త్రవేత్తల మహాసభలో వీరు పాల్గొనిరి. (7) బ్రిటన్ సామ్రాజ్య విశ్వవిద్యాలయ మహాసభలో - తమ ప్రతినిధిగా వీరిని కలకత్తావారు అచటికి పంపిరి. (8) 1920 లో - ఆక్సుఫర్డు యూనివర్సిటీ మాంచస్టర్ కళాశాల వారు ప్రపంచ మతముల పర్యటన పీఠమునకై వీరిని ఆచార్యులుగా ఆహ్వానించిరి. 1930 లో ఆ యూనివర్సిటీకి వీరు ప్రొఫెసర్‌గా ఎన్నుకొనబడిరి. (9) 1931 లో - ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు ఉపాధ్యక్ష పదవికి జరిగిన పోటీలో నెగ్గి, ఆ పదవి నధిష్ఠించిరి. (10) 1939 లో - గాంధీ, మాలవ్యా - బెనారస్ హిందూ విశ్వ విద్యాలయమునందు ఉపాధ్యక్ష పదవిని

స్వీకరించునట్లు వీరిని ఒప్పించిరి. (11) 1948 - 49 లో - య
విద్యా సంస్థల పరిశీలన సంఘమునకు అధ్యక్షులుగా వీరిని స్వతంత్ర
ప్రభుత్వము నియమించినది.

1931 - 39 సంవత్సరముల మధ్య కాలములో వీరు - రాజకీ
ప్రవేశించిరి.

ఉన్నత పదవులు :- (1) 1947 లో - స్రప్రూ కమిటీకిని, 1
భారత రాజ్యాంగ పరిషత్తునకును వీరు సభ్యులుగా ఎన్నుకొనబడి
1949 లో - మాస్కోకు - భారత రాయబారిగా వీరు నియవి
(3) 1946 నుండి 1950 వరకు నాలుగు సంవత్సరముల కాలము
సమితిలో భారత ప్రతినిధి వర్గమునకు నాయకత్వము వహించిరి.

అత్యున్నత పదవులు :-(1) 1952 లో - మాస్కో రాయబా
విరమించుకొని, ఇండియాకు తిరిగివచ్చిన వెంటనే, అనగా 1952 ల
భారత ఉపాధ్యక్ష పదవి వరించినది. 1957 లో మరల రెండవ
భారత ఉపాధ్యక్ష పదవికి ఎన్నిక అయినారు. (2) 1958 ను
వరకు - రాజ్య సభకు అధ్యక్షులుగా కూడ వీరు ఎన్నుకొనబడినా
13-5-1962 తేదీన - స్వతంత్ర భారత దేశమునకు అధ్యక్షులుగా
బడినారు.

రచనలు :- (1) రవీంద్రనాథ టాగూరు దర్శనము (2)
దర్శన శాస్త్రములు (3) భారతీయ తత్త్వశాస్త్రము (4) హైంద
దృక్పథము (5) భావవాద జీవిత దృక్పథము (6) ప్రాక్ పశ్చి
కొన్ని చింతనలు (7) ధర్మోద్ధరణము (8) నాగరికత భవిష్య
స్వేచ్ఛ - సంస్కృతి (10) మహాత్మాగాంధీ (11) విద్య - రా
యుద్ధము (12) భగవద్గీత (13) ఇదియా శాంతిసేన (14) ధమ
(15) ఉపనిషత్తులు (16) బ్రహ్మసూత్రములు (17) నా సత్యా
(18) మన సర్వ శాస్త్ర సారము మున్నగునవి.

అస్తమయము :- 17-4-1975 తేదీన, మద్రాసులో తమ స్వగ
వీరు అస్తమించిరి.

## గుదిమెళ్ళ రామానుజాచార్యులు



జననము ;- ఆనంద నామ సంవత్సర జ్యేష్ఠ మాసము (1915). జన్మస్థానము - గుంటూరు జిల్లా - రేపల్లె తాలుకా - ముక్తిపల్లి అగ్రహారము.

కొంతకాలమునకు జన్మస్థానమగు ముక్తిపల్లిని వదలి, తెనాలి తాలూకా - నడిగడ్డపాలెము చేరి, అచట - 'హయవదన సదనము'ను నిర్మించి, అందు నివసింపసాగిరి.

శ్రీ విశిష్టాద్వైత మతప్రచారక సంఘ సంచాలకులుగా భక్తినివేదన సహాయ సంపాదకులుగా, బహుకావ్య నిర్మాతలుగా వీరు దేశమునకు ...తులు.

శ్రీ త్రిదండి శ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారితో శ్రీరామ ...కతు నిర్వహణార్థమై, ఆసేతు శీతాచలము దాదాపు ఒక పుష్కర కాలము ...ంచిరి.

లు ...

సంప్రదాయ కావ్యములు ;- 1. భక్తియోగము 2. ప్రపత్తియోగము ...వ్యయమంత్రార్థము 4. చరమార్థ దీపిక ...5. పల్లాండు వైభవము ...ధుం...సూక్తి 7. శ్రీ కూర్మనాథ సుప్రభాతము మొదలగునవి.

శ్రీ రామాయణ కావ్యములు ;- 1. ప్రథమ సర్గ 2. మా నిషాద ...హం వేద్మి 4. మైథిలి 5. మాండవి 6. ఊర్మిళ 7. శ్రుతకీర్తి ...కమ 9. శబరి 10. ఋష్యమూకము 11. రామ రాజ్యము 12.

సంక్షేప రామాయణము 13. సిద్ధాశ్రమము 14. రామాయణ రహస్యము 15. శ్రీరామ క్రతువు మొదలగునవి.

ఇతర కృతులు :- 1. ధనుర్దాసుడు 2. శరద్రాత్రి 3. గీతా సందేశము 4. విద్యా విలాసము 5. మురళీధర విలాసము 6. శ్రీకాకుళ స్వామి శతకము 7. రఘుకులేంద్ర స్తుతి 8. పండిత గోష్ఠి 9. ఆచార్య సంభావన 10. శ్రీదేవి 11. యతిరాజ విజయము 12. శ్రీభాష్యకారులు 13. సువర్ణ పూజ 14. సువర్ణ ధార మొదలగునవి.

ఈ కవి శేఖరు లిపుడు కీర్తిశేషులు.

## డాక్టర్ : తట్టా విజయ రాఘవాచార్యులు

జననము :- 3-6-1959. జన్మ స్థానము :- కృష్ణాజిల్లా, చిన శ్రీరంగపురము. జననీ జనకులు :- వెంకట నరసమ్మ, గోపాలకృష్ణమాచార్యులు గారలు. విద్యాభ్యాసము :- కృష్ణాజిల్లా - జగ్గయ్యపేట జిల్లాపరిషత్తు ఉన్నత పాఠశాలలో పదియవ తరగతి వఱకు, అనంతరము 1967 నుండి 1976 వఱకు చిట్టిగూడూరు సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము - సాహిత్య విద్యా ప్రవీణలో ఉత్తీర్ణత. 1981 నుండి 1983 వఱకు ఆంధ్ర విశ్వవిద్యాలయమునందు సర్వదర్శన విభాగమున అధ్యయనము, సంస్కృతములో - ఎం ఏ. డిగ్రీ స్వీకరణము.

పరిశోధన వ్యాస రచనము :- (1) 1984 నుండి తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యాపీఠమునందు విశిష్టాద్వైత దర్శనమున పరిశోధనము. తత్త్వారాధ్యతులు, చతుశ్శాస్త్ర పండితులు - 'తర్క వాచస్పతి' బిరుదాలంకృతులు రాష్ట్రపతి బహుమాన గ్రహీతలు నగు శ్రీమాన్ N. S. రామానుజ తాతాచార్యుల వారి పర్యవేక్షణమున 'వేదార్థ సంగ్రహ సమీక్షాత్మక మధ్యయనమ్' అను విషయముపై పరిశోధన వ్యాసమును రచించి, Ph. D. డిగ్రీ నిమిత్తమై తాష్ట్రియ సంస్కృత విద్యాపీఠమునందు 9-10-1986 తేదీన సమర్పించిరి. (2)

ఆలిండియా ఓరియంటల్ కాన్ఫరెన్సు జైపూరునందు - 'ఆత్మ విచారము' అను పరిశోధక వ్యాసమును సమర్పించిరి. (3) ఆంధ్రప్రదేశ్ ఓరియంటల్ కాన్ఫరెన్సు గుంటూరులో - 'భక్తేః మోక్షసాధనత్వే వివిధాభిప్రాయాః' అను శీర్షికతో పరిశోధక వ్యాసమును సమర్పించిరి.

పరిశోధనము ;- 'విశిష్టాద్వైతస్య ఆంధ్రాణాం యోగదానమ్' 'ఆంధ్రులు - విశిష్టాద్వైతము' అను విషయముపై ఇటీవల పరిశోధన చేసిరి.

సంపాదకత్వము ;- శ్రీమాన్ శిరిశినహళ్ కృష్ణమాచార్యులవారిచే ఆంధ్రీకరింపబడిన వేదార్థ సంగ్రహమునకు సంపాదకత్వము వహించి, దానిని 'ఆంధ్ర వేదార్థ సంగ్రహ మను పేర టి.టి.డి. వారి ఆర్థిక సహాయముతో 1986 లో ప్రకటించిరి.

వ్యాఖ్యానము :- శ్రీ యామునాచార్యులవారి 'గీతార్థ సంగ్రహము'నకు వ్యాఖ్యానమును రచించిరి.

అనువాదము - (1) భక్తిసిద్ధాంతః (2) అష్టాక్షరీ మంత్ర మాహాత్మ్యమ్ (3) సవిశేషం బ్రహ్మ (4) లక్ష్మీ పురుషకార వైభవము (5) విశిష్టాద్వైతమ్ (6) తత్త్వత్రయమ్ అను సంస్కృత వ్యాసములు, వానికి ఆంధ్రానువాదములు వీరిచే రచింపబడినవి.

సంస్కరణము ,- (1) శ్రీనివాస రాఘవ విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సంగ్రహః' (2) శ్రీ వాత్స్య వరదాచార్య విరచిత మగు 'రామానుజ సిద్ధాంత సారః' (3) శ్రీకృష్ణ తాతాచార్య విరచిత మగు 'ఐత్వ చంద్రికా' అను సంస్కృత గ్రంథములు వీరిచే సంస్కరింపబడి, ముద్రణకు సిద్ధమై యున్నవి. (4) సురపురం శ్రీనివాసాచార్యులవాని జ్ఞాన రత్న ప్రకాశికా (5) షష్ఠీ దర్పణమ్ అను సంస్కృత గ్రంథములును (6) న్యాయమాత్మా భాష్యమ్ (7) 'శరణాగతి శబ్దార్థ విచారః' (8) ప్రపత్త్యనుపాయత్వ విచారః' అను సంస్కృత ప్రకరణ గ్రంథములును (9) శుద్ధసత్త్వ రామానుజాచార్యులవారి 'రహస్యత్రయ మీమాంసా భాష్యమ్' అను సంస్కృత గ్రంథమును - ఇపుడు వీరిచే సంస్కరింపబడుచున్నది.

ఆంగ్ల వ్యాసములు :- (1) క్రియేషన్ ఆఫ్ ది వరల్డు, (2) గాడ్ అండు సోల్ (3) డాక్టరిన్ ఆఫ్ విశిష్టాద్వైత అనునవి వీరి ఆంగ్ల వ్యాసములు

ఉద్యోగము :- రాష్ట్రీయ సంస్కృత సంస్థానము - న్యూఢిల్లీ వారిచే నిర్వహింపబడిన ఇంటర్వ్యూలో వీరు 'సెలక్టు' అయి, తిరుపతిలో కేంద్రీయ సంస్కృత విద్యా పీఠమున, విశిష్టాద్వైత విభాగమునందు 31-7-1987 తేదీన ఉపన్యాసకులుగా నియుక్తులైరి. ఇపు డీ విద్యా సంస్థ - రాష్ట్రీయ సంస్కృత విద్యా పీఠ మను పేర వ్యవహరింపబడుచు, విశ్వ విద్యాలయ ప్రతిపత్తిని పొంది యున్నది.



# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 7 | 23 | నేత్రదండము | వేత్రదండము |
| 9 | 15 | సత్యం | సత్యం |
| 14 | 16 | వథము | వధము |
| 16 | 4 | ఉతరించినచో | ఉద్ధరించినచో |
| ,, | 25 | యుద్ధ | యుద్ధ |
| 21 | 4 | లక్ష్మదును | లక్ష్మణుడు |
| 22 | 17 | స్రప్రవృతి | ప్రవృత్తి |
| 24 | 2 | ప్రచేతనుడు | ప్రచేతసుడు |
| 31 | 2 | వాల్మీశి | వాల్మీకి |
| 32 | 18 | శ్రేష్టుడు | శ్రేషుడు |
| ,, | 23 | ఆచార్యునకు | ఆచార్యునకు |
| 35 | 4 | దాల్మీకి | వాల్మీకి |
| 37 | 10 | టాలిచే | జాలిచే |
| 46 | 13 | పవిత్రు | పవిత్రు |
| ,, | ,, | నీరుడుగా | పీరుడుగా |
| 48 | 7 | మనుష్వాణాం | మనుష్యాణాం |
| 49 | 22 | లభ్య | లభ్యః |
| ,, | 23 | నిస్పృణుతే | వివృణుతే |
| 51 | 24 | పదాస్య | పరాస్య |
| 52 | 22 | చిరి | చీర |
| 53 | 3 | వారు | వాదు |
| ,, | 7 | నత్వా | సత్వా |
| ,, | , | న త్త్వ | స త్త్వ |
| 54 | 14 | నలవు | కలవు |
| 55 | 14 | క్రోథము | క్రోధము |
| ,, | 15 | ,, | ,, |
| ,, | 17 | ,, | ,, |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 65 | 5 | దివధా | ద్వివిధా |
| 69 | 9 | మథ్య | మధ్య |
| 71 | 3 | వావి | వాని |
| 73 | 11 | వేదాతంతము | వేదాంతము |
| 78 | 20 | బ్రాస్మాణులతో | బ్రాహ్మణులతో |
| 79 | 7 | సందర్భమున | సందర్భమున |
| 80 | 5 | ఆహతి | ఉహుతి |
| ,, | 12 | లొకము | లోకము |
| 88 | ,, | వచ్చిస | వచ్చిన |
| ,, | 12 | వలసిస | వలసిన |
| ,, | ,, | తగిస | తగిన |
| 89 | 2 | లోకములలోని | లోకములోని |
| 91 | 21 | లొకమునకు | లోకమునకు |
| 92 | 22 | జీపులకు | జీవులకు |
| ,, | 27 | తీసుకొని | తీసికొని |
| 25 | 7 | షష్ఠా | ష్ఠష్ఠా |
| ,, | 8 | పృథ్క్ర్యామ | పృథక్రాక్మ |
| 103 | 23 | భగవత త్త్వ | భగవ త్త్వత్త్వ |
| 106 | 21 | అద్వైతయోః | అద్వైతయోః |
| 115 | 13 | వచ్చ్ననియు | వచ్చుననియు |
| 147 | 11 | జీపుని | జీవుని |
| 119 | 7 | దష | దష్ట |
| ,, | 19 | అదంత | అనంత |
| ,, | ,, | పినిబట్టి | వినిసబట్టి |
| 123 | 2 | నత్య | సత్య |
| 160 | 10 | భగవత్త్యైకర్యంబే | భగవత్త్యైకంర్యంబే |
| 175 | 3 | ఉవనిషతులలో | ఉపనిషత్తులలో |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 176 | 3 | వుని | జీవుని |
| 198 | 8 | తత్వమును | తత్త్వమును |
| 200 | 12 | సిద్ధాంతము | సిద్ధాంతము |
| 201 | 4 | గ్రంధములలో | గ్రంధములలో |
| 202 | 4 | వహవాసము | సహవాసము |
| ,, | 20 | అనుషాన | అనుష్ఠాన |
| 221 | 13 | వసువు | వస్తువు |
| ,, | 18 | ణక్తి | శక్తి |
| 225 | 14 | జెవదును | శెందును |
| 226 | 3 | పరిచ్ఛి | పరిచ్ఛిన్న |
| ,, | 17 | వ్యూహ | వ్యూహ |
| 227 | 13 | రెండపది | రెండవది |
| 230 | 20 | అహకారము | అహంకారము |
| 231 | 14 | అస్థిత్వము చే | అస్తిత్వము చే |
| 230 | 27 | శ్రీ రా.గీ.భా 9-126 | శ్రీ.రా గీ.భా 1-25 |
| 240 | 25 | శ్రీ.రా.గీ.భా.9-126 | శ్రీ.రా.గీ.భా.9-26 |
| 2౿8 | 16 | జీతురు | జీయరు |
| 272 | 14 | లక్ష్మి | లక్ష్మి |
| ?75 | 16 | విపరించు | వివరించు |
| ,, | 19 | సత్కంరింప | సత్కరింప |
| vi | 22 | గ్రంధోద్ధస్య | గ్రధొంషస్య |
| viii | 2 | తలలరించి | లలరించి |
| ,, | ,, | బొంతు | బొందు |

## వదాన్య శేఖరులు

1 కీ: శే: పబ్బతి లక్ష్మిరెడ్డి గారి జ్ఞాపకార్థము - వారి కుమారుడు ప్రొఫెసర్: నరేంద్ర రెడ్డి, Ph D. AKRON (U S.A.) Dol's 31(

## మహారాజ పోషకులు

1. శ్రీమాన్ చిలకమర్తి సత్యలక్ష్మణాచార్యులు, Retd I T.O గుంటూరు
2. డాక్టర్ :- కె. సత్యనారాయణాచార్యులు, M.S; M ch. ”
3. శ్రీ వి. మధుసూదనరావు, రిటైర్డ్ జిల్లా రిజిస్ట్రార్, ”
4. శ్రీమాన్ కిడాంబి వెంకట నరసింహాచార్యులు పెంటపాడు.

## రాజపోషకులు

1 శ్రీమాన్ కందాడ శ్రీనివాస రాఘవన్, బి. కాం. గుంటూరు.

## పోషకులు

1. శ్రీమాన్ నంపూరు సత్యనారాయణాచార్యులు గుడివాడ.
2. శ్రీ పుతుంబాక శ్రీరాములు (మాజీ శాసన సభ్యులు) పెదపాలెం
3. శ్రీమాన్ నండూరు బుచ్చిరామానుజాచార్యులు గుంటూరు.
4. డాక్టర్ : సి. రామదాసు, D,M. & E.D M.R. ”
5. శ్రీమాన్ చిత్రకవి ఆత్రేయ, M. A. విశాఖపట్టణము.
6. శ్రీమాన్ కె.వి రాఘవాచార్యులు, M.A., B Ed. హైదరాబాదు.
7. శ్రీమాన్ యస్. సి. వరదాచారి, B.A. I R S మద్రాసు
8. శ్రీమాన్ కె. వి. కృష్ణమాచార్యులు, M. A వాత్రేరు.
9. శ్రీమాన్ సౌమిత్రి రంగాచార్యులు, M.A; B.Ed హనుమకొండ.
10. శ్రీమాన్ టి.కె.వి. రాఘవన్, M. A. హైదరాబాదు
11. డాక్టర్ : యస్. వి. రంగరామానుజాచార్యులు, M.A, Ph D. కొవ్వూరు.
12. శ్రీ ఎల్లంరెడ్డి బాలకృష్ణారెడ్డి నెల్లూరు.

## విరాళములు

1. డాక్టర్ మాడభూషి ఊర్మిళా దేవి, M.B.B S గుంటూరు. రూ.243.